

# అమ్మ చేతి బువ్వ

## కథల సంపుటి

## కట్టా రాంబాబు

# Amma Chethi Buvva

By

**Katta Rambabu**

Mobile no: 9440140510

Cover design: Madhav

DTP&layout: Srungavarapu Rachana

Printed at : Rohith Printers, Vijayawada



For copies:

1) **Katta Rambabu**
   54-5-3/4, 403-Yasoda Arcade
   Addepally Colony
   Rajahmundry-533103
   East Godavari District ,Phone no :9440140510

2) **Dr.Sunil Kumar, M.S, ENT**
   Flat no 111, OAK Gardens Apartments
   Narayanapuram colony road, Nidadamanuru,
   Vijayawada (Rural)-521104,
   Phone no: 8179055679

SAMANVI publications

Price: **Rs.250/-**



## అంకితం

మా తండ్రిగారు కీ.శే.కట్టా నరసింహమూర్తిగారు,

మా తల్లిగారు కీ.శే. కట్టా వెంకటరమణమ్మ గార్లకు

నా 'అమ్మ చేతి బువ్వ' కథల సంపుటిని అంకితమిస్తున్నాను.

# అందరి జీవితాలూ కథలే! అందరూ కథకులే!



– ఏ.ఎన్. జగన్నాథశర్మ
ప్రముఖ కథారచయిత,
నవ్య సంపాదకులు

పొడుగ్గా ఉన్నవారిని చూసి, మీరు బాగా పొడగరి అని చెప్పకూడదట. చెబితేవారు నమ్మరు సరికదా, అద్దంలో తమని తాము పదేపదే చూసుకుని షాక్అవుతారట! ఈ మాట ఎక్కడో చదివాను. అలాగే మంచికథలు రాసేవారిని మీరుమంచికథలు రాస్తారని చెప్పకూడదు. చెబితే కొత్తవస్తువుకోసం వారుప్రయత్నించరు సరికదా, పాతవస్తువునే పదేపదే రాసి విసిగిస్తారు. ఇదిసంపాదకునిగా ఒకనాటి నా అనుభవం. అసలు ఈ 'మంచి' ని ఎలా నిర్ణయిస్తాం?

ఎక్కడ ఏ హోటల్లో ఏ టిఫిన్ బాగుంటుందో చెప్పగలంగాని, మనుషుల్లో మంచినీ, రచయితల్లో మంచి రచయితనీ చెప్పడం మహాకష్టం. నాకు తెలిసి, మంచిమనిషీ మంచిరచయితా అన్నవి ఓ అర్హతగానీ, ఓ పరీక్షగానీ కానేకావు. మంచిని పరిస్థితులు నిర్ణయిస్తాయి. ఆ పరిస్థితుల ప్రభావంతోనే మనిషి మంచి మనిషిగా కానీ, మంచి రచయితగా గానీ రూపొందుతాడు. కట్టారాంబాబు గారు అలా రూపొందిన రచయితే! మంచిరచయిత. వస్తువుకోసం వెదుకులాడినరచయితలను నేను చూశానుగాని, వస్తువే రచయితను వెదుక్కోవడం అరుదుగాజరుగుతుంది. అలా అరుదుగా జరిగిన సంఘటనల సమాహారమే రాంబాబుగారి 'అమ్మచేతి బువ్వ' కథా సంకలనం. ఇందులో ముప్పయి అయిదుకథలు ఉన్నాయి. ఇవన్నీ ఒకదానికి ఒకటి భిన్నం.చాలా కథలు బహుమతి పొందినవి. బహుమతికోసం కథలు రాయడం ఓ మంచి అలవాటు. కథ బహుమతికిఅర్హమవుతుందా? కాదా? అన్నది తర్వాతి సంగతి. ముందు కథొకటితయారవుతుంది. ఈ ప్రపంచంలో శక్తివంతం అయిన ఆయుధం ఒకటే! అది కథ. దానిని మించిన ఆయుధం మరొకటిలేదు. అలాంటి ఆయుధాలను తయారుచేయడం గొప్పలక్షణం. ఆ లక్షణం మెండుగా ఉన్న వ్యక్తి రాంబాబుగారు.

అనగనగా ఒకసారి ఏం జరిగిందంటే...అని చెప్పడానికి ముందు ఏం జరిగిందన్నది స్పష్టంగా తెలిసిన వ్యక్తి కట్టా రాంబాబు గారు. అతని దగ్గర శషభిషలేం కుదరవు. కథను సాఫీగా, సజావుగా చెబుతారు. జిమ్మిక్కులూ, చమక్కులూ ప్రదర్శించరు. అందుకే వారికథలు బహుమతులు గెలుచుకున్నాయి. పొడవు వెడల్పుల కొలతలకు అందనిది ఒకటే, అది గుండె. ఆ గుండె లోతుల్నిచూసిన వారు రాంబాబుగారు. ఆ కారణంగానే వారికథలన్నిటా కన్నీటితడి ఉంది. అరకొరా సరసమైనకథలురాసినా అందులో కూడా ఓ ఆర్ద్రత ఉంది. వాస్తవంచాలా గందరగోళంగా ఉంటుంది. దానిని సరిదిద్ది, తీర్చిదిద్దేదే కథ. ఆ వైనంతెలిసిన రాంబాబుగారు కథలను సునాయసంగా చెప్పగలిగారు.

అందరూ కథకులే! అందరిజీవితాలూ కథలే! కథను మించిన బాంధవ్యంలేదు. మనిషినీ మనిషినీ ప్రేమతో కట్టిపడేసే అసలుసిసలుబంధం కథ. ఆ బంధాలతోనే రాంబాబుగారు జీవిస్తున్నారు. 'లోపల్లోపల ప్రతివ్యక్తీ కథకుడేసార్! కాకపోతే ఆవ్యక్తి కథకుడు అని తేలేందుకు కొంచెం సమయం పడుతుంది అంతే' అని నవ్వే రాంబాబుగారు ప్రతిమనిషినీ రచయితగానే చూస్తారు. గౌరవిస్తారు. నిజంచెప్పడం గొప్పనుకుంటారు కొందరు. తమ విలువను పెంచుతుంది అనుకుంటారు ఇంకొందరు. గణికులు, ఆధ్యాత్మికవేత్తల పట్ల అది సత్యం కావచ్చేమో గాని, సాధారణ మనుషులపట్లా, మానవసంబంధాల పట్లా నిజం, నిజంగా చాలా ప్రమాదం. మానవ సంబంధాలు బలపడాలంటే... జాలి, దయ, కరుణ, సానుభూతితో పాటు, కొంత అబద్ధం కూడా అవసరం అవుతుంది. అదికోట్లాదినిజాలకన్నా గొప్పదవుతుంది. అలాంటి అందమైన అబద్ధాలనే రాంబాబుగారు కథలుగా మలిచారు. ఆనందం అన్నది మానవసంబంధాల్లో తప్ప ఇంకెక్కడా దొరకదని గ్రహించి, ఆ సంబంధాలకే పెద్దపీటవేసి కథల్లో కూర్చోబెట్టారు. మానవ సంబంధాల పట్ల కథలు కరెన్సీలాంటిది. దానిని జాగ్రత్తగా వాడుకోవాలి. పొదుపు చెయ్యాలి. ఆ రహస్యంకూడా రాంబాబుగారికి తెలిసినట్టు ఉంది. కేర్‌ఫుల్‌గా వ్యవహరించారు.

ఓ పద్ధతిలో జీవించేందుకు కథలు రాయాలి. చెప్పుకోవాలి. ముందుతరాల కోసం తప్పనిసరిగా కథలు సృజించాలనే రాంబాబుగారు ఈ మధ్య కాలంలో పెద్దగారాయట్లేదు అనేవారికి సమాధానమే ఈ సంకలనం. కథలకూ, కథకులకూ మరణం ఉండదు. కాకపోతే కొన్నాళ్ళు కనుమరుగవుతారు. అందుకు అనేక కారణాలుఉంటాయి. రాంబాబుగారు కనిపించట్లేదు, వారి కథలు వినిపించట్లేదు అనుకునేవారికి ఈ పుస్తకం సజీవసాక్ష్యం. దీనిని మించిన స్నేహితుడు ఇంకొకడులేదు. ఈ స్నేహితుణ్ణి చేతులు సాచి ఆహ్వానించండి. దగ్గరగా తీసుకోండి. గుండెకు హత్తుకోండి.

* * *

# బాధ్యతను బలంగా గుర్తు చేసే కథలు



**- శృంగవరపు రచన**

ఏ కథకైనా బలం పాత్రలు, సంఘటనలు. ఈ రెండింటినీ రచయిత సమన్వయ పరచడంలోనూ, వాటిముద్ర పాఠకుల హృదయాలపై గాఢంగా పడేలా చూడటంలోనే ఆ కథా స్థాయి సాహిత్యంలో నిర్ణయించబడుతుంది. పాత్రలను, సంఘటనలను కథాబలంగా ఉండేలా జాగ్రత్త తీసుకుంటూ, తనురాసే కథల ద్వారా తాను చెప్పదలచుకున్న ప్రత్యక్ష పరోక్ష అంశాల పట్ల స్పష్టత, ముందుచూపు కలిగినకథకులు శ్రీకట్టా రాంబాబు గారు. విభిన్న కథలు రాయడంలోనూ, సాధారణ కథాంశాల్లో సైతంపాఠకులు ఊహించని కొసమెరుపులు ఉండేలా రాయడం వీరి రచనా వైవిధ్యంలోని ఓ ప్రత్యేకత.దాదాపు 300 పైగా కథలు రాసిన వీరి కథల్లో 35 ఆణిముత్యాలను 'అమ్మ చేతి బువ్వ' కథా సంపుటిగాతీసుకువచ్చారు.

ఈ కథల్లో రచయితగా, విద్యావేత్తగా, సమాజంలోని అనేక సమస్యలు గుండెల్ని రగిలించినప్పుడుకలిగిన వ్యథ వల్ల జన్మించిన అక్షర యోధుడిగా,తన కథల ద్వారా బాధ్యతను గుర్తు చేసే ప్రయత్నంచేశారు. భిన్న కోణాల్లో సమాజాన్ని,సమాజం వల్ల మనుషుల్లో రూపొందే మంచి-చెడులను, ఒక ఆసరాకలిగించగలిగితే సంస్కరించగలిగే అనేక మానవ హృదయాలను, తప్పు-ఒప్పుల కన్నా సమాజ స్థాయిలోకొట్టుకుపోయే మనిషి స్వాభావిక నైతికతను, ఇలా అనేకం ఆయన కథల్లో అంతర్లీన అంశాలుగాఆవిష్కరించబడ్డాయి.

ఈ కథల్లో కొన్ని కథలు స్త్రీ భౌతిక మరియు మానసిక జీవితంలోని అనేక పార్శ్వాలను స్పృశించాయి.స్త్రీని బాహ్య ప్రపంచం సౌందర్య సాధనంగా చూడటం ఓ రకమైతే, స్త్రీ తన అందంలోనే సంతోషాన్ని వెతుక్కుంటే, సౌందర్య లాలసతో ఓ స్త్రీ ఎటువంటి పనికైనా వెనుకాడకపోవడం గురించి రాసిన కథే'ఆహుతి.'శారీరక

సౌందర్యానికి ఓ ఎక్స్పైరీ డేట్ ఉందని, వయసుతో పాటు వచ్చే మార్పులనుహుందాగా ఆహ్వానించాలని గ్రహించకుండా, తన వయసును దాచుకునే ప్రయత్నంలో ఓ తల్లి తనకన్నకూతురి మరణానికి, తన స్వీయ పతనానికి ఎలా కారణమైందో స్పష్టం చేసే కథే ఇది.తన కూతురి సంతోషం కోసం ఏమైనా చేయడానికి సిద్ధపడి, తన ప్రాణాలు కోల్పోయే స్థితిలో కూడానిజాయితీగా నిలిచిన స్త్రీ కథే 'ఆమె నవ్వు'. లైంగిక వేధింపుల పర్వంలో స్త్రీలు ఎదుర్కొనే ఇబ్బందులగురించి, వాటి పట్ల న్యాయం మారాల్సిన అవసరాన్ని గురించి, స్త్రీ తనను తానే ఈ సందర్భాల్లోరక్షించుకోవాలి అని చెప్పే కథలే 'అ(మె)వేదన','నిన్ను నువ్వే రక్షించుకో.'స్త్రీల పట్ల కీచకులుగా ప్రవర్తించేవారికి బుద్ధి చెప్పాల్సిన అవసరం గురించి చెప్పే కథే 'గురుదక్షిణ.'

మారే కాలంతో పాటు యువత కొత్త పోకడల్లో పయనిస్తున్న తీరు గురించి,వాటి వల్ల వారుకోల్పోయే జీవితం గురించి రాసిన కథలే 'విలువలు', 'పరిష్కారం.' ప్రేమ-వివాహం అన్నవి భారతీయసంస్కృతిలో నైతికతతో అనుసంధానమైన విలువలతో ముడిపడి ఉన్నవి. స్నేహం పేరుతో నేటియువతీయువకులు విశృంఖలంగా వ్యవహరించడం వల్ల ,వివాహ బంధంలో ఉండే మధురఅనుభూతులను కోల్పోతారని స్పష్టం చేసే కథే 'విలువలు.'దురలవాట్లకు బానిసలయ్యే యువత వాటినితమ కొత్త లైఫ్ స్టైల్ గా మార్చుకుంటూ తల్లిదండ్రులకు ఎలా క్షోభ కలిగిస్తారో, అటువంటి స్థితిలోతల్లిదండ్రులు ఎంత సున్నితంగా వ్యవహరించి వారిని మార్చుకోవాలో చెప్పే కథే 'పరిష్కారం'.తల్లిదండ్రులకు,పిల్లలకు మధ్య ఉండే అనుబంధాలు, కనిపించని మనోవ్యథల గురించి అనేకకోణాల్లో రాసిన కథలే 'జీవన వ్యథ','ఆవేదన', 'అమ్మ చేతి బువ్వ', 'ఒక్కసారి ఆలోచించండి.' పిల్లలు తమజీవితాలు తమకు ఏర్పడ్డాక తల్లిదండ్రుల పట్ల నిర్లక్ష్యం వహించడం గురించి, పిల్లలకు కష్టం విలువతెలియకుండా పెంచడం వల్ల వారు క్రమక్రమంగా నిర్లక్ష్యంగా మారే తీరు గురించి రాసిన కథలు 'జీవనవ్యథ','ఆవేదన.'వయసుతో సంబంధం లేకుండా ఉన్నత ఆలోచలనతో, పరుల గురించి ఆలోచించినఓ తల్లి ఎలా తన కొడుకును,సమాజాన్ని ప్రభావితం చేసిందో స్పష్టం చేసే కథే 'అమ్మ చేతి బువ్వ.'వృద్ధాప్యంలో తమ పిల్లల ఆర్థిక స్థితిగతులను గురించి అర్థం చేసుకోకుండా ప్రవర్తించే తల్లిదండ్రులగురించి,వారు పిల్లలను అర్థం చేసుకోకపోతే వచ్చే అనర్థాల గురించి రాసిన కథే 'ఒక్కసారిఆలోచించండి."

ఉపాధ్యాయ వృత్తిలో విద్యార్థులను, సమాజాన్ని, తన తోటి మనుషులను రచయిత అనేక కోణాల్లోదర్శించిన అనుభవం, ఆ అనుభవంతో రూపొందిన అభిప్రాయాలు-

విలువలు, పరిష్కారాలు కూడాకొన్ని కథల్లో కనిపిస్తాయి. విద్యార్థుల మనసును తండ్రిలా అర్థం చేసుకుని, విద్యకు–జీవితానికి–డబ్బుకుమధ్య ఒత్తిడికి గురవుతూ మనోవ్యథను అనుభవించే విద్యార్ధుల హృదయాన్ని రాంబాబుగారు తన 'చెట్టునీడ', 'అమ్మా...నాన్నా....ఓ ఎంసెట్ అమ్మాయి'కథల్లో ఆవిష్కరించారు.విద్య వ్యక్తికి ఎలాంటి ఆసరా ఇస్తుంది? విద్యావంతులు ఉన్నా నిరుద్యోగ సమస్య తలెత్తినప్పుడు సైతం,వ్యక్తికున్న తెలివితేటలకు విద్య ఎలా శోభను చేకూరుస్తుందో స్పష్టం చేసే కథే 'చెట్టు నీడ'. విద్య ఉద్యోగంకోసం మాత్రమే అన్న భావజాలం ఎప్పటి నుండో సమాజంలో బలపడిపోయింది. ఆ ఉద్యోగం వచ్చేఅనుకూలత ఎంత ఉందో కూడా నిర్ధారణకు రాలేని వ్యవస్థలో జీవిస్తున్న విద్యార్థులకు తమ విద్య వల్లఉద్యోగం రాకపోవచ్చు అన్న అభద్రత ఉండటం సహజమే. ఆ అభద్రత వల్ల విద్యార్థుల్లో విద్య పట్ల ఆసక్తిసన్నగిల్లడం కూడా సహజమే. ఆ అభద్రతను ఎలా జయించాలి? అన్న కోణం నుండి రాసిన కథే ఇది.వ్యక్తికి చదువు లేకపోయినా తెలివితేటలు ఉంటే జీవితంలో కొంతవరకు రాణించవచ్చు. కానీ విద్య వల్లతెలివితేటలు ఎలా ఓ సక్రమ మార్గంలో, మార్పుకు తగ్గట్టు రూపొంది, జీవితాన్ని ఆశావాహకంగామలుస్తుందో అన్న అంశాన్ని ఓ ఉపాధ్యాయుడు, ఉద్యోగ అభద్రత వల్ల విద్య పట్ల ఆసక్తి కోల్పోయిన ఓవిద్యార్థికి మార్గదర్శకం చేసే క్రమంలో ఈ కథను రచయిత స్వయంగా తాను ఉపాధ్యాయ వృత్తిలోఉండటం వల్ల ఈ కథనాన్ని వాస్తవికంగా చిత్రించగలిగారు. ఈ కథ చదువుతున్నప్పుడు, నేటివిద్యావ్యవస్థలో ఇటువంటి మార్గదర్శకం చేసే గురువులు కరువవ్వడం వల్లే నేటి విద్యార్థులునిరాశ,నిస్సహలకు లోనవుతున్నారేమో అనిపించక మానదు. తల్లిదండ్రులు, విద్యార్థులు తప్పకచదవాల్సిన కథ ఇది.

తమ పిల్లల ర్యాంకుల కోసం తపన పడే తల్లిదండ్రులెందరో. కార్పొరేట్ విద్యాసంస్కృతి ప్రభావం వల్లఎందరో తల్లిదండ్రుల్లో లాంగ్ టర్మ్ కోచింగుల వల్ల, ఎక్కువ డబ్బు పెట్టి చదివించడం వల్ల తమ పిల్లలమంచి భవిష్యత్తు కోసం తాము ఎంతో శ్రమిస్తున్నామన్న భావన ఉండటం అనేది వారి కోణం నుండివాస్తవమే అయినా,తమ ఆదుర్దా, ఆతురతలు పిల్లల్ని ఎలా ఒత్తిడికి గురి చేస్తున్నాయో కూడా వారుగుర్తించాల్సిన ఇంకో వాస్తవ చిత్రమే. పోటీ పరీక్షల నేపథ్యంలో విద్యార్థులు అనుభవించే ఒత్తిడిని దృష్టిలోఉంచుకుని రాసిన కథే 'అమ్మా...నాన్నా...ఓ ఎంసెట్ అమ్మాయి.'

వాస్తవానికి దగ్గరగా ఉన్న కథ ఇది. ఈ 2022–23 ఇంటర్ పరీక్షా ఫలితాలు

వెలువడుతాయనితెలిసిన తరువాత, అలాగే తెలిసాక ఎంతోమంది విద్యార్థులు తాము ఆశించిన మార్కులు రావేమో అన్నభయంతో ఇంట్లో నుండి పారిపోవడం, ఆత్మహత్యలు చేసుకోవడం మనకు తెలిసిందే. కార్పొరేట్సంస్కృతి పట్ల పెరిగిన ఆకర్షణ వల్ల తల్లిదండ్రులు తమకు తెలియకుండానే, తమ పిల్లల ర్యాంకులను,తమ పరువు ప్రతిష్టలకు, హోదాలకు ఓ గీటు రాయిగా చూసే దృక్పథాన్ని ఏర్పరచింది. పిల్లల మనఃస్థితిని సరిగ్గా అర్థం చేసుకోకుండా వారిని ర్యాంకుల విషయంలో ఉక్కిరిబిక్కిరి చేస్తే, ఆ ఒత్తిడిలో వారు తమజీవితాలను ఎలా అర్థాంతరంగా ముగించుకుంటారో స్పష్టం చేసే కథ ఇది.స్వయంగా తానే విద్యారంగంలో భాగం కావడం, రచయిత కావడం వల్ల రాంబాబు గారి 'వాస్తవచిత్రం' కథలో రచయిత ఎటువంటి రచనలు చేస్తే సమాజాన్ని ప్రభావితం చేయగలుగుతాడు అన్నఅంశాన్ని సూత్రీకరించే ప్రయత్నం చేశారు. ఈ కథలో కథకుడు ఓ కళాశాలలో లెక్చరర్ గా పని చేస్తూరచయితగా కూడా ఉన్నాడు. సామాన్యులను హింసిస్తూ, వారి శ్రమను దోచుకుంటున్న రౌడీషీటర్ నుచూసి అతను వ్యథ చెందుతాడు.మొదట తన వంతు బాధ్యతగా సమాజంలో ఇటువంటి ఘటనల పట్లస్పందన రావాలని ఆశించి, దానిని కథారూపంలో మలుస్తాడు. కానీ ఉత్తమ కథగా ప్రశంసలు పొందినా, దాని పట్ల నిజంగా స్పందించే వారు ముందుకు రాకపోవడం అతన్ని నిరుత్సాహపరుస్తుంది. తర్వాతిదశగా, ఆ సంఘటనను తాను చిత్రించిన వీడియోను గుర్తుంచుకుని, మీడియాకు ఆ క్లిప్పింగ్ ఇవ్వడంవల్ల, అది అనేక ఛానల్లలో ప్రసారమవ్వడం వల్ల ప్రజాస్పందన పెరుగుతుంది. అలా చేయడం వల్లకథకుడికి ప్రమాదం ఏర్పడే పరిస్థితి వచ్చినా, రచయితగా తన బాధ్యతను నిర్వర్తించడం వల్ల వచ్చినమద్ధతు అతన్ని అపాయం నుండి తప్పిస్తుంది. రచయితకు క్రియాశీలకంగా కూడా తమకు ఎదురైన సందర్భాల్లో వ్యవహరించి, వాస్తవ జీవితాలను పాఠకుల ముందుంచి, ఓ మార్పుకి నాంది పలికితే,ఎప్పటికీ సాహితీ లోకంలో చిరస్థాయిగా నిలిచిపోతారని స్పష్టం చేసే కథ ఇది.

విద్య వల్ల మనిషి నడవడిక ఉత్తమంగా ఉంటుందని అనుకోకూడదని, నేటికి విద్యావంతుల్లోముఖ్యంగా స్త్రీల పట్ల రావాల్సిన మార్పు గురించి చెప్పే కథే 'మార్పు.' భార్యాభర్తల మధ్య వచ్చే చిరుఅపార్థాల గురించి, ఆ సమయంలో ఒకరిపై ఇంకొకరికి ఉండాల్సిన నమ్మకం గురించి చెప్పే కథే 'మంచుతెర.' బాల్యంలో కుటుంబాన్ని పోషించడానికి బాలికల జీవితం నాశనమయ్యే మార్గం నుండి సాధారణపౌరులు సైతం కాపాడవచ్చని చెప్పే కథే 'పసిపిల్ల."

ఓ భర్త తన భార్య భద్రత కోసం పడిన తపన గురించి రాసిన కథ 'రెండో ఫ్యామిలీ.' సంపాదన వ్యసనమైనప్పుడు కుటుంబ బంధాలు ఎలా బలహీనమవుతాయో చెప్పే కథే 'రివెంజ్.' మనిషిని మనిషిగా చూడాలని, పుట్టుక–పెరిగిన నేపథ్యం ఆధారంగా కాదని చెప్పే కథే 'స్వయంవరం.' మనిషిలో క్షణికంగా జనించే మానవత్వ స్పృహను అతనిలోని స్వార్థ ప్రవృత్తి ఉన్న మనిషి ఎలా అంతం చేస్తాడోచెప్పే కథే 'మరో మనిషి'. పిల్లలను బాధ్యతతో పెంచడం అన్నది తల్లిదండ్రులు గ్రహించాల్సిన అంశమనిప్రేమ పేరుతో వారిని గారాబం చేస్తే వారి జీవితం అస్తవ్యస్తమవుతుందని స్పష్టం చేసే కథే 'బాధ్యత'.

కథాంశాల్లో భిన్నత, సమాజంలో సంస్కార విలువలు నశించకుండా ఉండాలన్న సంకల్పం, వ్యక్తితనకున్న పరిధిలో తనకు చేతనైన సాయం తోటివరకు చేయాలన్న స్పృహ, ఎన్ని అనుకున్నా మనిషిలో స్వాభావిక స్వార్థం ఉండనే ఉంటుందన్న వాస్తవికతను మరచిపోకుండా, వీటిని సమన్వయం చేస్తూ బాధ్యతాయుతంగా రాస్తున్న రచయిత రాంబాబుగారికి ఈ సందర్భంగా అభినందనలు తెలియజేస్తూవారి ఈ ప్రథమ కథాసంపుటి 'అమ్మచేతి బువ్వ'ఎన్నో పాఠకహృదయాలను స్పృశించాలని కోరుకుంటున్నాను.

* * *

# రచయితగా నేను ....



– కట్టా రాంబాబు

**క**థలు చాలా మంది చదువుతారు కానీ కొందరే రాస్తారు. ఆ కొందరిలో నేనొక్కణ్ణి కావడం నా అదృష్టంగా భావిస్తాను. కోనసీమలో ఓ పల్లెటూరిలో పుట్టి ఎటువంటి సాహిత్య నేపథ్యం లేని మా కుటుంబంలో సాహిత్యా భిమానులున్నారు. వారిలో ముఖ్యమైన వ్యక్తి నా కన్నతల్లి.

నాకు ఊహ తెలిసినప్పటి నుంచీ అమ్మ చేతిలో ఎప్పుడూ పుస్తకం ఉండటాన్నే చూసేవాణ్ణి. ప్రతిరోజూ వీక్లీనో, నవలో చదువుతుండేది. ఆ రోజుల్లో ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికల్లాంటి వీక్లీలు, యువ, జ్యోతి లాంటి మంత్లీలు క్రమం తప్పకుండా వచ్చేవి. ప్రతిరోజూ ఏదో ఒకటి చదవకుండా వుండేది కాదు. ఆమె కన్ను మూసేవరకు ఆ పఠనాశక్తి తగ్గలేదు. మా అమ్మ తన చేత్తో సాహిత్యపు బువ్వ తినిపించిందేమో నాకూ అలా చదవడం అలవాటయి పోయింది. అమ్మతోపాటు నేనూ చిన్నతనం నుంచీ పుస్తకాలు విరివిగా చదివేవాణ్ణి. తినగ తినగ వేము తీయనైనట్లు చదవగా చదవగా నాకూ రాయాలనే తపన ఏర్పడింది. హైస్కూల్ రోజుల నుంచి ప్రారంభమైన నా రచనా వ్యాసాంగం నేటి వరకు కొనసాగుతూనే ఉంది.

నా ప్రవృత్తికి, నా వృత్తి తోడవ్వడం నాకో వరం లభించినట్లయింది. వృత్తిరీత్యా కాలేజీ లెక్చరర్ గా, ప్రిన్సిపాల్ గా విద్యార్థుల తీరుతెన్నులను, విద్యారంగంలో మార్పులను సన్నిహితంగా పరిశీలించే అవకాశం కలిగింది. అనేకమంది విద్యార్థులతోను, వారి తల్లిదండ్రులతోను మమేకమవ్వడంతో నేను కథా వస్తువును వెతుక్కోవలసిన అవసరం రాలేదు. నేను రాసిన కథలు ఎక్కువగా ఈ నేపథ్యంలో రాసినవే. సాంకేతిక విజ్ఞానంతో వస్తున్న మార్పులను గమనించకుండా నాగరికత మోజులో పడి ప్రపంచవ్యాప్తంగా వస్తున్న గొప్ప గొప్ప అవకాశాలను అందిపుచ్చుకోవడంలో విఫలమవుతున్నారనే బాధ కలిగినప్పుడు పుట్టినవే నా

కథలన్నీ. నైతిక విలువల పతనం వైపు దారి తీస్తున్న యువతను దృష్టిలో పెట్టుకుని రాసిన కథే 'విలువలు' అనే కథ. సరియైన మార్గ నిర్దేశనం లేక విద్యార్థుల నిర్ణయాలలో గజిబిజి ఎలా ఉంటుందో చెప్పిన కథ 'చెట్టు నీడ.' నాగరికత వెర్రితలలు వేస్తున్న తరుణంలో ఉన్నతస్థితికి చేరుకోవలసిన యువత జీవితాలను వ్యవస్థ ఎలా ముగింపు పలికిందో తెలియజెప్పిన కథ 'గురుదక్షిణ.' చదువు పట్ల సరియైన అవగాహన లేని తల్లిదండ్రులు పిల్లలను విపరీతమైన ఒత్తిడికి గురి చేస్తూ వారిని అయోమయంలో పడేసినప్పుడు వారు ఏ నిర్ణయం తీసుకోవాలో తెలియని మానసిక పరిస్థితిని వివరించే కథే 'అమ్మా ...నాన్నా ..ఓ ఎంసెట్ అమ్మాయి.'

మానవ సంబంధాలే కథావస్తువుగా ఉండాలనేది నా అభిప్రాయం. హృదయాన్ని కదిలించే యదార్థ సంఘటనలే నా కథా వస్తువులు. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా ఉన్న ఈ తరుణంలో ఎంత మంది పిల్లలు తమ తల్లిదండ్రులకు మానసిక వ్యథను కలిగిస్తున్నారో అన్న నేపథ్యంలో రాసిన కథే 'జీవన వ్యథ.' తమ తల్లిదండ్రులను వృద్ధాప్యంలో ఆశ్రమాలకు పంపుతున్న పిల్లలు తామూ అలాంటి ఆశ్రమాలకు వెళ్లాల్సిన స్థితి కలిగినప్పుడు కలిగే వ్యథను వివరించిన కథే 'వ్యథాభరితం.' పాశ్చాత్య నాగరిక మోజులో పడి తమ కుటుంబాలను నిర్దాక్షిణ్యంగా వదిలి విదేశాలకు పోయి, తమ జీవితాలను విచ్ఛిన్నం చేసుకుని, తమకు తామే శిక్ష విధించుకున్న కథ 'ఆవేదన.'ఈ కథలన్నీ వివిధ పత్రికలలో బహుమతులు సాధించినవే.

రచయితగా నాకు గుర్తింపు తెచ్చినవారిని గుర్తుకు తెచ్చుకోవడం ఎంతైనా ముదావహం. చదువుకునే రోజుల్లో హైస్కూల్, కాలేజీ, యూనివర్సిటీ మేగజైన్లకు పరిమితమైన నా కథలు చదువు పూర్తయ్యాక వివిధ దిన, వార,మాస పత్రికలకు విస్తరించాయి. ఆ స్థాయికి రావడానికి పత్రికా సంపాదకుల ప్రోత్సాహమే కారణం. పత్రికాముఖంగా వెలుగు చూసిన మొట్టమొదటి కథ 'కంచె.' జయశ్రీ మాసపత్రిక ఎడిటర్ శ్రీయం. రామమోహనరావుగారు (సుధానిధి)నన్నెంతో ప్రోత్సహించి మంత్లీలోనూ, ప్రత్యేక సంచికలలోనూ ఎన్నో కథలు ప్రచురించి రచయితగా నిలబెట్టారు. తర్వాత ఆంధ్రభూమి వార,మాస పత్రికా సంపాదకులు శ్రీ

సి.కనకాంబరరాజుగారు రచయితగా మంచి గుర్తింపును తీసుకొచ్చారు. నేను రాసిన మొత్తం కథలలో మూడవ వంతు కథలు ఆంధ్రభూమి సంస్థ నుంచి వచ్చిన వచ్చిన పత్రికలలో ప్రచురించబడినవే. మంత్లీలో ఒక నవల సీరియల్ గాను, మరొకటి అనుబంధ నవలగాను ప్రచురించి నవలా రచయితగా పరిచయం చేశారు. అలాగే సృజనప్రియ ఎడిటర్ శ్రీనీలందయానంద రాజు గారు రెండు నవలలు సీరియల్ గా ప్రచురించి,ఎన్నో కథలను తమ మంత్లీలో ప్రచురించారు. అలాగే సహరి అంతర్జాల వార,మాస పత్రికల చీఫ్ ఎడిటర్ శ్రీగొర్లి శ్రీనివాసరావుగారు, మేనేజింగ్ ఎడిటర్ శ్రీమతి పసుపులేటి సత్యశ్రీనివాస్ గారు వారి పత్రికలలో బహుమతులిచ్చి ప్రోత్సహించారు.

ఇంక ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన ప్రముఖ వ్యక్తి శ్రీ ఎ.ఎన్.జగన్నాథ శర్మగారు. నవ్యవీక్లీ సంపాదకులుగానే కాక ప్రఖ్యాత రచయితగా అందరికీ పరిచయమే. వారిచ్చిన ప్రోత్సాహం మరువలేనిది. నేను పంపే ప్రతీ కథా చదివి అందులోని తప్పొప్పులను నిర్మొహమాటంగా చూపించి తిప్పి పంపి మళ్ళీ రాయించి పత్రికలో ప్రచురించేవారు. ఎన్నో కథలకు బహుమతులిచ్చి, నా కథల పట్ల నా బాధ్యతను మరింత పెంచారు. నా ఇంటర్వ్యూని నవ్యలో ప్రచురించి, నా గురించి పాఠక ప్రపంచానికి పరిచయం చేశారు. నా ఈ కథల సంపుటికి ముందుమాట రాసి, ఈ సంపుటికి మరింత వన్నె తెచ్చారు. నేను దాదాపు మూడు వందల కథలు,ఆరు నవలలు వ్రాయగలిగానంటే ఆంధ్రప్రభ,ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి,స్వాతి,మయూరి, సాహితీకిరణం, విశాలాక్షి, విశాఖ సంస్కృతి, జాగృతి, హాస్యానందం,నెలవంక-నెమలీక, ప్రియదత్త మొదలైన పత్రికా సంపాదకుల ప్రోత్సాహమే. వారందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అంతే కాకుండా ఈ సంపుటిలోని అన్ని కథలను విశ్లేషించి కథలలోని ఔచిత్యాన్ని తెలియజెప్పడమే కాకుండా, ఈ సంపుటిని తీసుకురావడంలో తన వంతు కృషిని,సలహాలను అందించిన రచనగారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అందమైన ముఖచిత్రాన్ని అందించిన శ్రీమాధవ్ గారికి కూడా ఈ సందర్భంలో కృతజ్ఞతలు. ఈ కథాసంపుటిని అందంగా తీర్చిదిద్దిన 'రోహిత్ పబ్లిషర్స్'విజయవాడవారికి కూడా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

నా రచనా వ్యాసాంగానికి నా శ్రీమతి మల్లీశ్వరి(సైకాలజిస్ట్) అందించిన సహకారం మరువలేనిది. నేను రాసిన ప్రతీ రచనకు మొదటి పాఠకురాలే కాకుండా అనేక కథలకు,నవలలకు పేర్లు పెట్టడం జరిగేది. నేను రాసిన నవలల్లో మంటల్లో చంద్రుడు (ఆంధ్రభూమి మంత్లీ అనుబంధ నవల),నవగమనం (సృజనప్రియ మంత్లీ సీరియల్) తను పెట్టిన పేర్లే. వృత్తిరీత్యా మానసిక విశ్లేషకురాలు కావడం వలన నా రచనలకు తన సలహాలు ఎంతగానో ఉపయోగపడేవి. నేను రాసిన కథల్లో కొన్నింటిని 'అమ్మ చేతి బువ్వ' కథల సంపుటిగా రావడానికి రూపకర్తలైన నా అల్లుడు డాక్టర్ సునీల్ కుమార్. ఎం.ఎస్,ఈ .ఎన్.టి సర్జన్, నా కుమార్తె డాక్టర్ కె.హరిచందన, ఎం.ఎస్ బీ ఆర్థోపెడిక్ సర్జన్‌లు ప్రధాన కారకులు. వీరి ప్రోత్సాహం లేకపోతే ఈ సంపుటి వెలుగు చూసేది కాదేమో. వీరి గారాల పుత్రిక సమన్వి. 'సమన్వి పబ్లికేషన్స్'లో వస్తున్న మొదటి సంకలనమిది. వీరందరికీ ప్రేమపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

* * *

# కథాక్రమము

# అమ్మ చేతి బువ్వ

**నా**కు మా అమ్మన్నా, నేను పుట్టి పెరిగిన వూరన్నా చాలా యిష్టం. ఎవరికి మాత్రం వుండదు చెప్పండి ఆ రెండింటి మీద మమకారం. మాది కోనసీమలోని ఓ అందమైన పల్లెటూరు. మా వూరికన్నా అందమైనది మా అమ్మ మనసు. అమ్మకు నేనొక్కడినే కొడుకుని. నా చిన్నప్పుడే అనారోగ్యంతో నాన్న చనిపోయారు. నన్నెంతో కష్టపడి చదివించింది అమ్మ. నాన్న పోయే నాటికి మాకు మిగిలింది రెండు ఎకరాల మాగాణి, ఒక ఎకరం కొబ్బరి తోట. వాటి మీద వచ్చే ఆదాయమే మా కుటుంబానికి ఆధారం. నేను బీటెక్ వరకు చదివానంటే అది అమ్మ ప్రోత్సాహమే. నా సంతోషం కోసం, నా ఉన్నతి కోసం, అమ్మ అహర్నిశలు కష్టపడింది. నేను కోరుకున్నట్లుగానే నాకు మంచి ఉద్యోగం కూడా దొరికింది. అప్పుడు అమ్మ ఆనందం అంతాయింతా కాదు. నాకు ఉద్యోగం వచ్చినప్పుడు అమ్మ ఎంత సంతోషించిందో. నేను యశోదను పెళ్ళి చేసుకుంటానని చెప్పినప్పుడు కూడా అంతే సంతోషించింది. "నీ ఆనందం కంటే నాకింకేం కావాలి కన్నా"అంది మనస్ఫూర్తిగా.

యశోద, నేను బీటెక్ చదువుతున్నప్పుడు ప్రేమించుకున్నాం. ఓ కోటీశ్వరుడి గారాల కూతురు యశోద. ఉన్న ఒక్క కూతురి మాట కాదనలేక నాతో పెళ్ళికి ఒప్పుకున్నారు యశోద నాన్నగారు. మాకు పెళ్ళవ్వడమే కాదు హైదరాబాదులో మా యిద్దరికి ఓ పెద్ద కంపెనీలో మంచి జీతాలతో ఉద్యోగాలు దొరికాయి. యశోద నాన్నగారు కూతురుకోసం కట్టించిన పెద్ద బంగ్లాలో కాపురం పెట్టాం.

యశోదకు మా అమ్మన్నా, మా వూరన్నా పెద్ద ఇష్టం ఉండదు. ఎంతో కష్టపడి పెంచిన మా అమ్మకు నా దగ్గరకు తెచ్చేసుకుందామనుకున్నాను గానీ యశోద మనసు తెలిసిన అమ్మ సున్నితంగా తిరస్కరించింది.

"చూడు కన్నా! ఈ వూరితోను, ఈ యింటితోను నాకు యాభై ఏళ్ళ పైన అనుబంధం ఉంది. ఇక్కడనుంచి నేనెక్కడకు రాలేను. ఈ మట్టిలోనే నేను కలిసిపోవాలి', అంటూ తప్పించుకుంది. తను మా దగ్గరికొచ్చి మా మధ్యవుండే ప్రేమను దూరం చేసుకోదలుచుకోలేదని నాకర్థమయింది. అందుకే అమ్మను చూడడానికి రెండు, మూడు నెలలకొకసారి మా వూరు వెళుతుంటాను. ముఖ్యంగా సంక్రాంతికి మాత్రం ప్రతి

సంవత్సరం తప్పనిసరిగా వెళ్ళి నాలుగైదు రోజులు ఉంటాను. ఒక్కోసారి యశోద వచ్చేది తను రాకపోయినా నేను మాత్రం తప్పనిసరిగా వెళతాను.

సంక్రాంతిని మా వూళ్ళో బాగా జరుపుకుంటారు. ఇప్పటికీ మా అమ్మ నా చేత భోగిమంట వేయిస్తుంది. భోగిరోజున తెల్లారకుండా నలుగుపెట్టి స్నానం చేయిస్తుంది. పెద్ద పండుగ రోజున పెద్దలను పిలిచి భోజనాలు పెడుతుంది. కనుమరోజున బళ్ళపూజ చేయిస్తుంది. ఆ రోజున ఇంట్లో పనివాళ్ళకు నా చేత కొత్త బట్టలు పెట్టిస్తుంది.ముక్కనుమ రోజున మా వూళ్ళో జరిగే మహాలక్ష్మమ్మ తీర్థానికి వెళ్ళేవాళ్ళం. కోడిపందాల, అమ్మవారి జాతర్లతో అంతా సరదా,సరదాగా జరిగిపోయేది.

ఈ సంవత్సరం నేను బయలుదేరుతుంటే యశోద తనూ వస్తానంది. నేనూ ఆనందంగా బయలుదేరాను. హొూండాసిటీ కారులో ప్రయాణం హాయిగానే అన్పించింది. ఎంత ఐశ్వర్యమున్నా మాకో అసంతృప్తి. మేం ఏ జన్మలో చేసుకున్న పాపమో మరి మాకు పిల్లలు పుట్టలేదు. యింకా పుట్టే అవకాశం కూడా లేదు. నాకిప్పుడు యాభై నిండాయి. మా అమ్మకు డెబ్భై నిండినా ఎంతో ఆరోగ్యంగా ఉంటుంది.ఆరోగ్యపరంగా తనకు ఎటువంటి కంప్లెయింట్స్ లేవు. యశోదకు, నాకు అయితే ఉద్యోగంలో టెన్షను, సంపాదన యావతో బీ.పీ, సుగర్ లాంటి వన్నీ సంక్రమించాయి. ఇప్పటికే మా బ్యాంకు లాకర్లు నిండిపోయాయి. అన్ని బ్యాంకుల్లోను డిపాజిట్లు లక్షల్లో ఉన్నాయి. యశోద నాన్నగారి ఆస్తి కోట్లలో ఉంది. అయినా, యశోదకు డబ్బు సంపాదన మీద తపన పోలేదు. ఎప్పుడూ నన్ను పోరుతూనే ఉంటుంది. మా వూళ్ళో ఉన్న భూములకు ధరలు బాగా పెరిగాయి కాబట్టి వాటిని అమ్మేయమని, మా అమ్మకు నెలకింత అని తన ఖర్చులకు పంపుదామని చెబుతుండేది. అది నాకిష్టం లేదు. ఆ విషయం గట్టిగానే చెప్పేశాను. యశోద అప్పుడేం మాట్లాడలేదుగాని యిప్పుడు నాతో బాటు బయలుదేరుతుంటే ఏదో అనుమానంగానే వుంది. ఈ విషయం అమ్మతోనే డైరెక్టుగా మాట్లాడుతుందేమోనని ఒక ప్రక్క భయంగా కూడా వుంది.

మేము భోగి ముందు రోజునే యింటికి చేరుకున్నాం.అమ్మ ఆత్మీయంగా ఆహ్వానించింది. కోడల్ని చూసి చాలా సంతోషించింది. మాది పెద్ద మండువలోగిలి. ప్రతీ సంక్రాంతికి ఇంటికి సున్నాలు వేయిస్తుంది. గదులన్నీ శుభ్రం చేయిస్తుంది. మేముండే నాలుగురోజులు మాకే లోటు లేకుండా చూస్తుంది. మా యింటి చుట్టూ కొబ్బరి తోటలు, ఒక ప్రక్క ఏటిగట్టు దానినానుకుని గోదావరి ఉంటుంది. అంత

మనోహరమైన ప్రకృతిలో పుట్టినందుకు ఎంతో గర్వంగా కనిపించినా యిక్కడ ఉండలేకపోతున్నామే అనే బాధ మనసును తొలుస్తూ ఉంటుంది.

మేం ఫ్రెష్ అయ్యి హాల్లో కొచ్చేసరికి యింట్లో చాలామంది కనిపించారు. ఎప్పుడు యింట్లో అమ్మ, ఒకరిద్దరు పనివాళ్ళు తప్ప ఎవరూ కంపించేవారు కాదు. కాని యిప్పుడు యింట్లో అమ్మ వయసు వారే పదిమంది వరకు ఆడా,మగా కన్పించారు. వాళ్ళంతా ఎవరో నాకు అర్థం కాలేదు.

మెత్తగా దూదిలా ఉన్న ఇడ్లీలను కారంపొడి, కొబ్బరి చట్నీతో నంజుకుతిని చిక్కటి పాలతో కలిపిన చక్కటి కాఫీ తాగాం. ఇంతటి కమ్మని రుచి నాకిక్కడే దొరుకుతుంది. తెల్లారితే భోగి. ఇల్లంతా పండుగ వాతావరణం చోటుచేసుకుంది.

అమ్మ,నేను యశోద హాల్లో వున్న సోఫాల్లో కూర్చున్నాం. అమ్మ ముఖం ఎంతో ప్రశాంతంగా,ఆరోగ్యంగా, హుందాగా వుంది. ఈ వయసులో కూడా అలా ఉందంటే ఆశ్చర్యంగా వుంటుంది. మా యింట్లో మొత్తం ఆరు గదులున్నాయి. ఒక గదిలో అమ్మ వుంటుంది. మరో గది మాది. మేము వచ్చినప్పుడు దానిని ఉపయోగిస్తాం. ప్రతీవారం ఆ గదిని శుభ్రం చేయిస్తూ వుంటుంది. మిగిలిన నాలుగు గదులు ఎప్పుడూ ఖాళీగానే వుంటాయి. కానీ ఇప్పుడు మాత్రం వాటిలో ఆ పదిమంది ఉన్నారు.

"వాళ్ళంతా ఎవరమ్మా"అని అడిగాను.

అమ్మ గదుల్లో వున్న వాళ్ళను పిలిచింది. వాళ్ళంతా బయటికొచ్చారు. అంతా వయసు మళ్ళిన  వాళ్ళే. కాని వాళ్ళ ముఖాల్లో ఎంతో ప్రశాంతత, బ్రతుకు మీద ఆశ,భద్రత కనిపిస్తున్నాయి. "వాళ్ళంతా అన్నీ వున్న  అనాధలు నాన్నా బ్రతుకు పోరాటంలో ఓడిన వాళ్ళు. వాళ్ళలో పొడవుగా వున్నాయన జగన్నాధం బాబాయి. మీ నాన్నగారి దగ్గరి చుట్టం. ఆయన ప్రక్కనున్నావిడ ఆయన భార్య సుభద్రమ్మ పిన్ని. వీళ్ళకిద్దరు కొడుకులు. ఒకప్పుడు మంచి ఆస్థిపరులైనా కొడుకులు అన్ని వ్యసనాలకు బానిసలై ఆస్తంత తగలేశారు. వీళ్ళను పోషించలేమని చెప్పి బయటకు తోలేశారు. వీళ్ళు బ్రతుకు మీద ఆశను విడిచి ఆత్మహత్య చేసుకోబోయారు. నేనే వాళ్ళను తీసుకొచ్చి మన యింట్లో ఉండమన్నాను. ఆ ప్రక్కనున్నావిడ జనకమ్మగారు. భర్త పోయాడు. ఉన్న ఒక్క కొడుకుని ఆస్తులన్నీ అమ్మి కష్టపడి చదివించింది. వాడు అమెరికా పోయి అక్కడమ్మాయిని పెళ్ళాడి అక్కడే సెటిలయిపోయాడు. కనీసం తల్లి ఎలా వుందో వాడు ఆలోచించడం లేదు. ఫోన్ చెయ్యడు, ఏమి పంపడు. అసలు బతికుందో లేదో కూడా వాడికి అక్కర్లేకుండా పోయింది. ఆమె నాకు చిన్నప్పటినుండి తెలిసినావిడ

కావడంతో మనింట్లోనే వుంటుంది. ఆ ఇద్దర్లో ఒకరు రెహమాన్ భాయ్. రెండో ఆయన క్రిష్టఫర్. మీ నాన్నగారి ప్రాణస్నేహితులు. వీళ్ళిద్దరూ కూడా పిల్లల అనాదరణకు గురైనవారే. అందుకే వీళ్ళనూ ఇక్కడే ఉండమన్నాను. మిగతావాళ్ళంతా కూడా వృద్ధాప్యంలో కన్నవాళ్ళ ఆప్యాయతకు దూరమైనవారే. నేనేం వాళ్ళకు పంచభక్ష్యపరమాన్నాలు వండిపెట్టడం లేదు. మనకున్న దాన్లోనే తలోముద్ద పెడుతున్నాను. మన పొలం మీద ఏటా పాతిక, ముప్ఫై బస్తాలు ధాన్యం వస్తుంది. కొబ్బరి తోట మీద నెలకు రెండు, మూడు వేలు వస్తాయి. అంతా రోజూ తినే గుప్పెడు బియ్యానికి సరిపోతున్నాయి. మన పెరడంతా ఖాళీగానే వుందిగా అందులో రోజూ కావలసిన కూరగాయాల్ని వీళ్ళే పండిస్తున్నారు. మనకా లంకంతా ఇల్లుంది. అంత ఇంట్లో ఒక్కదాన్నే ఉండాలన్నా బోరుగా వుంటుంది. వీళ్ళు వచ్చిన తర్వాత నాకు కాలక్షేపం బాగానే ఉంది. అయినా ఈ గదులన్నీ ఖాళీగా ఉండటం వల్ల పాడయిపోతున్నాయి కదా. వీళ్ళంతా ఉండటంతో యిల్లంతా చూడు ఎలా కళకళలాడిపోతుందో", అంటూ చెప్పడం ఆపింది.

నేను హిమాలయాలను చూడలేదు. కానీ అంతకన్నా ఎత్తు ఎదిగిపోయిన అమ్మను చూస్తున్నాను. అమ్మ ఎంత నిస్వార్థపరురాలు. ఉన్నదాంట్లోనే పదిమందికి పెట్టాలనుకోవడం ఎంత గొప్ప విషయం. ఎంతమంది ఆలోచిస్తారిలా, నేను మాత్రం ఏం చేస్తున్నాను. బ్యాంకుల్లో లక్షలు ములుగుతున్నాయి. ఆస్తులు కోట్లలో ఉన్నాయి. ఏం ప్రయోజనం.

యశోద మాత్రం అమ్మ వంక, వాళ్ళ వంక వింతగా చూస్తుంది. వాళ్ళలోని రహమాన్ భాయ్ అన్నాడు. "చూడుబాబూ మీ నాన్నా, మేమూ ప్రాణస్నేహితులం. మా మధ్య రక్తసంబంధం లేదు కానీ సొంత అన్నదమ్ముల కంటే ఎక్కువగా వుండేవాళ్ళం. ఆయన పోయినా అమ్మగారు కూడా మమ్మల్ని సొంత తోబుట్టువులాగానే ఆదరించారు. ఆ అమ్మ చేతి బువ్వ మాలో బతుకు మీద ఆశల్ని పెంచింది. ఆ తల్లే లేకపోతే మేమీ పాటికి లోకాన్ని విడిచి పోయే వాళ్ళమేమో. మా ఆయుష్షు కూడా పోసుకుని ఆ తల్లి నూరేళ్ళు బ్రతకాలని, మా లాంటి వాళ్ళకు అండగా ఉండాలని ఆ దేవుణ్ణి కోరుకుంటున్నాను.

ఆయనలా అంటుంటే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. యశోద కళ్ళు కూడా చెమ్మగిల్లినట్లనిపించింది.

"వీళ్ళే కాదురా ..వీళ్ళలాంటి వాళ్ళు మనూళ్ళో చాలామంది వున్నారు. అందర్నీ

నేను చూడలేను కదా. ఏ మహానుభావుడైనా పుణ్యం కట్టుకుంటే వాళ్ళ బతుకులు కూడా బాగుంటాయి"అంది అమ్మ. ఆ మధ్యాహ్నం అమ్మ చేతి వంట రుచి చూశాం. ముద్దపప్పు, దోసకాయ, చిక్కుడు కాయ వేపుడు, కమ్మని నెయ్యి, గడ్డ పెరుగు కడుపు నిండా తిన్నాం.

దేవతలు తాగే అమృతం ఎలా వుంటుందో గాని అమ్మ చేతి వంట అంతకు మించే వుంటుంది. రాత్రంతా ప్రయాణం చేశామేమో భోజనం చేసిన వెంటనే నిద్ర పట్టేసింది. సాయంత్రం ఐదు గంటలకు గాని మెలుకువ రాలేదు. వంటింట్లో నుంచి పండగ కోసం చేస్తున్న పిండి వంటల ఘుమఘుమలు నాసికా రంధ్రాలను తాకుతున్నాయి.

ప్రతి సంవత్సరం అమ్మ సంక్రాంతికి నాకిష్టమైన అరిసెలు, సున్నుండలు, జంతికలు, పూతరేకులు చేయిస్తుంది. యశోద టీ తెచ్చింది, టీ తాగి ఆలోచనల్లో పడ్డాను. సాయంత్రం ఆరు గంటలకు యశోదను తీసుకుని గోదావరి ఒడ్డుకు వెళ్ళాను. ఇసుక తిన్నెల మీద యిద్దరం కూర్చున్నాం. గోదావరి మీద నుంచి చల్లని గాలి వస్తుంది. సాయంకాలపు నీరెండ గోదావరి అలలమీద పడి వెండిలా మెరుస్తుంది.

"యశూ! నీకో విషయం చెప్పాలని ఇక్కడకు తీసుకువచ్చాను. నేనొక నిర్ణయం తీసుకున్నాను. అది నీకు నచ్చుతుందో లేదో నాకు తెలియదు. కానీ నేనేం చెయ్యాలనుకుంటున్నానో చెబుతాను విను. నేను ఉద్యోగానికి రిజైన్ చేసి ఈ వూరు వచ్చేద్దామనుకుంటున్నాను"అంటూ ఆగాను.

యశోద నా వంక ఆశ్చర్యంగా చూసింది.

"అమ్మ చేస్తున్నది చూశాక ఆమె ముందు నేను చాలా అల్పుడిగా అనిపించాను. అందుకే ఆమె బాటలో నేనూ పయనించాలని అనుకుంటున్నాను. ఈ వూళ్ళో వృద్ధులకు, అనాథలకు ఓ ఆశ్రమాన్ని నిర్మించాలనుకుంటున్నాను. కడుపున పుట్టిన పిల్లల చేత అనాదరణకు గురైన తల్లిదండ్రులకు, అమ్మానాన్నలను కోల్పోయిన పిల్లలకు ఆశ్రయం కల్పించాలని నిర్ణయించుకున్నాను. మనకా పిల్లలు లేరు. ఇంకా సంపాదించి ఏం చేసుకోవాలో అర్థం కావడం లేదు. మనం తోటి మనుష్యులకు సాయం చేయలేకపోతే ఈ జీవితానికి అర్థం లేదనిపిస్తుంది. ఈ విషయంలో నిన్ను ఏం బలవంతపెట్టదలచుకోలేదు. మీ నాన్న గారి ఆస్థి నాకు అక్కర్లేదు. నా అకౌంటులో ఉన్నది నాకు చాలు. నువ్వు అక్కడే ఉండేటట్లైతే ఉండొచ్చు. ఇక్కడి వాతావరణం, అమ్మ చేతి వంట నన్ను ఆరోగ్యవంతుణ్ణి చేస్తాయనిపిస్తుంది"చెప్పడం ఆపాను.

కాస్సేపు ఆలోచించి యశోద అంది, "నాదో కోరిక తీర్చేటట్లయితే నేనూ కూడా మీతో పాటే యిక్కడే ఉండిపోతాను"

"ఏమిటో చెప్పు"అన్నాను.

"మనకి పిల్లలు లేరు. అంతమాత్రం చేత నేను తల్లిని కాకుండా పోను కదా. నాకూ తల్లిని అనిపించుకోవాలనే కోరిక చాలా గాఢంగా వుంది. అందుకని అనాథ శిశువులైన ఒక పాపను, ఒక బాబును మనం దత్తత తీసుకుందాం. వాళ్ళను కన్నబిడ్డల కంటే ప్రేమగా పెంచుతాను. నేనూ తల్లిప్రేమను పొందుతాను. మీరు చేస్తున్న దానికి నా వంతు కృషి చేస్తాను. నేనూ నా ఉద్యోగానికి రిజైన్ చేస్తాను. అక్కడి మన సంపాదన అంతా ఇక్కడకు తీసుకు వచ్చి మరింత మందికి సాయపడదాం",అంది మనస్ఫూర్తిగా.

యశోద నిర్ణయాన్ని హర్షించకుండా ఉండలేకపోయాను. యశోద చేతిని తీసుకుని ప్రేమగా నొక్కాను. ఆ రాత్రి భోజనాలయ్యాక అమ్మ ప్రక్కనకూర్చుని విషయం చెప్పాను. అమ్మ ఆనందం మాటలతో వర్ణించలేను. నన్ను ప్రేమగా దగ్గరకు తీసుకుని నా తలను ఒడిలో పెట్టుకుని నా నుదిటి మీద తన అరచేతితో స్పృశించింది.

అమ్మ ఒడిలోని హాయి అమ్మ చేతి బువ్వంత కమ్మగా వుంది.

**(ఫిబ్రవరి 2014, విశాలాక్షి మాస పత్రికలో ప్రచురితం)**

* * *

# ఆ(మె) నవ్వు

**ఆ** నవ్వు మనిషిని సమ్మోహనపరిచేదిలా లేదు. అలా అని హృదయాన్ని గిలిగింతలు పెట్టేలానూ లేదు. ఎంతో ఆత్మీయంగా ఉంది. మనసును ఆహ్లాదపరిచేదిలా వుంది. ఇద్దరు స్నేహితులో లేక ఇద్దరు ప్రేమికులో మాట్లాడుకునే సందర్భంలో మనసునిండా సంతోషంగా ఉన్నప్పుడు వచ్చే నవ్వులా ఎంతో అందంగా వుంది ఆమె నవ్వు. నిజానికి ఆమె ఎవరో నాకు తెలీదు. ఇంతకుముందెప్పుడూ చూసిన గుర్తు లేదు. నేనెవరో ఆమెకు తెలుసో లేదో నాకు తెలీదు.కానీ ఆమె నన్ను చూసి నవ్విందంటే నేను ఆమెకు తెలిసే వుండాలి. ఎందుకంటే ఎవరో అపరిచితుల్ని కావాలని పలకరించినప్పుడు నవ్వే కృత్రిమ నవ్వులా లేదు.

అసలు నేను ఆ సమయంలో ఆ సెంటరుకు వెళ్ళను. ఎందుకంటే సాయంకాలలప్పుడు ఆ సెంటరు చాలా రద్దీగా ఉంటుంది. ఈ రోజు మార్నింగ్ వాక్ చెయ్యని కారణంగా సాయంకాలం నడుద్దామని బయలుదేరాను. సరిగ్గా అప్పుడే ఆమె నాకు ఎదురయ్యింది. నాతో ఏమీ మాట్లాడకుండానే నా ప్రక్క నుంచి వెళ్ళి కొంచెం దూరం నడిచి ఆగింది. ఆమె ఎవరో అర్థం కాక వెనక్కి తిరిగిన నాకు ఆమె నా వంకే చూస్తూ కన్పించింది. ఆమె ముఖంలో నవ్వు మాత్రం చెక్కుచెదరలేదు.

నాకు మాత్రం మతిపోతోంది. ఇంతకీ ఆమె ఎవరు? ఒకవేళ నా శ్రీమతి స్నేహితురాలు కాదు కదా. తన గురించి అడగటానికి ఆగిందా? పోనీ దగ్గరకెళ్లి అడిగితే? అదే మంచిది. లేకపోతే ఈ సస్పెన్స్ ను భరించడం కష్టంగా ఉంది. ఆమె దగ్గరకు నడిచాను. నేను తన దగ్గరకు రావడం చూసి ఆమె కొంచెం దూరంగా వెళ్ళి ఎవరూ లేని చోట నిలబడిందిఆమెకు ముప్పై ఐదేళ్ళు వుండొచ్చు. సాదా చీరలో అందంగా ఆకర్షణీయంగా వుంది.

నేను వెళ్ళి ఆమె ప్రక్కగా నిలబడి "మీరెవరో నాకు తెలియదు. మిమ్మల్నెప్పుడు కూడా నేను చూడలేదు. నన్ను చూసి మీరు నవ్వుతుంటే నేను మీకు తెలుసెమో అనిపిస్తుంది. ఇంతకీ మీరు ...."అంటూ ఆగాను.

ఆమె ఒక్కసారి నవ్వి అంది, "నిజమే మీరు నన్నెప్పుడు చూసి ఉండరు. నేనే మిమ్మల్ని అప్పుడప్పుడు చూస్తూ ఉంటాను. మీ అపార్ట్మెంట్ ప్రక్కన ఒక అపార్ట్మెంటు

ఉంది కదా, దాని ప్రక్కన రెండు పోర్షన్లున్న చిన్న ఇంట్లో ఒక దానిలో మేము ఉ ంటాము. మీరు రోజు ఆఫీసుకు మా ఇంటి ముందే వెళుతుంటారు. మీరు మోటారు బైకు మీద వెళుతూ మా ఇంటి వైపు చూసే అవకాశం లేదు కాబట్టి నన్ను చూసి వుండరు. అప్పుడప్పుడు మీరు నాకు కనిపిస్తారు.

"ఇంతకీ మీకు నాతో ఏమైనా పని ఉందా?" అడిగాడామెను.

కాస్సేపు సంశయించి నెమ్మదిగా అంది, "నాకో హెల్ప్ చేయగలరా?"

"చెప్పండి"

"ఇలా అడుగుతున్నానని నన్ను మరోలా భావించకండి. చాలా దయనీయమైన పరిస్థితిలో ఉండి అడగవలసి వస్తుంది. నాలాంటి పరిస్థితి ఎవరికీ రాకూడదని కోరుకుంటున్నాను."

"ఇంతకీ మీరు అసలు సంగతి చెప్పలేదు"

చెప్పడానికి ఆమె మొహమాటపడుతోంది. అంతవరకు నవ్వుతూ వున్న ఆమె ముఖంలో ఏదో సన్నని బాధ గోచరిస్తోంది.

"పర్వాలేదు అడగండి. నేను చెయ్యగలిగితే చేస్తాను" కాస్సేపు మౌనం తర్వాత ఆమె చెప్పింది.

"నాకో రెండు వేల రూపాయలు ఇవ్వగలరా"నేను ఆశ్చర్యంగా ఆమె వంక చూసాను.

ఆమె ఎవరో నాకు తెలీదు. ఆ సంగతి ఆమెకూ తెలుసు. తెలియని వ్యక్తికి ఎవరైనా డబ్బులిస్తారా? ఎలా అడగగలిగింది.

"మీ అనుమానం నేనూహించగలను. తెలియని వ్యక్తికి ఎలా సాయం చేస్తారని అనుకుంటున్నారు కదూ. తెలిసున్నవారికే సాయం చెయ్యాలి, తెలియని వారికి చెయ్యకూడదనేమీ లేదు కదా"

అసలు ఈమె ఎవరు? వందో, రెండొందలో కదా పోతేపోయాయనుకోవచ్చు. ఏకంగా రెండువేలు,అంతమొత్తం ఎందుకిస్తారు. లేదనేస్తే సరిపోతుంది.

"మీ దగ్గర డబ్బు తీసుకుని ఎగ్గొడతానని అనుకుంటున్నారేమో తొందరలోనే మీ డబ్బులు మీకు తిరిగి ఇచ్చేస్తాను. తెలియని వ్యక్తి డబ్బులడిగితే ఎవరికైనా అనుమానం వస్తుంది, అవి తిరిగొస్తాయో రావోనని. అసలు తెలిసిన వ్యక్తికి డబ్బులు ఇవ్వాలంటేనే ఎంతో ఆలోచించాల్సిన పరిస్థితి. అలాంటప్పుడు మీరు ఆలోచించడంలో తప్పు లేదు. కానీ నాకు డబ్బు చాలా అవసరముండి దిక్కు తోచని పరిస్థితిలో మిమ్మల్ని

అడుగుతున్నాను.

ఆమెకేం చెప్పాలో అర్థం కావడం లేదు. ఆమెను చూస్తుంటే మోసం చేసే మనిషిలా కనిపించడం లేదు. అలా అని ఇవ్వాలంటే ఆమె ఎవరో తెలీదు. ముక్కుముఖం తెలియని వాళ్ళకు ఇచ్చిన తర్వాత బాధపడాలి.

"మీరేం ఆలోచిస్తున్నారో నేను ఊహించగలను. కానీ మీకు నా మీద నమ్మకం కలగడం లేదు. దానికీ మార్గం చెబుతాను. అంతకన్నా నాకు మరో దారి లేదు"అలా అంతున్నప్పుడు ఆమె కంఠం కొద్దిగా ఒణికింది.

"ఏమిటది"అడిగాను.

"నన్ను మీరు గంటసేపు ఎక్కడికైనా తీసుకెళ్ళండి. మీరెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను. అప్పుడే నాకు డబ్బులివ్వండి" ఆమె కళ్ళల్లో కన్నీటి తెర,ఆమె మాటలకు బిత్తరపోయాను.

"అంటే ..."

"నేను చెప్పినమాట మీకు అర్థం కాలేదని నేననుకోను. మీరిచ్చే డబ్బులకు ప్రతిఫలంగా నన్ను నేను ఇచ్చుకోవడం తప్ప నేను ఈ పరిస్థితిలో ఏం చెయ్యలేను"

ఆమె బుగ్గల మీదుగా కన్నీరు.

ఆమెను ఆ స్థితిలో చూస్తే చాలా జాలేసింది. ఇచ్చేద్దామా అనుకున్నాను. ఇవ్వడానికి నా దగ్గర డబ్బులున్నాయి. అయితే ఆమె ఎందుకడుగుతుందో తెలుసుకోవాలి. అదే అడిగాను.

కొంచెం సేపు మౌనంగా ఉండి అప్పుడు చెప్పింది.

"ఈ రోజు మధ్యాహ్నం మా అమ్మాయి పెద్దమనిషయ్యింది. మా వారిక్కడ ఓ బట్టల కొట్లో గుమాస్తాగా పని చేస్తున్నారు. ప్రస్తుతం ఆయన వూళ్ళో లేరు. ఆయన,యజమాని కలిసి బట్టలు కొనుక్కోవడానికి మహారాష్ట్ర వెళ్లారు. ఇంకో పదిహేను రోజుల వరకు రారు. నాకేం చెయ్యాలో పాలుపోవడం లేదు. మాకు ఒక్కతే కూతురు. ఈ ఫంక్షను గ్రాండ్ గా చెయ్యకపోయినా కనీసం స్నానం చేయించి కొత్త బట్టలు వెయ్యాలి. ఇరుగు పొరుగు వాళ్ళకి తాంబూలాలివ్వాలి. వాటికోసం కనీసం రెండువేలన్నా ఉండాలి. ఆయన వూరు వెళుతూ ఇంటి ఖర్చులకిచ్చారు. అవి కూడా అయిపోవచ్చాయి. డబ్బులేనప్పుడు అంత ఖర్చు పెట్టి చెయ్యకపోతేనేం అని మీరనుకోవచ్చు. కానీ మాకొక్కగానొక్క కూతురు. మా బంధువుళ్ళలో జరిగే ఫంక్షన్లన్నీ అది చూసింది. ఈ విషయంలో మేం పట్టించుకోకపోతే అది ఫీల్ కావచ్చు. అందులోనూ

ఇరుగుపొరుగు వారు, మా బంధువులు కూడా నానామాటలంటారు. కష్టమో,నష్టమో ఇప్పుడు చేస్తే మేం కూడా ప్రశాంతంగా వుండగలం. నాకు తెలిసిన ఎంతోమందిని అడిగాను. ఎవ్వరూ ఇవ్వలేదు. గత్యంతరం లేని పరిస్థితిలో మిమ్మల్ని అడుగుతున్నాను. మా వారొచ్చిన తరువాత మా యజమాని దగ్గర తీసుకుని మీకు ఇచ్చేస్తాను. ….”అంటూ ఆగింది.

ఆమెను చూస్తే చాలా జాలేసింది. కాని ఇందులో ఎంతవరకు నిజముందో తెలీదు. మా ఫ్రెండ్స్ చాలా మంది చెబుతుంటారు. ఈ రకంగా జరిగే మోసాల గురించి. కానీ ఎందుకో ఆమెను చూస్తుంటే మోసం చేసేదానిలా కనిపించడం లేదు. ఆమెకు డబ్బివ్వాలని నిశ్చయించుకుని ఆమెతో అన్నాను.

“చూడండి! మీరు చెప్పేది నిజమే కావచ్చు. మీకు డబ్బులు అవసరం చాలా వుండి వుండొచ్చు. కాని కేవలం రెండు వేల రూపాయల కోసం మిమ్మల్ని మీరు అర్పించుకోవడం అన్నది సమర్థనీయమైన విషయం కాదు. మీకు డబ్బులిస్తానని చెప్పి మిమ్మల్ని తీసుకెళ్ళి వాళ్ళు అవసరం తీరాక మీకు డబ్బులివ్వకుండా మోసం చేస్తే మీరేం చెయ్యలేరు. కాబట్టి అలాంటి ఆలోచనలు ఎప్పుడూ చేయకండి. లోకం గొడ్డు పోలేదు. మీరింకా ప్రయత్నం చేస్తే ఎక్కడో ఓ చోట దొరక్కపోదు. తొందరపడి తప్పటడుగులు వేయకండి. మీకు కావలసిన రెండువేలు నేనిస్తాను. తీసుకెళ్ళి మీ అవసరం తీరాక యివ్వండి”అంటూ జేబులో నుంచి రెండువేలు తీసి ఆమెకు ఇచ్చాను.

కృతజ్ఞత నిండిన కళ్ళతో రెండుచేతులు జోడించి, “మీరు చేసిన సాయాన్ని ఎప్పటికి మరిచిపోలేను.”అని చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన తర్వాత అక్కడ నుంచి కదిలాను. ఆ రాత్రి నిద్ర పట్టలేదు. నేను అపాత్రదానం చేయలేదు కదా అన్పించింది. ఈ విషయం ఎవరితోనూ చెప్పలేదు.

నెలరోజులయినా ఆమె నాకు డబ్బులివ్వలేదు. కనీసం ఎక్కడా కనిపించలేదు. రెండు మూడు సార్లు ఆ సెంటరుకు సాయంకాలమప్పుడు నడుచుకుంటూ వెళ్ళాను,ఆమె కనిపిస్తుందేమోనని.

ఆఫీసుకెళ్ళేటప్పుడు ఆమె ఇంటివైపు చూస్తుండేవాడిని. ఎప్పుడు చూసినా తలుపులు మూసే ఉండేవి. నిజంగా ఆమె నన్ను మోసం చేసిందా!

ఆమె మాటలు,చూపులు అలా అనిపించలేదు. అందుకే ఆమెకు డబ్బులిచ్చాను. కానీ యింతవరకు ఆమె నుంచి ఎటువంటి రెస్పాన్స్ లేదు కాబట్టి ఆమె నన్ను మోసం చేసిందనే అనుకున్నాను. జీవితంలో అదే మొదటిసారి అలా నేను

మోసపోవడం.

కొన్నాళ్ళకి నేను ఆ విషయం మరిచిపోయాననే చెప్పాలి. నాలుగు నెలలు గడిచిపోయాయి. ఓ రోజు ఆఫీసులో పని చేసుకుంటున్న సమయంలో మా ఆఫీస్ బాయ్ వచ్చి చెప్పాడు నా గురించి ఎవరో వచ్చి బయట వెయిట్ చేస్తున్నారని బయటకు వచ్చాను. కారిడార్లో ఓ పన్నెండు,పదమూడేళ్ళ వయసున్న అమంయి నిలబడి ఉ ంది. దూరం నుంచే నన్ను చూసి పలకరింపుగా నవ్వింది. ఆ నవ్వు ... అచ్చం ఆమె నవ్వులా ఉంది.

ఈ అమ్మాయిలో ఆమె పోలికలున్నాయి. నో డౌట్.

ఈ అమ్మాయి ఆవిడ కూతురే అయ్యుంటుంది.

“నమస్తే సార్”అంది ఆ అమ్మాయి నేను దగ్గరగా వెళ్ళేసరికి.

“నువ్వు ..”అన్నాను.

“నేనెవరో మీకు తెలియకపోవచ్చు సార్. కానీ మీరు నాకు తెలుసు. మీరు మా అమ్మకు రెండువేలు ఇచ్చారు కదా అప్పుడు చెప్పింది మిమ్మల్ని చూపించి. ఆ డబ్బులిచ్చి వెళదామని వచ్చాను.”

అంతలోనే ఆ అమ్మాయి ముఖంలో విషాదం. ఆ అమ్మాయి ఎందుకలా వుందో అర్థం కాలేదు.

కాస్సేపాగి అంది “సార్! మీకు ఇవ్వాల్సిన రెండువేలు ఇవ్వడం చాలా ఆలస్యమైంది. క్షమించండి సార్. మా అమ్మ పదేపదే చెప్పింది సార్ మీకు త్వరగా డబ్బులిచ్చేయ్యమని. నేనే యివ్వలేకపోయాను సార్”అంటూ రెండువేలు హ్యాండ్ బ్యాగ్ లో నుంచి తీసి నా చేతికి ఇచ్చింది.

“మీ అమ్మ నీకు చెప్పడమేమిటి తనే యివ్వొచ్చు కదా”నేనలా అన్న వెంటనే ఆ అమ్మాయి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

“మా అమ్మ చచ్చిపోయింది సార్.”

ఆ మాటలు విన్న నేను షాక్ తిన్నాను.

ఆమె నవ్వు ముఖం నాకు వెంటనే గుర్తుకు వచ్చింది.

“అదేంటి ?...ఏం జరిగింది?”అడిగాను.

“ఆ రోజు మీరు రెండువేలు ఇచ్చిన వెంటనే ఆనందంగా ఇంటికి వచ్చింది. ఆ డబ్బుతో నాకు బట్టలు,యింకా ఏం కావాలో లిస్టు రాసుకుంది. మా నాన్న వచ్చిన

తరువాత మీ డబ్బు మీకు ఇచ్చేయ్యాలంది. ఆ మర్నాడు ఉదయం అమ్మ బజారుకు బయలుదేరుతుంటే మీరు ఆఫీసుకు బైకు మీద మా ఇంటి మీదుగా వెళుతున్నప్పుడు నాకు మిమ్మల్ని చూపించింది. పదిగంటల తరువాత బజారుకు వెళ్ళింది. వెళ్ళిన గంటకు నాకు కబురొచ్చింది అమ్మ గవర్నమెంటు హాస్పటల్ లో ఉందని. కంగారుగా వెళ్ళాను. గట్టిగా దెబ్బలు తగిలి చావు బతుకుల్లో ఉంది. అమ్మ ఎక్కిన షేర్ ఆటోను వెనకనుంచి స్పీడ్ గా వస్తున్న లారీ గుద్దేసిందట.తలకు పెద్ద పెద్ద గాయాలయ్యాయి. డాక్టర్లు బ్రతకడం కష్టమని చెప్పేశారు. మా నాన్నకు ఫోన్ చేసి చెప్పాను. అమ్మ స్పృహలో ఉండగా చెప్పింది మీకు డబ్బును ఎలా అయినాసరే అందజేయమని. నేను మీకు తప్పకుండా అందజేస్తానని మాట ఇచ్చాను. మా నాన్న వచ్చిన రోజునే అమ్మ చనిపోయింది. అప్పటికి ఆమె స్పృహలో లేదు. మీరిచ్చిన డబ్బులు మా అమ్మ అంత్యక్రియలకు పనికొచ్చాయి."

ఆ అమ్మాయి కళ్ళల్లో నీరు బుగ్గల మీదుగా జారుతున్నాయి.

ఎంతటి హృదయ విదారకమైన సంఘటన. ఆమె అప్పుడు కలలో కూడా ఊహించి వుండదు నా దగ్గర తీసుకుంటున్న డబ్బు తన అంత్యక్రియలకు పనికొస్తాయని. ఆ అమ్మాయి మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"అమ్మ పోయినప్పటి నుంచి నాన్న పిచ్చోడయిపోయాడు. తాగుడికి బానిసైపోయి సంపాదించినదంతా ఇంట్లో కొంత ఇచ్చి మిగిలింది తాగేస్తున్నాడు. మీకు ఇవ్వాల్సిన డబ్బు ఎలా ఇవ్వాలో అర్థం కాలేదు. మీకు తప్పకుండా యిస్తానని అమ్మకు చెప్పాను. అమ్మకు ఇచ్చిన మాట నెరవేర్చకపోతే అమ్మ ఆత్మకు శాంతి కలుగదు. అందుకే నేను స్కూలుకు వెళ్ళే ముందు ఒక గంట, అయిపోయిన తరువాత ఒక గంట పని చెయ్యడానికి ఓ యింట్లో కుదిరాను. వాళ్ళు నెలకు అయిదు వందలు యిస్తున్నారు. నేను పని చేస్తున్నట్టు మా నాన్నకు తెలియదు. అసలు నన్ను స్కూలు మానెయ్యమంటున్నాడు. తనింక చదివించలేనని ఇంట్లో పడుండమంటున్నాడు. నేను బాగా చదువుకోవాలని అమ్మ కోరిక. బాగా చదివి ఉద్యోగం చేయాలని ఎప్పుడూ చెబుతూండేది. అమ్మ కోసమైనా నేను చదువుకోవాలి. నాన్న వద్దన్నా నేను ఎక్కడో ఓ చోట పని చేసుకుంటూ చదువుకుంటాను. అది చాలు నాకు."

ఆ అమ్మాయి కళ్ళల్లో వాళ్ళమ్మ కోరిక తీర్చానన్న సంతృప్తి కనిపించింది. ఆ అమ్మాయి ఎంత బాధ్యతగా తీసుకుంది. వాళ్ళమ్మ చనిపోయిందన్నప్పుడు అయ్యో పాపం అనిపించింది. కానీ వాళ్ళమ్మకిచ్చిన మాట కోసం ఒకరింట్లో పనిమనిషిగా

చెరీ ఆ డబ్బు నాకివ్వడం తలుచుకుంటుంటే మనసంతా ఎలాగో అయిపోయింది. ఎందుకో ఆ డబ్బు తీసుకోవాలని అనిపించలేదు. తిరిగి యివ్వబోయాను. ఆ అమ్మాయి తీసుకోలేదు.

"వద్దు సార్! మీరు తిరిగి యిచ్చేస్తే నేను అమ్మ మాట నెరవేర్చినట్లు కాదు. అమ్మ మీకు బాకీ ఉంది. దాన్ని నేను తీర్చేశాను అంతే."

ఆ అమ్మాయి అలా అంటుంటే నేనేం చెయ్యలేక ఆ డబ్బును జేబులో పెట్టుకున్నాను.

"చూడమ్మా నేనో మాట చెబుతాను వింటావా"అన్నాను .ఏమిటన్నట్లు చూసింది.

"నీకు బాగా చదువుకోవాలనే కోరిక వుంది కాబట్టి నువ్వు ఎంతవరకు చదువుకోవాలనుకుంటున్నావో అంతవరకు నేను చదివిస్తాను. ఆ తర్వాత నీకు ఉ ద్యోగం కూడా చూస్తాను. నాకు ఒక్కడే కొడుకు. వాడిప్పుడు స్టేట్స్ లో మంచి ఉ ద్యోగం చేసుకుంటూ భార్యతో అక్కడే ఉంటున్నాడు. ఇక్కడ నేను నా భార్య ఇద్దరమే వుంటున్నాము. నాకిక్కడ మంచి ఉద్యోగమే ఉంది. నీ చదువుకు అయ్యే ఖర్చు నాకు పెద్ద భారమనిపించదు. కాబట్టి నువ్వు బాగా చదువుకో. మా ఇంటికి అప్పుడప్పుడు వస్తుండు. నీకు అమ్మలేని లోటు కన్పించదు. మాకూ ఈ వయసులో ఒంటరితనమనిపించదు తెలిసిందా"అన్నాను.

ఆ అమ్మాయి కృతజ్ఞత నిండిన కళ్ళతో చూసింది.

నా దగ్గర డబ్బు తీసుకుంటున్నప్పుడు వాళ్ళమ్మ కూడా ఇలాగే చూసింది.

అంతవరకూ విచారంగా వున్న ఆ అమ్మాయి కళ్ళల్లో చిరునవ్వు వెలిసింది.

ఆ నవ్వు అచ్చం వాళ్ళమ్మ నవ్వులాగే ఉంది.

నా గుండెలో నిక్షిప్తమైన ఆ నవ్వు ....ఆమె నవ్వు.

**(జులై 2, 2014 నవ్య వారపత్రికలో ప్రచురితం)**

* * *

# విలువలు

ఉదయం తొమ్మిది గంటలకే  రైల్వే స్టేషన్ చేరుకున్నాను. జన్మభూమి సూపర్ ఫాస్ట్ ఎక్స్ ప్రెస్ రాజమండ్రి వచ్చేసరికి తొమ్మిది దాటుతుంది.రోజూలాగే ఈ రోజు కూడా రైల్వే స్టేషనంతా జనంతో నిండిపోయింది.

తొమ్మిదిన్నరకల్లా ట్రైన్ వచ్చింది. రిజర్వేషన్ కంపార్ట్మెంట్ నెంబరు చూసుకుని ఎక్కి నా సీటు దగ్గరకెళ్ళి కూర్చున్నాను. ఏ.సి.కంపార్ట్మెంట్ కావడంతో అక్కడక్కడా సీట్లు ఖాళీగా వున్నాయి.

నా ఎదురు సీట్లో ఓ జంట కూర్చున్నారు. చూడముచ్చటగా ఉంది. అమ్మాయి మాత్రం చాలా అందంగా ఉంది. ఆమెకు ఇరవై రెండేళ్ళు ఉండొచ్చు.బంగారం లాంటి రంగు, గుండ్రటి ముఖం, నవ్వుతూ ఉన్నట్లుండే కళ్ళు. చుడీదార్ లో బాగుంది ఆమె.

ట్రైన్ బయలుదేరింది. గోదావరి బ్రిడ్జి మీద నుంచి  ట్రెయిన్  వెళుతున్నప్పుడు వింత శబ్దం విన్పిస్తోంది. నేను ఎక్కే వరకు నా సీటు ఖాళీగానే ఉంది. వాళ్ళిద్దరూ అంత వరకు చాలా ఫ్రీగా ఉండి ఉంటారు. నేను కూర్చునే సరికి వాళ్ళకి కొంచెం అసౌకర్యంగా ఉన్నట్లనిపించింది. నా పక్కసీటు ఖాళీగానే ఉండి. ఇంతలో టి.టి.ఇ వస్తే టికెట్ చూపించాను. అతను వెళ్ళాక ఎయిర్ బ్యాగ్ లో నుంచి వీక్లీ తీసి చదవడం మొదలుపెట్టాను. నేను ఎప్పుడయితే పేజీలు తిప్పడం మొదలుపెట్టానో వాళ్ళు నెమ్మదిగా మాట్లాడుకోవడం ప్రారంభించారు. కొత్త జంట లాగా ఉన్నారు. ఒకరికి దగ్గరగా మరొకరు అతుక్కుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

వాళ్ళు భార్యాభర్తలా లేకా ప్రేమికులా అని వాళ్ళను చూస్తుంటే అనుమానం వచ్చింది.ఎందుకంటే ఆమెకు పెళ్ళయిన దాఖలాలేమీ లేవు. మెళ్ళో సూత్రాలు గాని, నల్ల పూసలు గాని, పాపిట సింధూరం గానీ లేవు. అవి లేవు కాబట్టి పెళ్ళి కాలేదని అనుకోవడానికి లేదు. ఇప్పుడు పెళ్ళయిన వాళ్ళు కూడా వాటిని పెట్టుకోవడం లేదు కదా. నా పుస్తక పఠనంలో నేనున్నాను. నా ఉనికిని పట్టించుకోకుండా జోకులేసుకుంటూ,నవ్వుకుంటూ ఒకర్నొకరు గిచ్చుకుంటూ జార్నీని తెగ ఎంజాయ్ చేస్తున్నారు వాళ్ళిద్దరూ. నేను పుస్తకంలో నుంచి తల పైకెత్తేసరికి ఆ అమ్మాయి చెవిలో అతనేదో చెబుతున్నాడు. ఆమె వద్దంటూ తల ఊపింది. కాస్సేపు బతిమాలాడు.

తర్వాత సరేనని విండో వైపు జరిగి సర్దుకుని కూర్చుంది. అతను తన తలను ఆమె ఒళ్ళో పెట్టుకుని పడుకున్నాడు. ఆ అమ్మాయి అటూ యిటూ చూసి నా వంక చూసింది. అప్పుడే నా ముఖాన్ని పుస్తకం వైపు మరల్చినా దృష్టి అటువైపే ఉంచాను. ఆమె చటుక్కున అతని నుదుటి మీద ముద్దు పెట్టుకుంది. అతను ఆమె వంక నవ్వుతూ ప్రేమగా చూశాడు. ఆమె అతని వంక ఆరాధనగా చూసింది. అతని తలలోనికి తన వేళ్ళనిపోనిచ్చి అతని జుట్టుతో ఆడుకుంది. హేండ్ బాగ్ లో నుంచి బిస్కెట్ ప్యాకెట్ తీసి ఒక్కో బిస్కెట్ ను అతని నోటికి అందిస్తోంది. అతను సగం కొరికితే మిగిలిన సగాన్ని తను తింటోంది.

"రాత్రి సినిమా చాలా బాగుంది కదూ"అన్నాడతను నవ్వుతూ.

"నన్ను సినిమా ఎక్కడ చూడనిచ్చావు. నీ చేతులతో నన్ను తెగ అల్లరి పెట్టేశావు"అంది ముద్దుముద్దుగా.

"ఏం చెయ్యనమ్మా! ఇంత అందాల చందమామ నా పక్కనుంటే. ముడుచుకుని ఎలా కూర్చోను చెప్పు" అన్నాడతను.

"ఊ ...కబుర్లు మాత్రం బాగా చెబుతావు "అంటూ అతని నెత్తి మీద నెమ్మదిగా మొట్టింది.

వాళ్ళనలా చూస్తుంటే నాకు చాలా ఆనందంగా ఉంది. కొత్త జంట. ముద్దుమురిపాలతో ఎంతో అన్యోన్యంగా కనిపిస్తున్నారు. అంత అందమైన అమ్మాయి దొరకడం నిజంగా అతని అదృష్టమనిపించింది.

ఇప్పుడు నేను అలాంటి అమ్మాయిని చూడటానికే బయలుదేరాను. అంటే అమ్మాయి నా కోసం కాదు. నా స్నేహితుడు రాజారావు కొడుకు కోసం. రాజారావు నా ప్రాణస్నేహితుడు. వాడూ నేనూ ముప్పయేళ్ళ క్రితం అమలాపురంలో డిగ్రీ వరకు చదువుకున్నాము. తర్వాత వైజాగ్ లో పీజీ చేశాము. నేను ఉద్యోగంలో చేరితే వాడు బిజినెస్ స్టార్ట్ చేశాడు.బిజినెస్ లో బాగానే క్లిక్ అయ్యాడు. మాతో చదువుకున్న అమ్మాయిని వాడు ప్రేమించాడు. పెళ్ళికి అటూ,ఇటూ కూడా ఎవరూ అంగీకరించలేదు. ఎవరు ఒప్పుకున్నా లేకపోయినా ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానన్నాడు. అది పద్ధతి కాదని చెప్పి రెండు వైపులా పేరెంట్స్ ను కన్విన్స్ చేసి వాళ్ళ పెళ్ళయ్యేలా చేయడంతో వాడికి నేనంటే బాగా గురి కుదిరింది. అందుకే వాడు ఇప్పుడు నాకో కొత్త బాధ్యత అప్పగించాడు.

రాజారావు కొడుకు భాస్కర్ ఎం.టెక్ చేసి బెంగుళూరులో సాఫ్ట్ వేర్ ఇంజనీరుగా

పని చేస్తున్నాడు. ఒక్కడే కొడుకు. మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేయాలని వాడి ఆలోచన. వాడి పెళ్ళి నేనే దగ్గరుండి జరిపించాను కాబట్టి తన కొడుక్కి కూడా నన్నే సంబంధం సెటిల్ చేయమన్నాడు. ఆ ఉద్దేశ్యంతోనే నేను ఇప్పుడు గుంటూరు బయలుదేరాను.

సూపర్ ఫాస్ట్ కావడంతో ట్రెయిన్ చాలా వేగంగా పోతోంది. అప్పుడే తాడేపల్లిగూడెం దాటేసింది.

"వచ్చేదే ఏలూరు. ఇంకో పావుగంట పడుతుంది"ఆ అమ్మాయితో అన్నాడతను. అంతవరకు ఆనందంగా కబుర్లు చెబుతున్న ఆ అమ్మాయి ముఖంలో ఆనందం ఆవిరయింది.

"అంటే నువ్వు దిగిపోతావన్నమాట"అంది నీరసంగా.

"తప్పదు కదా"అన్నాడతను.

"పోనీ నువ్వు కూడా వచ్చెయ్యకూడదూ" అంది బతిమాలుతున్నట్లు.

"ఎంత రేపు మళ్ళీ ఇదే ట్రెయిన్ కి నువ్వు వచ్చేస్తావు కదూ"

ఆ అమ్మాయేం మాట్లాడలేదు. ఆ తర్వాత ఆ అమ్మాయి ముభావంగానే ఉంది.

ఏలూరులో ట్రెయిన్ ఆగిన వెంటనే అతను తన బ్యాగ్ తీసుకుని ఆ అమ్మాయికి 'ఆల్ ది బెస్ట్' చెప్పి దిగిపోయాడు. ట్రైన్ కదిలింది. కాస్సేపు ఆ అమ్మాయి దిగులుగా ఉంది. ఆమెను చూస్తే నాకు జాలేసింది. అతన్ని వదిలి ఉండలేకపోతుందనిపించింది. తర్వాత హ్యాండ్ బేగ్ లో నుంచి ఓ ఇంగ్లీష్ నవల తీసి చదవడంలో మునిగిపోయింది. ఇప్పుడామె ముఖంలో ఎటువంటి ఫీలింగ్స్ కనబడటం లేదు.

పన్నెండుగంటలకల్లా ట్రైన్ విజయవాడ చేరుకుంది. ఇదే ట్రైన్ లో నేను గుంటూరు వరకు వెళ్ళిపోవచ్చు. కానీ విజయవాడలో నాకు కొంచెం పని ఉంది. అది చూసుకుని గుంటూరు వెళదామని నిర్ణయించుకున్నాను. అయినా యిదే ట్రైన్ లో గుంటూరంటే  చుట్టూ తిరిగి వెళ్ళాలి.

నేను నా ఎయిర్ బాగ్ తీసుకుని పైకి లేచాను. అప్పుడా అమ్మాయి నా వంక చూసి పుస్తకంలో తల దూర్చింది. నేను ట్రైన్ దిగిపోయాను. ఆ అమ్మాయి అక్కడ దిగలేదూ అంటే తెనాలి లేదా గుంటూరు లేదంటే ఏకంగా సికిందరాబాదులోనే దిగుతుందనుకున్నాను.

విజయవాడలో పని పూర్తి చేసుకుని నాలుగు గంటలకల్లా గుంటూరు బయలుదేరాను.

రంగారావు గారు లక్ష్మీపురంలో ఉంటున్నారు. ఆయనో పెద్ద లాయరు. ఆయన అడ్రస్ తేలిగ్గానే దొరికింది. నేను ఊహించిన దాని కంటే చాలా సంపన్నులని ఆ బిల్డింగ్ ని చూస్తేనే తెలుస్తుంది. రంగారావుగారు నన్ను సాదరంగా ఆహ్వానించారు. అతిథి మర్యాదలు అయ్యాక అమ్మాయిని నాకు పరిచయం చేయడానికి తీసుకురమ్మన్నారు. నేను కూర్చున్నా హాల్లోకి తీసుకొచ్చారు.

"నీ పేరేమిటమ్మా"అడిగాను.

"సహస్ర"అంటూ తల పైకెత్తింది.

నన్ను చూసిన ఆమె, ఆమెను చూసిన నేను ఒకేసారి ఉలిక్కిపడ్డాం. తక్షణమే ఆమె ముఖం కళావిహీనమయిపోయింది. ఆ అమ్మాయి ఎవరో కాదు ట్రైన్ లో అబ్బాయితో కలిసి నాతో ప్రయాణం చేసిన అమ్మాయి. నాకు మతిపోయింది. ఇలాంటివి కథల్లో,సినిమాల్లో జరుగుతాయి. కానీ వాస్తవాన్ని చూస్తుంటే కాసేపు నా బుర్ర పని చేయలేదు. కలలో కూడా ఊహించని సంఘటన. హాల్లో నేను,రంగారావుగారు,ఆయన భార్య, ఆ అమ్మాయి మాత్రమే ఉన్నాం.

"మా సహస్ర ఆంధ్రా యూనివర్సిటీలో బీటెక్ ఫైనలియర్ చదువుతుంది.రెండు నెలల్లో కోర్సు పూర్తయిపోతుంది. ఒక్కతే అమ్మాయి కదా మంచి సంబంధం చూసి పెళ్ళి చేద్దామనుకుంటున్నాము. మా అమ్మాయికి కూడా పై చదువులు చదివే ఆలోచన లేదు. మీ ఫ్రెండ్ వాళ్ళబ్బాయి గురించి తెలిసింది. ఆయనతో మాట్లాడాను. మీ గురించి చెప్పారు. ముందు మీరు వచ్చి చూస్తారని ఆ తర్వాత అన్నీ మాట్లాడుకోవచ్చని అన్నారు. మూడు రోజుల క్రితం ఫోన్ చేసి ఈ రోజు మీరు వస్తున్నారని చెప్పడంతో అమ్మాయిని కూడా ఈ రోజే యూనివర్సిటీ నుండి పిలిపించాను. మళ్ళీ రేపు వెళ్ళిపోతుంది "అన్నారు రంగారావుగారు.

"మీకేం అభ్యంతరం లేకపోతే అమ్మాయితో ఒక్క అయిదు నిమిషాలు మాట్లాడవచ్చా?"అడిగాను

ఆ మాటలకు ఆ అమ్మాయి భీతహరిణిలా వణికింది.

"సరే దాందేముంది. అమ్మా సహస్రా అంకుల్ ని నీ రూముకి తీసుకెళ్ళు. అక్కడయితే ఫ్రీగా మాట్లాడుకోవచ్చు"అన్నారు రంగారావుగారు.

కలలో నడిచినట్లుగా ముందు నడిచింది సహస్ర. నేనామెను అనుసరించాను.

ఆమె గది చాలా అందంగా అలంకరించబడి ఉంది. విశాలమైన గదిలో ఓ ప్రక్కనున్న సోఫాలో కూర్చున్నాను. ఏసీ రూము కావడంతో రూంలో చల్లగా ఉంది.

"నువ్వు కూడా కూర్చోమ్మా"అన్నాను. నెమ్మదిగా వచ్చి నా ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది.

కాసేపు మా ఇద్దరి మధ్య మౌనం తాండవించింది.

"చూడమ్మా!నేను నీతో మాట్లాడాలని ఎందుకన్నానో నీకు అర్థమై ఉంటుంది"

ఆ అమ్మాయేం మాట్లాడలేదు.

"ఆ అబ్బాయిని నువ్వు ప్రేమించావా?"అనడిగాను.

చివ్వున తలెత్తి "లేదు.లేదు అతను నా ఫ్రెండ్ మాత్రమే"అంది.

"అదేంటి మీ ఇద్దరి మధ్య ఉన్న సాన్నిహిత్యం చూస్తే నాకు అలాగే అన్పించింది."

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఇష్టం లేకపోయినా బలవంతంగా ఈ తతంగం ఏర్పాటు ఏర్పాటు చేసారేమో అనిపించింది.

"పోనీ ఇప్పుడు జరుగుతున్న తతంగమంతా నీకు తెలిసే జరుగుతుందా"అడిగాను.

"తెలుసు. డాడీ నా పెళ్ళి ఈ సంవత్సరం చేసేయ్యాలనుకుంటున్నారు. డాడీ ఇష్టమే నా ఇష్టం"అంది.

"ఆ అబ్బాయంటే నీకు చాలా ఇష్టంలా అనిపించింది. అతను కూడా బాగానే ఉన్నాడు. అతన్ని చేసుకోవచ్చుగా"

"అతనికి పెళ్ళి కుదిరింది. వచ్చే నెలలోనే పెళ్ళి. ఏలూరులో తన కాబోయే భార్యను చూడటానికి దిగాడు.అయినా నేనతన్ని పెళ్ళి చేసుకోవాలనుకోలేదు.

ఆ అమ్మాయి అలా చెబుతుంటే నాకు మతిపోయింది.

"అలాంటప్పుడు అతనితో అంత సన్నిహితంగా ఉండటం మంచిదంటావా?"

"ఫ్రెండ్స్ అన్న తర్వాత ఆ మాత్రం ఉండటంలో తప్పేముంది?"

నాకు బుర్ర తిరిగిపోయింది. ఏమిటీ అమ్మాయి. అది సన్నిహితంగా ఉండటం కాదా? తను చేస్తున్న తప్పు తనకు తెలియడం లేదు. ఈ అమ్మాయే కాదు ప్రస్తుతం యూత్ అంతా ఇలాగే ఉంది. నా వయసు ఇప్పుడు యాభై సంవత్సరాలు. లెక్చరర్ గా పని చేస్తున్నాను. పాతికేళ్ళ గవర్నమెంటు సర్వీసులో ఎన్నో ఊళ్ళు తిరిగాను. కొన్ని వేలమంది నా దగ్గర చదివి ఉంటారు. కాని గతంలో యువతలో ఇలాంటి విపరీత ధోరణి లేదు. ఇప్పుడు నాగరికత పెరిగింది. విజ్ఞానం పెరిగింది. వాటితో పాటు విచ్చలవిడితనం జరిగింది. నేటి యువత చేతిలో సెల్ ఫోన్ ఎంత ముఖ్యమైందో అలాగే అబ్బాయి అయితే గర్ల్ ఫ్రెండూ, అమ్మాయికయితే బాయ్ ఫ్రెండు

తప్పనిసరయ్యారు.   ఎక్కడికి పోతోంది మన  వ్యవస్థ?

"చూడమ్మా సహస్రా! నువ్వన్నట్టు ఫ్రెండ్స్ అంటే క్లోజ్ గా ఉండాల్సిందే. కాదనను. కానీ ఆడ,మగ ఫ్రెండ్స్ అయినప్పుడు దానికి కొంత పరిధి ఉంటుంది కదా దాన్ని దాటడం వల్ల వచ్చే పరిణామాలు ఎలా ఉంటాయో నీకు తెలియటం లేదు. మీరిద్దరూ సినిమాలకు వెళుతున్నారు. షికార్లు చేస్తున్నారు. అలాగే ప్రయాణాలు చేస్తున్నారు. అటువంటి సమయాల్లో అతను నీ శరీరంలో నీ భర్త మాత్రమే తాకాల్సిన సున్నితమైన భాగాలను అతను తాకుతుంటే నీకు తప్పు అనిపించడం లేదా.నీ ప్రవర్తన ఎవరూ ఎవరూ హర్షించేదిగా మాత్రం లేదమ్మా"కొంచెం సీరియస్ గానే అన్నాను.

నా మాటలకు ఆమె షాక్ తిన్నట్టు ఫీలయ్యింది. ఆమెకు కోపం వచ్చినట్టుగా పెదాలు అదురుతున్నాయి.

"మీరు ఊహిస్తునట్లు నేను అతనితో ఏ తప్పూ చేయలేదంకుల్. నేను పవిత్రంగానే ఉన్నాను"

"నేను ఆ విషయం గురించి మాట్లాడటం లేదమ్మా. సరే నువ్వు చెప్పిన విషయానికే వద్దాం. నీ దృష్టిలో తప్పు చేయడమంటే శారీరకంగా కలవడం మాత్రమే. అది కాకుండా ఏం చేసినా తప్పు కాదనేది నీ వాదన. మనిషికి శరీరం ఉన్నట్లుగానే మనసుకు కూడా ఉంటుంది కదా. మానసికంగా చేసిన తప్పులు నీ దృష్టిలో తప్పు కాదు. అంతేకదా. చూడమ్మా!పవిత్రత అనేది కేవలం శరీరానికే పరిమితం చెయ్యకూడదు. ప్రస్తుతం మీ యువతలో ఒక భావం వుంది. నేను మీలో తప్పు పట్టడానికి చెప్పడం లేదు. మీరేమనుకుంటున్నారో అదే మీ దృష్టిలో కరక్ట్. మనకో సంస్కృతి ఉందని దానికి కొన్ని విలువలు ఉంటాయని మీరు ఆలోచించరు. మన సమాజంలో ఆచారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు మన పూర్వీకులు ఎందుకు నేర్పించారంటావు. మన విలువలను మనం కాపాడుకోవటానికి, మన వ్యవస్థను సక్రమంగా నడిపించుకోవడానికీను. కానీ ఇప్పుడంతా నైతిక పతనం జరుగుతుంది."

"చూడండంకుల్! విజ్ఞానం ఇంత అభివృద్ధి చెందిన తరువాత కూడా మనిషిలో మార్పు రాకూడదంటారా?"

"ఆ మాట నేను అనడం లేదమ్మా.విజ్ఞానం కూడా సంప్రదాయాలను, కట్టుబాట్లను పాటించవద్దని చెప్పదు. కానీ మన ఆలోచనా విధానంలో వచ్చిన విపరీతమైన ధోరణి మనల్ని పతనపుటంచులకు తీసుకెళ్ళిపోతుంది.

చూడు సహస్రా! నేనేదో నీకు ఉపన్యాసం ఇవ్వడానికి రాలేదు. ఒక్క విషయం

ఆలోచించు. నువ్వు నా కూతురు లాంటి దానివి కాబట్టి చెపుతున్నాను. మనం చదువుకునే రోజుల్లో ఎంత జాగ్రత్తగా ఉంటామో అది మన భవిష్యత్తుకు పునాది అవుతుంది. లేకపోతే అది మనకు తెలియకుండానే కాటేస్తుంది. ఒక్కసారి మనం వేసే తప్పటడుగులు నీడల్లా మనల్ని వెంటాడుతూ ఉంటాయి. రేపు నీకు పెళ్ళవుతుంది. నీ భర్తతో నువ్వు హాయిగా ఉంటావు. అటువంటి సమయంలో నీతో చదువుకున్న వాళ్ళలో ఎవరైనా నీ మీద కోపంతో నీ భర్తతో నువ్వు చదువుకున్న రోజుల్లో ఫలానా వాడితో సినిమాలకెళ్ళేదానివని,బీచుల్లో మీరు షికార్లు చేసేవారని, ,అతనితో చాలా క్లోజ్‌గా ఉండేదానివని ఇలా రకరకాలుగా ఉన్నవి లేనివి చెప్పారనుకో, అప్పుడేమవుతుంది. ప్రశాంతంగా సాగిపోతున్న నీ జీవితంలో కలకలం మొదలవుతుంది. నీ భర్త నిన్నేమి అనకపోయినా అతని మనసులో అనుమాన బీజం పడుతుంది. అది ఏదో రూపంలో బయట పడొచ్చు. ఇదంతా ఎందుకు జరుగుతుంది చెప్పు. మనం జాగ్రత్తగా ఉండాల్సిన సమయంలో తప్పటడుగులు వేయడం వల్లే కదా.

పోనీ ఇలాంటివి ఏమి జరగకపోయినా, రేపు నీకు పిల్లలు పుట్టి వాళ్ళు కూడా నీలాగా చదువుకునే రోజుల్లో బాయ్ ఫ్రెండ్స్ తో తిరుగుతుంటే వాళ్ళ ప్రవర్తన చూసి నువ్వు భరించగలవా? వాళ్ళకి ఏమని జాగ్రత్తలు చెప్పగలవు. చూడమ్మా!జీవితంలో అన్నీ మనం అనుకున్నట్లు జరగవు. అటువంటప్పుడు మనం వేసే ప్రతి అడుగుని నిశితంగా పరిశీలించుకోవాలి. ఇలా ఎంత చెప్పినా నీకు చాదస్తంగా ఉండవచ్చు. కానీ ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. కొంచెం నీ జీవన పంథా మార్చుకో.ఇంక ఈ పెళ్ళి విషయానికి వస్తే మా స్నేహితుడి కొడుక్కి నిన్ను ప్రపోజ్ చేయలేను. ఇవన్నీ తెలియకపోతే వాడితో నీ పెళ్ళి కచ్చితంగా జరిగేది. వాడు ఎంత ఉత్తముడంటే నాకే గనుక కూతురు ఉండి ఉంటే ఏమీ ఆలోచించకుండా ఆ అబ్బాయికి ఇచ్చి పెళ్ళి చేసి ఉండేవాణ్ణి. నీ అదృష్టం బావుంటే నా స్నేహితుడి కొడుకు కంటే ఉత్తముడు నీకు దొరకవచ్చు. అలా దొరకాలని నేను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

చివరిగా ఒక్కమాట నువ్వు ఎప్పుడూ నైతిక విలువలను గౌరవిస్తూ వాటిని కాపాడతావని కోరుతున్నాను. వస్తానమ్మా"అని ఆ అమ్మాయికి చెప్పి బయటకు వచ్చి రంగారావుగారితో మా వాడితో మాట్లాడి ఏ సంగతీ చెబుతామని చెప్పి అక్కడ నుంచి బయలుదేరాను.

**( నవ్య వీక్లీలో ప్రచురితం )**

* * *

# ఆహుతి

**బె**ల్ కొట్టిన వెంటనే క్లాసు రూము నుంచి స్టాఫ్ రూముకొచ్చేసరికి టేబిల్ మీద టెలిగ్రాం వుంది. ఎక్కడ నుంచబ్బా అనుకుని కంగారుగా విప్పాను. 'వైశాలి ఎక్స్ పైర్డ్. స్టార్ట్ ఇమ్మీడియట్లీ' అని వుంది. నాకు గుండాగినట్లయింది.

అంకుల్ ...అంకుల్ ...అంటూ నా చుట్టూ చిన్నపిల్లలా తిరిగిన వైశాలి చచ్చిపోయిందా? నమ్మలేకపోతున్నాను. నాకే ఇంత బాధగా వుంటే మరి అనురాధా, రాజారావులు ఎంత బాధపడుతూ ఉండాలి. ఇంక తర్వాతి క్లాసుకు వెళ్ళాలనిపించలేదు. ప్రిన్సిపాల్ గారిని పర్మిషన్ అడిగి ఇంటికి వచ్చేశాను. రెండు రోజులు లీవ్ కూడా పెట్టాను. నారాక శ్రీమతికి ఆశ్చర్యం కలిగించింది. "ఏమిటలా ఉన్నారు?" అని అడిగింది. టెలిగ్రాం చూపించాను. "నిజమా?"అంది బాధగా. తనే బ్రీఫ్ కేస్ సర్ది అందించింది. భోజనం కూడా చేయకుండా బయలుదేరాను.

\- - -

యూనివర్సిటీలో చేరిన మొదటిరోజునే అనూరాధను చూసి చాలా ఆశ్చర్యపోయాను. ఇంత అందమైన వాళ్ళుంటారా అనుకున్నాను. అనూరాధది అసామాన్యమైన అందం. ఆమెతో స్నేహం చెయ్యాలని అందరూ తహతహలాడేవారు.

అనూరాధకు యూనివర్సిటీలో చేరేనాటికే పెళ్ళయింది. భర్త ఉద్యోగం చేస్తున్నాడు. అనూరాధ కోరిక మీదే ఆమెను చదివిస్తున్నాడు. అనురాధది అందరితోను ఫ్రీగా వుండే మనస్తత్వం. ఆమెకున్న ఫ్రండ్స్‌లో బాయ్ ఫ్రెండ్సే ఎక్కువ. అయితే ఆమెకు ఎంతమంది స్నేహితులున్నా నన్ను ఆత్మీయుడిగా భావించేది. అనూరాధను చూడటానికి భర్త రాజారావు అప్పుడప్పుడు వస్తుండేవాడు. రాజారావు చాలా మంచివాడు. అతను నాకు మంచి స్నేహితుడయ్యాడు. వచ్చినప్పుడల్లా నన్ను కలవకుండా వెళ్ళేవాడు కాదు. వెళ్ళేముందు అంటుండేవాడు "మీలాంటి మంచి మిత్రులు దొరికినందుకు మా అనూ చాలా అదృష్టవంతురాలు. మీరంతా వున్నారు కాబట్టే నేనక్కడ అనూ గురించి ఏ భయం లేకుండా ఉండగలుగుతున్నాను", అని.

అనూరాధ నాతో తన స్వంత విషయాలు చెబుతుండేది. తనకి చాలా చిన్నతనంలోనే పెళ్ళయిందని, భర్త రాజారావు దేవుడని, తనకో కూతురు,కొడుకు

ఉన్నారని, చదువంటే తనకు చాలా ఇష్టమని, పెళ్ళికి ముందు ఎప్పుడో ఆపేసిన చదువు పెళ్ళయి పిల్లలు పుట్టింతర్వాత కొనసాగించానని పి.జి. అయిన వెంటనే ఉ ద్యోగంలో చేరతానని చెబుతుండేది.

ఓసారి ఎగ్జిబిషన్‌లో అనూరాధ కన్పించింది. ఆమె కూడా ఆమె లాగే వున్న ఓ అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి అనూరాధ అంత పొడవే వుంది. సన్నగా చుడీదార్‌లో వుంది. పన్నెండేళ్ళ వయసుంటుంది. ఆ అమ్మాయిని చూసి అనురాధ చెల్లెలను కున్నాను. కాని అనూరాధ, “మా అమ్మాయి వైశాలి”అని పరిచయం చేసేసరికి ఆశ్చర్యపోయాను. వైశాలి ఎయిత్ క్లాస్ చదువుతుందట. పెళ్ళయిన సంవత్సరానికే పుట్టిందట. బాగా చదువుతుందట. ఎప్పుడూ స్కూలు ఫస్టేనట. వైశాలి నన్ను అంకుల్ అంటూ ఎంతో ఆత్మీయంగా పిలిచేది. అప్పుడప్పుడు సెలవుల్లో నేను ఇంటికి వెళ్ళేటప్పుడు అనూరాధ వాళ్ళూరిలో ఆగి ఒకరోజు వాళ్ళింట్లో వుండి వెళు తుండేవాడిని. ఆ కుటుంబానికి నేను ఫామిలీ ఫ్రెండ్ అయిపోయానని చెప్పాలి. నేను వెళ్ళినప్పుడల్లా వైశాలి నాతో ఎన్నో కబుర్లు చెప్పేది. ఎన్నెన్నో విషయాలు చర్చించేది. ఆ అమ్మాయి తెలివితేటలు చూస్తే నాకు ఆశ్చర్యమేసేది. యింత అందం, తెలివితేటలు ఉన్న అమ్మాయి భవిష్యత్ లో చాలా ఉన్నత స్థితిలో వుంటుందనిపించేది.

మేం ఫైనలియరుకొచ్చాము. యూనివర్సిటీలో అనూరాధ ప్రవర్తన నాకు కోపం తెప్పించేది. ఎప్పుడూ అబ్బాయిలతో తిరుగుతుండేది. క్లాసులెగ్గొట్టి వాళ్ళతో సినిమాలకు, పిక్నిక్‌లకు పోతుండేది. ఒకసారి నేను ఆమెతో అనడం కూడా జరిగింది, అలా తిరగడం మంచిది కాదేమోనని. దానికి నవ్వి ‘‘నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావా? నాది అందరితో చాలా ఫ్రీగా ఉండే మనస్తత్వమని నీకూ తెలుసు. స్నేహం చేసేటప్పుడు ఆడా,మగా తేడా చూడను. చదువుకునే రోజుల్లో ఎంజాయ్ చెయ్యకపోతే రేపు యింటికెళ్ళాక భర్త,పిల్లలతో సంసారం జంఝాటంలో పడిపోతాము. ఈ నాలుగు రోజులన్నా నన్ను హాయిగా వుండనివ్వు” అంటూ తేలిగ్గా తీసిపారేసింది. రాజారావు ఇచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తుందనిపించింది.

“మీ వైశాలిని ఓసారి తీసుకురాకూడదు”అన్నాను.

“అదిక్కడ ఎందుకు, వైశాలి నా కూతురని తెలిస్తే నన్నో ముసలమ్మ క్రింద జమకడతారు”అంది అనూరాధ.

ఆమె అలా అంటే నాకు చాలా బాధ వేసింది. వైశాలి లాంటి కూతురుందని చెప్పుకోవడానికి గర్వపడాలిగాని అనూరాధ ఎందుకలా ఫీలవుతుంది.

అనూరాధా స్వతహాగా అందగత్తె అయినా ఆ అందానికి మెరుగులు దిద్దుతూ మేకప్ చేసుకుంటుంది. ఆమెను చూస్తే ఇరవై ఏళ్ళకన్నా ఎక్కువుండవనుకుంటారుగాని ఆమెకు ముప్పయిరెండేళ్ళ వయసు. నాకంటే పదేళ్ళు పెద్దది. అసలు ఆమెకు పెళ్ళయిందని ఏ కొద్దిమందికో తెలుసు. మెళ్ళో మంగళసూత్రాలు కూడా వుంచుకునేది కాదు. ఆమె నడవడికను చెడ్డగా చెప్పుకునేవారు. అయితే ఆ విషయాలేమీ నేను పట్టించుకునేవాడిని కాను. ఆమె నాకు మంచి స్నేహితురాలు అంతే.

మొత్తం మీద మా యూనివర్సిటీ చదువు పూర్తయింది. యూనివర్సిటీ నుంచి వెళ్ళిపోతున్నప్పుడు అనూరాధ చాలా బాధపడింది. ఒక అందమైన జీవితం నుంచి దూరంగా వెళ్ళిపోతున్నందుకు అందరికీ బాధనిపించినా అనూరాధ మాత్రం ఏదో కోల్పోయినట్టుగానే ఫీలయింది.

– – –

ఎమ్మే పూర్తి చేసిన వెంటనే నాకు లెక్చరర్ ఉద్యోగం దొరికింది. అనూరాధ ముందే బి.యిడి పూర్తి చేసి వుండటంతో వాళ్ళ వూళ్లోనే టీచరు ఉద్యోగం సంపాదించుకుంది. నేను పెళ్ళి చేసుకున్నాను. పాప కూడా పుట్టింది. అప్పుడప్పుడు మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతుండేవి. వైశాలి టెంత్‌లోకి వచ్చిందని, బాగా చదువుతుందని ఓసారి వ్రాసింది. ఓ వారం క్రితమే అనూరాధ ఉత్తరం వ్రాసింది. రెండు రోజుల్లో టెంత్ పరీక్షలు ప్రారంభం అవుతున్నాయని, కష్టపడి చదువుతుందని, ఇవి పూర్తయితే మంచి కోచింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఇంటర్ చేర్పించాలని ఎమ్‌సెట్ మెడికల్ ఎంట్రన్స్‌కు ప్రిపేర్ చేయించాలని అనుకుంటున్నట్లుగా వ్రాసింది. వైశాలి లాంటి తెలివైన అమ్మాయి తప్పకుండా డాక్టరవుతుందనిపించింది.

పరీక్షలు వ్రాస్తూ మధ్యలో వైశాలి ఎందుకు చనిపోయిందో నాకర్థంకాలేదు. ఏమన్నా అనారోగ్యమా? అలాంటిదేమీ అయివుండదు. వైశాలిది చక్కని ఆరోగ్యం. అనూరాధ కూడా ఎప్పుడూ వ్రాయలేదు. మరి కారణం ఏమై వుంటుంది? అక్కడకు వెళితేనేగాని తెలియదు.

– – –

అనూరాధ వాళ్ళవూరు చేరుకునేసరికి సాయంత్రం అయిదు గంటలయ్యింది. నేను వెళ్ళేసరికి వైశాలి శవం యింటి దగ్గరే వుంది. అనూరాధ తల్లిదండ్రులు రావాలట. అందుకని వుంచారు. నన్ను చూసినవెంటనే వాళ్ళిద్దరి దుఃఖం కట్టలు త్రెంచుకుంది. రాజారావు నా చేతుల్లో ముఖం దాచుకుని బోరుమని ఏడ్చేసాడు. నాకూ దుఃఖం ఆగలేదు. వాళ్ళని ఎలా సముదాయించాలో కూడా తెలియలేదు. తెల్లారి లేచి చూసేసరికి

గదిలో ఫేనుకు ఉరివేసుకున్న వైశాలి కంపించిందట. నిన్న పరీక్ష వ్రాసిన వెంటనే పేపరు సరిగ్గా వ్రాయలేదని, ఆ పేపరులో ఫెయిలవుతానని, స్కూలు ఫస్టు వస్తుందనుకున్న తను పరీక్ష ఫెయిలయితే ఎలా తలెత్తుకు తిరగాలని రోజంతా ఏడుస్తూ కూర్చుందిట. అంతపని చేస్తుందని తాము కలలో కూడా వూహించలేకపోయామని అనూరాధ ఏడుస్తూ చెప్పింది. చనిపోయిన వైశాలి ముఖం చూడలేకపోయాను. బయటకొచ్చిన నాలుక కనుగ్రుడ్లు %--%చాలా భయంకరంగా ఉంది. ఎన్నో తెలివితేటలున్న వైశాలి ఎంత దారుణమైన చావుని కోరుకుంది. అప్పుడు నాకు వైశాలి మీద కోపం వచ్చింది. ఇప్పుడు ఫెయిలయితే సెప్టెంబరులో పూర్తిచేసుకోవచ్చు. ఇంత మాత్రానికే ప్రాణాలు తీసుకోవాలా?

వైశాలిని అయిదున్నరకల్లా శ్మశానానికి తీసుకెళ్ళారు. కూడా నేను వెళ్ళాను. నా కళ్ళముందే మట్టిలో కలిసిపోయింది వైశాలి.

మనస్సంతా వికలమైపోయింది. రెండు రోజులుందామని వచ్చినా ఇంక అక్కడ వుండలేకపోయాను. ఆరాత్రే బయలుదేరి యింటికి వచ్చేశాను.

- - -

పెట్టిన లీవ్ క్యాన్సిల్ చేసుకుని మర్నాడు కాలేజీకి వెళ్ళాను. ఫస్టవరు లేకపోతే స్టాఫ్ రూములో కూర్చుని పుస్తకం చదువుతున్నాను. పోస్టుమాన్ ఓ ఉత్తరం ఇచ్చి వెళ్ళాడు. ఎక్కడి నుంచబ్బా అనుకుని ఫ్రం అడ్రస్ చూశాను. 'ఫ్రం వైశాలి' అని వుంది. ఆశ్చర్యం కలిగింది. అంటే తను చనిపోయేముందు నాకు ఉత్తరం వ్రాసి పోస్ట్ చేసిందన్నమాట. ఆత్రంగా విప్పాను.

"అంకుల్! ఈ ఉత్తరం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది కదూ! నా అంతిమ యాత్ర పూర్తయ్యాకే మీరీ ఉత్తరం చదువుతారని తెలుసు. ఎవరికీ తెలియని నా చావు రహస్యం మీ ఒక్కరికే తెలియాలి. అందుకే మీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. నేను నిజంగా పరీక్ష సరిగ్గా వ్రాయనందుకే చనిపోయానని అనుకుంటున్నారా? లేదంకుల్. పరీక్ష అనేది కేవలం సాకు మాత్రమే. నా చావు వెనకాల చాలా కారణముంది. నేను చచ్చిపోదామని నిర్ణయించుకున్నాకే టెన్త్ క్లాసు పరీక్ష పాడుచేసి అందరికీ నా చావుకు కారణం అదే అనే భావం కలిగించాను. ఈ కారణం వల్లనే చనిపోయాననుకున్నారు కదూ!

అంకుల్! నాకు జీవితం పట్ల ఎన్నో ఆశలుండేవి. భవిష్యత్తు మీద నమ్మకం ఎంతగానో ఉండేది. మంచి భవిష్యత్తును పొందడానికి, మంచి జీవితాన్ని ఏర్పాటు చేసుకోవడానికి ఎన్నో ప్రణాళికలు వేసుకున్నాను. ఎన్నెన్నో ఊహలు అల్లుకున్నాను.

అటువంటి నేను చావును వరిస్తానని ఎప్పుడూ అనుకోలేదు.

మా అమ్మకు చిన్నప్పుడే పెళ్లి కావడం,వెంటనే నేను పుట్టడం నా దురదృష్టానికి నాంది ఏర్పడిందనుకుంటానంకుల్. మా అమ్మకు చదువుకోవాలనిపించడం, అందంగా చిన్నపిల్లలా కనిపించాలనుకోవడం, దానికి తగ్గట్టు ఆవిడ ప్రవర్తించడం, ఇవన్నీ నా దురదృష్టాన్ని ఇంకా బలపరిచాయి. నేను పెద్దాదాన్ని అయ్యేకొద్దీ అమ్మకు గుబులుగా ఉండేది. నా అంత పెద్దకూతురు తనకుందని అందరికీ తెలిస్తే తనని పెద్దవయసున్న దానిలా జమకడతారని అమ్మ భయం. అందుకే నన్ను ఎక్కడికీ తనతో తీసుకువెళ్ళేది కాదు. ఎవరైనా క్రొత్తవాళ్ళు,అమ్మ ఫ్రెండ్స్ వచ్చినప్పుడు నన్ను వాళ్ళకంట పడనిచ్చేది కాదు. నేను మానసికంగా ఎంత క్షోభననుభవించేదాన్నో మాటలలో చెప్పలేను.

అదేం పాపమోగాని అమ్మకు ముప్పయ్యేళ్లు పైబడ్డా ఇరవై ఏళ్ళ అమ్మాయిలా కన్పించేది. నాకు పదిహేనేళ్లు రాకపోయినా పాతికేళ్ళ అమ్మాయిలా కనబడేదానిని. తనకి ఇద్దరు పిల్లలున్నారని, నా అంత కూతురుందని చెప్పుకోవడానికి అమ్మకు ఇష్టం ఉండేది కాదు. తమ్ముణ్ణి రెసిడెన్షియల్ స్కూల్లో వేసింది. నన్ను కూడా అలా వేసేదేమో! నాన్నగారు నన్ను చూడకుండా ఒక్క క్షణం ఉండలేరు. అందుకే నేనింట్లోనే వుండిపోయాను. అమ్మకి చాలామంది స్నేహితులున్నారు. వారిలో మగవాళ్ళు కూడా ఎక్కువే. అందర్నీ యింటికి టీపార్టీలకు, డిన్నర్లకు పిలుస్తుండేది. నాన్నగారు సంస్కారవంతులు. అమ్మనేమీ అనేవారు కాదు. మావూరి లేడీస్ క్లబ్ కి మా అమ్మ సెక్రటరీగా ఉండేది. ప్రెసిడెంట్ గా మా వూరి ఎమ్మెల్యే గారి భార్య ఉండేది.

ఓ రోజు మా స్కూలుకి ఏనివర్సరీ సందర్భంగా ముఖ్య అతిథిగా ఎమ్మెల్యేగారు వచ్చారు. వారితో పాటు భార్య కూడా వచ్చింది. ఆ సందర్భంగా నిర్వహించిన అన్ని పోటీల్లోనూ నాకు ఫస్ట్ ప్రైజులొచ్చాయి. ప్రయిజుల్ని ఎమ్మెల్యేగారి భార్య చేత ఇప్పించారు. అన్నీ నాకే రావడంతో ఆవిడ “ఎవరమ్మాయివమ్మా”అనడిగారు. నేను “మీ క్లబ్ సెక్రటరీ అనూరాధ గారి అమ్మాయినండి”అని గర్వంగా చెప్పాను. ‘నిజమా!’ అని ఆవిడ ఆశ్చర్యపోయారు.

మర్నాడు క్లబ్ మీటింగు నుంచి అమ్మ చాలా కోపంగా యింటికి వచ్చింది. నన్ను పిలిచి “మా ప్రెసిడెంటుతో నువ్వు ఏం చెప్పావు?” అనడిగింది.

“నేనేం చెప్పాను, నువ్వు మా అమ్మవని చెప్పాను”అన్నాను.

“చాలా మంచి పని చేశావు, పెద్ద ఆరిందాలా? ఎవరు చెప్పమన్నారు నిన్ను. ఈవేళ నేను క్లబ్ మీటింగుకు వెళ్ళేసరికి నా వయసు మీద అంతా తలోరకంగా

మాట్లాడుతున్నారు. అంత కూతురుంది కాబట్టి నన్ను నలభై ఏళ్ళ ముసలమ్మని చేశారు. నువ్వు పుట్టి నా పరువు తీస్తున్నావు. ఇంకా ముందు ముందు ఎన్ని అవమానాలు పడాలో"అంటూ కోపంగా మాట్లాడింది. నా మనస్సు చివుక్కుమందంకుల్. ఏ తల్లీ పిల్లల విషయంలో అలా ఆలోచించదేమో. మా అమ్మ లాంటి మనస్తత్వం వున్నవాళ్ళకి నా అంత కూతుళ్ళుండకూడదంకుల్. అమ్మ ఏ శుభకార్యాలకెళ్ళినా తను ఒక్కర్తే వెళ్ళేది గాని నన్ను తీసుకు వెళ్ళేది కాదు. నన్ను తీసుకు వెళితే ఎక్కడ తన వయసు బయటపడిపోతుందోనని భయం. నేను మా అమ్మకు అంతర్గత శత్రువులా తయారయ్యాను. నాలో ఒక రకమైన విరక్తి భావం బయలుదేరింది.

మరొకసారి–అప్పుడు నాన్నగారు వూళ్ళోలేరు. కేంపుకెళ్లారు. అమ్మ తనకు ఒంట్లో బావుండలేదని స్కూలుకి లీవ్ పెట్టింది. నేను అమ్మ పని చేసే స్కూల్లో చదవడం లేదు. ఇంకో స్కూల్లో చేర్పించింది. నేనూ స్కూలుకి వెళ్ళనని చెప్పాను. కానీ అమ్మ ఒప్పుకోలేదు. నేను స్కూలుకి వెళ్ళానన్న మాటే గాని అమ్మకు ఎలా ఉందోనని ఇంటి మీద మనస్సు తిరిగిపోయింది. మొదటి రెండు పిరియడ్లు అయిపోయింతర్వాత ఇంక స్కూల్లో ఉండలేక యింటికొచ్చేశాను. వీధి తలుపులు వేసే ఉన్నాయి. లోపల బెడ్ రూము నుంచి ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. అమ్మ పకపకా నవ్వుతుంది. బెడ్ రూము కిటికీ దగ్గరకు వెళ్ళాను. ఒక కిటికీ తలుపు కొద్దిగా తీసి ఉంటే అందులో నుంచిచూసాను. లోపల కనపడిన దృశ్యం చూసి స్టన్ అయ్యాను. అమ్మ నగ్నంగా ఓ పరాయి వ్యక్తి పక్కలో పడుకుని ఆనందంగా కబుర్లు చెబుతోంది.

ఆ స్థితిలో అమ్మను చూస్తే పట్టారని కోపం వచ్చింది. దేవుడిలాంటి నాన్నగారిని మోసం చేస్తున్న అమ్మంటే అసహ్యం వేసింది. గట్టిగా "అమ్మా"అంటూ అరిచాను.

లేచి గబగబా చీర సర్దుకుని వీధి తలుపులు తీసింది. అమ్మ కళ్ళు తీక్షణంగా చూస్తున్నాయి. "నువ్విప్పుడు ఎందుకు వచ్చావు?"కోపంగా అడిగింది.

నాలో ఎప్పుడూ రానంత తెగింపు వచ్చేసింది.

"అసలు. నువ్వు చేస్తున్నదేమిటి. అంత వయసు వచ్చింది సిగ్గులేదూ. నాన్నగార్కి ద్రోహం చేస్తావా! ఆయన నీకేం అపకారం చేసారు" గట్టిగా అడిగేసాను.

నా చెంప ఛళ్మనిపించింది. "ఏం కూసావ్. నా యిష్టం వచ్చినట్లు నేనుంటాను. నువ్వు నాకడుపున పుట్టి నాకు సుఖ సంతోషాలు లేకుండా చేస్తున్నావు. నిన్ను పుట్టిన వెంటనే పీక నులిమి చంపేసి అవతల పారేసుంటే ఇప్పుడు నాకీ తిప్పలుండేవికావు" అంటూ నన్ను గట్టిగా పట్టుకుని ఈడ్చుకుంటూ నా గదిలోకి నెట్టి బయట తలుపువేసి

తన ప్రియుడితో పాటు బెడ్‌రూములో కెళ్ళిపోయింది.

అంకుల్! ఆరోజు నా హృదయం బద్దలయిపోయింది. పుట్టిన తర్వాత అంతలా ఎప్పుడూ ఏడ్చివుండను. నాకు వెంటనే చావెందుకు రాలేదా అనుకున్నాను. అప్పటి నుంచీ నాకు కష్టాలు ప్రారంభమయ్యాయి. నా ఉనికిని అమ్మ అసలు భరించేదికాదు. అంకుల్ అప్పుడే నిశ్చయించుకున్నాను. నేను చచ్చిపోవాలని. ఏకారణం లేకు0డా చచ్చిపోతే నామీద నానా రకాలుగా నిందలు వేస్తారు. కాలు జారిందనో, కడుపొచ్చిందనో, ప్రేమించిన వాడు మోసం చేసాడనో ఇలా రకరకాలుగా చెప్పుకుంటారు. అది నాకిష్టంలేదు. అందుకే పరీక్షలను సాకుగా తీసుకున్నాను. ఆత్మాహుతి చేసుకోవడానికి నిర్ణయించుకున్నాను. కావాలని ఈరోజు పరీక్ష పేపరు సరిగ్గా రాయకుండా ఒకరకమైన వాతావరణాన్ని సృష్టించాను. ఇప్పుడే మీకు ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

అంకుల్ నా చావు రహస్యం మీకు తప్ప ఎవరికీ తెలియకూడదు. అమ్మ కారణంగా నేను చచ్చిపోయానంటే నాన్నగారు అమ్మని చంపి తను చచ్చిపోతారు. అందుకే తెలియనివ్వలేదు. ఈ విషయం మీలోనే దాచుకోండి.

అంకుల్! నాకొద్దిపాటి జీవితం నాకు రెండు అదృష్టాలనిచ్చింది. ఒకటి నాన్నలాంటి ఉత్తమ వ్యక్తికి కూతురుగా పుట్టడం, రెండోది మనస్సు విప్పి చెప్పుకోవడానికి మీలాంటి ఆప్తులు లభించడం. అందుకే నా మనస్సులోని విషయాలను, ఎవరికీ తెలియని రహస్యాన్ని మీముందుంచాను.

నేను చేస్తున్నది తప్పో, ఒప్పో నాకు తెలియదు. కాని నాకింక బ్రతకాలని లేదు. అంత విరక్తి కలిగింది జీవితమ్మీద. మీరైనా నన్ను అర్థం చేసుకుంటారని ఆశిస్తాను. అదే నా ఆత్మకు శాంతి. కనీసం అప్పుడప్పుడైనా ఈ అభాగినిని గుర్తు తెచ్చుకుంటారు కదూ! ఇంక శెలవంకుల్. చనిపోయేముందు మీతో మనస్సువిప్పి చెప్పుకున్నానన్న తృప్తి నాకు దక్కింది. అది చాలంకుల్''''

ఉత్తరం పూర్తి చేసిన నా కళ్ళ నిండుగా నీళ్ళు!

'అమ్మా వైశాలీ నువ్వెంత దురదృష్టవంతురాలివమ్మా' అనుకుంటూ బాధగా కళ్ళు మూసుకున్నాను. నాకళ్ళలోని నీళ్ళన్ని నా చంపల్ని తడిపేసాయి.

**(ఆగస్టు 1999 ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితం)**

* * *

# పరిష్కారం

**అ**ర్థరాత్రి దాటాక ఆ స్థితిలో వచ్చిన కొడుకుని చూసిన అన్నపూర్ణమ్మకు దుఃఖం ఆగింది కాదు. ఈ రోజు కూడా తాగొచ్చాడు అజయ్.

గత పదిరోజులుగా యిదే వరుస. కొడుక్కి ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు. ఇంజనీరింగ్ రెండో సంవత్సరం చదువుతున్న కొడుక్కి తాగడం మంచిది కాదన్న విషయం తెలియందేమీ కాదు.

అజయ్ ఏమీ మాట్లాడకుండా, అన్నం కూడా తినకుండా తన గదిలోకి పోయి తలుపేసుకున్నాడు. ఎంతో బుద్ధిమంతుడనుకున్న కొడుకు అలా అయ్యేసరికి ఆమె తట్టుకోలేకపోతోంది.

వీధి తలుపేసి తమ గదిలోకొచ్చింది. భర్త రఘురామ్ ఇంకా నిద్రపోవడం లేదు.

"అజయ్ వచ్చాడా"అనడిగాడు.

"ఆ"అంది ముభావంగా.

"ఈ రోజు కూడా తాగొచ్చాడు కదూ"

"అవునండి"అంటూ భర్త గుండెలమీద పడి భోరున ఏడ్చి0ది.

"ఊరుకో పూర్ణా! యింతకు ముందు లేని అలవాటు యిప్పుడొచ్చిందంటే స్నేహితుల బలవంతం అయివుంటుంది. అలా అని మనం చూస్తూ కూర్చుంటే వాడు పక్కా తాగుబోతు అయినా ఆశ్చర్యపోనక్కర్లేదు. దీనికేదో పరిష్కారం ఆలోచించాలి. నువ్వేం చెప్పకు వాడికి. నేను ఏమీ చెప్పను. మనం చెబితే వాడి0కా రెచ్చిపోతాడు... నువ్వింక పడుకో"అని భార్యతో చెప్పాడే గాని అతనూ నిద్రపోలేకపోయాడు. అన్నపూర్ణమ్మ సరేసరి. రఘురామ్ ఆలోచనలో పడ్డాడు. ఏం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? ఏం చేస్తే వాడు ఈ అలవాటు నుంచి బయటపడతాడు? తెల్లవార్లూ ఆలోచిస్తూనే వుండిపోయాడు.

\- - -

రఘురామ్ ఓ ఆఫీసులో సెక్షనాఫీసరుగా పని చేస్తున్నాడు.

ఒక్కడే కొడుకు. అతన్ని గారాబంగానే పెంచాడు. అజయ్ ని పెద్ద యింజనీరుని

చెయ్యాలనుకున్నారా దంపతులు. కాని యిప్పట్నుంచే తాగుడు అలవాటు చేసుకున్నాడంటే వాడెలా తయారవుతాడో తలుచుకుంటుంటే భయమేస్తుంది. ఎలాగైనా వాడి అలవాటును మాన్పించాలి. వాడి మనస్సు బాధ పెట్టకుండా సున్నితంగా ఈ సమస్యను పరిష్కరించాలి. ఈ వయస్సులో కుర్రాళ్ళ మనసులు చంచలంగా వుంటాయి. ఒక్కోసారి మనం చేసే ప్రయత్నాలు బెడిసికొడతాయి. అలాంటప్పుడు చాలా బాధ పడాల్సి వస్తుంది.

ఇలాంటివి చాలా సెన్సిటివ్ థింగ్స్. చేసే ప్రయత్నాలు సరిగ్గా వున్నప్పుడు మాత్రమే ఆశించిన ఫలితాలు చేకూరతాయి. దీనికి ఎలాంటి పరిష్కారం కనుగొనాలా అని తీవ్రంగా ఆలోచించాడు.

రోజూ సాయంకాలమప్పుడు రఘురామ్ ఫ్రెండ్స్ తో కాలక్షేపం చేస్తాడు. కాని అజయ్ యిలా ప్రవర్తిస్తున్నప్పటి నుంచీ అతను వారితో సరిగ్గా గడపలేక పోతున్నాడు. ఏదో పోగొట్టుకున్నవాడిలా వుంటున్నాడు. వాళ్ళు కారణం అడిగినా చెప్పలేకపోతున్నాడు.

ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

– – –

ఓ ఆదివారం ఉదయం పడియం పదిగంటలప్పుడు అజయ్ బయటకు వెళ్ళబోతుంటే రఘురామ్ కొడుకుని పిలిచాడు.

“అజయ్! ఓ సారి మా ఫ్రెండ్స్ యిళ్ళకు పోయొద్దాం రా. వాళ్ళూరికే గొడవ పెడుతున్నారు నిన్ను చూసి చాలా కాలమయిందని. సరదాగా అలా వెళ్ళొద్దాం రా”

అజయ్ ఏమనుకున్నాడో ఏమో సరే అన్నాడు.

ఇద్దరూ స్కూటర్ మీద బయలుదేరారు. దార్లో ఏవో చిన్న చిన్న విషయాలు మాట్లాడుకున్నారు.

స్కూటర్ ఓ యింటి ముందాగింది.

అది సత్యం ఇల్లు. అతను రఘురామ్ పని చేసే ఆఫీసులోనే వేరే సెక్షన్‌లో సూపరింటెండెంట్ గా పని చేస్తున్నాడు.

గుమ్మం దగ్గరకు పోయి తలుపు కొట్టబోయేసరికి లోపలి నుంచి గట్టిగా అరుపులు, పెద్ద పెద్ద శబ్దాలు వినిపిస్తున్నాయి. యిద్దరూ నిశ్శబ్దంగా అక్కడే ఆగిపోయారు.

“చావవే ....చావు ...నీ బాబుగారి సొమ్మేదో నాకిస్తున్నట్లు బాధపడతావేం. నేను

సంపాదించుకుంటున్నాను కాబట్టి  నా యిష్టమొచ్చినట్లు తాగుతాను. నువ్వెవరివే చెప్పడానికి అంటూ సత్యం గట్టిగా భార్యను కొడుతున్న శబ్దం వినిపించింది.

"చంపండి .... రోజూ తాగొచ్చి నానాహింసలు పెట్టే బదులు ఒక్కసారిగా నన్ను పీక పిసికి చంపెయ్యండి. సంపాదించిందంతా మీ తాగుడికే సరిపోతుంది. పగలూ రాత్రీ లేదు ఏకంగా తాగడమే మీ పని. సంసారం గుల్లయిపోయింది మీ తాగుడు వల్ల. అంత తాగుడే మీకు అవసరమైనప్పుడు మేమేందుకు ఈ యింట్లో. నేనూ పిల్లలు మా పుట్టింటికి పోతాం "అంటూ సత్యం భార్య ఏడుస్తూ అరుస్తోంది.

'పొండే ,పీడ పోతుంది. మీరంతా పోతే హాయిగా తాగుతూ గడుపుతాను. మీ గోలతో తాగేనన్న ఆనందం కూడా వుండటం లేదు, తక్షణమే పొండి"అంటూ గట్టిగా అరుస్తున్నాడు సత్యం.

రఘురామ్ కొడుకు వంక చూశాడు. అజయ్ తలతిప్పుకున్నాడు.

"పద అనవసరంగా వచ్చాం. వీడింత తాగుబోతని నేననుకోలేదు. తాగి పెళ్ళాన్ని నానా హింసలు పెడుతున్నాడు వెధవ"అంటూ అక్కడనుంచి నడిచాడు.

అజయ్ అతన్ని  అనుసరించాడు.

రఘురామ్ స్కూటర్ స్టార్ట్ చేశాడు. వెనుక కూర్చున్న అజయ్ లో ఏవో ఆలోచనలు ముసురుకుంటున్నాయి. స్కూటర్ రెండు వీధులు తిరిగి ఓ యింటి ముందాగింది. అది శివం యిల్లు. అతను ఓ ప్రైవేట్ కంపెనీలో మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. రఘురామ్ కి మంచి ఫ్రెండు. ఇంటి తలుపులు తీసే వున్నాయి. యిద్దరూ లోపలికి నడిచారు. శివం భార్య వాళ్ళను చూసి, "అన్నయ్యా ....రాబాబూ కూర్చోండి"అంటూ ఆహ్వానించింది.

ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు అజయ్. ఎలావుండే ఆమె ఎలా అయిపోయింది. చిరిగి,మాసి వున్న చీర,జాకెట్టులేసుకుంది. ఇంట్లో సామాన్లు కూడా అంతంతమాత్రంగా వున్నాయి. శివం మంచి ఉద్యోగమే చేస్తున్నాడుగా మరి ఈవిడిలా వుందేమిటి?

"శివం లేడా అమ్మా"అడిగాడు రఘురామ్.

అలా అడిగేసరికి ఆమె కళ్ళల్లో నీళ్ళు నింపుకుంది. దుఃఖాన్ని ఆపుకోవాలనుకుంది గాని ఆమె వల్ల కాలేదు. పవిట చెంగు ముఖానికి కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

కంగారుపడ్డాడు రఘురామ్.

"ఏమయిందమ్మా, శివం ఏడి?"

ఆవిడ కాస్సేపు మాట్లాడలేదు. దుఃఖాన్ని దిగమింగుకుని, “ఏం చెప్పమంటా రన్నయ్యా. ఆయన తాగుడు రోజురోజుకి ఎక్కువైపోతోంది. ఈ మాయదారి అలవాటు ఎలా వచ్చిందో కాని యింటిపట్టున అసలు వుండటం లేదు. రోజులో ఎక్కువ భాగం క్లబ్ లోనే గడుపుతున్నారు. రాత్రనగా పోయారు యిప్పటికీ రాలేదు. జీతం సరిపోక అప్పులు పెరిగాయి. యింట్లోకి కావలసినవేం తేరు. చెప్పుకుంటే సిగ్గుచేటు మీకిప్పుడు కాఫీ యివ్వాలన్నా కూడా యివ్వలేని పరిస్థితి “అంటూ గుడ్లలో నీళ్ళు కుమ్ముకుంది.

“ఛ !ఛ! వీడిలాంటి వాదనుకోలేదమ్మా. ఏదో కొద్దిగా తాగుడలవాటుందంటే కంపెనీ కోసం తాగుతాడనుకున్నాను కాని కుటుంబాన్ని సర్వనాశనం చేసేలా అది మహమ్మారిలా తయారయిందని తెలీదు “అంటూ బాధపడ్డాడు రఘురామ్.

అజయ్ మనస్సయితే మరీ వికలమైపోయింది. ఆమె స్థితిని, అక్కడి పరిస్థితిని చూసి అతను భరించలేకపోయాడు.

“వస్తానమ్మా బాధపడకు.వాడే మారతాళ్ళే. నేనూ గట్టిగా చెబుతాను”అంటూ కొడుకుతో అక్కడినుంచి బయలుదేరాడు.

“ఈ రోజేం బావుండలేదురా అజయ్! ఏదో సరదాగా ఫ్రెండ్స్ తో గడుపుదామని నిన్ను తీసుకువస్తే ఆ వెధవలిద్దరూ ఎలా తయారయ్యారో చూడు. పద మా సుందరం గాడింటికైనా వెళదాం. వాడికిలాంటి తాగుడలవాటు లేదులే “అంటూ అక్కడ నుంచి సుందరం యింటికి తీసుకెళ్ళాడు.

సుందరం ఆ ఊళ్ళో ఓ పెద్ద కాంట్రాక్టరు. బాగానే సంపాదించాడు. అతనికిద్దరూ పిల్లలు. యిద్దరూ చదువుకుంటున్నారు. తండ్రీ, కొడుకులిద్దరూ అక్కడికెళ్ళేసరికి సుందరం దంపతులు దిగులుగా కూర్చున్నారు.

“ఏమయిందిరా సుందరం! అలా వున్నారేంటి?”అడిగాడు రఘురామ్.

“ఏం చెప్పమంటావురా. మా పెద్దోణ్ణి పోలీసులు అరెస్టు చేశారట. యిప్పుడే ఫోనొచ్చింది. ఏం చెయ్యాలో తోచడం లేదు. యింతలో నువ్వొచ్చావు “అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు సుందరం. అతని భార్య కూడా దుఃఖాన్ని దిగమింగుకుంటోంది.

“ఏం జరిగింది?”అడిగాడు.

“ బార్ లో బాగా తాగి ఎవణ్ణో తన్నాడట. వాడు పోలీసులకు రిపోర్టిస్తే వాళ్ళొచ్చి వీణ్ణి తీసుకుపోయారు”అన్నాడు బాధగా.

“అవునూ మీ వాడేం చదువుతున్నాడు”

"ఏం చదువు అదో పెద్ద చదువా. బిఏ ఫైనల్లో కొచ్చాడు. అది పూర్తయితే వాణ్ణి కూడా కాంట్రాక్టుల్లోనే పడేద్దామనుకున్నాను. చిన్నాడింకా ఇంటరులోనే వున్నాడు. వీడికీ అలవాటున్నట్టుంది. పిల్లలలా తయారయితే తల్లిదండ్రులుగా మనమెంత బాధపడతామో వాళ్ళు ఆలోచించరు. ఎంత సంపాదిస్తే మాత్రం ఏం లాభం చెప్పు. ఏదో సరదాకు తాగుతున్నార్లే వాళ్ళేమనుకుంటారోనని చూసి చూడనట్లూరుకుంటే అదిప్పుడు నా కొంప ముంచింది. వాణ్ణి పోలీసులు అరెస్టు చేశారంటే నాకెంత చెడ్డపేరో చూడు. కష్టపడి సంపాదించుకున్న మంచి పేరంతా తాగుబోతులైన కొడుకుల వల్ల నాశనమయిపోయింది. ఈ వెధవ తాగుడు ఎన్నో కుటుంబాల్ని నాశనం చెయ్యడమే కాకుండా ఎంత మందిని మానసిక క్షోభకు గురిచేస్తుందో తాగే వాళ్ళు ఎందుకు గ్రహించరో అర్థం కావటం లేదు. ఈ విషయంలో నువ్వు చాలా అదృష్టవంతుడివే అనుకుంటున్నాను. రత్నం లాంటి కొడుకును కన్నావు"అన్నాడు సుందరం.

ఉలిక్కిపడ్డాడు అజయ్! తల వంచుకున్నాడు ఎటూ చూడలేక.

"నువ్వేం బాధపడకురా. ఎస్సై నాకు తెలిసినవాడే. నేను చెప్పి కేసు లేకుండా చేస్తానులే. మా అజయ్ ని యింటివద్ద దింపి నేను స్టేషన్ కెళతాను. వాడింటికొచ్చిన తరువాత ఏమీ అనకు. నెమ్మదిగా చెపితే వాడే మానుకుంటాళ్ళే "అని చెప్పి అక్కడి నుంచి కొడుకును తీసుకుని బయటికొచ్చాడు రఘురామ్.

"ఈ రోజు నీ మూడ్ పాడుచేసినట్టున్నాన్రా అజయ్! శలవురోజు నీ ఫ్రెండ్స్ తో గడపకుండా అనవసరంగా యిటు తీసుకొచ్చాను"కొడుకుతో అన్నాడు రఘురామ్.

"అదేం లేదు నాన్నగారూ"అని అన్నాడు గాని అజయ్ మనస్సులో ఏవో ఆలోచనలు.

ఇంటిదగ్గర అజయ్‌ని దింపి, "నేనోసారి పోలీస్ స్టేషన్ కేళ్ళోస్తాను"అని చెప్పి స్కూటర్ని ముందుకు నడిపించాడు.

అజయ్ యింట్లోకి వచ్చాడు. మనస్సంతా చాలా చికాగ్గా ఉంది. ఆ మూడు కుటుంబాల్ని చూసొచ్చాక అతనికనిపించింది . 'తన వల్ల తన కుటుంబం కూడా అలా అయిపోతుందా' అని. ఆ రోజు సాయంత్రం తల్లీ, తండ్రీ హాల్లో కూర్చుని టీ తాగుతుంటే అక్కడికొచ్చాడు అజయ్.

"రారా కన్నా"అని పిలిచింది అన్నపూర్ణమ్మ.

తల్లి ప్రక్కన కూర్చున్నాడు అజయ్.

"వాడికి డబ్బులేమన్నా కావాలేమో చూడు బయటకెళుతున్నట్టున్నాడు"అన్నాడు

రఘురామ్.

తల్లి ఒళ్ళో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు అజయ్.

కంగారు పడింది అన్నపూర్ణమ్మ.

"ఏమయింది బాబూ"అంటూ అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి ప్రేమగా దువ్వింది.

"నన్ను క్షమించమ్మా. నేనెంత పెద్ద తప్పు చేయబోయానో తలుచుకుంటుంటే నాకే సిగ్గుగా వుంది. ఎంతో హాయిగా వున్న మన కుటుంబం నా వల్ల నాశనం కాకూడదు. మిమ్మల్నెంతో మానసిక క్షోభకు గురి చేశాను. యింకెప్పుడూ తాగను. మీ యిద్దరి మీద ఒట్టు"అంటూ వెక్కి వెక్కి ఏడ్చాడు.

అన్నపూర్ణమ్మ ప్రేమగా కొడుకుని నిమిరి భర్తవంక చూసింది నవ్వుతూ. రఘురామ్ కూడా చిరునవ్వు నవ్వాడు.

ఉపసంహారం : అక్కడ డైనింగ్ టేబిలు చుట్టూ అంతా భోజనాలకు కూర్చున్నారు.

"మీ అందరికీ ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియడం లేదు. మీరు చేసిన మేలు నేనెప్పటికీ మరిచిపోలేను. పతనం వైపు పయనించబోయిన నా కొడుకుని సరియైన మార్గంలో పెట్టడానికి మీరంతా మీ వంతు కృషి చేసారు, చాలా థ్యాంక్స్"అన్నాడు రఘురామ్ కృతజ్ఞత నిండిన స్వరంతో.

"మాదేం వుందిరా స్నేహితుడికి ఆ మాత్రం చెయ్యలేమా. మీ వాడు అలా తయారవుతుంటే వాణ్ణి మార్చాలనే నీ ప్రయత్నంలో మేం తలో చెయ్యా వేసాం అంతేగా"అన్నాడు సత్యం.

"అదేం చిన్న విషయం కాదుగా. మా వాడి దృష్టిలో మీరు,మీ పిల్లలు తాగుబోతులుగా ముద్ర వేసుకున్నారు. అదే నాకు చాలా బాధగా వుందిరా"

"పోనీలేవోయ్! మేమెలాగూ నిజ జీవితంలో తాగడం లేదుగదా. కనీసం యిలాగైనా తాగుబోతు వేషాలేశామనుకుంటాం"అన్నాడు శివం నవ్వుతూ.

"నువ్వు నీ కొడుకు సమస్యను డీల్ చేసిన విధానం బావుందిరా. వాడు చేసిన తప్పును తెలుసుకుని తనంత తాను మారడానికి నువ్వు ఎన్నుకున్న పరిష్కార మార్గం మాకు నచ్చింది. చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లలు తప్పుల్ చేస్తుంటే బెంబేలు పడిపోయి వాళ్ళని మందలించే విషయంలో గందరగోళ పరిస్థితులు సృష్టించి వాళ్ళింకా పెద్ద తప్పులు చేయడానికి కారకులవుతారు. కాని సమస్యను సున్నితంగా

పరిష్కరించడానికి పూనుకోరు. యిలాంటి పరిష్కారాలు యువతను పెడత్రోవ నుండి బయట పడేస్తాయి. యిది చాలా మంది తెలుసుకోరు. మీవాడు మారాడు మాకంతే చాలు. యిందులో నువ్వారికే మాకు కృతజ్ఞతలు చెప్పుకోనక్కర్లేదు. మేం నీకు ప్రాణ స్నేహితులం. స్నేహం కోసం మేమేదైనా చేస్తాం"అన్నాడు సుందరం.

"మీరు సరేరా! మీ భార్యలకు కూడా యిందులో భాగస్వాములను చేసారు"అంటూ వారివంక తిరిగి, "మీరు నా సొంత తోబుట్టువుల కంటే ఎక్కువ బాధపడి నా సమస్యకు పరిష్కారం చూపారమ్మా. మా కుటుంబం మీకెప్పుడూ రుణపడి వుంటుంది"అన్నాడు రఘురామ్.

"భలే వారన్నయ్యా! రేపు మా పిల్లలు తప్పు చేస్తుంటే మీరూరుకుంటారా చెప్పండి. మనలో మనకు కృతజ్ఞతలేమిటి? "అంటూ సత్యం భార్య అన్నపూర్ణతో, "ఏమమ్మోయ్ వదినమ్మా మేము కబుర్లు చెప్పుకుంటుంటే చూడటమేనా లేక మాకేమైనా వడ్డించేదుందా లేదా?"అనడంతో అంతా ఫక్కుమని నవ్వారు.

**(ఆంధ్రభూమి వారపత్రికలో 21-12-2000 లో ప్రచురితం)**

* * *

# జీవన వ్యథ

**స**మయం రాత్రి తొమ్మిది గంటలు.

సికింద్రాబాద్ రైల్వే స్టేషన్లో గౌతమి ఎక్స్ ప్రెస్ ఎక్కడానికి స్టేషన్ కొచ్చాను. అప్పటికే ఒకటో నెంబరు ప్లాట్ ఫారం మీద రైలు ఆగి ఉంది. తొమ్మిదింపావుకు బయలుదేరుతుంది. నా కోచ్ నెంబర్ చూసుకుని ఎక్కాను. నాది మిడిల్ బెర్త్. లోయర్ బెర్తుల్లో ఇద్దరు వయసు మళ్ళిన ఆడవాళ్ళు ఎదురెదురుగా విండో ప్రక్కన కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. అప్పుడే నా బెర్త్ వేసుకోవడానికి వీలుండదు కాబట్టి లోయర్ బెర్త్ మీదే ఒకావిడకు కొంచెం దూరంలో కూర్చున్నాను. వాళ్ళిద్దరూ దగ్గర దగ్గరగా ఎనభై సంవత్సరాల వయసున్న వాళ్ళలా ఉన్నారు. అయితే కాయకష్టం చేసి బ్రతికినవాళ్ళు కాబట్టి కొంచెం బలంగానే ఉన్నారు. వార్థక్యం ఛాయలేమీ కనిపించడం లేదు. సాదా చీరల్లో దిగువ మధ్యతరగతికి చెందిన వాళ్ళలా ఉన్నారు.

ఇంక రైలు బయలుదేరుతుండగా ఓ వ్యక్తి వచ్చి నా ఎదురుగా సీట్లో కూర్చుని, "సార్! మీరెంత వరకు వెళుతున్నారు" అనడిగాడు.

"రాజమండ్రి"అని చెప్పాను.

"సార్! నాకో సాయం చేయాలి. ఈవిడ మా అత్తగారు. ఎప్పుడూ రైలులో ఒంటరిగా ప్రయాణం చేయలేదు. ఒక్కావిడనే పంపించాల్సి వస్తోంది. ఈవిణ్ణి కొంచెం నిడదవోలులో దించుతారా"అని రిక్వెస్ట్ చేశాడు పక్కనున్న ఆవిడను చూపించి.

"దాందేముందండి అలాగే"అన్నాను. థాంక్స్ చెప్పి అతను దిగిపోయాడు. రైలు బయలుదేరింది.

"ఆయన మా పెద్దల్లుడుగారండి. ఇక్కడో ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నారు. చిన్నల్లుడుగారేవో ఏదో చిన్న ఆఫీసులో చేస్తారండి. అదేంటో నాకు తెలీదనుకోండి"అంటూ చెప్పిందావిడ తన ముందు కూర్చున్నావిడతో.

"అలాగా అయితే మీది నిడదవోలన్నమాట"

"అవునండి. మీరేంతవరకు వెళ్ళాలి"

"నేనూ రాజమండ్రే ఎల్లాలండి. నా పేరు గంగారత్నమండి. మరి మీ పేరు" అడిగిందామె.

"నా పేరు అనంతమ్మండి"

"అలాగా నాకిద్దరు కొడుకులండి. ఆళ్ళిద్దర్లో పెద్దోడు ఇక్కడుంటాడండి. రెండోవాడు రాజమండ్రిలో ఉంటాడండి" చెప్పింది గంగారత్నం. ఆ వయసులో వాళ్ళు ఒకరినొకరు పరిచయం చేసుకోవడం, కుటుంబ వివరాలు చెప్పుకోవడం వింటుంటే నాకు ముచ్చటేసింది. వాళ్ళిద్దరి మాటల్లో గోదావరి జిల్లాల యాస బాగా కనిపిస్తోంది. వాళ్ళిద్దరూ ఏవేవో విషయాలు పిచ్చాపాటీగా మాట్లాడుకుంటున్నారు. నేను వీక్లీ చూస్తున్నాను.

రైలు వేగం పుంజుకుంది. నాకు చాలా బద్ధకంగాను, నీరసంగాను ఉంది. కాసేపు పడుకోవాలనిపించింది కానీ వాళ్ళిద్దరు కూర్చున్నారు కాబట్టి మిడిల్ బెర్త్ వేసుకోవడానికి లేదు. అప్పర్ బెర్తులు ఖాళీగానే ఉన్నాయిగానీ, అంతపైకి ఎక్కలేక అలానే కూర్చున్నాను. మా కాబిన్లో ఉన్న ఎనిమిది బెర్తుల్లో మేం ముగ్గురమే ఉన్నాం. మిగిలిన ఐదు బెర్తులు ఖాళీగానే ఉన్నాయి. తర్వాతి స్టేషన్లో ఎక్కుతారేమో.

"నాకసలు ఏడింటికే అన్నం తినే అలవాటండి. ఆ టైములో కడుపులో ఏదో ఒకటి పడకపోతే నేనుండలేనండి. ఈ రోజు రైలెక్కడం కోసం ఐదింటికే బయలుదేరవలసి వచ్చిందండి", అంటూ అనంతమ్మ సీటు కింద బ్యాగ్ లోంచి ఓ బాక్సు బయటకు తీసింది.

"నాకూ పెందలాడే తినడమే అలవాటండి. సుగరుంది కదండి. మా డాక్టరుగారు తొందరగా తినెయ్యమంటారండి "అంటూ తనూ ఒక బాక్సు,బాటిలూ బయటకు తీసింది గంగారత్నం. అందులో మజ్జిగ ఉంది. వాటిని రెండు బెర్తుల మధ్య విండో దగ్గర అటాచ్ చేసి ఉన్న బల్ల మీద సర్దుకున్నారు. ఇద్దరూ బాక్సులు ఓపెన్ చేశారు.

"నాయనా నువ్వేదైనా తెచ్చుకున్నావా? లేకపోతే మాతోపాటే కొంచెం తింటావా?"అడిగింది గంగారత్నం.ఆవిడలా అడుగుతుంటే నాకేదోలా అనిపించింది.

"లేదండి. నేను తినే వచ్చాను"అని చెప్పాను. వాళ్ళిద్దరూ ఎంతో ఆత్మీయుల్లా కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు. తెచ్చిన వాటిని ఇద్దరూ పంచుకుని తిన్నారు. మజ్జిగ చెరో గ్లాసు తాగారు.

రైలు ఎక్కేవరకు వాళ్ళిద్దరూ ఒకరికొకరు పరిచయం లేదు. కానీ కూర్చున్నా ఐదు నిమిషాల్లోనే ఒకరికొకరు బాగా తెలిసినవారిలా వాళ్ళిద్దరూ కలిసిపోయారు. పాతతరం మనుషులింతే. వాళ్ళకి కల్మషాలుండవు. ఇగో ప్రాబ్లమ్స్ లేవు. ప్రస్తుత తరం వారిలో ఇలాంటివి ఏ మాత్రం కనిపించవు. అందరికీ ఇగోలే. ఎదుటి మనిషిని

పలకరిస్తే నామోషీగా ఫీలయ్యే పరిస్థితి. వీళ్ళిద్దరినీ చూస్తుంటే ఎన్నోన్నో తెలుసుకోవాలనిపిస్తోంది.

నేను వాష్ రూమ్ కెళ్ళి తిరిగొచ్చేసరికి వాళ్ళిద్దరూ బెర్తుల మీద పక్కలు సర్దుకుంటున్నారు.

"కూర్చుని కూర్చుని నడుములు నొప్పి పెడుతున్నాయి నాయనా. ముసలోళ్ళ0 కదా కూర్చోలేకపోతున్నాం. పదుకుంటాం మరి"అంది అనంతమ్మ.

నిజమేకదా అనిపించింది. మిడిల్ బెర్తులు రెండింటినీ సెట్ చేశాను. వాళ్ళిద్దరూ నడుములు వాల్చారు. నేను మిడిల్ బెర్త్ ఎక్కాను. పడుకున్నారన్నమాటేగాని,వాళ్ళు మాట్లాడుకోవడం మానలేదు.

"ఏమాటకామాటే చెప్పుకోవాలి గంగారత్నంగారూ. ఎవరైనా సరే ఇంత వయసొచ్చేవరకు బతక్కూడదండి. అందులోనూ భర్త లేకుండా పిల్లల మీద ఆధారపడేటట్లయితే అసలుండకూడదండి."

"భలే చెప్పారండి. నేను ఎప్పుడూ అదే అనుకుంటానండి. ఎప్పుడెప్పుడు తెల్లారిపోతుందా అని. నాలాంటి  బాధలే మీక్కూడా ఉన్నాయన్నమాట"అంది గంగారత్నం.

"పిల్లల్ని కన్నప్పుడు ఈ బాధలు ఉండకతప్పుతాయంటారా. మీ సంగతి నాకు తెలీదుగానండి. నా సంగతే చూడండి.నాకిద్దరు ఆడపిల్లలండి. ఆ మారాజు బతికున్నప్పుడే ఇద్దరికీ పెళ్ళిళ్ళు చేశామండి. మాది నిడదవోలు పక్కనే పల్లెటూరండి. మాకో ఎకరం భూముందిలెండి. దాన్లోనే రెక్కలు ముక్కలు చేసుకుని బతికేవోరమండి.

ఆయన పోయాక నా వల్ల కాలేదండి. కౌలుకిచ్చేసి కుతుళ్ల దగ్గరకు హైదరాబాదు ఎల్లిపోయానండి. చెరో మూణ్ణెల్లు బాగానే చూసారండి. తర్వాత నాకు తిండెట్టడం దండగనుకున్నారండి. అప్పటినుండి నాకు తిప్పలు మొదలయ్యాయండి. నేనాళ్ళదగ్గరుండలేక మా ఊరెళ్ళిపోతానన్నానండి. అయినా వాళ్ళు నన్ను వెళ్ళనివ్వలేదు. కన్నతల్లినని కూడా చూడకుండా నన్ను ఒక ఇంట్లో వంటమనిషిగా పెట్టారు. వాళ్ళు తిండిపెట్టి నెలకు మూడు వేలిస్తారు. చెరో పదిహేను వందలు పంచుకుంటారు. ఎంత అన్యాయమో చూడండి. కన్నతల్లిని పనిలో పెట్టి నా జీతం నన్ను తీసుకోనివ్వకుండా ఏదైనా అవసరం ఉంటుందేమోనని  పది రూపాయలు కూడా ఇవ్వకుండా వాళ్ళ దగ్గర నుంచే పట్టుకుపోయేవారు. పోనీ నాకు అక్కడన్నా సుకముందా అంటే అదీలేదు. పొద్దుటినుంచీ బండ చాకిరీ. కడుపునిండా తిండి

కూడా పెట్టేది కాదా తల్లి. ఎనభై ఏళ్ళ వయసులో రోజూ నరకం అనుభవించానంటే నమ్మండి.

పిల్లలు కడుపులో పడ్డప్పుడు ఏ తల్లయినా సంతోషపడుతుంది కదండి. తన ప్రాణం పోయినా సరే పిల్లలకు జన్మనివ్వాలనుకుంటుంది. నేనూ నా పిల్లల్ని కళ్ళలో పెట్టుకుని పెంచాను. మా కడుపులు మాడ్చుకుని వాళ్ళ కడుపులు నింపాం. వాళ్ళనెంత కష్టపడి పెంచి పెళ్ళిళ్ళు చేసి పంపామో వాళ్ళకీ తెలుసు. అయినా వాళ్ళవన్నీ మరిచిపోయారు. అందుకే అక్కడ ఉందబుద్ధి కాలేదు. ఆ కష్టమేదో మా ఊళ్ళోనేపడితే హాయిగా బతకొచ్చని వాళ్ళతో పోట్లాడి బయలుదేరానండి"అంటూ చెప్పుకొచ్చింది అనంతమ్మ.

ఆవిడ చెబుతున్న విషయాలు వింటుంటే నా మనస్సంతా ఏదోలా అయిపోయింది.

"మీరు చెప్పింది వింటుంటే కడుపు తరుక్కుపోతోంది అనంతమ్మగారు. నా బాధలు కూడా మీలాంటివే. నాకిద్దరు కొడుకులండి. మా పిల్లలిద్దరి చిన్నప్పుడే నా భర్త చనిపోయాడు. అప్పటినుంచీ ఎన్ని కష్టాలు పడ్డానో ఎవరికి చెప్పినా నమ్మరండి. పాచిపనులు చేశాను. వంట పనులకు వెళ్ళేదానిని. అదీ ఇదని కాదండి అన్ని పనులు చేసి నా పిల్లల కడుపు నింపేదాన్ని. నేను తిన్నానో లేదో కూడా ఆలోచించేదాన్ని కాదండి. పెద్దోణ్ణి పదోతరగతి వరకు సదివించానండి. ఇంక సదివించలేక అణ్ణో మందులషాపులో గుమాస్తాగా పెట్టేశాను.

రెండోవాడికి పదేళ్లొచ్చేసరికి ఓ తాపీ మేస్త్రి దగ్గర కూలికి పెట్టేశాను. ఇద్దరూ చేతికి అందివచ్చారనుకోండి. వయసొచ్చాక ఇద్దరికీ పెళ్ళిళ్ళు చేశానండి. పెద్దకోడలు పరమగయ్యాళండి. మా అన్నకూతురే మళ్ళీ. మా అన్నయ్యడిగితే దాని సంగతి తెలిసే కాదనలేక నాకొడుక్కిచ్చి పెళ్ళి చేశానండి. మా పెద్దోడు ఇష్టాపడ్డాడనుకోండి. పెళ్ళయిన సంవత్సరానికే మావోణ్ణి తీసుకుని హైదరాబాదు చెక్కేసిందండి.అక్కడే ఆడేదో పనిచేసుకుంటున్నాడండి. ఆడికిద్దరు పిల్లలండి. నేనిక్కడెలా బతుకుతున్నానో ఆడికక్కర్లేదండి. నన్ను సూడ్డానికి రాడండి. నాకేమీ అంపడండి. పోన్లే ఆడి బతుకేదో ఆడు బతుకుతున్నాడని సరిపెట్టుకుంటానండి. అమ్మను కదా మరి ఇప్పుడైనా ఎల్లకపోదునండి. మా కోడలికి టైపాయిడు వచ్చిందండి. అది పనులు చేసుకోలేకపోతోంటే వచ్చానండి. దానికిప్పుడు బాగానే ఉందండి. అందుకే ఇంటికి బయలుదేరాను.

ఇంక రెండోవాడి పెళ్ళాం మంచిదేగానండి దానికి కోపమెక్కువండి. నోటికి ఎంతొస్తే అంత అనెత్తాదండి. రోజూ ఇంట్లో బండచాకిరీ చెయ్యాలి. ఈడికి ముగ్గురు పిల్లలు. ఓసారి మా పెద్దమనవడికి జొరమొస్తే దానవాయిపేటలో ఓ ఆసుపత్రిలో పదిరోజులుంచామండి. ఆ ఆసుపత్రిలో ఆయాలు కావాలని బోర్డు పెట్టారండి. నేనక్కడ కుదిరిపోయాను. నెలకు రెండేలు ఇస్తారు. ఆ రెండేలు మా కోడలు తీసేసుకుంటాదండి. డెబ్బై ఏళ్ళ వయసులో అక్కడ చేరానండి. అక్కడా పనెక్కువే. పొద్దున్నే మా మా ఇంట్లో అన్ని పనులూ సేసుకుని అక్కడికెళతానండి. ముందు డాక్టరుగారింట్లో పనులు చేసి పదిగంటలకల్లా ఆసుపత్రికెళ్ళాలి. తెల్లారకుండా ఐదుగంటలకు లేస్తే రాత్రి తొమ్మిదవుతుంది.పనులు పూర్తవడానికి మధ్యలో భోజనానికి ఓ గంట పంపిస్తారండి. మళ్లీ సుగరోటండి. మా డాట్టరు గారు మంచోరు కాబట్టి శాంపిలు మందులులిత్తారండి. మా సిన్నోడు కూడా నన్ను పట్టించుకోడండి. ఏం తిన్నానో, ఏం తాగానో ఆడికక్కర్లేదండి. పెళ్ళాంమాటే ఇంటాడండి. ఒంట్లో ఓపికుంది, పని సేత్తున్నాను కాబట్టి ఇంట్లో ఉండనిస్తున్నారండి. ఆ ఓపికైపోతే ఏ రోడ్డు పక్కనో పడేత్తారండి. ఎంతమందిని సూట్టంలేదండి. అలాంటి పరిస్థితి రాకుండా సచ్చిపోతే బాగుండనిపిస్తుంది” చెప్పడం ఆపింది గంగారత్నం.

వాళ్ళమాటలు వింటుంటే మనస్సంతా వికలమైపోయింది. అలాంటి పిల్లలు ఉంటారా అనిపించింది. నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

ఛళ్ మని వీపుమీద ఎవరో చరచినట్లయింది. ‘నువ్వు వాళ్ళ పిల్లలకంటే గొప్పోడివా’అని అంతరాత్మ ప్రశ్నించింది. అప్పుడు నాకనిపించింది. ‘నిజమే కదా నాకంటే వాళ్ళ పిల్లలే నయం కదూ’అని.

నేను మా తల్లిదండ్రులకు ఒక్కడినే. మాది రాజమండ్రికి దగ్గర్లో పల్లెటూరు. ఇంటర్ వరకు నా చదువంతా రాజమండ్రిలోనే జరిగింది. తర్వాత ఇంజనీరింగ్ హైదారాబాద్ లో పూర్తి చేశాను. ఎంటెక్ కూడా పూర్తి చేయడంతో మంచి ఉద్యోగం దొరికింది. మా అమ్మానాన్నలిద్దరూ ఊళ్ళోనే ఉంటారు. సొంతిల్లుంది. మాకు రాజమండ్రి నుంచి వైజాగ్ వెళ్ళే హైవేలో రోడ్డుప్రక్కనే రెండు ఎకరాల భూమి ఉంది. మా వాళ్ళు వ్యవసాయం చేసి ఎంతో కష్టపడి నన్ను చదివించారు. వాళ్ళిద్దరూ నిరక్షరాస్యులు. పక్కా రైతులు కావడంతో వాళ్ళతో కలిసి ఆ పల్లెటూళ్ళో ఉండటం ఇష్టముండేది కాదు. అందుకని రాజమండ్రిలో ఫ్రెండ్స్ తో కలిసి రూము తీసుకుని ఉండేవాణ్ణి. నా ఫ్రెండ్స్ , నా తల్లిదండ్రుల్ని చూస్తే నా గౌరవానికి భంగం

కలుగుతుందని భావించేవాణ్ణి. అందుకే నేను చదువుతున్నంత కాలం నా రూమువైపు గానీ, కాలేజీవైపు గానీవాళ్ళని రానిచ్చేవాణ్ణి కాదు. నా తల్లిదండ్రులెలా ఉంటారో ఎవరికీ తెలీదు.

నేను అడిగింది కాదనకుండా నాకు అన్నీ సమకూర్చారు.నేను హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడు నా సహోద్యోగిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నప్పుడు కూడా వాళ్ళకి చెప్పలేదు. చెప్పకుండా చేసుకుంటే వాళ్ళు బాధపడతారని నేననుకోలేదు. పిల్లలు పుట్టారు. వాళ్ళు పెద్దవాళ్ళవుతున్నారు. నాకు గానీ, నా భార్యకుగానీ వాళ్ళని మా దగ్గరకు తెచ్చుకోవాలని లేదు. అప్పుడప్పుడు వెళ్ళి చూసిరావాలని కూడా అనుకోలేదు. ఎప్పుడైనా పిల్లలతో సెలవులప్పుడు వైజాగ్ గానీ,అరకు గానీ వెళ్ళేటప్పుడు ఓ అరపూట ఆగి చూడటం అంతే. పిల్లలు మాత్రం నాన్నమ్మను, తాతయ్యను మనింటికి తీసుకెళదామని గొడవపెడతారు. మేము ఒప్పుకోము. వాళ్ళిప్పుడు బాగా ముసలివాళ్ళయిపోయారు. వాళ్ళ ఆరోగ్యాలు కూడా పాడైపోయాయి. అట్లాంటప్పుడు వాళ్ళను ఇంటికి తీసుకువెళితే నా పరువేం కావాలి? నా సర్కిల్స్ లో వాళ్ళని చూపించి నేను తలెత్తుకోలేను. అందుకే ఆ ప్రయత్నం చేయలేదు.

కానీ ఇప్పుడు వెళ్ళేది మా ఊరికే.అయితే వాళ్ళని ఇంటికి తీసుకెళ్ళడానికి కాదు. మాది రెండెకరాలు హైవే పక్కన ఉండటం. అక్కడున్న భూముల్లో వెంచర్స్ వేయడంతో మా భూమి ఇప్పుడు కోట్లు పలుకుతోంది. ఆ విషయం తెలిసినప్పటినుంచీ నా భార్య ఒకటే పోరు పెడుతోంది అమ్మేద్దామని. నాక్కూడా అదే అనిపించింది. కానీ అమ్మేద్దామంటే మా వాళ్ళకిష్టం లేకపోయినా నా మాట కాదనలేరు. వాళ్ళకి నెలకింత అని పంపిస్తే వాళ్ళు బతికున్నంత కాలం అక్కడే పడి ఉంటారు అని నిర్ణయించుకుని ఇప్పుడు బయలుదేరాను.

కానీ వీళ్ళు మాట్లాడుకున్న మాటలు విన్న తర్వాత నేనెంత మూరు?ణ్ణో అర్థమవుతోంది నాకు. నన్ను కన్న పాపానికి నా తల్లిదండ్రులు నరకం అనుభవించారు. వాళ్ళకి నేనే చూపించాను. నిజంగా నాకు పుట్టగతులుంటాయా? రేపు నా పిల్లలు కూడా నన్నలాగే చూస్తారేమో!

ఆ తల్లులిద్దరూ నా కళ్ళు తెరిపించారు. వాళ్ళ పిల్లలు వాళ్ళను బాధపెడుతుంటే వాళ్ళు ఎంత నరకం అనుభవించారో చెబుతుంటే నాకు తెలుస్తోంది నా తల్లిదండ్రులకు నేనెంత నరకం చూపించానో. నేను నిజంగా పాపాత్ముణ్ణి. నేను చేసిన పనికి నాకు నిష్కృతి లేదు.

అంతా అంటుంటారు. దేవతలు–దేవుళ్ళు అంటూ ప్రత్యేకంగా ఎవరూ ఉండరు. మనల్ని కనిపెంచిన తల్లిదండ్రులే మన దేవుళ్ళనీ. రోజూ కళ్ళెదుట కనిపించే వాళ్ళను కాదనుకుని కనబడని దేవుళ్ళను ఎందరినో పూజిస్తూ ఉంటాము. తల్లిదండ్రులకు తిండి పెట్టకుండా, చాలా హీనంగా చూసే నాలాంటి వాళ్ళు చాలా మంది ఉన్నారు.

నాకిప్పుడే జ్ఞానోదయమైంది. మరో ఆలోచన లేకుండా ఇంటికి ఫోన్ చేసి నా భార్యతో, "అమ్మానాన్నల్ని హైదారాబాద్ తీసుకొస్తున్నాను. మన నాలుగో బెడ్ రూమ్ క్లీన్ చేయించు. ఇకనుండి వాళ్ళిద్దరు మనింట్లోనే ఆ బెడ్ రూమ్ లో ఉంటారు"అని చెప్పి నా భ భార్య మరోమాట మాట్లాడటానికి అవకాశం లేకుండా ఫోన్ స్విచ్చాఫ్ చేసి బెర్త్ మీద హాయిగా నిద్రపోయాను.

**( 22–8–2018 నవ్య వారపత్రికలో ప్రచురితం )**

( ఈ కథకు నవ్య వీక్లి – బలివాడ కాంతారావు స్మారక కథల పోటీలో ఐదువేల రూపాయల బహుమతి లభించింది.)

* * *

# మార్పు

**రా**జేష్‌ని అంతంత మాటలంటానని అనుకోలేదు. నోరు జారి అన్నానో లేక కావాలని అన్నానోగానీ ఆ క్షణంలో అనడం జరిగిపోయింది.

నేనలా అంటుంటే అతను తల దించుకున్నాడేగానీ పల్లెత్తు మాట అనలేదు. అదే మరొకరయితే ఆ మాటలకు నా చెంప ఛళ్‌మనిపించేవారేమో! నా దగ్గర చదువుకున్నాననే గౌరవంతో అలా వున్నాడో లేక నా పెద్దరికానికి గౌరవం ఇచ్చాడోగానీ ఏం మాట్లాడకుండా తల దించుకుని వెళ్ళిపోయాడు. అతని ముఖంలోని బాధావీచికల్ని నేనింకా మరచిపోలేదు.

నిజానికి అతను ఒకప్పటి నా స్టూడెంట్ అనే చనువుతో అనలేదు. అక్కడ జరుగుతున్న అన్యాయాన్ని సహించలేక గబగబా అనేసాను. రాజేష్ నా దగ్గర సుమారు పది సంవత్సరాల క్రితం డిగ్రీ చదివాడు. చాలా మంచి విద్యార్థి అని పేరు తెచ్చుకున్నాడు. చదువులోనే కాదు వినయ విధేయతలలో కూడా ముందుండేవాడు. నేనంటే ప్రత్యేకమైన అభిమానంతో ఉండేవాడు. నేనూ అతడ్ని అభిమవానించేవాడిని.

చాలాకాలం తరువాత నాకు ఈ రోజు బస్టాండ్‌లో కనిపించాడు. నేను గుంటూరు వెళదామని పొదిలి బస్టాండ్‌కొచ్చాను. అప్పుడు కన్పించాడు రాజేష్ కన్పించిన వెంటనే నమస్తే చెప్పి “బాగున్నారా సార్” అంటూ పలకరించాడు.

“ఏమయ్యా రాజేష్ చాలాకాలానికి కన్పించావు. ఏం చేస్తున్నావు?” అనడిగాను.

“ఒంగోలు కలెక్టరేట్‌లో జూనియర్ అసిస్టెంట్‌గా చేస్తున్నాను సార్. ఆరోగ్యం బాగుంటుందా సార్.పాపా, మేడమ్‌గారు ఎలా వున్నారు సార్” అంటూ కుశల ((ప్రశ్నలు వేసాడు.

“అంతా బాగానే వున్నారుగానీ నీ ఉద్యోగం ఎలా వుంది? ప్రమోషన్స్ వచ్చే అవకాశం వుందా?”

“బాగానే ఉంది సార్. ఒకటి రెండు సంవత్సరాల్లో సీనియర్ అసిస్టెంట్ కావచ్చు సార్. మీ. దగ్గర చదువుకోవడం నా అదృష్టం సార్. అసలు మన కాలేజీలో చదవడం గర్వంగా వుంటుంది సార్” అన్నాడు.

నిజం చెప్పొద్దూ నాకు మనసులో చాలా ఆనందం కలిగింది.

"అన్నట్లు పిల్లలెంతమంది?" అనడిగాను.

"లేరు సార్" అన్నాడు.

"కుటుంబ నియంత్రణేమన్నా పాటిస్తున్నావా ఏమిటి?" అన్నాను నవ్వుతూ.

"అదేం లేదు సార్. పుట్టలేదంతే!"

"పెళ్లయి ఎన్నాళ్లయింది?"

"ఆరేళ్లయింది సార్. నాలుగేళ్ళు చూసి ఎంతకీ పుట్టకపోయేసరికి ఇంకో పెళ్లి రెండేళ్ళక్రితం చేసుకున్నాను సార్."

ఆ మాటలకు నేను చాలా ఆశ్చర్యపోయాను.

"అదేంటయ్యా పిల్లలు పుట్టకపోతే వెంటనే రెండో పెళ్లి చేసేసుకోవడమేనా? డాక్టర్‌కు చూపించి మందులు వాడకపోయారా?"

"చాలామందికి చూపించాను సార్. ఏవేవో పరీక్షలు చేసి మందులు రాసిచ్చారు. ఎంతకాలం వాడినా పుట్టలేదని మరో పెళ్లి చేసుకోవాల్సి వచ్చింది."

"ఆ తర్వాతయినా పుట్టారా?"

"నా దురదృష్టమేమిటోగానీ ఈమెకీ పుట్టలేదు సార్. ఈమెనూ డాక్టర్‌కు చూపించాను. మందులు వాడుతోందికానీ ఫలితం కన్పించడం లేదు" అన్నాడు నిరాశగా.

"మరి నువ్వు పరీక్షలు చేయించుకున్నావా?"

"నేను పరీక్షలు చేయించుకోవడమేమిటి సార్. నేనెందుకు? నేను మగాడ్ని కదా!"

"అదేంటయ్యా అలా అంటావు. మగవాడయితే చేయించుకోకూడదా? లోపం నీలోనూ ఉండొచ్చు కదా!"

"నా సామర్థ్యం మీద నాకు నమ్మకం వుంది సార్. నాలో ఏ లోపం వుండదు" అన్నాడు ధీమాగా.

"చూడు రాజేష్ శారీరక సామర్థ్యానికి, పిల్లలు పుట్టడానికి ఏం సంబంధంలేదు. ఎంత బలవంతుడయినా ఈ విషయంలో ఏవో లోపాలుండవచ్చు. ఇప్పుడు వైద్య విజ్ఞానం బాగా అభివృద్ధి చెందింది. ఎటువంటి లోపాన్నయినా సరిదిద్దుతున్నారు. నాకు తెలిసిన ఎంతోమందికి అలా పిల్లలు పుట్టారు. నువ్వు కూడా మంచి డాక్టర్‌ను కన్సల్ట్ చెయ్యి పుడతారు."

"మీవింకా చాదస్తపు భావాలు సార్, మగవాళ్ళకు పరీక్షలేమిటి? మీరు చెప్పినటువంటివాళ్ళు నూటికో కోటికో ఒకరుండవచ్చు. కానీ నేనలాంటి వాళ్ళకు చెందను. నాకు పరీక్షలనవసరం అనుకుంటాను."

ఆ మాటలకు నాకు చాలా కోపమొచ్చింది. అయినా తమాయించుకున్నాను.

రాజేష్‌లాంటి వాళ్లుండబట్టేకదా చాలామంది స్త్రీలు అన్యాయానికి గురవుతున్నారు. పెళ్ళికి ముందు అమ్మాయిలో గుణగణాలను వెతుకుతారుగానీ అబ్బాయిలో పిల్లలు వుట్టించే సామర్థ్యం వుందో లేదో ఎవరూ పట్టించుకోరు. అలాంటి మగాడ్ని పెళ్లాడిన ఆడది పిల్లలు పుట్టకపోతే జీవితాంతం అందరిచేతా మాటలు పడుతూ జీవించవలసి వస్తుంది. పాశ్చాత్య దేశాల్లో మాదిరిగా పెళ్లికి ముందే ఆడా మగా అన్ని పరీక్షలు చేయించుకునే విధానం మన దేశంలో కూడా ఉంటే బాగుండుననిపించింది.

"అవునూ! ఇప్పుడెక్కడికి బయలుదేరావు?" అనడిగాను.

"పెళ్లిచూపులకని కనిగిరి వెళుతున్నాను సార్" అన్నాడు కొంచెం సిగ్గుపడుతూ.

"ఎవరికీ మీ తమ్ముడికా?"

"కాదు సార్! నాకే" అన్నాడు రాజేష్.

ఆ మాటలకు బిత్తరపోయాను.

"ఏమిటీ నీకా?"

"అవును సార్. మరో పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను సార్. ఇద్దరికీ ఇంక పిల్లలు పుట్టరనిపించింది. అందుకే మరో ప్రయత్నం చేద్దామనుకుంటున్నాను" అన్నాడు తాపీగా.

ఆ మాటలకు నాకు కోపం నషాళానికంటింది.

ఏమిటీ మనుషులు? ఎక్కడికి పోతుందీ వ్యవస్థ? సమాజంలోని ఇతర రంగాలలో ఎన్నో మార్పులొస్తున్నాయి. కానీ మనిషిలోనే మార్పు రావడంలేదు. ఎంత మూర?త్వం! మరో ఆడదాని జీవితాన్ని నాశనం చేయడానికి రాజేష్ కంకణం కట్టుకున్నాడు.

"అవునూ! ఇప్పుడు చేసుకునే పెళ్లివలన పిల్లలు పుడతారనే గ్యారంటీ వుందంటావా?" అనడిగాను కోపాన్ని దిగమింగుకుంటూ.

"భలేవారే సార్! ఏవో ఒకటి రెండు ఫెయిలయ్యాయని ఇది కూడా ఎందుకు ఫెయిలవుతుంది సార్. అయినా మన ప్రయత్నంలో లోపం ఉండకూడదు కదా" అన్నాడు నవ్వుతూ. అతని నవ్వు చూస్తే నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోయాను.

అప్పుడే నా నోటిలో నుంచి నేను ఎప్పుడూ ఎవరినీ అనని మాటలు వచ్చేసాయి.

"అయితే ఓ పని చెయ్యి రాజేష్. పెళ్లి చేసుకున్న వెంటనే ఫామిలీని బ్రహ్మచారులుండే పోర్షన్ ప్రక్కనో లేక ఏ స్టూడెంట్స్ హాస్టల్ ప్రక్కనో ఇల్లు తీసుకుని పెట్టు. నీవల్ల కానిది వాళ్ళవల్లనయినా నీకు పిల్లల్ని ఎత్తుకునే అదృష్టం పడుతుంది. ఎందుకంటే నీకింక పిల్లలు పుట్టరని నీ ఇద్దరు భార్యలూ రుజువు చేసారు. వాళ్లల్లో ఒకరికి లోపమున్నా మరొకరికైనా పుట్టి ఉండేవారు. కానీ ఇద్దరికీ పుట్టలేదంటే లోపం నీలోనే వుందని ఇట్టే అర్థమైపోతుంది. ఖచ్చితంగా ఈ పెళ్లివల్ల కూడా నీకు పిల్లలు పుట్టరు. నేను చెప్పినట్లు చేస్తే నీకు పుట్టకపోయినా కనీసం నీ పిల్లలని చెప్పుకునే అవకాశం ఏర్పడుతుంది. లేకపోతే ఈమెకు పుట్టలేదని నువ్వు మరో పెళ్లికి తయారవుతావు. అప్పుడూ నీకు పిల్లనివ్వడానికి ఆడపిల్లల తండ్రులు ముందుకు వస్తారు. అటువంటి దౌర్భాగ్యం మనది. మరి ఏమంటావ్?" అతనిమీద కలిగిన కోపాన్నంతా అలా మాట్లాడి తీర్చుకున్నాను. ఆ మాటలకతను బాధపడతాడనిగానీ, దానికి రియాక్టయి నామీద తిరగబడతాడనికానీ ఊహించలేదు. అలా అనే హక్కు నాకుందా అని కూడా ఆలోచించలేదు. అక్కడో అమ్మాయిని పరోక్షంగా అవమానిస్తున్నానని భావించలేదు. కానీ రాజేష్ నన్నేమీ అనలేదు. అక్కడ నుంచి మాత్రం వెళ్లిపోయాడు.

ఆ తర్వాత అన్పించింది అలా మాట్లాడకుండా అతనికి మరొకరకంగా చెప్పి ఉండవలసిందని.కాలు జారితే సర్దుకోగలంగానీ నోరు జారితే ఏం చెయ్యలేం కదా!

\- - -

ఒక సంవత్సరం తరువాత రాజేష్ నాకు బజారులో కన్పించాడు. ప్రక్కనే భార్య అనుకుంటాను ఆమె చేతిలో రెండు మూడు సంవత్సరాల వయసున్న బాబు ఉన్నాడు. నన్ను చూసిన వెంటనే నా దగ్గరకు నవ్వుతూ వచ్చి పలకరించాడు.

"ఎలా వున్నారు మాస్టారూ! చాలాకాలమయింది మిమ్మల్ని చూసి" ఎంతో గౌరవంగా వున్నాయి అతని మాటలు.

అతన్ని చూస్తే నాకే గిల్టీగా అన్పించింది.

"బాగానే వున్నానయ్యా" అని మాత్రం అన్నాను.

"ఆ రోజు మీరా మాటలన్నప్పుడు నాకు చాలా బాధ కలిగింది సార్. కానీ ఆలోచించిన మీదట మీ మాటల్లో వాస్తవం కన్పించింది. వెంటనే పెళ్లి చూపులకు వెళ్లడం మాని డాక్టర్ని కన్సల్ట్ చేసి స్పెరమ్ టెస్ట్ చేయించాను. నాలో కౌంటు చాలా

తక్కువగా వుందని, పిల్లలు పుట్టే అవకాశం  అవకాశం లేదని తెలిసింది. ఆ విషయాన్ని నా భార్యలిద్దరికీ చెప్పాను మొదటి భార్య ఏమీ అనలేదు. కానీ రెండవ భార్య మాత్రం పిల్లల్లేకుండా నాతో ఉండలేనంది. విడాకులు కావాలంది. ఈ కారణం చూపిస్తే వెంటనే విడాకులు మంజూరయ్యాయి. ఆమె వేరే పెళ్ళి చేసుకుంది.

ఇప్పుడామె గర్భవతి అని  తెలిసింది. ఇంక ఎలాగూ పిల్లలు పుట్టరు కాబట్టి, మొదటి భార్య, నేను సంప్రదించుకుని అనాధాశ్రమము నుంచి ఒక బాబుని తెచ్చుకుని పెంచుకుంటున్నాము.  అన్నట్టు ప్రమోషను కూడా వచ్చింది. ఇప్పుడు  చాలా ఆనందంగా గడుపుతున్నాం సార్. ఆ రోజు మీరు నా కళ్ళు తెరిపించారు. మీకు చాలా కృతజ్ఞతలు సార్" అన్నాడు రాజేష్.

అప్పుడు నేనన్న మాటలకు అతనలా రియాక్టవుతాడని మాత్రం నేను ఊహించలేదు. కానీ నేనో  మనిషిని మార్చగలిగాననే తృప్తి నాలో మిగిలిపోయింది.

**(జూన్ , 2003 ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితం)**

* * *

# మంచు తెర

**బ**స్ దిగిన వెంటనే భర్త కోసం అటూ, ఇటూ చూసింది వనజ. కనుచూపు మేరలో ఎక్కడా కన్పించలేదు శంకరం. బయలుదేరే ముందు ఫోన్‌లో మాట్లాడినప్పుడు చెప్పనే చెప్పాడు.

"నేను నీకోసం ఎనిమిది గంటల వరకే వెయిట్ చేయగలను. ఆఫీసులో ఇన్‌స్పెక్షనుంది. త్వరగా వెళ్ళిపోవాలి. బస్ లేటుగా వస్తే మాత్రం నా కోసం ఎదురుచూడకుండా ఆటో చేసుకుని ఇంటికి వెళ్ళిపో. తాళాలు ఇంటిగలవాళ్ళ దగ్గరుంటాయి. తీసుకో" అని.

ఈరోజు బస్ తొమ్మిది గంటలగ్గాని చేరుకోలేదు. ఈ వెధవ బస్‌లెప్పుడూ ఇంతే. ముఖ్యంగా అమలాపురం నుంచి హైదరాబాదు బస్సులయితే రోజూ లేటే. ఒక్కోసారి ట్రాఫిక్‌లో ఇరుక్కుని పన్నెండు, ఒంటిగంట కూడా అవుతుంది. ఇంక. భర్త కోసం చూడకుండా ఆటో పిలిచి విజయ్‌నగర్ కాలనీకి మాట్లాడుకుంది.

ఆటోలో కూర్చుని ఇంటికి చేరేవరకు భర్త గురించిన. అలోచనలే. అప్పుడే పది రోజులయిపోయింది ఆయన్ని చూసి. పెళ్ళయిన ఆరునెలల్లో ఇన్నిరోజులు భర్తను విడిచి ఉండటం ఇదే. అమ్మకి టైఫాయిడ్ వచ్చిందని, తనని చూడాలంటుందని నాన్న ఫోన్ చేస్తే వెళ్ళింది. భర్తతో కలిసి వెళదామనుకుంది కాని ఆయనకు శలవు లేకపోవడం, ఇన్‌స్పెక్షనుండటంతో తను ఒక్కర్తే బయలుదేరింది... మూడోరోజుకే భర్త మీద మనసు తిరిగిపోయింది. కాని అమ్మకు జ్వరం తీవ్రంగా ఉండటంతో బయలుదేరలేకపోయింది. ఈ పది రోజులు రాత్రిళ్ళు ఫోన్‌లో భర్తతో మాట్లాడితేగాని నిద్రపట్టేదికాదు. ఆయనంటే తనకి ప్రాణం. ఆయనకీ అంతే. తప్పనిసరి పరిస్థితుల్లో పుట్టింట్లో ఉండవలసివచ్చింది. అమ్మకి తగ్గి పత్యం పెట్టిన వెంటనే బయలుదేరేసింది. రెండురోజులులాగితే తమ్ముడినిచ్చి పంపుతానని తండ్రి చెప్పినా వినలేదు. వాడికిప్పుడు పరీక్షలు జరుగుతున్నాయి. ఇంక రెండురోజులుగ్గాని పూర్తికావు. తల్లి అలా వుండటంతో నాన్న బయలుదేరటానికి వీలులేదు. తను ఒంటరిగానే బయలుదేరతానని చెప్పడంతో నాన్న బస్‌కి రిజర్వు చేయించాడు. అప్పటికే చెల్లెలు వేళాకోళం చేసింది.

"బావని విడిచి అక్క ఉండలేకపోతోంది. మనకంటే ఆరునెలల. క్రితం వచ్చిన

బావ ఎక్కువైపోయాడు దీనికి" అని.చెల్లెలి నెత్తిమీద ఒక్క మొట్టికాయ మొట్టింది అలా అంటుంటే.

రాత్రి బస్సులో ఒక్కక్షణం కూడా నిద్రపోలేదు. ఎప్పుడెప్పుడు ఆయన్ని చూస్తానా అని ఒకటే ఆలోచన. తనులేకపోవడంతో ఆయనకు నిజంగా పిచ్చెక్కి వుంటుంది. ఆఫీసుకెళ్ళే సమయం తప్పితే ఒక్కక్షణం కూడా తనని విడిచిపెట్టీ ఉండడు. అలాంటి భర్త దొరకడం నిజంగా తన అదృష్టం కదూ.

పదిరోజుల విరహం ఆమెను నిలవనీయడంలేదు. ఎప్పుడెప్పుడు భర్తను చూస్తానా, ఎప్పుడు భర్త కౌగిలిలో కరిగిపోతానా అనే తలపులతో ఆమె మనస్సు, శరీరం తహతహలాడుతున్నాయి.

ఆటో ఇంటికి చేరింది. తాళాలకోసం ఇంటిగలవారి పోర్షను వైపుకి వెళ్ళింది వనజ.

ఇంటిగలావిడ తాళాలిస్తూ –

"ఏమిటమ్మా వనజా ఇదేనా రావడం. మీ ఆయన్ని పూర్తిగా మర్చిపోయినట్టున్నావే" అంటూ నవ్వింది. ఎందుకో ఆవిడ మాటల్లో ఏదో తేడా అన్పించింది. అవేమీ పట్టించుకోకుండా తాళాలు తీసుకుని తలుపుతీసి సూట్‌కేసుతో ఇంట్లో ప్రవేశించింది. సూట్‌కేసును డ్రాయింగ్ రూమ్‌లో పెట్టి బాత్‌రూమ్ కెళ్ళి ముఖం కడుక్కుని వచ్చింది. ఫ్రిజ్‌లో పాలపాకెట్లుండటంతో స్టవ్ వెలిగించి కాఫీ కలుపుకుంది.

కాఫీ తాగి ,కప్పు సింకులో పడేసి ఒళ్ళంతా చికాగ్గా ఉండటంతో స్నానం చేద్దామని సూట్‌కేసు తీసుకుని బెడ్‌రూమ్‌లోకి అడుగుపెట్టింది.

అక్కడి సీను చూసి బిత్తరపోయింది.

బెడ్‌మీద దుప్పటి నలిగిపోయి వుంది. పక్కమీద. వాడిపోయిన మల్లెపూలు అక్కడక్కడ పడివున్నాయి. నేలమీద పగిలిన గాజుముక్కలు. రాత్రంతా పక్కమీద గడిపిన గుర్తులు.

వనజకు మతిపోయింది. చేతిలోని సూట్‌కేసు జారిపోయింది.

ఏమిటిది? ఏం జరిగిందిక్కడ?

తను లేనప్పుడు భర్త ఇంకొకరితో...

ఊహించలేకపోయింది.

దుఃఖం వచ్చేసింది వనజకు. అక్కడ ఒక్కక్షణం కూడా ఉండలేక డాయింగ్

రూంలోకొచ్చి సోఫాలో కూలబడిపోయింది. ఎంత ఆపుకుందామనుకున్నా ఏడుపు ఆగడం లేదు. తను భర్తను ఎంత గాఢంగా ప్రేమించింది. అతనితోడిదే జీవిత మనుకుంది. అతన్ని ఎంతో నమ్మింది. కాని తను పదిరోజులు ఇంట్లో లేకపోయేసరికి ఇంకో ఆడది కావలసి వచ్చిందంటే తనమీద అతని ప్రేమంతా ఒట్టి భూటకమని తెలిసిపోతోంది. ఛీ! ఛీ! ఎంత పనిచేశాడు. భర్తమీద కోపంతో పాటు అతనంటే విరక్తిపుడుతోంది. పెళ్ళాం ఇంట్లో లేకపోతే ఇంకో ఆడదాన్ని ఇంటికి – తీసుకొచ్చేయడమేనా? అంత ఆగలేకపోయాడా? ఇలాంటి వాడితోనా ఇంతకాలం తను కాపురం చేసింది? ఇంక అతనితో కలిసి జీవించలేదు. వెంటనే తిరిగి వెళ్ళిపోదామని నిర్ణయించుకుంది.

అలా వెళ్ళిపోతే తనకి నిజం తెలిసిందన్న నంగతి అతనికి తెలియదు. వచ్చేవరకు వుండి అతన్ని నాలుగు దులిపేసి తాడోపేడో తేల్చుకుని వెళ్ళిపోవాలనుకుని అలాగే సోఫాలో కూర్చుండిపోయింది. స్నానం కూడా చేయాలనిపించలేదు. ఎన్ని కలలు కంది జీవితం గురించి. ఎన్ని ఆశలు అల్లుకుంది. అన్నీ నీటిమూటలయిపోయాయి. తన కాపురం మూణ్ణాళ్ళ ముచ్చటవుతుందని కల్లోకూడా ఊహించ లేదు. ఇంక తన భవిష్యత్తేమిటి? చచ్చిపోవాలని కూడా అన్పించింది.

మనసు పరిపరివిధాల ఆలోచనలో పడింది. ఇంతలో బయటినుంచి వదినగారూ అంటూ పిలువు వినిపించింది. పక్కపోర్షను పంకజాక్షి గొంతది. గబగబా ముఖాన్ని పవిటచెంగుతో తుడుచుకుని వెళ్ళి తలుపు తీసింది.

‘‘ఎప్పుడొచ్చారు?. ఇంకా స్నానం చేసినట్టులేదు. అన్నయ్యగారు ఆఫీసుకువెళ్ళిపోయినట్టున్నారే. అవునూ వారం రోజుల క్రితం మీ ఇంటికెవరో బంధువులొచ్చినట్టున్నారు. పగలు కనపడేవారు కాదుగానీ రాత్రిళ్ళు మాత్రం ఇల్లంతా హడావిడిగా ఉండేది” ఆవిడ మాటలు ఇంకా బాధించాయి. ఆవిడ కావాలనే– మాట్లాడుతుందని తెలుసు. అయినా అవేమీ కన్పడనీయకుండా ముఖానికి నవ్వు పులుముకుని –

‘‘అవునండీ. మావారు తరపు బంధువులొచ్చారు. ఆయనకు వరుసకు చెల్లెలవుతుంది. వాళ్ళు బెంగుళూరులో వుంటున్నారు. ఆయన ఫోన్‌చేసి చెప్పారు. అమ్మకు బావుండక నేను రాలేకపోయాను. ఏం అవస్థలు పడ్డారో ఏమో” అంటూ ఏవేవో అబద్ధాలు చెప్పేసింది.

“నువ్వో పిచ్చిమాలోకానివి కాబట్టే , మీ ఆయన అలాంటి వేషాలేస్తున్నాడన్నట్టు

ఓ నవ్వు నవ్వి, “ఇంకా పనులేవీ కానట్టున్నాయి. మళ్ళీ వస్తాన్లెండి” అని చెప్పి వెళ్ళిపోయింది.

తలకొట్టేసినట్టయింది వనజకు. ఆటో దిగిన వెంటనే ఇంటిగలావిడ పలకరింపూ ఇప్పుడు పంకజాక్షి పరామర్శలతో భర్తచేసిన నిర్వాకమేమిటో అర్థమైపోయింది. తను వెళ్ళిన వెంటనే దేన్నో తెచ్చుకుని దుకాణం తెరిచినట్టున్నాడు. ఛీ! ఛీ! ఎంత సిగ్గుచేటు. భర్తను తను చాలా గొప్పగా ఊహించుకుంది. కాని ఇంతటి స్త్రీ లోలుడని అనుకోలేదు. అతన్ని తలుచుకుంటుంటే అసహ్యమేస్తుంది.

దుర్మార్గుడు! తనని ఎంత మోసం చేసాడు. రానియ్యి చెప్తాను. తను ఎలాగూ వెళ్ళిపోవాలనుకుంటుంది. కాబట్టి అతని పరువు తీసిగానీ పోదు. నలుగురిలో తలెత్తుకుని తిరగకుండా చెయ్యాలి. తనకింత అన్యాయం చేసాడు కాబట్టి అంతకంత అనుభవించేలా చెయ్యాలనుకుంది.

ఉదయం నుంచి కాఫీ  తప్ప కడుపులో ఏం లేకపోవడం,రాత్రంతా  ప్రయాణంలో నిద్రలేకపోవడంతో నీర్సంగా  వుంది. వంట చేసుకోవాలనిపించక అలా సోఫాలోనే కూర్చుండిపోయి కాస్సేపటికి నిద్రలోకి జారిపోయింది వనజ. అలా ఎంతసేపు నిద్రపోయిందో ఆమెకే తెలియదు. కాలింగ్‌బెల్ మోగిన శబ్దానికి మెలకువ వచ్చింది. టైమ్ చూస్తే అయిదు గంటలు దాటింది. భర్తేమో అనుకుంది. వెంటనే వెళ్ళి తలుపు తియ్యాలనిపించలేదు. అదేపనిగా బెల్  మోగుతుంటే వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా ఇద్దరం అపరిచిత వ్యక్తులు – ఆడ, మగ. అమెకు పాతికేళ్ళుంటాయి. చాలా అందంగా ఉంది. అతనికీ ముప్పయికి లోపే వుంటాయి. అతనూ అందంగానే వున్నాడు.

“నమస్కారమండీ!నాపేరు సత్యమూర్తి. శంకరం స్నేహితుణ్ణి. ఈమె నా శ్రీమతి. ఇద్దరం స్టేట్‌బ్యాంకులో పని చేస్తున్నాం” అన్నాడతను.

“రండి” అంటూ పిలిచింది. ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

“శంకరం ఇంకా రాలేదాండి. మీరు ఉదయమే. వచ్చినట్టున్నారు. మీ ఇద్దరికీ థేంక్స్ చెప్పిపోదామని వచ్చాం”

“ఎందుకండి?” మతిపోతోంది వనజకు.

“ఎందుకేమిటండీ. మీరు వూరికెళ్ళినందుకు శంకరం మాకు మరిచిపోలేని హెల్ప్ చేసినందుకు”

“మీరు చెప్పేదేమిటో నాకు అర్థంకావడంలేదు” అంది వనజ.

“మీకు విషయం తెలియదు కదూ. అంతా చెప్తాను. వినండి. మేమిద్దరం చాలాకాలం నుంచి ప్రేమించుకుంటున్నామండి. కులాలు వేరు కావడంతో పెద్దలు మాపెళ్ళికి ఒప్పుకోలేదు. ఇంక లాభంలేదనుకుని వారం రోజుల క్రితం శంకరం లాంటి ఫ్రెండ్స్ సహాయంతో గుళ్ళో పెళ్ళి చేసుకున్నాం. తను వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో వుండేది. నేను ఫ్రెండ్ రూమ్‌లో వుండేవాణ్ణి. ఇల్లు దొరికే వరకూ హొటల్లో రూమ్ తీసుకుని వుందామనుకున్నాం. కాని మీరు వూరు వెళ్ళారని, పదిరోజుల వరకు రారని చెప్పి శంకరం మమ్మల్ని మీ యింటికి తీసుకొచ్చి మీ బెడ్‌రూమ్ మాకిచ్చాడు. ఈ వారం రోజులు స్వంత ఇంట్లో వున్నట్టే ఆనందంగా గడిపాం. హొటల్లో అయితే అలా వుండలేం కదండీ. దానికి మీకెంతో కృతజ్ఞతలు. ఈరోజు మీరొచ్చేస్తారని శంకరం చెప్పాడు. ఈలోగా ఇల్లు వెతుక్కున్నాం ఈరోజే అందులో చేరుతున్నాం. మీరిద్దరూ ఒక్కసారి మా ఇంటికి తప్పకుండా రావాలి” అన్నాడు సత్యమూర్తి.

“ఉదయం ఆలస్యంగా లేవడంతో బేంకు వెళ్ళే హడావిడిలో బెడ్ సర్దకుండా వెళ్ళిపోయాం. రూమంతా గందరగోళంగా వుండి వుంటుంది. వెరీసారీ అండీ” అంది సిగ్గుపడుతూ సత్యమూర్తి భార్య.

వనజకు మతిపోతోంది వారి మాటలు వింటుంటే.

ఇంతవరకు తను ఊహించిందేమిటి?ఇప్పుడు జరుగుతున్నదేమిటి? భర్తను ఎంతలా అపార్థం చేసుకుంది.

వెళ్ళొస్తామని చెప్పి వాళ్ళిద్దరూ చేతులు జోడించి వనజ దగ్గర శలవు తీసుకుని వెళ్ళిపోయారు. ఇంక నిలబడలేక సోఫాలో కూలబడి మోకాళ్ళలో తలపెట్టుకుని,వెక్కివెక్కి ఏడ్చింది వనజ.

భర్త విషయంలో ఎంత దారుణంగా ఆలోచించింది తను. కనీసం భర్త వచ్చేంత వరకు ఎదరుచూసి విషయం తెలుసుకోకుండా ఏవేవో ఊహించేసుకుని అతన్ని అనుమానించింది. ఇప్పుడు నిజంగా భర్తకు ముఖం చూపలేక చచ్చిపోవాలనిపిస్తోంది. భర్తమీద తనకెంతో నమ్మకం వుందనుకుంది. కానీ తనసంత గాఢంగా ప్రేమించిన వ్యక్తిని ఎంతలా అపార్థం చేసుకుంది.

ఛీ! ఛీ! తనమీద తనకే అసహ్యం వేస్తుంది. భర్త వచ్చిన వెంటనే క్షమాపణ కోరుకోవాలి. ఆయన తప్పకుండా క్షమిస్తారు.

వనజకిప్పుడు మనస్సంతా దూదిపింజలా అయిపోయింది. భర్తవచ్చే

సమయమయ్యింది. ఆయనొచ్చేసరికి ఈ అవతారంతో వుండాలంటే సిగ్గనిపించింది. వెంటనే అక్కడ నుంచి లేచి బెడ్‌రూమ్‌లో కెళ్ళి బెడ్‌మీద నుంచి దుప్పటి తీసేసి రూమంతా శుభ్రం చేసింది. బెడ్ మీద తెల్లదుప్పటి పరచింది. వీధిలోకి పూలమ్మే వాడొస్తే నాలుగు మూరల సన్నజాజుల దండ, నాలుగు గిద్దల విడిమల్లెపూలు కొంది. మల్లెపూలను బెడ్‌మీద చల్లింది. టీ పెట్టి ఫ్లాస్క్ లో పోసింది. ఇంటిదగ్గర నుంచి తెచ్చిన స్వీటు, హాటు ప్లేట్లలో సర్ది బెడ్‌రూమ్‌లో పెట్టింది. అభ్యంగన స్నానం చేసి తెల్లచీర కట్టుకుంది. తల్లో సన్నజాజుల్ని తురుముకుంది. అందంగా అలంకరించుకుని భర్తకోసం ఎదురు చూస్తూంది వనజ. మరో పావుగంటకు శంకరం వచ్చిన స్కూటర్ శబ్ధం వినిపించింది.

అలసిన ముఖంతో గుమ్మం దగ్గర నిలబడ్డ శంకరాన్ని చూసి దుఃఖం వచ్చేసింది వనజకు. పరుగున వెళ్ళి అతని గుండెలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. కంగారు పడ్డాడు శంకరం.

“ఏమిట్రా వనజా? ఎందుకు ఏడుస్తున్నావు? నువ్వు ఉదయం వస్తే నేను ఇప్పుడు వచ్చాననా. తొందరగా రావాలనుకున్నా వీలుకాలేదు. ఈరోజుతో ఇన్ స్పెక్షను అయిపోయింది. రేపు శలవు పెట్టేశాను. ఇక రోజంతా నీతోనే వుంటాను. సరేనా? అన్నాడు శంకరం అనునయంగా. భర్తను వదలకుండా అలాగే కరుచుకుపోయింది. మంచుకరిగినట్టు వనజ కళ్ళలో నుంచి నీళ్ళు అతని గుండెల్ని తడుపుతున్నాయి.

“ఏమిట్రా పిచ్చీ! సారీ చెప్పానుగా.ఇంకెప్పుడూ నిన్ను విడిచి అన్ని రోజులు వుండను. నువ్వులేక నేను పిచ్చి వాణ్ణయిపోయాను తెలుసా?” భర్త అలా అంటుంటే పశ్చాత్తాపంతో దహించుకుపోయింది వనజ.

నన్ను క్షమించండి. మీ గురించి ఎంత చెడుగా ఆలోచించానో తలుచుకుంటుంటే నామీద నాకే అసహ్యం వేస్తుంది. నన్ను తిట్టండి....కొట్టండి అని పైకి అనాలనుకుంది. కానీ శంకరం వనజనేమీ మాట్లాడనీయకుండా బెడ్ రూమ్ లోకి నడిపించుకుపోయాడు.

**(మయూరి వీక్లీలో ప్రచురితం)**

* * *

# వ్యథాభరితం

"**అ**భినందనలు రాజారావు గారు. అక్కయ్యగారు మీక్కూడా" అన్నారు నాగభూషణంగారు. "సంతోషం నాగభూషణంగారు. దీనిక్కూడా అభినందనలు చెప్పాలా" అన్నారు రాజారావుగారు నవ్వుతూ.

"భలేవారే! ఇంత మంచి వార్త విన్న తర్వాత అభినందించకుండా ఎలావుంటాన్సార్. మాలో ఎవరికీ కలగని అదృష్టం మీక్కలిగింది మరి."

"నిజంగా అదృష్టవమేనంటారా" అన్నారు అన్నపూర్ణమ్మగారు.

"కాకపోతే ఏమిటండి. మీ అబ్బాయి, కోడలు మీతో కలిసివుండటానికి ఇక్కడికొస్తున్నారంటే అది మామూలు విషయంకాదు కదండి".

ఆ మాటలు విన్న వెంటనే ఆవిడకళ్ళలో నీళ్ళు తిరిగాయి. అవి ఆనంద భాష్పాలో లేక బాధతోవచ్చిన కన్నీళ్ళో ఆవిడకే తెలియదు.

రాజారావు గారికి ఎనభై అయిదేళ్ళు ఉంటాయి. అన్నపూర్ణమ్మ గారికి ఎనభై ఏళ్ళు ఉంటాయి. బంగారురంగు ఛాయ, నెరిసిన జుట్టు ఇద్దర్నీ చూస్తుంటే ఎవరికైనా పూజ్యభావం కలుగుతుంది. సుమారు పదిహేనేళ్ళ నుంచీ భార్యా, భర్తలిద్దరూ అక్కడే వుంటున్నారు. వారుండే పక్కగదిలోనే నాగభూషణంగారు అంటున్నారు. ఆయనకూ డెబ్భైఏళ్ళు పైనే వుంటాయి. ఆయనా అక్కడ పదేళ్ళ నుంచీ వుంటున్నారు. పదేళ్ళ క్రితమే భార్య పోవడంతో అప్పట్నించీ అక్కడే వుంటున్నారు. పక్కపక్కనే వుండటంతో వారి మధ్య బాగా స్నేహం కుదిరింది. దాంతో ఆయనకు వంటరితనమంతగా బాధ కలిగించడంలేదు.

ఆ ముగ్గురూ వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. "మీరెన్నయినా చెప్పండి రాజారావుగారూ నాతోపోలిస్తే మీరిద్దరూ చాలా అదృష్టవంతులు. ఉదాహరణకు నన్నే తీసుకోండి. ఉండటానికి నాకిద్దరు పిల్లలున్నారు కానీ వాళ్ళిప్పుడు నా దగ్గరలేరు. ఎప్పుడూ ఉండరు కూడా. ఎందుకంటే వాళ్ళని ఎప్పుడుబడితే అప్పుడుచూడటం కుదరదు. దూరదేశాలకు పంపేసాను. మా భార్యాభర్తల స్వార్ధం వాళ్ళని మాకు

దూరంచేసింది. పేదరికంలో పుట్టిపెరిగిన మేము  డబ్బు సంపాదనే ధ్యేయంగా పెట్టుకుని పిల్లల్ని బాగా చదివించి ప్రయోజకుల్నిచేసాము. వాళ్ళిద్దరూ మాదగ్గరేవుండి ఉద్యోగాలు చేసుకుంటామన్నా మేం వినలేదు. వాళ్ళకిష్టం లేకపోయినా ఒకణ్ణి అమెరికా, రెండో వాణ్ణి  లండన్ పంపేసాను. కొడుకులిద్దరూ మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. కోడళ్ళిద్దరూ కూడా ఉద్యోగస్తులే. మేమేం ఆశించివాళ్ళని పెంచామో వాళ్ళుదాన్ని సఫలంచేసారు. వాళ్ళు సంపాదించి మాకు పంపడంతో మేమిక్కడ పొలాలు,ఇళ్ళస్థలాలు, అపార్ట్ మెంట్ల రూపంలో ఆస్తులు కూడబెట్టడంతో మేం కోటీశ్వరుల జాబితాలో చేరిపోయాం. కానీ తర్వాత తెలిసింది ఏం కోల్పోయామో.”

“ఇందులో క్రొత్త విషయావేముంది నాగభూషణంగారూ చాలామంది తల్లిదండ్రుల్లాగే మీరూ ఆలోచించారు అంతేకదా” అన్నారు అన్నపూర్ణమ్మగారు.

“చూడండమ్మా నిజమే చాలామందిలా నేను ఆలోచించాను కానీ అలా చెయ్యడం వల్ల బి ఏం కోల్పోయానో వృద్ధాప్యంలో గానీ తెలియలేదు. రక్తం పంచుకుని పుట్టిన పిల్లలు దూరంగా ఉంటే ఎంత వేదనను అనుభవించవలసి వస్తుందో మీకు తెలియనిది కాదమ్మా. నేనెంతో దురదృష్టవంతుణ్ణి నాభార్య కూడా లేకపోవడంతో నేను పడుతున్న బాధ వర్ణనాతీతం.”

అప్పుడు రాజారావుగారన్నారు, “అందుకే వృద్ధాప్యంలో  స్నేహ సంబంధాలు పెంచుకోవాలంటారు  నాగభూషణంగారూ. స్నేహబంధాలు ఏ వయసులోనైనా అవసరమే. మనసులోని బాధల్ని పంచుకోవడానికి స్నేహితులకు మించిన వారు లేరు. ఏ కుటుంబంలో చూసినా భార్యాభర్తలిద్దరే కదా మిగిలేది. అటువంటప్పుడు మన స్నేహితులే మనకి రక్తసంబంధీకుల కంటే ఎక్కువవుతారు.”

“మీలాంటి వారు స్నేహితులుగా వుండడంవల్ల ఈమాత్రం సంతోషంగానైనా వుండగలుగుతున్నాను కదండి.”

“అందరి పరిస్థితి అలాగే వుంది లెండి. అయితే ఒక్క విషయానికి మాత్రం మెచ్చుకోవాలి. ఇక్కడ మన వాళ్ళంతా ఎంతో స్నేహభావంతో వుండి ఎటువంటి కల్మషాలు లేకుండా వుంటున్నారు కాబట్టి పిల్లలు దూరమైనా,  ఆబాధ కొంతలో కొంత తగ్గుతోంది.” అన్నారు రాజారావుగారు.

“ఇంక మీకు అటువంటి బాధలేమీ వుండవు సార్. ఎందుకంటే మీ అబ్బాయి,

కోడలు వచ్చి మీతోనే వుండబోతున్నారు కదా. ఎప్పుడొస్తున్నారు సార్ వాళ్ళు." చిన్నగా నవ్వి అన్నారు రాజారావుగారు.

"చూడండి నాగభూషణంగారూ ఒక విషయం చెబుతాను, అది విన్న తర్వాత మీకు ఆశ్చర్యం కలగొచ్చు. అదేమిటంటే మావాడు ఇంతకాలం దూరంగా వున్నాడనే బాధలేదు. వాడువస్తున్నాడనే సంతోషంలేదు. ఈశేష జీవితాన్నిలాగే ఇక్కడే గడిపేస్తాం."

నిజంగా ఆశ్చర్యపోయారు నాగభూషణంగారు.

"అదేంటి సార్ అలా అంటారు. మీరు చెబుతుంది వింటుంటే చాలా వింతగావుంది."

"అవును భూషణంగారూ అలానే వుంటుంది. కాని అదినిజం. మీ అబ్బాయిలు మీ దగ్గరే వుంటామంటే మీరు వాళ్ళని దూరంగా పంపేసారు. కాని దాని భిన్నంగా జరిగింది మా విషయంలో. మాకొక్కడే కొడుకు ఎంతో గారాబంగా పెంచాం. మరొకరికి జన్మనిస్తే వీణ్ణి సక్రమంగా తీర్చిదిద్దలేమని ఒక్కడికే పరిమితిచేసాం. అనుకున్నట్టుగానే వాడికి మంచి చదువులు చెప్పించాం. నేను చేసింది రెవిన్యూ డిపార్ట్‌మెంటులో చిన్న ఉద్యోగమైనా మా అవసరాలన్నింటికీ స్వస్తి చెప్పి వాడి అవసరాలన్నీ తీర్చాం. మేం కోరుకున్నట్లే వాడు ఉన్నత స్థితికి చేరుకున్నాడు. ఖర్గపూర్ ఐ.ఐ.టి లో గోల్డ్ మెడల్ సంపాదించాడు. మేం చాలా సంతోషించాం, మాజీవితాలు ఒడ్డున పడ్డాయని భావించాం. వాడి పట్ల మేం ప్రేమను పెంచుకున్నాం. వాడూ మా పట్ల అలా వుంటాడనుకున్నాం కానీ వాడు డబ్బు పట్ల వ్యామోహాన్ని పెంచుకున్నాడు. అందు కోసం వాడు మా ప్రమేయంలేకుండా ప్రయత్నాలు మొదలు పెట్టాడు. అమెరికాలో మంచి అవకాశమొచ్చింది. అంతే ఎగిరిపోయాడు. ఓ ధనవంతుల అమ్మాయిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. అక్కడ కోట్లు సంపాదించాడు. ఇక్కడ వాళ్ళ మామగారిద్వారా ఆస్తులు సమకూర్చుకున్నారు. ఈ విషయాలేవి మాకు చెప్పడంగానీ, మా అభిప్రాయాలు తెలుసుకోవడంగాని చేయలేదు.

ప్రతీ సంవత్సరం ఇండియా రావడం, వుండే పదిహేను రోజుల్లోను ఒకటిరెండు రోజులు మా ఇంట్లో వుండి మిగిలిన రోజులు అత్తారింట్లోను వుండేవాడు. అయినా మేం బాధపడలేదు. ఎక్కడున్నా వాడు సంతోషంగా వుంటున్నాడు అంతే చాలనుకున్నాం. మేము వాడితో కలిని వుందామనుకున్నాం గాని వాడి మీద ఆధారపడి బతకాలనుకోలేదు. ఎందుకంటే నేను రిటైరయ్యేనాటికి తాసిల్దారునయ్యాను. మేమిద్దరం

బతకడానికి కావలసిన పెన్షన్ని మాకు గవర్నమెంటిస్తుంది. కాబట్టి వాడు మమ్మల్ని పోషించాల్సిన అవసరంలేదు. కానీ వృద్ధాప్యంలో తల్లిదండ్రులు తమ పిల్లలు తమ దగ్గరే వుండాలనీ వారి శేష జీవితం వాళ్ళ సమక్షంలోనే ముగిసిపోవాలని కోరుకుంటారు. కానీ అలాంటి అదృష్టం మాకు లేదు.

మావాడు ముప్పయ్యేళ్ళు అమెరికాలో వుండి బాగా సంపాదించాడు. వాడక్కడుండగానే కొడుకు పుట్టాడు. వాడికీ ఒక్కడే కొడుకు. మా మనవణ్ణి మొత్తం మీదా నాలుగైదు సార్లు చూసుంటామంతే. వాడిక్కూడా అమెరికాలోనే పెళ్ళిచేసారు. ఎందుకొచ్చేసారోగానీ అంతా ఇండియావచ్చేసారు. అయినా వాడిలో ఏం మార్పు లేదు. మాతో మునపటిలాగే వుండేవాడు. మేం వాడిమీద ఎటువంటి ఆశలు పెట్టుకోలేదు. వాడెందుకలా తయారయ్యాడని కూడా మేం తర్కించుకోలేదు. వాడలా అవ్వడానికి గల కారణాలు మాకోడలని కాని, వాడి అత్తామామలని కానీ మేం అనుకోలేదు. ఎందుకంటే మన బంగారం మంచిదయితే అన్నసామెత ఉంది కదా.

రిటైరయ్యాక పది సంవత్సరాలపాటు ఇంట్లో బాగానే వున్నామిద్దరం. కానీ అలా ఎంతకాలం వుండగలం చెప్పండి. ఇద్దరికీ మరీ ఒంటరితనమనిపించేది. అందుకే వుండే ఇంటిని అమ్మేసాం. వచ్చిన డబ్బుని బ్యాంకులో వేసాం. నాకొచ్చే పెన్షన్ ఇద్దరికీ సరిపోతుంది. ఈ ఆశ్రమ నిర్వాహకులని కలిసి పెన్షన్ మొత్తాన్ని నెలనెలా ఆశ్రమాని కిచ్చేస్తామని, అనారోగ్య సమస్యలొచ్చినప్పుడు బ్యాంకులో డిపాజిట్ డబ్బులు వాడుకోవచ్చని చెప్పడంతో, వారు అంగీకరించి ఇక్కడ మేమిద్దరం కలిసి వుండటానికి అన్ని వసతులు ఉన్న ఈ రూము ఏర్పాటుచేసారు. ఆ తర్వాత మీకు తెలిసిందే ఇలా కాలక్షేపమవుతుంది. అంతా మనలాంటి వాళ్ళే కాబట్టి అంతా కలిసి కష్టసుఖాలు చెప్పుకుంటూ హాయిగా బతుకుతున్నాం. ఎటువంటి ఆరోగ్యసమస్యలు లేకుండా వుంటున్నాం" అంటూ ముగించారు రాజారావుగారు.

"మరి అబ్బాయి, కోడలు ఎందుకొస్తున్నారు సార్. ఇక్కడ వుండే అవసరం వాళ్ళకెందుకొచ్చిందంటారు."

"చరిత్ర పునరావృతమవ్వడమంటే ఇదే నాగభూషణంగారు. మీలాంటి శ్రేయోభిలాషుల ద్వారా మాకు తెలిసిందేమంటే మావాడక్కడ సంపాదించిందంతా ఇక్కడ బిజినెస్‌లో పెట్టాడని, నెమ్మది నెమ్మదిగా వయసు సాకు చూపి, మా మనవడు బిజినెస్ అలాగే ఇతర ఆస్తుల్ని తన ఆధీనంలోకి తీసుకుని, మావాణ్ణి దూరంగా

పెట్టాడని తెలిసింది. మా మనవడి భార్యకు, మాకోడలికి అసలు పడటం లేదట. రోజూ ఇంట్లో గొడవలట. మావాడు కూడా వాడి కొడుకుతో గొడవపడుతున్నాడట. దాంతో మా మనవడికి కోపం వచ్చి వీళ్ళని ఈ ఆ(శమానికి వంపేస్తున్నాడట. అందుకని వాళ్ళిక్కడకు వస్తున్నారు గానీ మాతో కలిసి వుండటానికి కాదు. తెల్సిందా నాగభూషణం గారూ" చెప్పారు రాజారావుగారు.

అన్నపూర్ణమ్మగారు పవిటతో కళ్ళు తుడుచుకుంటున్నారు.

" అంటే మీఅబ్బాయి,కోడలు మీకేం శిక్షవేసారో అలాంటి శిక్షే వాళ్ళ తల్లిదండ్రులకు మీ మనవడు, అతని భార్య వేశారన్నమాట. ఇలాంటి విచిత్రం ఎక్కడా జరగదుసార్. మీకొడుకు, కోడలికి దూరమై మీరెంత వ్యధననుభవించారో అలాంటి వ్యధే మీకొడుకు కోడలు అనుభవిస్తారన్నమాట."

"ఇది శిక్ష అని అనుకోలేం నాగభూషణంగారూ. ఇప్పుడు మానవజీవితంలో ఇవి సాధారణ విషయాలే, ఎందుకంటే సమాజమంతా మారిపోయింది. బంధుత్వాలు, ప్రేమాభిమానాలు లేవు. అంతా కమ్మర్షియలైజ్ అయిపోయింది. అంతా దానికలవాటు పడవలసిందే. అందుకే మేం ముందుగానే ఆలోచించి ఇక్కడ చేరిపోయాం. మేమిప్పుడిక్కడ ఆనందంగానే వున్నాం మరి."

"నిజమేనండి మీరు చెప్పింది, కానీ తండ్రీ కొడుకు ఒకే ఆశ్రమంలో వుండటమనేది ఎక్కడా జరిగుండదు రాజారావుగారు, మీ విషయంలోనే జరుగుతుంది."

"అంతా ఖర్మ ఫలమండి" అన్నాడు రాజారావుగారు.

అంతలో గంటమోగింది.

"పదండి రాజారావుగారు భోజనాలకు వేళయింది గంటకొట్టారుగా" అంటూ లేచారు నాగభూషణంగారు. అంతాకలిసి భోజనశాలకు బయలుదేరారు.

– – –

ఊరికి దూరంగా ప్రశాంతమైన వాతావరణంలో వుంది ఆ ఆశ్రమం. విశాలమైన ప్రదేశం చుట్టూ పంట పొలాలు, వివిధ ఫలవృక్షాలకు సంబంధించిన తోటలతో ఎంతో సుందరంగా వుందా ప్రదేశమంతా. ఆ ఆశ్రమంలో సుమారు ఏభైమందికి పైనే వృద్ధులున్నారు. అంతా నెలకింత అని కట్టి వుండేవారే. కొంతమందికి తమ పిల్లలు కడితే, ఇంకొంతమంది తమ పెన్షన్ల నుంచో లేదా తమ ఆస్తుల మీద వచ్చే

ఆదాయాలను కట్టో వుంటున్నారు. అంతా కన్న పిల్లల నిరాదరణకు లోనై వృద్ధాప్యంలో తోడు లేకుండా వుంటున్నారక్కడ. ఉదయం పదిగంటల సమయంలో ఓ పెద్దకారొచ్చి ఆ ఆశ్రమం ముందాగింది. అందులోనుంచి సుమారు అరవై సంవత్సరాల వయసుండే ఆడ, మగా, ముప్పయ్యేళ్ళ వయస్సుండే మరో జంటా దిగారు. డిక్కీలోనుంచి సూట్ కేసుల్ని అక్కడున్న సహాయకులు తీసుకున్నారు. అంతా కలిసి రాజారావుగారు, అన్నపూర్ణమ్మగారుంటున్న గది దగ్గరకొచ్చారు. లోపలరాజారావుగారు,అన్నపూర్ణమ్మగారు కుర్చీల్లో కూర్చుని చదువుకుంటున్నారు. రాజారావుగారు పేపరు చూస్తుంటే, అన్నపూర్ణమ్మగారు భగవద్గీత చదువుతున్నారు. గుమ్మందగ్గర అలికిడైతే తలెత్తి చూసారిద్దరూ. ఎదురుగా కొడుకు భార్గవ్, కోడలు రాధిక, మనవడు రాకేష్ వాడి భార్య స్వప్న. ఇద్దరూ ఒకరిముఖాలొకరు చూసుకున్నారు. వారి ముఖాల్లో ఎటువంటి భావం లేదు. భార్గవ్, రాధిక వచ్చి వారివురి కాళ్ళమీద పడి భోరుమని విలపిస్తున్నారు.

"ఎందుకలా ఏడుస్తారు మేమింకా బతికే వున్నాం కదా" అన్నారు రాజారావుగారు కొంచెం కటువుగా.

"మీరలా అనకండి నాన్నగారు....మిమ్మల్నెంత బాధ పెట్టామో ఇప్పటికిగాని తెలియలేదు. మీరెంత కష్టపడి నన్ను ఉన్నతుణ్ణి చేసారో కళ్ళు పొరలు కమ్మి గుర్తించలేకపోయాను. రెక్కలొచ్చిన పక్షిలా ఎగిరిపోయాను. కానీ ఇప్పుడు నాకు తెలుస్తుంది ఎంత తప్పుచేసానో. చేసిన తప్పుని సరిదిద్దుకోలేని పరిస్థితిలో వున్నాను" భార్గవ్ అన్నాడు ఏడుస్తూ.

అప్పుడు అన్నపూర్ణమ్మగారు అందుకున్నారు "అయిపోయిన పెళ్ళికి బాజాలెందుకురా. నువ్వెన్ని చెప్పినా ఎవరుమాత్రం చేసేదేముంది ఇంకూరుకో."

"అత్తయ్యగారు..... తప్పు ఆయనరొక్కరిదేకాదండి నా పాత్ర కూడాఎక్కువే వుంది. మా అమ్మ, నాన్నా చెప్పిన మాటల్ని గుడ్డిగా నమ్మి ఆ పాపంలో పాలుపంచుకున్నాను ఇప్పుడైనా మమ్మల్ని క్షమించండి. మమ్మల్ని మీతో పాటు ఈ శేష జీవితం గడిపి మీకు సేవ చేసుకునే భాగ్యాన్ని కల్పించండి" అంది రాధిక, కళ్ళు తుడుచుకుంటూ.

"చూడమ్మా! ఇక్కడ మేం హాయిగావున్నాం. మాకు మీరేమీ సేవచేయక్కర్లేదు. మీ సంగతి మీరు చూసుకోండి"అన్నారావిడ నిష్టూరంగా.

ఆవిడ మాటల్లో ఎంతో వేదన వుంది. "చూడు భార్గవా! మీ అమ్మ చెప్పినట్లు

మేమిక్కడ చాలా హాయిగావున్నాం. ఒక రకంగా చెప్పాలంటే మేం గతమంతా మరిచిపోయాం. మళ్ళీ మీరిప్పుడొచ్చి మానిన గాయాన్ని రేపకండి. మీరిక్కడ మాతో వుండేటట్లయితే రోజూ మిమ్మల్ని చూస్తూ మనశ్శాంతిగా వుండలేం. అలాగే మీరు మమ్మల్నిచూస్తుంటే మీరుచేసిన తప్పు రోజూగుర్తుకొచ్చి, మీరు ప్రశాంతంగా వుండలేరు. అందుచేతనేనొకటిచెప్పదలుచుకున్నాను'' అంటూ ఆగారు. నిశ్శబ్దంగా వుంది వాతావరణం. గుమ్మం దగ్గర నిలబడివున్న రాకేష్ దంపతులు జరుగుతున్న దాన్ని చూస్తున్నారు.

"బాబూ రాకేష్... ఈ విషయం నీకే చెప్పాలనుకుంటున్నాను. నువ్వు మీ అమ్మ, నాన్నల్ని వృద్ధాశ్రమంలో వుంచడం అనేది మనింటి వారసత్వంలావుంది. అయితే వాళ్ళని ఇక్కడుంచొద్దు. ఇంకో ఆశ్రమంలో చేర్పించు. ఇక్కడ మీ అమ్మా, నాన్నా వుండి మాకుచేసేదేమీలేదు. ఎందుకంటే ఈ ఆశ్రమనిర్వాహకులు దైవ దూతల్లా మమ్మల్ని చూసుకుంటున్నారు. చక్కటి వసతిని కల్పించడమే కాకుండా ఆరోగ్యకరమైన ఆహారం, ప్రతీవారం డాక్టర్లతో చెకప్లు చేయించి ఎంతో ఆదరణతో చూస్తున్నారు. అందుచేత వీళ్ళని వేరో చోటుకి తీసుకెళ్ళిపో." ఆయనలా అనేసరికి భార్గవ్ దంపతుల బాధ వర్ణనాతీతం. తల్లిదండ్రులు తమ ప్రవర్తన పట్ల ఎంత వ్యధ చెందారో అర్థమవుతుంది.

"చూడండి తాతగారూ! మీరెవరూ వుహించని విషయాన్ని చెపుతున్నాను. నిజానికి నా తల్లిదండ్రులకు ఇక్కడుంచడానికి తీసుకురాలేదు. వాళ్ళు మీపట్ల ఎంత ఘోరాతిఘోరమైన తప్పిదం చేసి మీకెంత మానసిక వ్యధను కల్గించారో చూస్తారని తీసుకొచ్చాను. నాకు గానీ, నాభార్యకు గానీ అలాంటి ఆలోచన అసలే లేదు. మా అమ్మానాన్నలకు ఇటువంటి పరిస్థితి కావాలనే కల్పించాం. అందుకే వాళ్ళతో గొడవలు పెట్టుకున్నట్లు నటించి వాళ్ళిక్కడకు వచ్చేలా చేసాం. అంతే తప్ప మా అమ్మానాన్నలు చేసిన తప్పును మేం చేయాలనుకోవడంలేదు. వాళ్ళని ఏ ఆశ్రమానికి తీసుకెళ్ళాలను కోవడం లేదు. వాళ్ళని మన ఇంటికే తీసుకెళతాను. రేపట్నించీ ఆయన పూర్వంలాగే బిజినెస్ వ్యవహారాలు చూసుకుంటారు. నేనాయనకు సహాయకుడిగానే వుంటాను. కానీ తాతయ్యా ఇంకో విషయంచెప్పబోతున్నాను, మా అమ్మానాన్నల్నే కాదు-మిమ్మల్నీ, నాన్నమ్మను కూడా మాతో తీసుకెళతాము. ఇంత కాలం మీరిక్కడవున్నారు. ఇంక మీ శేషజీవితాన్ని మాతో సంతోషంగా గడపండి. నామాట కాదనొద్దు" చెప్పాడు రాకేష్

చిన్నగా మందహాసం చేసారురాజారావుగారు.

"చూడు రాకేష్! నువ్వు నీ తల్లిదండ్రుల విషయంలో తీసుకున్న నిర్ణయాన్నినేను హర్షిస్తున్నాను. వాళ్ళని జాగ్రత్తగాచూసుకో.వాళ్ళు ప్రశాంతంగా జీవించే అవకాశం కల్పించు.ఇంక మా విషయమంటావా. మేం మీతో రాలేం. అలాగే మీతో కలిసి కూడా వుండలేం ఎందుకంటే మీతో వుంటే మీ నలుగురితోనే వుండాలి, కానీ ఇక్కడ మేం ఏభై మంది వున్నాం. ఒకే కుటుంబంలా ఎంతో ఆత్మీయంగా, అనుబంధాలతో వుంటున్నాం. అక్కడ కొస్తే ఈ ఆనందం పోతుంది. దయచేసి మమ్మల్ని బలవంత పెట్టకండి.

చివరగా చిన్నమాట భార్గవ్. ఇక్కడున్నవాళ్ళంతా వృద్ధులే. ప్రతీ సంవత్సరం నలుగురైదుగురు చనిపోతుంటారు. కొంతమందికి వాళ్ళ పిల్లలే దహన సంస్కారం చేస్తారు. మరికొంతమందికి ఆ అదృష్టం కూడావుండదు.ఆశ్రమనిర్వాహకులే చేస్తారు. అయితే అనాధ సంస్కారంలా జరగదు. కుటుంబ సభ్యుల్లా మేం దగ్గరుండి జరిపిస్తాం. ఇంక మా విషయమంటవా, అది మీచేతుల్లో వుంటుంది. అంతా మీ ఇష్టం.ఇంత కన్నా నేను చెప్పేదేంలేదు. ఇంక మీరెళ్ళొచ్చు" అంటూ ఆయన అన్నపూర్ణమ్మ గారి వంక చూసారు.

'మీ నిర్ణయం సరైనదే' అన్నట్లు ఆవిడ నవ్వుతూ ఆయన వంక చూసారు.

**(మక్కెన రామసుబ్బయ్య స్మారక మరియు విశాలాక్షి సాహితీ మాసపత్రిక నిర్వహించిన కథల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన కథ)**

* * *

# పసిపిల్ల

**ఆ** అమ్మాయితో పాటు చాలామంది అమ్మాయిలున్నారు గాని ఎందుకో ఆ అమ్మాయయితేనే బాగుంటుందనిపించింది. ఆ అమ్మాయి అంత అందంగా లేకపోయినా కళ వున్న ముఖంతో వుంది. అక్కడక్కడ చిరిగిన బట్టలు. లంగా, ఓణీ వేసుకుంది. తను కాస్త పెద్ద వయసున్న దానిలా కన్పించడానికి ప్రయత్నిస్తుంది. ఓణీని అప్పుడప్పుడు సర్దుకుంటుంది. ఆ అమ్మాయికి పదిహేను సంవత్సరాల వయసుంటుంది.

దగ్గరకు రమ్మని పిలిచాను. నా దగ్గరగా వచ్చి నిలబడింది. మిగతావాళ్ళంతా నిరసనగా నా వంక చూసారు. వాళ్ళని చూస్తే చాలా జాలేసింది. భారతదేశంలోని పేదరికమంతా వాళ్ళ దగ్గరే వుంది. నేను పిలిచిన వెంటనే ఆ అమ్మాయి ముఖంలో నవ్వు కన్పించింది. ఆశగా నా వంక చూసింది.

"నాతో వస్తావా" అనడిగాను. తలూపింది.

"అయితే స్కూటరెక్కు" అన్నాను. ఆమె స్కూటరెక్కే లోపల ఒకతను నా దగ్గరకొచ్చి నిలబడ్డాడు. ప్రశ్నార్థకంగా అతని వంక చూసాను.

"ఓ పదిరూపాయలిచ్చి పంపండి"అందా అమ్మాయి. పది రూపాయలతనికిచ్చి స్కూటర్ స్టార్ట్ చేశాను.

"పది రూపాయలెందుకు ఇప్పించావు"అనడిగాను.

"అదంతే, నేను ఎవరితో ఎక్కడికెళ్ళినా పదిరూపాయలివ్వాల్సిందే"అంది.

"బ్రోకరా"అన్నాను నవ్వుతూ.

ఆ అమ్మాయేం మాట్లాడలేదు. స్కూటర్ నెమ్మదిగా పోతోంది.

"టిఫిన్ చేశావా"అనడిగాను. లేదంది. అప్పుడే తొమ్మిది కావొస్తుందేమో ఎండ వేడినందుకుంటోంది. నేను కూడా టిఫిన్ చెయ్యకపోవడంతో దారిలో కనబడిన హోటలు దగ్గర స్కూటరాపాను. ఇద్దరం లోపలికెళ్ళి కూర్చున్నాం. బేరర్ వస్తే టిఫిన్ ఆర్డర్ చేశాను.

"నీ పేరేమిటి" అడిగాను.

"సావిత్రి" చెప్పింది.

“మీ  అమ్మేం చేస్తుంది. ఇదే పనా”

“చచ్చిపోయింది” అంది కొంచెం బాధగా.

ఎందుకడిగానా అన్పించింది.

“మీ నాన్నేం చేస్తుంటాడు”

“ఇప్పుడేగా మీరు పది రూపాయలిచ్చారు. దానితో తాగేసి పడుకుంటాడు”

ఆ అమ్మాయి అలా చెపుతుంటే బాధేసింది.

“ఎంత వరకు చదువుకున్నావేంటి?”

“ఎనిమిది చదివి మానేశాను. అప్పుడే మా అమ్మ చచ్చిపోయింది. కుటుంబ భారం నా మీద పడటంతో మానక తప్పలేదు. ఈ పాటికి పదిలోకి వచ్చుండేదాన్ని” అంది బాధగా.

అంతలో టిఫిన్ ప్లేట్లు వచ్చాయి. ఎంతో ఆకలి మీదున్నట్లు గబగబా తినేసింది.

“రాత్రి అన్నం తినలేదు. బాగా ఆకలేసింది” అంది చెయ్యి. కడుక్కుంటూ. నేనేం మాట్లాడలేదు.

బిల్లు పేచేసి బయట కొచ్చి స్కూటర్ స్టార్ట్ చేసాను.

ఎక్కబోతూ అడిగింది “ఇప్పుడెక్కడికి పోవాలి” అని.

“మా ఇంటికి” చెప్పాను.

“ఇంట్లోనా” అంది.

“ఏం బయటకు కూడా వెళుతుంటావా” నవ్వుతూ అడిగాను.

“నన్నెక్కడికి తీసుకెళితే అక్కడికి పోవడమే” అంది తనూ నవ్వుతూ.

స్కూటరు నెమ్మదిగా పోతోంది.

“ఎన్నాళ్ళనుంచి చేస్తున్నావీ పని” అడిగాను.

“స్కూలు మానేసిన దగ్గర్నుంచీ”

“నీ చేత యిలా చేయిస్తున్నాడంటే మీ నాన్న మనిషి కాడు” అన్నాను.

“ఏం చేస్తాం మా ఖర్మ” నిర్లిప్తంగా అంది.

స్కూటరు మా ఇంటి ముందాగింది.

ఇంటి తాళం తీస్తున్నప్పుడు చుట్టుపక్కల వాళ్ళు నా వంక, ఆ అమ్మాయి వంక చిత్రంగా చూసారు.

"మీరొక్కరే వుంటున్నారా" అనడిగింది లోపలికొస్తూ.

"ప్రస్తుతం ఒక్కడినే వున్నాను. పదిహేను రోజులనుంచీ మా ఆవిడ ఇంట్లో లేదు"అన్నాను సావిత్రి వంక చూస్తూ.

"అందుకే ఇల్లిలా వుంది" అంది నవ్వుతూ.

నిజమే ఇల్లంతా చాలా చిందర వందరగా వుంది.

"మా ఆవిడ తమ్ముడి పెళ్ళికని వారం రోజులు ముందే పుట్టింటికెళ్ళింది. పెళ్ళయి వారమయినా ఇంకా రాలేదు. శలవు లేకపోవడంతో నేను పెళ్ళిరోజుకెళ్ళి మర్నాడే వచ్చేశాను. వచ్చే ముందు నాకు సాధ్యంకాని పనిచెప్పి అది చేస్తేనే వస్తానని మెలిక పెట్టింది.

ఏదైనా చెయ్యొచ్చేమోగాని శ్రీమతి కోర్కె తీర్చడం చాలా కష్టం. ఏం చెయ్యాలో తోచలేదు. పదిహేను రోజులుగా శ్రీమతి లేని లోటు అంతా ఇంతా కాదు. అన్ని విధాలుగాను యిబ్బందిగా వుంది. నా యిబ్బంది గురించి ఆఫీసులో నా కొలీగ్‌కి చెపితే అతనిచ్చిన సలహా 'ఫలానా చోటికెళితే నీ పని అవుతుందని', దాంతో అక్కడికొచ్చి నిన్ను తీసుకొచ్చాను.

"మీ ఆవిడగారు ఊరెళ్ళారా" అనడిగింది సావిత్రి.

"అవును" అన్నాను.

"ఎప్పుడొస్తారు"

"నిన్నీరోజు ఇక్కడికి తీసుకొచ్చానని తెలిస్తే వెంటనే పరుగెత్తు కొస్తుంది" అన్నాను నవ్వుతూ.

"మీకు పిల్లలా" అడిగింది మళ్ళీ.

"ఒకమ్మాయి"

"చదువుకుంటోందా" అంది. 'చదువు' అనే మాట అంటున్నప్పుడు సావిత్రి మాటల్లో ఏదో వేదన.

"ఇంటరు చదువుతోంది. ఇప్పుడు హాస్టల్లో వుంది".

సావిత్రి ముఖంలో ఏవో నీలి నీడలు.

"నీకు చదువంటే ఇష్టమా" అనడిగాను.

"చాలా ఇష్టం. నాకు చదువుకోవాలని వుండేది. కానీ వీలు కాదుగా అందుకే ఇందులోకి దిగిపోయాను" అంది దిగులుగా. తర్వాత మామూలుగా అయిపోయింది.

"సర్లెండి. అవన్నీ తలుచుకుని, ఏం ప్రయోజనం. కానీ నన్నెందుకు తీసుకొచ్చారో దాని సంగతి చూడండి" అంది నవ్వుతూ.

నేను సావిత్రిని ఎందుకు తీసుకొచ్చానో, తనేం చెయ్యాలో చెప్పి స్నానానికెళ్ళాను. నేను స్నానం చేసొచ్చేసరికి సావిత్రి ఇల్లంతా చాలా నీట్‌గా సర్దింది. మెచ్చుకోలుగా ఆమెవంక చూసాను.

"చెయ్యాల్సినవి ఇంకేమైనా ఉన్నాయా" అనడిగింది.

"చాలా ఉన్నాయి. అప్పుడే ఏమయింది. అయితే ముందు నేను చెప్పింది విను. ఆ తర్వాత నీ నిర్ణయం చెప్పు. సరేనా".

సరేనన్నట్లు తలూపింది.

"చూడు సావిత్రీ! నేను నిన్ను ఎందుకు తీసుకొచ్చానో యిందాకే చెప్పాను. మాకు పనిపిల్ల అవసరం చాలా వుంది. అసలు మా ఆవిడ పుట్టింటి నుంచి రానిది కూడా అందుకే. నేను పనిపిల్లను మాట్లాడే వరకు ఇక్కడకు రానని మొండికేసింది. చాలా ప్రయత్నించాను. ఎవరూ దొరకలేదు. పని చేసే వాళ్ళు మీరుండే చోట దొరుకుతారని చెపితే అక్కడకొచ్చి నిన్ను తీసుకొచ్చాను. పనిమనిషిగా మా ఇంటి పనులు చేస్తానంటే. మా ఇంట్లోనే వుండి చెయ్యొచ్చు. ఇంతకీ నువ్వు ఇంటి పనులు చెయ్యగలవా"

"ఎందుకు చెయ్యను. మీరొచ్చినప్పుడు అక్కడ చాలా మంది ఉన్నారుగా. అంతా పనులు చెయ్యడానికి వున్నవాళ్ళే. రోజూ మేం ఆ పని, ఈ పని అని కాకుండా ఏ పని దొరికితే ఆ పనికి పోతుంటాం. అటువంటప్పుడు ఇంటి పనులో లెక్కకాదుగా" అంది.

"అయితే ఇక్కడ పనిచెయ్యడానికి మీ నాన్న ఒప్పుకొంటాడా"

"మా నాన్న చేతిలో డబ్బులు పడితే చాలు మేమేమయినా పర్లేదు"

"సరే నేను నెలకు ఇంత అని జీతం నిర్ణయించి అదంతా ప్రతి నెలా మీ నాన్నకిస్తాను. కాబట్టి అతనొప్పుకుంటాడు. నీకు రెండు పూటలు తిండి పెడతాం. కావలసిన బట్టలిస్తాం. ఇంట్లోనే వుండు. అన్నీ యిచ్చి నిన్ను ఇంట్లో పెట్టుకోవడానికి కారణమేమంటే మా ఆవిడకీ మధ్య ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం వచ్చింది. ఇంట్లో పనులు చేసుకుని వెళ్ళాలంటే కష్టం. వచ్చేనెలలో ఉద్యోగంలో చేరుతుంది. అందుకే నిన్ను పెట్టుకోవలసి వచ్చింది. లేకపోతే యిద్దరు మనుషులకు పనిమనిషి అవసరంలేదు..." చెప్పడం ఆపి సావిత్రి ముఖంలోకి చూసాను. నేను చెప్పేది శ్రద్ధగా వింటోంది.

"... అయితే. నిన్ను చూసిన తర్వాత నాకింకో ఆలోచన వచ్చింది. నీకు చదువంటే

చాలా ఇష్టమని తెలుస్తోంది. నువ్వు మా ఇంట్లో వుండి పదో తరగతి ప్రయివేటుగా చదువు. పుస్తకాలు కొనాల్సిన పనిలేదు. మా పాపవి వున్నాయి. పరీక్ష ఫీజు నేను కడతాను. నువ్వు శద్దగా చదువుకుంటే మా ఆవిడ కూడా సంతోషిస్తుంది. తనే నీకు కోచింగ్ కూడా యిస్తుంది. టెంతుతో నువ్వు చదువు ఆపెయ్యాల్సిన పనిలేదు. ప్రయివేటుగా బి.ఎ.చదువుకోవచ్చు.ఎప్పుడూ ఇలాగే పనిమనిషిగావుండి పోనక్కర్లేదు. ఏదైనా చిన్న ఉద్యోగం సంపాదించుకుని నీ బ్రతుకు నువ్వు బ్రతకొచ్చు. తెల్సిందా" అన్నాను.

సావిత్రి కళ్లలో సన్నని నీటితెర. "ఇంతకీ మా యింట్లో వుండటం నీకిష్టమేనా".

ఇష్టమేనన్నట్లు తలూపింది. సావిత్రి కళ్ళలో కృతజ్ఞత.

"అయితే ఓ పని చెయ్యి సావిత్రీ. ముందు శుభ్రంగా స్నానం చేసిరా. ఆ తర్వాత మనిద్దరికీ అన్నం వండు. కూరలు నేను హెూటలు నుంచి తెస్తాను. కాసేపు రెస్టు తీసుకో. ఇంట్లో మాసిన బట్టలున్నాయి. అవి ఉతుకు. పనంతా అయ్యాక ఇల్లంతా శుభ్రంగా కడుగు. ఈ రాత్రికే అమ్మగారు బయలుదేరి ఉదయానికల్లా వచ్చేస్తారు. రేపటి నుంచి ఏయే పనులు చెయ్యాలో తనే చెపుతుంది సరేనా" అన్నాను. తలూపింది.

పాతవీ మా అమ్మాయి బట్టలుంటే తీసి సావిత్రికిచ్చి బాత్‌రూమ్ చూపించాను.అవి తీసుకుని వెళ్లింది. ఈ విషయం శ్రీమతికి ఫోన్ చేసి చెప్పాలనిపించింది.

"ఏమోయ్! నీకో శుభవార్త. మనకి పనిపిల్ల దొరికింది. ఆ అమ్మాయిలో ఇంకా పసితనం పోలేదు. నిజంగా పసిపిల్లే అనుకో. ఆ అమ్మాయి పేరు సావిత్రి. నీలాగే చదువు పిచ్చి. టెంతు ప్రయివేటుగా చదవమని చెప్పాను. సావిత్రికి నువ్వే చదువు చెప్పాలి. నీకూ ఇంట్లో కొంత కాలక్షేపంగా వుంటుంది" అంటూ సావిత్రి కుటుంబ వివరాలు, సావిత్రితో నేనేం చెప్పింది అంతా ఫోనులో నా శ్రీమతికి వివరించాను.

ఎంతకాలానికి మీరు మంచి పని చేసారంటూ నన్ను శ్రీమతి మెచ్చుకుని ఈ రోజే బయలుదేరి వస్తున్నానని చెప్పింది. సావిత్రి స్నానం ముగించుకుని వచ్చింది.

ఎప్పుడో నేను ఇష్టపడి మా అమ్మాయికి కొన్న బట్టల్లో వున్న సావిత్రి ముఖం చూస్తే నాకు సావిత్రిలో మా అమ్మాయి కన్పించింది.

**( ప్రియదత్త సకుటుంబ సచిత్ర వారపత్రికలో ప్రచురితం )**

* * *

# ఆవేదన

**ఆ** ఊరికి దూరంగా వున్న ఓ పాడు బడిన బంగ్లా ముందు ఆ ఊరి జనమంతా గుమిగూడి ఉన్నారు. ఇంకా వచ్చేవాళ్ళు వస్తూనేవున్నారు. అంతలో రెండు పోలీసు జీపులు, ఓ అంబులెన్సు వచ్చి ఆగాయి. జీపుల్లో నుంచి పోలీసులు దిగారు. ముందు జీపులోనుంచి దిగిన డి.ఎస్పీ, సి.ఐ లు బంగ్లాలోపలికెళుతుంటే రెండో జీపులో నుంచి దిగిన కానిస్టేబుళ్ళు అక్కడి జనాలను కంట్రోలు చేస్తున్నారు. వాళ్ళని చూసి చాలా మంది ఎందుకైనా మంచిదని కొంచెం దూరంగాపోయి నిలబడ్డారు.

పోలీసులడిగే ప్రశ్నలకు ఏంచెప్పవలసి వస్తుందోనని కొంతమంది పక్కకు తప్పుకున్నారు. బిల్డింగులో  నుంచి వస్తున్న దుర్గంధాన్ని భరించలేక కూడా మరి కొంతమంది దూరంగాపోయి అక్కడ జరుగుతున్న తతంగాన్ని చూస్తున్నారు. పోలీసులంతా ఆవాసన భరించలేక స్కార్ఫ్లు చుట్టుకున్నారు. కాస్సేపటికే అక్కడకు ఫోటోగ్రాఫరు, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్పర్టు, క్లూస్ టీమ్ వేరే వెహికల్లో వచ్చారు.

ఆ వార్డు కార్పోరేటరు వీళ్ళంతా వస్తారని తెలిసి అక్కడ కుర్చీలు వేయించి వుంచాడు. అంతా కూర్చున్నాక డి.ఎస్పీగారు ఓ వ్యక్తిని పిలిపించారు. అతను చేతులు కట్టుకుని భయపడుతూ ఆయన ముందుకొచ్చాడు. అతనికి అరవై ఏళ్లుంటాయి. “ఏం జరిగిందో చెప్పు” అనడిగారతన్ని. “నా పేరు సూరయ్యంటారయ్యా,ఈ బంగ్లాకి వాచ్ మాన్గా వుంటున్నాను. మూడు రోజుల క్రితం నాకూతురికి బాగోలేదని తెలిసి పక్కూరికి దాన్ని చూడ్డానికెళ్ళి ఈ పొద్దున్నే వచ్చానయ్యా, ఇక్కడికొచ్చేసరికి లోపలినుంచి ఏదో వాసన వస్తుంది. తలుపులు తీసి చూస్తే ఓగదిలో ఓ ఆడా, మగా ఉరితీసుకుని ఏలాడుతూ కనిపించారయ్యా, భయంతో బయటకొచ్చి తలుపులేసేసి మన కార్పొరేటరుగారి దగ్గరికెళ్ళి చెప్పానయ్యా, ఆయన మీకు ఫోను చేసారు” అని చెప్పాడతను.

“ ఇంతకీ ఈ బిల్డింగెవరిది”?

అప్పుడు కార్పొరేటర్ చెప్పాడు “ఇది శివరావు గారిది. ఆయన భార్యా పిల్లలతో అమెరికాలోనే సెటిలయిపోయారు. అప్పుడప్పుడు వచ్చిపోతుంటారు. ఈ బిల్డింగే కాదు ఇక్కడింకా పొలాలు కూడా వున్నాయి. వాటిని కౌలుకిచ్చేసారు. ఈ బిల్డింగ్ కి ఇతన్ని

కాపలాగా వుంచారు. టౌన్లో ఆయనకో అపార్టుమెంటు కూడా వుంది. వచ్చినప్పుడల్లా అంతా అందులో వుంటారు. వారం పది రోజులుండి అన్నీ చక్కబెట్టుకుని వెళ్ళిపోతారు."

"ఆ ఉరి తీసుకున్న వాళ్ళెవరో నీకు తెలుసా" సూరయ్యనడిగారు డి.ఎస్పీగారు.

"తెలీదయ్యా, అయినా తెలీడానికి ఆళ్ళముఖాలు కనబడితేకదా. ఒకే కొక్కానికి తాళ్ళుబిగించి ఒకరినొకరు గట్టిగా పట్టుకుని ఒకరినొకరు ముద్దు పెట్టుకుంటున్నట్టుగా ఇద్దరి ముఖాలు అతుక్కుని ఉరేసుకున్నారయ్యా, గదిలో ఇంకా పురుగులమందుల డబ్బాలు కూడా వున్నాయి" చెప్పాడతను.

అంతా అక్కడ నుంచి లేచి లోపలికి లోపలికి నడిచారు. వాచ్‌మన్ తలుపులు తీసాడు. అది చాలా పెద్ద బంగ్లా. అక్కడున్నగదుల్లో ఓ గదిలో నుంచి చాలా ఘోరంగా వాసనొస్తుంది. ఆ గది తలుపులు కూడా తీసాడు. అక్కడి దృశ్యాన్ని చూసి బిత్తరపోయారంతా. మధ్యవయస్కులైన స్త్రీ, పురుషులిద్దరు ఒకర్నొకరు కౌగలించుకుని వేలాడుతున్నారు. అతని తల ఆమె భుజం మీద, ఆమె తల అతని భుజంమీదవున్నాయి. అతను ఆమె బుగ్గను ముద్దుపెడుతున్నట్టుగా కొంచెం తిరిగి వుంది, పక్కనే ఓ పాతనిచ్చెన, క్రింద ఓ పాత స్టూల్ వున్నాయి. గదిలో ఓ మూలన క్రిమిసంహారక మందుల డబ్బాలు ఖాళీవి వున్నాయి. వాటి ప్రక్కనే ప్లాస్టిక్ గ్లాసులు, మినరల్ వాటర్ బాటిల్సు వున్నాయి. ఆ మందులు తాగి మళ్ళీ బతుకుతామేమోనని ఉరి పోసుకున్నట్టుగా వుంది అక్కడి సీను. అలావేలాడుతున్న వాళ్ళని చూస్తుంటే ఎవరో తెలిసే అవకాశం లేదు.

డి.ఎస్పీగారి ఆదేశానుసారం పోలీసులు ఇద్దరి శవాలను అతి కష్టం మీద దించి (స్ట్రెచర్ సాయంతో బయటకు తీసుకొచ్చి అరుగుమీద వుంచారు. క్లూస్ టీమ్, ఫోటోగ్రాఫర్లు లోపల వాళ్ళపనులు వాళ్ళు చేసుకుంటున్నారు. ఆ శవాలను చూసిన వాచ్ మాన్ సూరయ్య "అయ్యగారూ! అమ్మగారూ!!" అంటూ గట్టిగా అరిచి కిందపడి ఏడుస్తున్నాడు. అంతా మరొక్కసారి బిత్తరపోయారు.

"సార్! వీళ్ళిద్దరూ శివరావుగారు, ఆయన భార్యాసార్" అన్నాడు కార్పొరేటర్. వాళ్ళను చూసిన వెంటనే, అందరికీ అంతుబట్టని విషయం ఒక్కటే. ఎక్కడో అమెరికాలో వుంటున్న శివరావు దంపతులు ఇక్కడకొచ్చి ఇలా ఆత్మహత్య చేసుకోవడమేమిటి?

అందరి ముఖాల్లోను ఆశ్చర్యం.

హత్యా? లేక ఆత్మహత్యా? అనే కోణంలో కూడా ఆలోచించారు పోలీసులు. అది ఆత్మహత్య కావడానికే ఎక్కువ అవకాశం కన్పిస్తుంది అయినా పోస్ట్ మార్టంలో అన్నీ తేలతాయి కదా అని కూడా అనుకున్నారు.

డి.ఎస్పీగారు వాచ్ మాన్ని అడిగారు "ఎన్నాళ్ళయ్యింది వీళ్ళిక్కడకొచ్చి" అని.

"సంవత్సరమయ్యిందయ్యా,. నెలకోసారో, రెండుసార్లో ఫోను చేసి మాట్లాడుతుంటారు. ఇంటిని జాగ్రత్తగా చూసుకోమంటారు. అప్పుడప్పుడు పొలాలకెళ్ళి కౌలుదార్లు శ్రద్దగా వ్యవసాయం చేస్తున్నారో లేదో చూడమంటారండి. నా జీతం కూడా ప్రతీనెల బేంకులో పడే ఏర్పాటు చేసారండి".

అతను అనుమానించతగ్గ వ్యక్తిలా అనిపించలేదు. నిజమే చెబుతున్నాడనిపించింది.

" ఆయనకెంతమంది పిల్లలు"

"ఓ కొడుకు, కూతురూ అయ్యా, ఆళ్ళకు ఇరవై నుంచి ఇరవై అయిదేళ్ళుంటాయి. ఆళ్ళు అక్కడే సదూకుంటున్నారు. ఆళ్ళనక్కడుంచి ఇంత అగాయిత్యం ఎందుకు చేసారో తెలీడంలేదు బాబూ" అంటూ మళ్ళీ బోరుమన్నాడు.

" ఆయన ఇండియా వచ్చినట్టు నీకు తెలుసా?"

"తెలీదయ్యా! ఎప్పుడైనా ఆయనేనాకు ఫోను చేసి ఏంచేయాలో చెబుతారు. ఒకవేళ ఇక్కడకు వచ్చేటట్టయితే పలానా రోజున వస్తున్నామని ముందుగా చెబుతారు. కానీ ఇప్పుడు వస్తున్నట్టు చెప్పలేదుకానీ వారం రోజుల క్రితం మాట్లాడినప్పుడు మాత్రం నేను వారం, పదిరోజులిక్కడవుండటం లేదని నాకూతురి దగ్గరకెళుతున్నానని చెప్పానయ్యా."

మొత్తంమీద వాచ్మన్ లేని రోజులేవో వాళ్ళకి తెలిసి ఇక్కడి కొచ్చారు. కాని అర్థంకాని విషయమొకటే! చచ్చిపోవడానికి అమెరికానుంచి ఇక్కడకు రావడమేమిటి? అసలు చావడానికి కారణమేమిటి? వాళ్ళిద్దరూ ఒకరినొకరు పట్టుకుని చనిపోవడం అందరి హృదయాలను కలిచి వేసింది. ఆవిషయం తెలిసి ఆడా, మగా అని కాకుండా ఊరు ఊరంతా తరలివచ్చింది.

ఉండేకొద్దీ ట్రాఫిక్ ఇబ్బంది లొస్తాయని త్వరత్వరగా అక్కడి వ్యవహారాలను ముగించుకుని శవాలను అంబులెన్స్లోనికి ఎక్కించారు. వాచ్మన్ని, కార్పొరేటర్ని స్టేషన్కి తీసుకెళ్ళారు ఏవేవో సంతకాలుచేయాలని. శవాలను పోస్ట్మార్టం నిమిత్తం గవర్నమెంట్ హాస్పిటల్కి తీసుకుపోయారు. పోలీసు డిపార్ట్మెంటుకి నిజంగా పిచ్చెక్కిపోతుంది.వీళ్ళగురించి ఎవరికి తెలియజేయాలో అర్థం కాని పరిస్థితి. అందర్నీ అయోమయానికి గురిచేస్తున్న విషయమొక్కటే. ఎక్కడో అమెరికాలో వున్నవాళ్ళు ఇక్కడికొచ్చి ఆత్మహత్య చేసుకోవడమేమిటి?

అమెరికా లోవున్న పిల్లల అడ్రస్లు తెలియవు. వీళ్ళకి ఇక్కడెవరైనా

బంధువులున్నారేమో కూడా తెలీదు. కనీసం సూసైడ్‌నోటు కూడాలేదు. ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని డి.ఎస్పీగారు కొంతమంది కానిస్టేబుళ్ళను ఆ ఊరికి పంపించారు. వాళ్ళా ఇంటిని క్షుణ్ణంగా పరిశీలించారు. ఎక్కడా చిన్నకాగితంకూడా దొరకలేదు. పోలీసులు ఆ ఊళ్ళోకూడా ఎంక్వయిరీ చేసారు. ఆ ముందు రోజు ఎవరైనా వాళ్ళని చూసారా? రాత్రప్పుడు ఏవైనా కార్లు వచ్చాయా లాంటివి అడిగారు. ఎవరూ కూడా చెప్పలేకపోయారు.

అయితే గవర్నమెంటు హాస్పిటల్ నుంచి ఓ ఫోను వాళ్ళకి మంచి వార్తనందించింది. పోస్ట్‌మార్టం చేస్తున్నప్పుడు భర్త ఇన్నర్ వేర్ జేబులో ఓ సీల్తీకవరుందని దాన్ని పంపిస్తున్నామని తెలియజేసారు. ఒక్కసారిగా ఊపిరి పీల్చుకుంది పోలీసు డిపార్ట్‌మెంటు. పాలితిన్ కవరులో పెట్టిన కాగితాల కవరు డి.ఎస్పీగారి చేతికందింది. ఆయన దాన్ని చదవడం మొదలు పెట్టారు.

“గౌరవనీయులైన పోలీసు డిపార్ట్‌మెంటువారికి ఓ ప్రవాసాంధ్రుడు రాసుకున్న విన్నపం. ఇది ఒక విధంగా నా ఆవేదనను చెప్పుకోవడమే అవుతుంది. మా భార్యా భర్తలచావులు మీకంతుబట్టవని తెలుసు. అందుకే మా చావు విషయం మీకు తెలియచేయాలని ఇది రాస్తున్నాను. దీన్ని బయటవుంచితే ఎవరైనా మాయం చేయొచ్చు లేదా ఇది మీకు చేరకపోయినా మాచావు విషయం ఎవరికీ తెలీదు. అందుకే ఈ లెటర్ని నా ఇన్నర్‌వేర్ జేబులో పెట్టుకున్నాను. పోస్ట్ మార్టమ్ చేస్తున్నప్పుడు తప్పనిసరిగా బయటపడుతుందిగా,

మేమీలా ఎందుకు ఆత్మహత్య చేసుకున్నామనేది అందరి మనసుల్లోను ఎదురయ్యే ప్రశ్న. ఈ భూమ్మీద బతికే అర్హత కలిగి వున్నామో లేదో మాకు తెలీదు కానీ మేం మాత్రం ఇంక బతక్కూడదని నిర్ణయించుకున్నాము. అందరికీ అనుమానం రావొచ్చు, ఎక్కడో అమెరికాలో సెటిలయినవాళ్ళు ఇక్కడి కొచ్చి చావడమేమిటని. నిజమే మేం అక్కడే చావాలి కానీ ఈ భూమ్మీదపుట్టాం కాబట్టి ఇక్కడి మట్టిలో కలిసిపోవాలనుకున్నాం.

ఇంక అసలు విషయానికొస్తాను, నేను ఇంజనీరింగ్ పూర్తిచేసినవెంటనే నేను నాతల్లిదండ్రులు, చెల్లెళ్ళు, తమ్ముళ్ళ ఆశల్ని వమ్ముచేసి అమెరికా వెళ్ళిపోయాను. నేనే మా ఇంట్లోపెద్దవాణ్ణి. అప్పులుచేసి ఉన్న కొద్ది పాటి భూమిని అమ్మి నన్ను చదివించారు. నేను పైకొస్తే కుటుంబాన్ని ఆదుకుంటానని అనుకున్నాడు మానాన్న. కానీ స్వార్థంపూర్తిగా నిండిపోవడంతో అందరి ఆశల్ని అడియాసలు చేసి నేను రెక్కలొచ్చిన పక్షిలా ఎగిరిపోయాను. నేను వెళ్ళేటప్పుడు మానాన్న, అమ్మ ఎంతగానో

ఏడ్చారు. అయినా వాళ్ళ కన్నీరు నన్ను కరిగించలేదు.

నేను అమెరికా వెళ్ళి మంచి ఉద్యోగమే సంపాదించుకున్నాను. నా కొలీగ్‌నే తెలుగమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. మా వాళ్ళతో పూర్తిగా సంబంధాలను తెంచుకున్నాను. వాళ్ళు ఏమయ్యారో, ఎలావున్నారో కూడా పట్టించుకోలేదు. ఇద్దరు పిల్లలు పుట్టారు – అమ్మాయి, అబ్బాయి. నాభార్యా, నేనూ బాగానే సంపాదించాము. అక్కడే ఇల్లు కొనుక్కున్నాము. అక్కడి పౌరసత్వం కూడా లభించింది. పరాయి దేశంలో వున్నాం కాబట్టి అక్కడ ఎంతకాలముంటామో చెప్పలేం. దేశరాజకీయ, ఆర్థిక పరిస్థితులు రోజురోజుకి మారుతున్నాయి కాబట్టి అక్కడ ఉండలేని పరిస్థితి వస్తే ఇండియా వచ్చెయ్యొచ్చనుకుని ఇక్కడ ఆస్తులు కూడబెట్టడం ప్రారంభించాము. ఓ పోష్ లొకాల్టీలో ఒక పెద్ద అపార్ట్‌మెంటు అన్ని వసతులతో వున్నది కొన్నాము. ఇంకా పొలాలు, ఇళ్ళస్థలాలు కొని కొంత డబ్బుని డిపాజిట్ కూడా చేసాము.

పిల్లలిద్దరూ అమెరికాలోనే పుట్టారు కాబట్టి వాళ్ళకు మన సంస్కృతి తెలియదు. అందుచేత ప్రతి సంవత్సరం ఫ్రండ్స్ ఇళ్ళలో జరిగే పెళ్ళిళ్ళకు, ఇతర పండగలప్పుడు ఇండియా తీసుకొస్తుండేవాళ్ళం. అయినా వాళ్ళకవేమీ వంటబట్టేవి కావు. పూర్తిగా అమెరికా కల్చరే వాళ్ళకి అలవాటయిపోయింది. పిల్లలిద్దరూ పెద్ద వాళ్ళయ్యారు. కానీ వాళ్ళ నడవడిక మాకు నచ్చేదికాదు. అంతా అక్కడి జీవితమే వాళ్ళకలవాటయి పోయింది. మాకప్పుడనిపించింది ఆమెరికా వచ్చి తప్పు చేసామా అని, కానీ చేసేదేమీలేదు.

ఇద్దరిలోను విచ్చలవిడితనం పెరిగింది. ఎప్పుడూ ఫ్రెండ్సూ, పబ్బులు – అవీ ఇవీ అని కాదు అన్ని దురలవాట్లకు అడిక్టయ్యిపోయారు. మా అబ్బాయయితే తాగుడేకాదు డ్రగ్స్ కూడా అలవాటయ్యాయి. వాటికి పూర్తిగా అడిక్టయ్యిపోయాడు. మా అమ్మాయయితే ఎప్పుడూ బాయ్‌ఫ్రండ్స్‌తో తిరగడమే. గీతదాటి పోయింది. మామాటవినే పరిస్టితి లేదు. మాదెంత దారుణమైన పరిస్థితంటే ఆమెకు మేమేరెండు సార్లు అబార్షన్లు చేయించాల్సొచ్చింది. ఏమన్నా అంటే అది కామన్ అంటూ తేలిగ్గా తీసి పారేస్తుంది. మావాడయితే డగ్స్‌కి బానిసైపోయి సైకోలా ప్రవర్తించడం మొదలెట్టాడు. మాకు మానసిక ప్రశాంతత లేకుండా పోయింది. మా ఇద్దరి ఆరోగ్యాలు పాడయిపోయాయి. మా ఉద్యోగాలను వదిలేసుకున్నాం.

పిల్లలిద్దరూ మాచెప్పు చేతల్లో లేరు కాబట్టి వాళ్ళనిక్కడ వదిలేసి మేం ఇండియా వచ్చేసి ప్రశాంతమైన జీవితాన్ని గడుపుదామనుకున్నాం. కానీ అనుకున్నవి

అనుకున్నట్టు జరిగితే అది జీవితమెందుకవుతుంది. నేను ఊహించని రెండు ఘోరమైన సంఘటనలు జరిగిపోయాయి. మావాడు తను చదువుతున్న కాలేజీకెళ్ళి ఉన్మాదంతో క్లాసులోవున్న నలభైమంది విద్యార్థులతోపాటు టీచ్ చేస్తున్న ప్రొఫెసర్నికూడా కాల్చిచంపేసాడు. అదిపెద్ద సంచలనమైపోయింది. వాణ్ణి పోలీసులు పట్టుకుని జైల్లోపెట్టి నానా హింసలు పెడుతున్నారు. వాళ్ళు వాణ్ణి చంపినా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఒకవేళ బ్రతికినా జీవితాంతం జైల్లోమగ్గిపోవలసిందే.

ఇంక నాకూతురు ఓనల్లజాతీయుడైన క్రిమినల్ని వాడి బలవంతం మీద పెళ్ళిచేసుకుంది. వాడో అంతర్జాతీయ స్మగ్లర్ కూడా. అప్పటికే వాడు రెండు పెళ్ళిళ్ళు చేసుకుని ఆ ఇద్దర్నీ చంపేసాడు. ఇది కూడా ఎప్పుడో వాడి చేతిలో చస్తుంది. దీని జీవితం కూడా నాశనమైపోయింది. ఇన్ని జరిగాక మేం బతికుండి ఏం చేయాలో చెప్పండి. అందుకే మేం చచ్చిపోవాలని నిర్ణయించుకున్నాం. అలా నిర్ణయించుకున్నాక ఇక్కడి ఆస్తుల గురించి పట్టించుకోకుండా అన్నీ అలాగే వదిలేసి ఇండియా వచ్చెయ్యాలని అనుకున్నాం. అనుకున్నట్టుగానే పదిహేనురోజుల క్రితం ఇండియా వచ్చేసాం. చనిపోయే ముందు, మేం మా కుటుంబాలకు చేసినపాపాలకు నిష్కృతిగా దైవదర్శనాలు చేసుకోవాలని షిరిడి, తిరుపతి లాంటి ప్రదేశాలకు వెళ్ళివచ్చాము.

పదిరోజుల క్రితమే ఈ ఊరుచేరుకున్నాం. ముందు మేముండే అపార్ట్‌మెంట్లోనే చచ్చిపోదామనుకున్నాం. కానీ ఇక్కడ ఎన్నోకుటుంబాలు జీవిస్తున్నాయి. ఒక ఇంట్లో ఇద్దరు ఆత్మహత్యలు చేసుకున్నారంటే ఇక్కడి వాళ్ళు చాలా ఇబ్బంది పడతారు. అందుకే ఎక్కడ చచ్చిపోదామా అనుకుంటున్న సమయంలో వాచ్‌మన్ సూరయ్య వారం రోజులు వుండనని చెప్పడం గుర్తొచ్చింది. అంతే అప్పుడు నిర్ణయించుకున్నాం పాత బంగ్లాలో పోవాలని.

వాడులేని సమయంలో ఓ రోజొచ్చి ఇల్లంతా తిరిగి అన్నీ సమకూర్చుకుని ఫలానారోజు పోవాలని నిశ్చయించుకున్నాం.పోయేముందు ఇక్కడున్న ఆస్తిపాస్తుల్ని నా తమ్ముళ్ళు, చెల్లెళ్ళకు సమానంగా చెందేటట్టుగా వీలునామా రాసాను. ఆ వీలునామా మేమున్న అపార్ట్‌మెంట్లో దొరుకుతుంది. మావాళ్ళ అడ్రస్‌లు కూడా రాసి పెట్టాను. ఇవన్నీ ముందు హాల్లోవున్న టేబుల్ సొరుగులో వుంటాయి. ఇంటి తాళాలు పక్కపోర్షన్ వాళ్ళ దగ్గర వుంటాయి.మేం పోయిన విషయం మా వాళ్ళకి తెలియచేయండి. వాళ్లొచ్చి దహనసంస్కారాలు చేస్తానంటే మా శవాలనువాళ్ళకివ్వండి. వాళ్ళు అంగీకరించకపోతే అనాథ శవసంస్కారాలు చేసే ఏదైనా స్వచ్ఛంద సంస్థ ద్వారా జరిపించండి.ఇంతకన్నా

మిమ్మల్ని కోరేదేమీలేదు.

చివరగా ఒక్కమాట, స్వదేశాన్ని వదిలేసి విదేశాలమీద మోజుతో ఇక్కడకొచ్చి స్థిరపడిన కొంతమంది ప్రవాసాంధ్రులు మాలాగే బాధలు పడుతున్నారు. అయినా ఈ ప్రక్రియ మారదు. అలాగే కొనసాగుతూవుంటుంది. మరి మా ఆవేదన కొంత మందినైనా ఆలోచింపచేస్తుందో లేదో తెలియదు. ఉంటానండి. మమ్మల్ని మేము క్షమించుకోలేక మేమీ నిర్ణయం తీసుకొవడం జరిగింది – ఇట్లు అభాగ్యుడు శివరావ్."

ఆ ఉత్తరం చదివిన డి.ఎస్పీగారు దీర్ఘంగా నిట్టూర్చి చేయ్యాల్సిన కార్యక్రమాలకు నడుం బిగించారు.

**(నవ్య వీక్లీలో 5,000 రూపాయల బహుమతి పొందిన కథ)**

* * *

# ఒక్కసారి ఆలోచించండి

**ఆ**ఫీసయిన వెంటనే సుధాకర్ ఇంటికి వెళ్ళాను.

"రండన్నయ్యా"అంటూ ఆహ్వానించింది సుధాకర్ భార్య రుక్మిణి.

"వీడింట్లో లేడా?"అనడిగాను. వాడుండని తెలిసే అడిగాను.

"లేరన్నయ్యా. మధ్యాహ్నమే ఇంటికొచ్చేశారు.... మా ఆడపడుచు గారబ్బాయికి ఆరోగ్యం బాగోలేదంటే చూడ్డానికి అమలాపురం వెళ్ళారు" చెప్పింది రుక్మిణి.

"అత్తయ్యగారు పడుకున్నారా?"

"నీరసంగా వుందని గదిలోనే వున్నారు. రండి చూద్దురుగాని"అంటూ లోపలికి దారి తీసింది.

ఆమె వెంట నడిచాను.ఆవిడ మంచం మీద పడుకునే వున్నారు. కానీ నిద్ర పోవడం లేదు.

"రా నాయనా!కూర్చో. మా సుధాకర్ అమలాపురం వెళ్ళాడు... రుక్మిణి చెప్పే వుంటుంది"అన్నారావిడ నెమ్మదిగా.వెళ్ళి ఆమె మంచం ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చున్నాను.

"చెప్పిందమ్మా ...మీరు చాలా నీరసంగా వున్నారు"అన్నాను.

"పెద్ద వయసు కదా నాయనా. ఇవన్నీ తప్పవు"అందావిడ. ఆవిడకు ఎనభై ఏళ్ళు పైనే వుంటాయి.

"ఈవిడ పెద్దవయసు దానిలా వుండటం లేదు కదా"అని మనసులో అనుకున్నాను.

"నిజమే లెండి. మొన్నీ మధ్య చిన్న తిరుపతి. ఇంకా ఈ చుట్టుప్రక్కల గుళ్ళూ గోపురాలు తిరిగొచ్చారు కదా. వాటివల్ల చాలా ఇబ్బంది పడి వుంటారు"అన్నాను.

"ఇబ్బందనుకుంటే ఎలా నాయనా. కాస్త పుణ్యం.పురుషార్థం కలగాలి కదా. చచ్చే ముందు ఇలా నాలుగు పుణ్యక్షేత్రాలు తిరిగితే మోక్షమైనా దక్కుతుంది"అందావిడ.

'అవుననుకోండి. కానీ ఈ వయసులో మీ శరీరం అలా తిరగడానికి సహకరించకపోవడం, అలాగే సుధాకర్ కి మిమ్మల్ని తీసుకుని తిప్పడం, ఆర్థికంగా తట్టుకోలేకపోవడం ఇవన్నీ ఇబ్బందులే కదా"

"కన్నతల్లి కోసం ఆ మాత్రం చేయడం కూడా ఇబ్బందనుకుంటే ఎలా నాయనా. మా సుధాకర్ అలా అనుకుంటాడని నేననుకోవడం లేదు"అన్నారావిడ కొంచెం నిష్ఠూరంగా.

"చూడండమ్మా! సుధాకరెప్పుడూ ఈ విషయాలు నా దగ్గర ప్రస్తావించలేదు. మా ఇద్దరి మధ్య ఉన్న స్నేహమెంత గొప్పదో మీకు తెలుసు. మేమిద్దరం కలిసే చదువుకున్నామని, ఒకేచోట ఉద్యోగాలు చేస్తున్నామన్న సంగతి కూడా మీకు తెలియనిది కాదు...కానీ ఈ కుటుంబ శ్రేయోభిలాషిగా, సుధాకర్ స్నేహితుడిగా నాకు కొంత బాధ్యత వుందని అనుకునే నేను నీతో ఇలా మాట్లాడుతున్నాను.

మీకు గుర్తుందో లేదో రెండేళ్ళ క్రితం రాజమండ్రిలో గోదావరి పుష్కరాల్లో స్నానం చేయాలని మీరు చెప్పినప్పుడు వాడు ఎంత మధనపడ్డాడో నాకు తెలుసు. మీరా నడవలేరు. రష్ చూస్తే మామూలుగా లేదు. గోదావరిలోంచి నీళ్ళు తెస్తాం. ఇంట్లో స్నానం చెయ్యమని చెప్పినా మీరు వినలేదు. నేనూ,వాడూ కలిసి మిమ్మల్ని గోదావరి దగ్గరకు తీసుకువెళ్ళాలని నిర్ణయించుకున్నాం. పోనీ రష్ తగ్గాక చెయ్యమంటే మీరు మొదటి రోజే, పుష్కర ఘాట్ లోనే స్నానం చేయాలని పట్టు పట్టారు. ఆ రోజు మిమ్మల్ని మోసుకుంటూ ఆ ఘాట్ వరకు తీసుకువెళ్ళాంగానీ అక్కడి జనాన్ని చూసి అందులోకి వెళ్ళలేక పక్క ఘాట్ లో మీ చేత స్నానం చేయించాం. ఆ రోజు మీరు పుష్కర ఘాట్‌లో స్నానం చేయలేదని గొడవపెట్టడం,అలగడం నాకింకా గుర్తుంది. నిజంగా ఆ రష్‌లో మిమ్మల్ని తీసుకెళ్ళి పుష్కర ఘాట్ లో స్నానం చేయించి వుంటే ఎంత ఘోరం జరిగుండేదో కదా. మీకు గుర్తుందా ఆ రోజు తొక్కిసలాటలో చాలామంది చచ్చిపోయారు. ఆ సంఘటనను తలుచుకుంటే ఇప్పటికీ ఒళ్ళు గగుర్పొడుస్తుంది. అప్పుడు మీకేమైనా అయ్యుంటే నిజంగా సుధాకర్ తట్టుకుని వుండేవాడు కాదమ్మా"

నా మాటలకు ఆవిడేం అనుకుంటుందో నాకు తెలియడం లేదు కానీ ఆవిడ మాత్రం అలా శూన్యంలోకి చూస్తుంది. అయినా నేను ఆపదలుచుకోలేదు. ఇప్పుడు చెప్పకపోతే మళ్ళీ చెప్పే అవకాశం వస్తుందో రాదో తెలియదు.

"నిరుడు క్రిష్ణా పుష్కరాలకు మళ్ళీ మీరు తీసుకువెళ్ళమన్నప్పుడు కూడా సుధాకర్ చాలా కంగారు పడ్డాడు. గోదావరి పుష్కరాలంటే ఏదో పక్కనే కాబట్టి వీలయ్యింది. అదే క్రిష్ణా పుష్కారాలంటే విజయవాడ వెళ్ళాలి. అక్కడకు తీసుకువెళ్ళడానికి డబ్బులవ్వడం కంటే మీ ఆరోగ్యం మిమ్మల్నేం చేస్తుందోననే భయం వాడికి. పుష్కారాలంటే దేశం నలుమూలల నుంచి జనం వస్తారు. తొక్కిసలాటలు జరుగుతాయి.

వెళ్ళేది కారులోనైనా నదీ తీరం వరకు పోనివ్వరు. సిటీ బయటే ఆపేస్తారు. అయినా మీరు పట్టుపట్టారు. వాడికి తప్పలేదు. మిమ్మల్ని స్నానాల ఘాట్ కి తీసుకెళ్ళడం ఎంత కష్టమో మీరు ఆలోచించలేదు. అలాగే మోసుకెళ్ళి మీకు స్నానం చేయించాల్సొచ్చింది. మళ్ళీ మీరు తిరుగు ప్రయాణంలో చిన్న తిరుపతి చూడాలన్నారు. అక్కడికీ తీసుకెళ్ళడం జరిగింది. అప్పుడు రానూ,పోనూ వ్యాన్ మాట్లాడుకుని వెళ్ళడానికి పదిహేను వేల రూపాయలైంది. ఆ డబ్బు సర్దుకోవడానికి వాడు ఎంత ఇబ్బంది పడ్డాడో నాకు తెలుసు. నాతో బాటు ఆఫీసులో ఇంకో నలుగురైదురు సర్దవలసి వచ్చింది. వాటినింకా తీర్చలేదనుకోండి"అంటూ ఆగి ఆమె వంక చూశాను. ఆమె అన్నీ వింటున్నట్టే అనిపించింది. ఇంక అసలు విషయం చెప్పాలనుకున్నాను.

"మళ్ళీ ఇప్పుడు పెద్ద తిరుపతి వెళ్ళాలి. వేంకటేశ్వరస్వామిని దర్శించుకోవడం ఇదే ఆఖరు సారవుతుందేమోనని అన్నారట. దానికి వాడు పడుతున్న బాధ ఇంతా అంతా కాదు. ఒక్కసారి ఆలోచించండి. ఈ రోజుల్లో తిరుపతి పోయి రావడం ఎంత కష్టమో  దర్శనం చేసుకోవడం కూడా అంతే కష్టమే. ఇప్పుడు మీరు అంత దూరం ప్రయాణం చేయగలరా? అలాగే వాడంత ఖర్చు భరించగలడా?రైల్లో ప్రయాణం చేయలేరు. ప్రత్యేకంగా మీరు పడుకోవడానికి వీలుగా వెహికల్ మాట్లాడుకోవాలి. కనీసం పాతిక,ముప్పయి వేలవుతాయి. ఒక్కరోజు వెళ్ళి మర్నాడు తిరిగొచ్చేది కాదు. మిమ్మల్ని తీసుకువెళితే నాలుగైదు రోజుల పైనే పడుతుంది తిరిగి రావడానికి.

మీరు తప్పకుండా వెళ్ళాలంటే వాడు కాదనలేడు. పి ఎఫ్ లోనో లేక బయట ఫైనాన్స్ లోనో తీసుకుంటాడు. మీరంటే అంతప్రేమ వాడికి. కాని మీరు కూడా ఆలోచించాలిగా వాడి గురించి. నేనిలా అంటున్నానని మీరు మరోలా అనుకోకండి. మీ మీద కోపంతోనో, వాడి మీద జాలితోనో అంటున్నది కాదు. వాస్తవం మాట్లాడుతున్నాను. మీరు పెద్దవారు. ఒక్కసారి ఆలోచించండమ్మా. మీరే కాదు మీలాంటి వాళ్ళంతా ఆలోచించాల్సిన విషయమిది. చాలా కుటుంబాల్లో ఇలాంటి సంఘటనలు జరుగుతుంటాయి. పెద్దవాళ్ళని నిర్లక్ష్యం చెయ్యాలి, వాళ్ళ కోర్కెలను తీర్చకూడదు అని చెప్పడం నా ఉద్దేశం కాదు. మీరున్న పరిస్థితి, పిల్లల ఆర్థిక పరిస్థితులను అర్థం చేసుకోవాలనే నేను చెప్పేది.

మీ బంధువులిళ్ళలో జరిగే పుట్టినరోజు,ఓణీలు, పంచెకట్టు ఫంక్షన్లకు మీరుసుధాకర్ని, రుక్మిణిలను వెళ్ళమని చెబుతుంటారు. అవి అంత అవసరమా చెప్పండి. అవి చేసే వారి కయ్యే ఖర్చు కంటే చూడటానికి వెళ్ళే వాళ్ళ బహుమతుల

ఖర్చు ఎక్కువగా  ఉంటుంది. చిన్న చిన్న ఉద్యోగులు వాటికి దూరంగా ఉండాలి కదా.

ఈ రోజు జరిగిందే చూడండి. సుధాకర్ని అమలాపురం పంపించారు. మీ మనవడిని చూసి రమ్మని. వాడేం చిన్నవాడు కాదు. బి.టెక్ రెండో సంవత్సరం చదువుతున్నాడు. మామూలు జ్వరం వచ్చి తగ్గింది. శుభ్రంగా కాలేజీకి కూడా వెళు తున్నాడు. వీడిప్పుడు వెళ్ళి వాణ్ణి చూసేదేముంది చెప్పండి. నిజానికిప్పుడు ఆఫీసులో ఇన్స్పెక్షను జరుగుతుంది. సెలవలివ్వడం లేదు. మీరు వారం రోజుల నుంచి గొడవ పెడుతున్నారట వెళ్ళి చూసి రమ్మని. ఆఫీసరు కాళ్ళవేళ్ళ పడితే ఈ పూట శాంక్షను చేశాడు. అదైనా లాసాఫ్ పే లో. మరి వీడి సెలవులన్నీ అయిపోయాయి. ఇట్లాంటివన్నీ ఖర్చుతో కూడుకున్నవే. వాడి ఆదాయమెంత వస్తుందో, ఇంట్లో ఖర్చులెంతెంత అవుతున్నాయో మీకు తెలియనిది కాదు. నేను చెప్పేదల్లా ఇటువంటి విషయాలన్నీ మిమ్మల్ని ఆలోచించమనే.

నేను మిమ్మల్ని బాధ పెట్టి వుంటే నన్ను క్షమించండి. నేనిలా మాట్లాడతానని సుధాకర్‌కి గాని,రుక్మిణికి గాని తెలియదు. వాళ్ళను తప్పు పట్టకండి. నేనిలా మాట్లాడానని కూడా వాళ్ళకు చెప్పకండి. సుధాకర్ చాలా  బాధ పడతాడు. మీరు ఏం చెయ్యాలనుకుంటున్నారో, ఎలా చెయ్యాలనుకుంటున్నారో అలాగే చెయ్యండి. అంతా మీ ఇష్టం”అంటూ చెప్పడం ఆపాను.

ఆమె ఆలోచనలో పడినట్లనిపించింది.

నిర్ణయాన్ని ఆమెకే వదిలేసి అక్కడ నుంచి నెమ్మదిగా బయటకొచ్చేశాను.

**( నవమల్లెతీగ మాసపత్రిక డిసెంబర్, 2018 లో ప్రచురితం )**

* * *

# అమ్మా... నాన్న... ఓ ఎంసెట్ అమ్మాయి

'వచ్చిందా....గుర్తొచ్చిందా...' తల్లి కంగారుగా అడుగుతుంటే, బేలగా చూసిందా అమ్మాయి తల్లి వంక. ఆమె కళ్ళ నిండా నీళ్ళు.

'నాకేం గుర్తుకు రావడం లేదమ్మా' బుగ్గల మీద జారుతున్నాయి కన్నీళ్ళు. కోపంగా కూతురు వంక చూసింది తల్లి. ఎంసెట్ పరీక్షా కేంద్రం జనంతో కిటకిటలాడుతోంది. హాల్లోకి వెళ్ళడానికి ఇంకా అరగంట టైముండటంతో ఎగ్జామ్ రాసే పిల్లలంతా టెన్షన్ టెన్షన్‌గా వున్నారు.

'అలా అంటే ఎలాగమ్మా...! గుర్తు తెచ్చుకో. ఇక టైం చూస్తే ఎంతో లేదు'అన్నాడు తండ్రి. ఆయన మాటలతో ఆ అమ్మాయి ఇంకా బెంబేలెత్తిపోయింది.

'నేను మొదట్నుంచి మొత్తుకుంటూనే ఉన్నాను. గుర్తుంచుకునేలా చదవ్వే అని. నా మాట ఎప్పుడైనా విందా. చూడండి ఇప్పుడెలా గుడ్లు తేలేస్తుంది"చీవాట్లు పెట్టింది. పరీక్ష రాసే ముందు అలా మాట్లాడకూడదని తెలియని తల్లి.

'ఇప్పుడు చూస్తున్నదేంటి బాటనీయా? అయితే అది మూసేసి జువాలజీ తీయు, ఇంకా అరగంట టైముందిగా, ఇదయ్యింతర్వాత ఫిజిక్స్,కెమిస్ట్రీ కూడా ఒకసారి చూడు' అన్నాడు తండ్రి. ఆ అమ్మాయికి అక్కడున్న రాయితో తల పగులకొట్టుకోవాలని పించింది. ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు వీరు. రాసేది ఎంసెట్ అనుకుంటున్నారా..? లేక క్వార్టర్లీ పరీక్షలనుకుంటున్నారా? ...హాల్లోకి వెళ్ళే ముందు ఎంత టెన్షన్ గా ఉ ంటుందో వీళ్ళకెంత చెప్పినా అర్థం కాదు. తనకే కాదు, అందరీ పరిస్థితి ఇంతే. కానీ తల్లిదండ్రులంతా ఇలాగే ప్రవర్తిస్తున్నారక్కడ. పుస్తకాలు తిరగేస్తుందన్నమాటే కానీ అక్షరాలేమీ కనిపించడం లేదు. అంతా గజిబిజిగా ఉంది. కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లున్నాయి. రాత్రి వంతుల వారీగా కూర్చుని తెల్లవార్లూ చదివించారు. ఏడ్పును అతి కష్టం మీద దిగమింగుకుందా అమ్మాయి. అక్కడ ఇలాంటి దృశ్యాలే అధికంగా కనిపిస్తున్నాయి.

పరీక్ష రాసే విద్యార్థుల్లో ఎంతో దైన్యం. తల్లిదండ్రులు పెట్టే ఒత్తిడి వలన ముఖాల్లో ఆందోళన. ఎందుకొచ్చిన చదువుర్రా భగవంతుడా...?అనుకుంటున్నారు కొందరు

విద్యార్థులు. 'టైం కావస్తోంది. పూర్తయ్యిందా చదవడం' అడిగింది తల్లి. ఆ అమ్మాయి ఏమీ మాట్లాడలేకపోయింది. అయినా ఏం మాట్లాడుతుంది. తననంత ఒత్తిడికి గురి చేస్తున్న తల్లిదండ్రుల మీద పీకల వరకు కోపమొచ్చింది. తనని మానసికంగా ఎంత హింస పెడుతున్నారు. తనకి మాత్రం ఎంసెట్ లో ర్యాంకు తెచ్చుకుని డాక్టరవ్వాలని ఉండదా? మరలాంటప్పుడు తననెందుకు బాధించడం. ఇవన్నీ పైకి చెప్పుకునేవి కావు.

ఒకవేళ చెప్పాలనుకున్నా, చెప్పే సమయమూ కాదు. పిచ్చెక్కిపోతుంది ఆమెకు. ఒక్కొక్కరే పరీక్ష హాలులోకి వెళుతున్నారు. తనని అప్పుడే వెళ్లనిచ్చేలా లేరు. ఇంకా టైముందిగా, కాస్సేపు పుస్తకాలు చూడమంటున్నారు. మెదడంతా శూన్యమైపోయింది. చదివినదంతా ఏమైపోయిందో అర్థం కావడం లేదు. తనని ఇప్పుడైనా వదిలిపెడితే ఓ పావుగంట రిలాక్సై పరీక్ష హాలులోకి వెళ్ళవచ్చు. ఇంక వాళ్ళ మాటల్ని లెక్క చేయకుండా పుస్తకాలను మూసేసింది.

'అదేంటే ఇంక చదవ్వా' అంది తల్లి కంగారుగా.

'ఏంటి చదివేది. ఇప్పుడు టైమెంతయ్యిందో చూశారా,లోపలికెళ్ళి సీటింగ్ చూసుకోవాలా...ఆఖరి నిమిషం వరకు ఇక్కడే ఉంటే నేను ఎగ్జామ్ రాసినట్లే'అంటూ తల్లీమీద విరుచుకుపడిందా అమ్మాయి. తల్లేం మాట్లాడలేకపోయింది. తండ్రి చేతిలోని వాటర్ బాటిల్ తీసుకుని ముఖం కడుక్కుని కొంచెం నీళ్ళు తాగింది. గుండెలా నిండా ఊపిరి పీల్చుకుని తల్లిదండ్రులతో మాట్లాడడం కానీ వాళ్ళని చూడడం కానీ చేయలేదు. మనసును ప్రశాంతంగా ఉంచుకుని అక్కడి నుంచి కదిలింది. గేటు దగ్గర హాల్ టికెట్ చూపించి లోపలికి నడిచింది.

\- - -

ఎగ్జామ్ హాలు నుంచి బయటకొస్తున్న కూతుర్ని దూరం నుంచే చూసి ఆమె దగ్గరకు పరిగెత్తుకెళ్ళారు తల్లిదండ్రులు.

'ఎలా రాశావు' ఏక కంఠంతో అడిగారిద్దరూ. ఏం చెబుతుంది. ఎలా రాసానని చెప్పగలదు. ఇది మామూలు పరీక్ష కాదు. ఆబ్జెక్టివ్ టైప్ ఎగ్జామ్. ఒక్క ప్రశ్నకిచ్చే నాలుగు సమాధానాలు ఇంచుమించు ఒకలాగే ఉంటాయి. అందులో ఒకటి ఎంపిక చేసుకోవడం మామూలు విషయం కాదు. తను అన్ని ప్రశ్నల్ని అటెంప్ట్ చేసింది. అందులో ఎన్ని రైటో, ఎన్ని తప్పో ఇప్పుడే తెలియదు. 'కీ' చూసుకోవాలి. కొన్ని ప్రశ్నలైతే గందరగోళంగా ఉన్నాయి. మరికొన్ని ప్రశ్నలకైతే రెండేసి జవాబులు కరెక్టుగా

ఉన్నాయి. అందులో ఏది ఎంపిక చేయాలో తెలియని గందరగోళ పరిస్థితి. ఇవన్నీ వారికి చెప్పినా అర్థం కాదు. బాగా రాశానని చెప్పినంత మాత్రాన సీటోస్తుందన్న గ్యారెంటీ లేదు. తల్లిదండ్రుల వంక అలా చూస్తుండిపోయింది.

'ఏంటే, అలా బెల్లం కొట్టిన రాయిలా ఉన్నావు. బాగా రాశావా, లేదా'కొంచెం కఠినంగానే అడిగింది తల్లి. ఆ అమ్మాయికి దుఃఖమొచ్చేసింది. తన మానసిక పరిస్థితి తెలుసుకోకుండా చిన్న పిల్లను అడిగినట్టు అడుగుతుంటే,ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఎంతో టెన్షన్ టెన్షన్ గా పరీక్ష రాసింది. కొంచెం కూడా రిలాక్స్ కాలేదు. కన్సియామ్ పేపర్ గురించి ఫ్రెండ్స్ తో కూడా చర్చించలేదు. అప్పుడే ఎలా రాసావంటే ఏం చెప్పాలి.

'అమ్మ అడుగుగుతోందిగా, సమాధానం చెప్పవేం?ఎలా రాశావు' తండ్రి కూడా అడగటంతో ఆ అమ్మాయికి నోరు విప్పక తప్పలేదు.

'బాగానే రాశాను' అంది నెమ్మదిగా.'

'అయితే సీటోస్తుందంటావా' ఠక్కున అడిగింది తల్లి. అక్కడ జరుగుతున్న శల్య పరీక్షకు తల పగిలిపోతున్నట్లుంది. తను రాసిన పరీక్ష పేపర్లో అడిగిన ప్రశ్నల కంటే, వీళ్ళ ప్రశ్నలకు జవాబులివ్వడం చాలా కష్టంగా ఉంది. సీటోస్తుందా? అంటే తనేం చెప్పాలి? అది తన చేతుల్లో ఉందా? ఏం మాట్లాడకుండా తండ్రి చేతుల్లోని వాటర్ బాటిల్ తీసుకుని తాగింది.

'దీని వాలకం చూస్తుంటే సరిగ్గా రాసుండదండీ! ఏం చేస్తాం. మన ఖర్మ. పదండి. ఇక్కడుండి చేసేదేముంది' అంటూ ముందుకు నడిచింది.ఆమె వెంట తండ్రి,వాళ్ళిద్దరిని ఆ అమ్మాయి అనుసరించింది. ఇంచుమించు అక్కడంతా ఇలాంటి సీన్లే ఉన్నాయి. తమ్మ పిల్లల్ని గుచ్చి గుచ్చి అడుగుతున్న తల్లిదండ్రులు, వాళ్ళకేం సమాధానం చెప్పాలో తెలియక బిత్తర చూపులు చూస్తున్న పిల్లలు ...ఎంతో తెలివైన పిల్లలు కూడా పరీక్ష రాసిన వెంటనే తమకు ఖచ్చితంగా ర్యాంకు వస్తుందని చెప్పలేని పరిస్థితి. ఆ విషయం తల్లిదండ్రులకు అర్థం కాదు. ఇంటికి వచ్చిందన్న మాటే గాని తల్లిదండ్రుల నస తగ్గలేదు. ఇంటర్మీడియట్ రెండు సంవత్సరాలే కాదు, లాంగ్ టార్మ్ కోచింగ్ తీసుకుని ఎంతో కష్టపడి చదివింది. ఎలాగైనా ఈ సంవత్సరం ర్యాంకు తెచ్చుకుని మెడిసిన్ లో సీటు సంపాదించాలని తపస్సు చేసింది. దానికి తగ్గట్టుగానే పరీక్ష రాసింది. కానీ ఫలితాలు వెలువడక ముందే సీటోస్తుందా అంటే తనేం చెప్పగలదు. 'కీ' వచ్చిన తర్వాత చూసుకుంటే అందులో నాలుగు తప్పులున్నాయి. తను వాటిని కరెక్టుగానే

రాశానని అనుకుంది. కానీ అవి తప్పులైపోయాయి. తనకొచ్చే మార్కుల్లో నాలుగు మార్కులు తగ్గడమంటే మాటలు కాదు.ర్యాంకు ఎక్కడికో పోతుంది. ఈ విషయం తెలిసి ఇంట్లో పెద్ద రాద్ధాంతమే జరిగింది. తల్లి నానా మాటలంది. తండ్రి అందుకు వంత పాడాడు. వారిద్దరూ తన మీద కక్ష కట్టినట్లు మాట్లాడుతున్నారు. వాళ్ళకి తనొక్కతే కూతురు. డాక్టర్ని చేయాలని కోరిక. పెద్దగా ఉన్నవాళ్ళు కాకపోయినా, తనను చదివించే స్థోమత ఉన్నవాళ్ళే.

తనను ఎంత త్వరగా డాక్టరుగా చూద్దామా అని చూస్తున్నారు. కానీ డాక్టరవ్వడం ఎంత కష్టమో,వాళ్ళు అర్థం చేసుకోరు. ఎంసెట్ ఎగ్జామ్ రాస్తే చాలు డాక్టరు చదివేయ్యొచ్చని అనుకుంటున్నారు. ఇంకో వారంలో ఫలితాలు వెలువడుతాయి. అప్పట్నుంచే ఆ అమ్మాయిలో టెన్షన్ మొదలయింది. సీటు వస్తుందా? రాదా? రాకపోతే ఇంట్లో తల్లిదండ్రులు పెట్టే హింస తను భరించలేదు. డాక్టరు కాలేకపోతే ఇక జీవితమే లేనట్టు వారు ప్రవర్తిస్తున్నారు. మానసికంగా తానెంత నలిగిపోతుందో వారు అర్థం చేసుకోవడం లేదు. ఇటువంటి సమయంలో తనకు సపోర్టుగా ఉండాల్సిన వాళ్ళే అలా ప్రవర్తించడం తను భరించలేకపోతోంది. తిండి సహించడం లేదు. నిద్ర పట్టడం లేదు.నీరసించిపోతోంది. ఫలితాలు వెలువడే రోజుదగ్గరపడే కొద్ది స్ట్రెస్ పెరిగిపోతోంది.

– – –

రేపే ఫలితాలు ప్రకటిస్తారని టీవీలో చెప్పారు. తనకంటే తల్లిదండ్రుల టెన్షన్ ఎక్కువైంది.

'దీనికి సీటోస్తుందంటారా'తండ్రిని అడుగుతోంది తల్లి. 'ఏమోనే దీని వాలకం చూస్తుంటే అలా అన్పించడం లేదు. సీటు రాకపోతే నలుగురిలో తలెత్తుకు తిరగలేము. మీ అమ్మాయికి సీటోచ్చిందా అని కనిపించిన ప్రతివాడు అడుగుతాడు. వారికి ఏం చెప్పాలో మరి' అన్నాడు తండ్రి.

'వాళ్ళ మాటలలా వుంచండి. మనం ఖర్చు పెట్టినదంతా వృథా అయిపోతుంది కదండీ. ఇప్పటికే ఇంటర్,కోచింగుకు కలిపి రెండు లక్షల పైనే అయ్యింది. సీటు రాకపోతే ఇదంతా గంగలో పోసినట్లే కదా! ఆ సొమ్ము పెట్టి అప్పుడో స్థలం కొన్నా, ఇప్పటికి ఐదింతలు అయ్యేది. ఈ మహాతల్లి రేపేం చేస్తుందో' తల్లి దీర్ఘాలు తీసింది. ఆమె మాటలు విన్న అమ్మాయి మనసు చివుక్కుమంది. వీళ్ళు ఇలా ఎలా మాట్లాడగలుగుతున్నారు? తనకంటే డబ్బు, పరువు ముఖ్యమా? బాధ పెట్టాలని మాట్లాడకపోయినా, తను బాధ పడుతుందని తెలియదా? తనేం చిన్నపిల్ల కాదు

కదా! మనసుకు చాలా కష్టంగా అనిపిస్తోంది.నిస్సహాయంగా ఉంది. తనకు సపోర్ట్‌గా ఉండాల్సింది పోయి అలా మాట్లాడటం ఆ అమ్మాయి తట్టుకోలేకపోతోంది. అప్పటికి వాళ్ళ మాటలని భరించలేక అడిగేసింది, 'ఎందుకమ్మా అలా మాట్లాడతారు. నేనేం మిమ్మల్ని అంత ఖర్చు పెట్టమని చెప్పలేదుగా.మెడిసిన్ చదవాలని మీరే పట్టుబట్టి బైపిసిలో చేర్పించారు. నా యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా మీ కోసం చదువుతున్నాను.నా శాయశక్తులా కష్టపడ్డాను. సీటొస్తుందో,రాదో నేనెలా చెప్పగలను? అది నా చేతుల్లో లేదుగా' తన మనసులోని బాధను మాటల్లో వెళ్లగక్కింది.

'నువ్వు అలాగే అంటావ్. ఇప్పుడు రాకపోతే వచ్చే సంవత్సరం తేచ్చుకుంటానంటావ్. అంతే కదా. నీ చదువు కోసం పోగు చేసిన సొమ్ము ఖర్చు పెడుతున్నాము. ఆ బాధ నీకు తెలియదు. మా సరదాలన్నీ మానుకుని నీ కోసం అన్ని అమర్చిపెడుతున్నాము. నీకు సీటు రాకపోతే, ఇంకో సంవత్సరం కోచింగుకు వెళతానంటావు. మా చేత మళ్ళీ బోలెడంత ఖర్చు పెట్టిస్తావు. నీకేం, నువ్వు హాయిగా చదువుకో.కట్టేవాళ్ళం మేమున్నాముగా'పిచ్చెక్కినట్టు మాట్లాడింది తల్లి. ఆ మాటలకు తట్టుకోలేకపోయింది ఆ అమ్మాయి. అమ్మ మాటలు అర్థమవుతున్నాయి. ఆ మాటల్లో తనకు సీటు రాదేమోనన్న బాధ అధికంగా ఉంది. కానీ తనేం చేయగలదు. రేపు నిజంగా సీటు రాకపోతే ఇంట్లో నా పరిస్థితి ఏమిటి? వాళ్ళనే మాటల్ని తను భరించగలదా? మనసంతా వికలమైపోయింది. తన నిస్సహాయ పరిస్థితిని తలుచుకుంటే, తన మీద తనకే జాలేస్తుంది. ఎందుకీ జీవితమనిపించింది. తనలాంటి పరిస్థితి, తన తల్లిదండ్రులలాంటివారు ఎవరికీ ఉండకూడదనుకుంది. తను ఎంతటి మానసిక క్షోభ అనుభవించాల్సి వస్తుంది. జీవితాంతం ఇంతే కదా! ఇప్పుడు చదువుకు ఖర్చు అయ్యిందంటారు. రేపు పెళ్ళికి ఖర్చు అయ్యిందంటారు. డబ్బుతో జీవితాన్ని లింకు మాట్లాడేవారంటే తనకు అసహ్యం. ఇక తన జీవితానికి అర్థం లేదనుకుంది. రాత్రంతా నిద్ర పట్టలేదు. రకరకాల ఆలోచనలు. నరాలు తెగిపోతున్నాయా అన్నట్లుంది. ఒక నిర్ణయానికొచ్చినట్లు అలా పైకి చూస్తూండిపోయింది.

– – –

తెల్లారి ఎంతసేపటికి తన గదిలోంచి బయటకు రాని కూతుర్ని లేపుదామని వచ్చిన తల్లి ఆ గదిలో సీలింగుకు ఉరి వేసుకుని వేలాడుతున్న కూతుర్ని చూసి ఓ పెద్ద కేక పెట్టింది. ఆ అరుపుకు కంగారుగా అక్కడికొచ్చిన తండ్రి అక్కడి పరిస్థితి చూసి నిశ్చేష్టుడయ్యాడు. ఎవరు తొందరపడ్డారు అనేందుకు సమాధానం దొరికేలోగా

జరగాల్సిన దారుణం జరిగిపోయింది. ఇరుగుపొరుగు వాళ్లొచ్చి ఆ అమ్మాయి శరీరాన్ని కిందకు దించారు. తల్లిదండ్రులిద్దరూ గుండెలు పగిలేలా ఏడుస్తున్నారు. అక్కడున్న వాళ్ళంతా వారిని ఓదారుస్తున్నారు. అంతలో ల్యాండ్ లైన్ ఫోన్ మోగింది. అక్కడున్న వాళ్ళల్లో ఒకరు ఫోన్ రిసీవర్ తీశారు. హైదారాబాద్ నుంచి వచ్చిన ఫోన్ అది. ఫలితాలు ప్రకటించారని, ఆ అమ్మాయికి 250 ర్యాంకు వచ్చిందని, ప్రభుత్వ కళాశాలలో సీటు వస్తుందని ఆ అమ్మాయి స్నేహితురాలు చెప్పింది. ఆ వార్త విన్న తల్లిదండ్రులు తమ కూతురి శవం వంక వెర్రి చూపులు చూస్తున్నారు.మీతో నాకేం పని అన్నట్టు ఆ అమ్మాయి నిశ్చింతగా శాశ్వతనిద్రలో ఉంది. అక్కడి వాతావరణం అంతా నిశ్శబ్దంగా మారిపోయింది.

**(నారీ భేరి మాసపత్రికలో ప్రచురితం.**
**విజయదశమి కథల పోటీల్లో ప్రథమ బహుమతి పొందిన కథ)**

* * *

# నిన్ను నువ్వు రక్షించుకో

**భ**ర్త ఫోటో ముందు నిలబడి తదేకంగా చూస్తుంది రక్షిత. ఫోటోలో నుంచి నవ్వుతూ చూస్తున్నాడు రాకేష్. ఫోటోకున్న దండను సరిచేసింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మంచం మీదున్న మూడేళ్ళ కొడుకు కదిలేసరికి కళ్ళు తుడుచుకుని వాణ్ణి మళ్ళీ నిద్ర పుచ్చింది.

రక్షిత, రాకేష్ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. ఇద్దరి పెద్దలు ఒప్పుకోకపోయినా వాళ్ళని కాదని దూరంగా వచ్చేశారు. రాకేష్ కి మంచి ఉద్యోగమే ఉంది. పెళ్ళయిన రెండేళ్ళకు బాబు పుట్టాడు. ఆనందంగా, హాయిగా జీవితం జరిగిపోతున్న సమయంలో వాళ్ళ జీవితంలోకి రాహువు ప్రవేశించి రాకేష్ ని తీసుకుపోయాడు.ఆఫీసుకు బైకు మీద వెళుతున్నప్పుడు వేగంగా వచ్చిన లారీ గుద్దెయ్యడంతో అక్కడిక్కడే కన్ను మూసాడు.

రక్షిత జీవితం అంధకారమైపోయింది. పాతికేళ్ళకే ఆమె సౌభాగ్యాన్ని దేవుడెత్తికెళ్ళిపోయాడు. తమని కాదని వెళ్ళిపోయారని రెండు కుటుంబాల వారూ దగ్గరకు చేరలేదు. వాళ్ళు రమ్మన్నా రక్షిత వాళ్ళతో వెళ్ళాలనుకోలేదు.

అయిదేళ్ళ వైవాహిక జీవితంలో అనుభవించిన ఆనందపు ఘడియల్ని రక్షిత మరిచిపోలేకపోతుంది. ప్రేమించి పెళ్ళి చేసుకున్న రాకేష్ లేని జీవితాన్ని ఊహించలేకపోతోంది. బాబు లేకపోతే తనూ రాకేష్ దగరకు వెళ్ళిపోయేదాన్నని ఎన్నోసార్లు అనుకుంది.

రాకేష్ పని చేసిన ఆఫీసులోనే రక్షితకు జూనియర్ అసిస్టెంట్ గా ఉద్యోగం యిచ్చారు. భర్త పోయి ఆరునెలలయింది. ఉద్యోగం వచ్చి మూడు నెలలయింది. బాబును చూడటానికి ఓ యాభై ఏళ్ళ స్త్రీ దొరికింది. కన్నబిడ్డలు నీ అవసరం లేదని బయటకు నెట్టేస్తే తనే ఆదరించి ఆమెను యింట్లో పెట్టుకుంది. తను ఆఫీసుకెళ్ళినప్పుడు ఆమె కంటి రెప్పలా బాబు ఆలనాపాలనా చూస్తుంది.

రక్షిత రెండు నెలలు బాగానే ఉద్యోగం చేసింది. మూడో నెల నుంచి ఆమెకు కష్టాలు ప్రారంభమయ్యాయి. ఆఫీసులో కొన్ని తోడేళ్ళు తనని పీక్కు తినడానికి తయారయ్యాయి. ఎప్పుడెప్పుడు సమయం దొరుకుతుందా అని చూస్తున్నాయి. మొదటి తోడేలు ఆఫీసులో బాస్ అయితే మిగిలిన రెండు ఆఫీసు సూపరెండెంటు, సీనియర్

అసిస్టెంటులు. రాకేష్ బ్రతికుండగా ఆఫీసులో అతన్ని ఎంతో గౌరవంగా చూసేవారు. ఫంక్షన్లు జరిగేటప్పుడు ఫ్యామిలీస్ కలిస్తే తనతో వీళ్ళంతా ఎంతో అభిమానంగా మాట్లాడేవారు. కానీ ఇప్పుడు రాకేష్ లేకపోయేసరికి వాళ్ళ నిజ స్వరూపాలను చూస్తున్నారు.

బాస్‌కి నలభై ఏళ్ళు0టాయి. అందమైన భార్య, యిద్దరు పిల్లలున్నారు. తనని చీటికి, మాటికి కేబిన్ లోకి పిలుస్తాడు. తన అందాన్ని పొగుడుతాడు. యవ్వనాన్ని వృథా చేసుకోవద్దంటాడు. సెలవు రోజుల్లో ఎక్కడికైనా వెళదాం రమ్మంటాడు. తను మౌనం వహించడం తప్ప ఏమీ  చేయలేకపోతున్నది. ఎదురు తిరిగితే తన ఉద్యోగానికి ముప్పోచ్చేలా ఉంది.

సూపరెండెంట్ కు యాభై ఏళ్ళు పైనే ఉంటాయి. భార్య పోయింది. ఎప్పుడూ ఆడాళ్ళను చొంగ కార్చుకుంటూ చూస్తుంటాడు. నాకు భార్య లేదు. నీకు భర్త లేడు మనిద్దరం పెళ్ళి చేసుకుందామా అంటాడు. పెళ్ళి చేసుకోకపోయినా తనని ఉంచుకుంటానంటాడు. అతని మాటలకు చచ్చిపోవాలనిపిస్తుంది.

ఇంక సీనియర్ అసిస్టెంటయితే  మరీను, తన ప్రక్క సీటే అతనిది. ఎప్పుడూ అసభ్యకరంగా మాట్లాడతాడు. తను వినాలని సెక్స్ గురించి మాట్లాడతాడు. తనని సెక్సీగా వర్ణిస్తూ లెటరు వ్రాసి ఫైల్లో పెట్టి పంపుతాడు. అప్సరలో మంచి ఇంగ్లీష్ సినిమా ఆడుతోంది. అందులో హాట్ హాట్ సీన్లున్నాయి సెకండ్ షోకి వెళ్దాం వస్తావా అనడుగుతాడు.

వాళ్ళ మాటలకు, చేష్టలకు ఏ విధంగానూ తను రెస్పాండ్ కావడం లేదు.

ఇంటికొచ్చి రాకేశ్ ఫోటో ముందు నిలబడి ఏడుస్తుంటుంది. రోజూ ఎందుకీ జీవితం అనిపిస్తుంది. భర్త లేని ఒంటరి స్త్రీ జీవితం యింతేనా? లైంగిక వేధింపులకు గురి అవ్వాల్సిందేనా? అసలు స్త్రీలకు రక్షణ లేని ఈ వ్యవస్థలో తనలాంటి ఒంటరి యువతికి రక్షణ వుంటుందా? స్త్రీకి రక్షణ  ఎప్పుడు  వుందని? జీవితాంతం అభద్రతాభావంతో బ్రతకవలసిందేనా? మగాళ్ళ దౌర్జన్యాలకు ఎంతమంది ఆడాళ్ళు బలయిపోతున్నారో.

ఎన్ని చట్టాలున్నా ఏ ఒక్క చట్టం కూడా స్త్రీని రక్షించలేకపోతోంది.

ఈ మధ్య ఢిల్లీలో జరిగిన వైద్యవిద్యార్థిని రేప్ కేసు ఎంత అలజడిని సృష్టించిందో అందరికీ తెలుసు. దేశమంతా అట్టుడిగిపోయింది. కానీ ఆ అమ్మాయికి జరిగిన అన్యాయానికి పరిష్కారం దొరికిందా? తన జీవితాన్ని ఆమెకు తిరిగి యివ్వగలిగిందా?

ఇప్పుడే కాదు గతంలో ఎంతోమందికి ఎన్నో అన్యాయాలు జరిగాయి. భవిష్యత్తులో కూడా జరుగుతాయి. జరిగినప్పుడు అలజడులు రేగడం, తర్వాత మామూలయిపోవడం ఇదంతా ఎప్పుడూ జరిగేదే. సంఘటన జరిగినప్పుడు ప్రభుత్వం, ప్రభుత్వ యంత్రాంగం హడావుడి చేస్తుంది. తర్వాత చల్లారిపోతుంది.

మరి ఆడవాళ్ళను రక్షించేదెవరు?

అసలు రక్షించే వ్యవస్థ అంటూ ఉందా? ఎప్పుడూ ఎవర్ని భక్షిద్దామా అని చూసే వ్యవస్థలో ఒకర్ని రక్షించడమనేది జరుగుతుందా! అంత నిస్వార్థంగా ఆలోచించే వాళ్ళున్నారా!

ముందు ముందు ఎవర్ని వాళ్ళే రక్షించుకోవాలేమో! రాకేష్ ఫోటో ముందు నిలబడి కన్నీళ్ళతో అడిగింది.

“ఇటువంటి పరిస్థితుల్లో నన్ను ఏం చెయ్యమంటావ్ రాకేష్ నాకేం పాలుపోవడం లేదు”అని.

ఈసారి ఫోటోలో నుంచి రాకేష్ నవ్వు ఏదో సందేశాన్నిచ్చినట్లనిపించింది.

“రక్షితా! నిన్నెవ్వరూ రక్షించరు. నిన్ను నువ్వు రక్షించుకోవలసిందే. అదెలా అన్నది నువ్వున్న పరిస్థితులను బట్టి వుంటుంది. అసలు ఎవరూ ఎవర్నీ రక్షించరు. ఎవరికి వారు రక్షణ కల్పించుకోవల్సిందే.తెల్సిందా”

నిజమే! నన్నెవరు రక్షిస్తారు. నన్ను నేను రక్షించుకోవలసిందే కదా. వాళ్ళతో గొడవ పెట్టుకుని ఉద్యోగం పోగొట్టుకోలేను. ఇది మానేసి ఇంకోచోట చేరినా అక్కడి పరిస్థితులు యింతకన్నా దారుణంగా వుండొచ్చు. ఏంచెయ్యాలి? ఎలాచెయ్యాలి? ఏంచేస్తే వాళ్ళు తన జోలికి రాకుండా ఉంటారు.రాత్రంతా ఆలోచిస్తూనే ఉంది రక్షిత.

– – –

మర్నాడు ఆఫీసులో ఆ ముగ్గురితో నవ్వుతూ మాట్లాడింది. వాళ్ళలో ఆశల్ని పెంచుతున్నట్లుగా సరదాగా వాళ్ళతో కబుర్లు చెప్పింది. పిట్ట దారిలోకొచ్చిందనుకున్నారు వాళ్ళు. వివిధ సమయాల్లో వాళ్ళు తమ సంగతేమిటని అడిగారు. రెండురోజుల్లో చెబుతానని వాళ్ళకు చెప్పింది. తర్వాత రెండు రోజులు ఆఫీసుకు వెళ్ళలేదు రక్షిత. వాళ్ళకి మతిపోయింది. కొంపతీసి మానెయ్యలేదు కదా అనుకున్నారు. మూడోరోజు ఆఫీసుకొచ్చింది రక్షిత. ఆమె ముఖమంతా పీక్కుపోయి లంఖణాలు చేసిన దానిలా ఉంది. వాళ్ళు కంగారు పడ్డారు. ఏం జరిగిందోనని బాస్ రక్షితను తన కేబిన్ లోకి పిలిపించాడు.

"ఏమిటి రక్షితా!అలా అయిపోయావు ఏమయింది"అనడిగాడు.

"రెండు రోజుల నుండి నీరసంగా వుంటుంది సార్. మొన్న విపరీతంగా ఫీవర్ వచ్చేసింది. టాబ్లెట్స్ వాడినా తగ్గలేదు. హాస్పటల్ కి వెళ్ళాను. డాక్టర్ బ్లడ్ టెస్టులు వ్రాసాడు. అన్ని టెస్టులు చేయించుకున్నాను. రిపోర్టులు కూడా వచ్చాయి."

ఆమె ముఖంలో రంగులు మారటాన్ని గమనించాడు బాస్.

"ఏమయింది రక్షితా! రిపోర్ట్స్ లో ఏముంది? డాక్టర్ ఏమన్నాడు? "

రక్షిత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కంగారుపడ్డాడు బాస్.

"ఏం జరిగిందో చెప్పు. నాకు చెప్పకూడదా"అనునయంగా అన్నాడు.

"చెప్పొచ్చు సార్! ఈ విషయం బయటకు తెలిస్తే నా పరువు పోతుంది. ఇందులో నా తప్పు ఎంతుందో నాకు తెలీదు. కానీ శిక్ష నేను అనుభవించాల్సిందే"అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

''రక్షితా! నువ్వు నన్ను అర్థం చేసుకోవడం లేదు. నేను నీ వాణ్ణి అనుకుంటున్నప్పుడు నీ రహస్యం నాది కాదా చెప్పు"

"అది కాదు సార్!రహస్యం ఒకరిలోనే ఉండాలి. అది రెండో వ్యక్తికి తెలిస్తే తప్పకుండా మూడో వ్యక్తికి తెలిసిపోతుంది. అందుకే అది నాలో వుండనివ్వండి" అంది బెక్కుతూ.

"లేదు రక్షితా! దేవుడి శిక్షగా చెబుతున్నాను నేనెవ్వరికి చెప్పను. నీకింకా నమ్మకం కలగటం లేదు కదూ. నా భార్యాబిడ్డల మీద ఒట్టేసి చెబుతున్నాను నీ రహస్యం నాతోనే వుంటుంది. నువ్వు నిర్భయంగా చెప్పొచ్చు"అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

అంతా  ఆమె అనుకున్నట్లుగానే జరుగుతున్నది.

"అవును సార్ ఇంక మీరే నాకు దిక్కు. అందుకే మీకే చెబుతున్నాను. దయచేసి ఎవరితోనూ అనకండి. నిన్న బ్లడ్ రిపోర్ట్ లో నాకు హెచ్.ఐ.వి పాజిటివ్ అని వచ్చింది. అది రాకేష్ వల్ల వచ్చింది కాదు. రాకేష్ పోయింతర్వాత క్షణికావేశంలో నేను చేసిన తప్పుకి ఫలితం ఇది"అంటూ తల దించుకుంది.

అంతసేపు రక్షిత చేతిని పట్టుకున్న బాస్ ఆ చేతిని ఠక్కున వదిలేశాడు. ఆ రియాక్షన్ రక్షిత ఊహించిందే.

"నేనొస్తాను సార్. ఇంక నేను మిమ్మల్నే నమ్ముకున్నాను. మీతో కలవడానికి నాకేం అభ్యంతరం లేదు! ఎప్పుడు రమ్మంటారో చెప్పండి"అంటూ అక్కడి నుంచి

లేచి వచ్చేసింది.

"గురుడు గింగిర్లు తిరిగుంటాడు"నవ్వుకుంటూ బయటపడింది. ఇంక చస్తే వీడు నా జోలికి రాడు. ఇదే ట్రిక్ ను మిగిలిన ఇద్దరి మీద సమయం చూసి ప్రయోగించాలి.

ఈ రహస్యం బయటకు రాదు కాబట్టి తనకొచ్చే నష్టమేమీ లేదు. చీకటిని తిడుతూ కూర్చునే కంటే వెలుతురు కోసం ప్రయత్నించినప్పుడే జీవితానికి సార్ధకత చేకూరుతుంది. తన సమస్యకిది ఎంతవరకు పరిష్కారమో తనకి తెలియదు. దీన్ని ఎవరూ హర్షించలేకపోవచ్చు. కానీ యింతకంటే మార్గం ప్రస్తుతానికి లేదు.

తనింక ప్రశాంతంగా ఉద్యోగం చేసుకోగలదు. తనని తాను రక్షించుకోవడానికి చేసే ఈ ప్రయత్నాన్ని రాకేష్ కూడా తప్పక హర్షిస్తాడు. తన జీవితాన్ని ఇంక నిర్భయంగా నడిపించుకోవచ్చు అనుకుంటూ ముందుకు అడుగులు వేసింది రక్షిత.

**( నవంబర్ 2013 –సాహితీ కిరణం మాసపత్రికలో ప్రచురితం )**

* * *

# గురుదక్షిణ

"**మీ**రు వచ్చేటప్పుడు అరటిపళ్ళతో పాటు తమలపాకులు కూడా మరచిపోకుండా తీసుకురండి"అంది శ్రీమతి. అలాగే అని చెప్పి బజారుకు బయల్దేరాను.

సాయంకాలం ఆరుగంటలు కావొస్తుంది. డిసెంబరు నెల. మార్గశిర మాసపు చలి కొంచెం ఎక్కువగానే ఉంది. నెమ్మదిగా నడుచుకుంటూ సెంటర్ కు చేరుకున్నాను. అక్కడ ఓ షాపింగ్ మాల్ పక్కనే చెట్టు కింద ఉన్న గంగమ్మ అరటిపళ్ళ బండి దగ్గరకు నడిచాను.ఆ బండి మీద దూరంగా కరెంటు స్తంభానికున్న ట్యూబ్ లైట్ వెలుగు పడినట్లుంది.పచ్చని పసిమిఛాయతో నుదుటి మీద రూపాయి కాసంత కుంకుమ బొట్టు పెట్టుకుని, నేరేడు పండు రంగు ముతక నేత చీరతో సాక్షాత్తూ ఆ గంగమ్మ తల్లిలాగే ఉంది గంగమ్మ. నన్ను చూసిన వెంటనే బ్యాటరీతో పని చేసే మినీ ట్యూబు లైట్ ని కింద నుంచి తీసి బండి మీద పెట్టి స్విచ్ ఆన్ చేసింది. అరటి పళ్ళతో నిండి వున్న ఆ బండంతా వెలుగుతో నిండిపోయింది. అరటిపళ్ళు బంగారంలా మెరిసిపోతున్నాయి.

"రండి సారో బోణీ చేయండి"అంది నవ్వుతూ.ఆమెకు అదో సెంటిమెంటు. నేను రోజూ ఆమె దగ్గరే అరటిపళ్ళు కొంటాను. ఒకటిరెండుసార్లు తను లైటు వేసిన వెంటనే కొన్నానట.అప్పుడామె పళ్ళన్నీ అమ్ముడై బాగా లాభం వచ్చిందట.అప్పటి నుంచీ నేను వెళ్ళాకే లైటు వెలిగించేది. నాకు అలాంటి సెంటిమెంట్లు లేవు. ఆవిడ నమ్మకాన్ని నేనెందుకు కాదనాలని నేనూ ఆ టైముకే వెళుతూ ఉండేవాడిని. నేను ప్రతిరోజూ ఓ డజనుపళ్ళు కొంటుంటాను. మా పిల్లలిద్దరికీ అరటిపళ్ళంటే చాలా ఇష్టం. మా ఆవిడా, నేను కూడా తింటాం. ఈ రోజు సాయంత్రం డజనుకొంటే రేపు సాయంత్రానికి ఒక్క పండు కూడా కనిపించదు. ఒక్కోసారి గంగమ్మే రోజూ ఇచ్చే పళ్ళకంటే రెండుపళ్ళు అదనంగా ఇచ్చేది. 'ఎందుకులే గంగమ్మా'అంటే 'బుడ్డోళ్ళు తింటార్లే సారూ'అనేది నవ్వుతూ.

నేను, నా భార్యా కాలేజీ లెక్చరర్లం.మాకిద్దరు మగపిల్లలు ఎనిమిదేళ్ళు ఒకరికి, ఆరేళ్ళొకరికి. వాళ్ళు కూడా గంగమ్మకు బాగా తెలుసు. నలభైయేళ్ళ మనిషి గంగమ్మ. పొట్టీ పొడుగు కాకుండా మధ్యస్థంగా ఉంటుందని చెప్పాలి. ఆమెలో అందంకంటే

ముఖంలో కళ ఎక్కువ. నాకంటే నాలుగైదేళ్ళు పెద్దదే. ఆమె అంటే మా అందరికీ ప్రత్యేక అభిమానం. తన జీవితం గురించి మాకు తెలియడమే ఆ అభిమానానికి కారణమనుకుంటాను. గంగమ్మది ఒక విషాదకరమైన జీవితం. సుమారు ఇరవైఏళ్ళ క్రితం పనీ పాటూ లేకుండా తిరుగుతున్న భర్తను తీసుకుని కృష్ణాజిల్లా నుంచి మా కోనసీమకు వచ్చిందట. వాళ్ళ ఊళ్ళో ఉంటే బాధ్యత లేకుండా తిరుగుతున్నాడని, ఇక్కడ ఏదైనా పనిచేసుకుని అంతా హాయిగా బతకొచ్చనుకుంటే ఆ భర్త ఇక్కడా అలాగే తయారయ్యాడు. రోజూ తాగడం, జర్దాకిళ్ళీ వేసుకుని నమలడం ఇదే పని. మొత్తం మీద వాడి అలవాట్ల వల్ల వాడు కేన్సర్ పేషంటు అయ్యాడు. ఇప్పుడు చివరి దశలో ఉన్నాడు. ఇంక కొన్ని నెలలే అని డాక్టర్లు చెప్పేశారు. వాళ్ళకి ఇద్దరు ఆడపిల్లలు. టెన్త్ ఒకరు,నైన్త్ ఒకరు చదువుతున్నారు. వాళ్ళని బాగా చదివించాలని కష్టపడుతూ ఉంటుంది. పగలంతా రెండుమూడు ఇళ్ళల్లో పని చేసి సాయంకాలం ఐదుగంటల నుంచి తొమ్మిదిగంటల వరకు అరటి పళ్ళు అమ్ముతుంది. ఎంత సంపాదించినా భర్త మందులకు, పిల్లల చదువులకు ఖర్చయిపోతుందని వాపోతుంది.

ప్రతిరోజూ సాయంత్రం గంగమ్మ అరటిపళ్ళ బండి దగ్గరకు రావడం అలవాటైపోయింది నాకు. అప్పుడప్పుడు నాతోపాటు శ్రీమతి కూడా వస్తుండేది. ఏ రోజైనా గంగమ్మ ఖాళీగా ఉన్నప్పుడు "ఒదినమ్మను తీసుకురాకపోయారా సారో"అనేది.

"అదేంటి గంగమ్మా నీకన్నా చిన్నవాళ్ళం కదా ఒదినమ్మా అంటావేం"అనంటే, "మీరు చదువులోను, ఉద్యోగాల్లోను చాలా పెద్దోళ్ళు సార్"అంటూ నవ్వేసేది. ఆమె నవ్వు నిష్కల్మషంగా ఉండేది. అలా గంగమ్మ మాలో ఒకర్తెగా మారిపోయింది. అప్పుడప్పుడు గంగమ్మ పడుతున్న కష్టాల గురించి మాట్లాడుకునే వాళ్ళం. మేమిద్దరం ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నాం కాబట్టి గంగమ్మ పిల్లల కాలేజీ చదువు విషయంలో సాయపడాలనుకున్నాం. ఓసారి పదిహేను రోజుల పాటు గంగమ్మ బండి పెట్టలేదు. మూడురోజుల వరకూ ఏమి అనిపించలేదు ఏదైనా అనారోగ్య సమస్యేమో అనుకున్నాను. కానీ వారమైనా పెట్టకపోయేసరికి ఏం జరిగిందో అనే ఆతృతతో ఆ పక్కనుండే కూరగాయల దుకాణంలో అడిగాను గంగమ్మ సంగతి.

"మీకు తెలీదా సార్ ఆమె భర్త పోయాడుగా, ఇంకో పదిరోజులవరకూ రాకపోవచ్చు"అన్నాడతను.

ఆ విషయం తెలిసాక చాలా బాధపడ్డాం. కానీ ఏం చేయగలం. మరో పదిరోజుల తర్వాత బండి పెట్టింది గంగమ్మ. అది తెలిసి నేనూ, శ్రీమతి వెళ్ళి పరామర్శించాం.

మమ్మల్ని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుందామె.

"ఆ మనిషి బతికున్నా,పోయినా నేను సుకపడిందేమీ లేదు సారూ. అంతా నా ఖర్మ. గత జన్మలో ఎంతో పాపం చేసుంటాను అందుకే ఈ జన్మలో నానాకష్టాలు పడుతున్నాను"అంది గంగమ్మ కళ్ళు తుడుచుకుంటూ. భర్త పోయాక గంగమ్మ ఆహార్యంలో ఏం మార్పులేదు. అదే బొట్టు.అదే రకం చీర. మా భావం కనిపెట్టినట్లుంది.

"ఆ మనిషిపోయాక బొట్టు తీసేసి తెల్లచీర కట్టుకోమన్నారంతా. కానీ దానికి నేనూ,పిల్లలు ఒప్పుకోలేదు. మొగుడున్నప్పుడే పోకిరీగాళ్ళతో గోలగా ఉండేది సారు. ఆ ఎదవలకు ఆడోళ్ళ వయసుతో పన్లేదు. తెల్ల చీర కట్టుకుని పళ్ళమ్ముకుంటుంటే మొగుడులేని దాన్నని తెలిశాక నన్ను బతకనిస్తారా సారూ"అంది బాధగా. నిజమే కదా అనిపించింది. ఈ మధ్యే ఓ యువకుడు తనకి పెద్దమ్మ వరసైన అరవై యేళ్ళు పైబడిన వృద్ధురాలిని మానభంగం చేసి హత్య చేసిన సంఘటన విన్న తర్వాత, సమాజం ఎంత వికృతంగా తయారయ్యిందో కదా అనిపించింది. అలాంటి సంఘటనలు ఎన్నో జరుగుతున్నాయి. వాటికి పరిష్కారాలు మాత్రం దొరకడం లేదు. గంగమ్మ ఎప్పటిలాగే అరటిపళ్ళు అమ్ముకుంటూ, పిల్లల్ని చదివించుకుంటూ కష్టపడుతోంది. కాలం నెమ్మదిగా సాగిపోతోంది. శ్రీమతి, పిల్లలు రెండురోజుల పాటు సెలవుపెట్టి ఎటన్నాపోయొద్దామని గొడవపెట్టారు. ఆదివారం కలిసొచ్చేలా మూడు రోజులు సెలవు పెట్టి శ్రీశైలం వెళ్ళాం. మల్లికార్జున స్వామిని, భ్రమరాంబికాదేవిని దర్శనం చేసుకుని అక్కడినుంచి మహానంది వెళ్ళాం. ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలన్నీ చూసి నాలుగోరోజు అర్ధరాత్రి ఇంటికి చేరుకున్నాము. తెల్లారి ఏడుగంటలకు పనిమనిషి కాలింగ్ బెల్ కొట్టేవరకు మెలకువ రాలేదు. కాలేజీకి వెళ్ళాలి కాబట్టి ఇద్దరం లేచాం. నేను వెళ్ళి మెయిన్‌డోర్ తీశాను. పనిమనిషి లోపలికొస్తూ "ఈ సంగతి తెలుసా సారూ" అంది. "ఏంటి" అన్నాను విసుగ్గా. నిద్ర సరిపోలేదు కాబట్టి తలంతా దిమ్ముగా ఉంది,"అరటి పళ్ళమ్మే గంగమ్మ చచ్చిపోయింది సార్."

"ఏంటి నువ్వు చెప్పేది..." అన్నాను అర్థం కాక.

"అవును సారూ ఆమెనెవరో పాడుచేసి చంపేశారు" అంది. నెత్తిమీద పిడుగు పడినట్టైంది. మత్తంతా వదిలిపోయింది. సోఫాలో కూలబడిపోయాను.

అంతలో శ్రీమతి అక్కడికొచ్చి "ఏం జరిగిందండీ" అంది.

"గంగమ్మను ఎవరో రేప్‌చేసి చంపేశారట!" బిత్తరపోయిందామె.

"ఏం చెబుతున్నారండీ గంగమ్మను రేప్ చేసి చంపడమేంటి" ఆమె కళ్ళనిండుగా

నీళ్ళు నా కళ్ళలో కూడా నీళ్ళు తిరిగాయి.

"ఎలా జరిగిందే ఈ దారుణం" అని పనిమనిషినడిగింది శ్రీమతి.

"మీరెళ్ళిన రాత్రే జరిగిందమ్మా. ఎప్పటిలాగే తొమ్మిది గంటలకు ఇంటికిపోలేదు. అరటిపళ్ళు ఎక్కువగా అమ్ముడుపోలేదని తెల్లారితే పాడైపోతాయని పది దాటేవరకూ ఉందటమ్మా. ఆ తర్వాత బండి నెట్టుకుంటూ ఇంటికి బయలుదేరిందట. ఆమె ఇంటికి చిన్నసందులో నుంచి ఫర్లాంగు దూరం వరకు వెళ్ళాలి. చీకటిగా ఉంటుంది ఆ సందు. అక్కడ కాపుకాసి నలుగురు కుర్రోళ్ళు ఆమెను చెరిచి, ఎవరికైనా చెబుతుందేమోనని చంపేసిపోయారంట".

మా ఇద్దరికీ దుఃఖం ఆగలేదు. ఎందుకిలా జరిగింది? ఎంత దారుణమైన సంఘటన. ప్రతిక్షణం గంగమ్మే గుర్తుకు వస్తోంది. 'బోణీచేయండి సారో' అంటూ పిలుస్తున్నట్లుంది.ఆమె అనేది కరెక్టేనా. నేను బోణీ చేస్తేనే బాగా పళ్ళు అమ్ముడయ్యేవా? నిజంగా సిల్లీ క్వశ్చన్! బోణీ చేయడానికి, అమ్ముడవ్వకపోవడానికి సంబంధం లేదు. ఆ కుర్రాళ్ళేవరో ఆమె అనుమానించినట్లుగానే గంగమ్మమీద కన్నేశారు. అవకాశం వచ్చింది, ఒంటరిగా కనిపించింది కాటేశారు. ఎంత దుర్మార్గం. నలుగురు కుర్రాళ్ళట. వాళ్ళతల్లి వయసుంటుంది ఆమెకు. ఆ నికృష్టులకు ఆ సమయంలో వాళ్ళతల్లి గుర్తుకురాలేదా? నేనులేని నాలుగురోజుల న్యూస్‌పేపర్లు బయట వరండాలో పడి ఉంటే వాటిని తీసుకుని తిరగేశాను. వాటిని చదువుతుంటే రక్తం మరిగిపోయింది.

ఒక్కో పేపరులోని వార్త చదువుతుంటే గుండె తరుక్కుపోతుంది. ఆ ఘోరానికి సంబంధించిన విషయాలతోపాటు ఫొటోలు కూడా ప్రచురించారు. ఆమె ఇంటికెళ్ళే సందులో విగతజీవిగా ఓ పక్కన పడున్న గంగమ్మ, ఒంటిమీద బట్టలన్నీ చీలికలైవున్నాయి. అరటిపళ్ళన్నీ రోడ్డుమీద చెల్లాచెదురుగా పడీ ఉన్నాయి.బండి ఒకపక్కన పడి ఉంది. ఆ ఫొటోలు చూస్తుంటే మనసంతా ఏదోలా అయిపోయింది. మరో పేపరు ఇంకో ఘోరమైన వార్త రాసింది. గంగమ్మను మానభంగం చేసిన నలుగురు కుర్రాళ్ళను అక్కడ దొరికిన ఆనవాళ్ళనుబట్టి పోలీసులు అరెస్ట్ చేశారని, కానీ సరైన సాక్ష్యాధారాలు లేకపోవడం వల్ల వాళ్ళని వదిలేశారని రాసింది. ఇంకో పేపరైతే వాళ్ళ నలుగురిలో ఒకడు మాజీ పోలీసు అధికారి కొడుకని, మరొకడు మేయరు తమ్ముడి కొడుకని, ఇంకొకడు ఎమ్మెల్యే మేనల్లుడని, నాలుగోవాడు ఎంపీగారి అనుచరుడి కొడుకని... ఇలా రాజకీయనాయకులందరూ వాళ్ళమీద కేసులేకుండా చేశారని రాసింది. ఎంతఘోరం. ఇలాంటి సపోర్టు ఉన్నప్పుడు ఎలాంటి వాడైనా

ఎలాంటి నేరమైనా నిర్భయంగా చేస్తాడు.

మేం శ్రీశైలం వెళ్ళడానికి రెండురోజులు ముందే దిశను మానభంగంచేసి హత్యచేసినవాళ్ళను ఎన్‌కౌంటర్ చేశారు. ఆ సంగతి తెలిసి కూడా వీళ్ళింత ధైర్యంగా ఇంత దుర్మార్గానికి పాల్పడ్డారంటే తమకేం జరక్కుండా చూసే వాళ్ళున్నారనే కదా. ఏమైపోతోందీ వ్యవస్థ! ఇంక అన్యాయం జరిగినవాళ్ళకిన్యాయమెలా జరుగుతుంది. అందుకే ఈ మానభంగాలు, హత్యలు.

– – –

వారం రోజులు గడిచినా గంగమ్మ కేసులో పురోగతి లేదు. ఇంకా కొన్ని రోజులు గడిస్తే, ఈ విషయం అంతా మరచిపోయినా ఆశ్చర్యంలేదు. నేనేమీ చేయలేని పరిస్థితి. చేసేది గవర్నమెంటు ఉద్యోగం. ఏం మాట్లాడినా నా ఉద్యోగానికే ప్రమాదం. నా నిస్సహాయతకు నామీద నాకే అసహ్యమేసింది.ఓ సాయంత్రం బయటకొచ్చాను శ్రీమతి,పిల్లలు సినిమాకి వెళ్ళారు. నన్ను రమ్మన్నారు కానీ ఏదీ ఒప్పుకాని సమయంలో ఈ తప్పెవరిది? అన్నదానికి సమాధానం చెప్పడం చాలా కష్టం. ఈ మధ్య సెంటర్‌వైపు వెళ్ళడం లేదు. అరటిపళ్ళు కూడా సరిగ్గా కొనడం లేదు. వాటిని చూస్తుంటే గంగమ్మే గుర్తుకొస్తోంది. అలా నడుస్తుంటే రోడ్ పక్కనున్న వీధిలో చిన్నహోటల్ ఉంటే అందులోకెళ్ళాను. తలంతా దిమ్ముగా ఉండటంతో, టీ తాగాలనిపించింది. అక్కడక్కడ కొద్దిమంది కూర్చుని ఉన్నారు. ఓ టేబులు దగ్గరకెళ్ళి కూర్చున్నాను. ఓ మూలనున్న టేబుల్ దగ్గర నలుగురు కుర్రాళ్ళు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. చాలా వల్గర్ జోక్స్ వేసుకుంటున్నారు. వాళ్ళు మాట్లాడుకునే మాటలు నాకు క్లియర్‌గా వినిపిస్తున్నాయి.

“అదృష్టమంటే మనదేరా” అన్నాడొకడు.

“దేనికిరా” అన్నాడు ఇంకొకడు.

“అదేంట్రా అప్పుడే మరచిపోయారా. మొన్నేకదరా మన నలుగురం బోణీ కొట్టాం. జున్నుముక్కలాంటి ఆ పళ్ళమ్ముకునేదాన్ని నంజుకుని తిన్నాం కదరా,ఏం సుఖమిచ్చిందిరా. పెద్దదైనా కన్నెపిల్లలా ఉంది.”

“దాని మొగుడు రోగిష్టోడురా. అయినా వాడు సచ్చాదుగా అలా ఉండక ఎలా ఉంటుంది'' నవ్వుతూ అన్నాడొకడు. నాకు వాళ్ళని చూస్తుంటే కోపం నషాళానికంటింది. నన్ను నేను కంట్రోలుచేసుకోలేకపోతున్నాను. దేవతలాంటి గంగమ్మను అతి కిరాతకంగా మానభంగంచేసి చంపేసిన రాక్షసులువాళ్ళే. వాళ్ళని

గొంతు పిసికి చంపెయ్యాలనిపించింది. వెంటనే నన్ను నేను సముదాయించు కున్నాను. ఏం చెయ్యాలి? ఆలోచనలో పడ్డాను. మొబైల్ తీసి ఏవో మెసేజ్‌లు చూస్తున్నట్టుగా వాళ్ళ నలుగురినీ ఫొటోలు తీశాను ఎందుకైనా మంచిదని. సడెన్‌గా నాకు మహేష్ గుర్తుకొచ్చాడు.

ఈ రోజు మధ్యాహ్నమే కాలేజీలో ఉండగా మహేష్ నుంచి ఫోనొచ్చింది. "సార్ మీ ఊరు వచ్చాను. మిమ్మల్ని కలుస్తాను సార్" అన్నాడు.

నేను ఈ ఊరు రాకముందు చాలా సంవత్సరాలు ప్రకాశంజిల్లాలో పనిచేశాను. అక్కడ మహేష్ నా స్టూడెంట్. డిగ్రీ అయ్యాక పోలీస్ సెలక్షన్స్‌లో ఎస్.ఐగా సెలక్టయ్యాడు. అదే జిల్లా ఎస్.ఐగా ఐదు సంవత్సరాల నుంచి పనిచేస్తున్నాడు. అప్పుడప్పుడు నాకు ఫోన్‌లో టచ్‌లో ఉంటాడు. నా అభిమాన స్టూడెంట్.

"ఏంటి మహేష్ విశేషాలు మా ఊరు ఎందుకు వచ్చావు?" అన్నాను.

"మా జిల్లా దొంగలు మీ జిల్లాలోపడ్డారు సార్. మీ ఊళ్ళో ఓ బంగారుదుకాణంలో దొంగతనం చేశారు. ఐదుగురిలో ఒకడు దొరకడంతో మిగిలిన నలుగురూ పారిపోయారు. వాళ్ళని పట్టుకుని అక్కడి కోర్టులో హాజరుపరచడానికి తీసుకొచ్చాను సార్. ఆ తర్వాత వాళ్ళని పోలీస్‌స్టేషన్‌లో అప్పజెప్పి తిరిగి పోదామనుకుంటున్నాం. మిమ్మల్ని ఒకసారి కలుద్దామనుకుంటున్నా, మీ దగ్గరకు వద్దామనుకుంటున్నాను సార్" అన్నాడు.

"అయితే ఓ పని చెయ్యి మహేష్ ఇప్పుడునా వర్క్ పూర్తయిపోయింది ఇంటికి వెళుతున్నాను. ఇంటికొచ్చెయ్యి" అన్నాను.

"అలాగే సార్" అన్నాడు.

మహేష్ ఎప్పుడు డ్యూటీమీద ఈ ఊరువచ్చినా నన్ను కలవకుండా వెళ్ళడు. నేను ఇంటికెళ్ళిన అరగంటకి వచ్చాడు. టీ తాగి కాస్సేపు రిలాక్సయ్యాడు. అతను ఎప్పుడొచ్చినా ప్రయివేట్ వెహికిల్లో వస్తాడు. అరడజనుమంది కానిస్టేబుల్స్ బయట వ్యాన్‌లో కూర్చుని ఉన్నారు.

"ఏంటి సార్ మీ ఊళ్ళో కూడా దిశ లాంటి సంఘటనే జరిగినట్లుంది" అన్నాడు.

అప్పుడు గంగమ్మ గురించి అంతా చెప్పాను. జరిగిందానికి చాలా బాధపడ్డాడు మహేష్.

"ఇలాంటి సంఘటనలన్నీ దేశమంతా జరుగుతున్నాయి సార్. కొన్నే బయటకు

వస్తున్నాయి. వ్యవస్థ కుళ్ళిపోయింది సార్. చట్టాలు లోపభూయిష్టంగా ఉన్నాయి. మా పోలీసుల కాళ్ళు చేతులు కట్టేస్తున్నారు. పిల్లలపెంపకం బాగోలేదు. మాకు పూర్తి స్వేచ్ఛ ఇస్తే ఇలాంటివాళ్ళని ఏరి పారేస్తాం సార్",అన్నాడు ఉద్రేకంగా.

"గంగమ్మ విషయంలో నువ్వు ఏమైనా చేయగలవా?"

"ఇక్కడింత పోలీసు వ్యవస్థ ఉండగా నేనొక్కడినీ ఏం చేయగలను సార్"

"తలుచుకుంటే నువ్వు చేయగలవు మహేష్.గంగమ్మను అంత కిరాతకంగా చంపినవాళ్ళని ఊరికే వదిలి పెట్టకూడదు. వాళ్ళ వివరాలు సేకరిస్తాను. వీలు చూసుకుని నీకు తెలియజేస్తాను. ఈలోగా ఎలాచేస్తే, ఏంచేస్తే నీకు ఇబ్బందిలేకుండా ఉంటుందో ఆలోచించు. సరేనా".

"ఇంతవరకు మీరు నన్నేమీ అడగలేదు సార్. నాకేమాత్రం అవకాశమున్నా నేను శాయశక్తులా ప్రయత్నిస్తాను సార్" అని మాటిచ్చి, "ఈ రాత్రి భోజనం చేసి బయలుదేరి వెళ్ళిపోతాం సార్ అని చెప్పిన విషయం నాకు ఆ క్షణంలో గుర్తుకు వచ్చింది.

టీ తాగి ఆ నలుగురి వంక చూశాను. వాళ్ళింకా టిఫిన్లు తింటున్నారు. వెంటనే నేను తీసిన ఫొటో మహేష్‌కి వాట్సాప్‌లో పంపి నేనూ, వాళ్ళూ ఎక్కడున్నదీ షేర్ చేశాను.

పావుగంటలో వస్తున్నామని వాళ్ళని జాగ్రత్తగా గమనించమని మెసేజ్ చేశాడు.

వాళ్ళు ఎలాగూ టిఫిన్ తిని టీ తాగేసరికి పావుగంట పడుతుంది కాబట్టి నేను అక్కడే ఉండటం మంచిది కాదని హోటల్ నుంచి బయటకొచ్చి లోపలున్నవాళ్ళు కనపడేలా ఓ పక్కన నిలబడ్డాను. వాళ్ళు నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు. లోపలవాళ్ళు తప్ప ఎవరూ లేరు. కౌంటరు దగ్గర ఓ వ్యక్తి కూర్చున్నాడంతే.

పావుగంటకన్నా ముందే ఓ వ్యాన్ వచ్చి హోటలు ముందు ఆగింది. వ్యాన్‌కి నెంబరు తీసేసి ఉంది. వ్యాన్‌లో నుంచి మహేష్‌తోపాటు మరో ఆరుగురు కానిస్టేబుల్స్ దిగి పరుగునలోపలికి వెళ్ళిన వెంటనే జేబుల్లోవున్న పిస్టల్స్ తీసి ఆ నలుగురి కణతలమీద ఆనించి వాళ్ళని అక్కడినుంచి ఎంతవేగంతో లోపలికెళ్ళారో అంతే వేగంతో వాళ్ళు తేరుకునే లోపల తీసుకొచ్చి వ్యాన్‌లోకి నెట్టారు. అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయింది ఆ వ్యాన్. ఆ వీధికి ఆ చిన్న హోటల్‌కి సీసీ కెమెరాలు లేవు కాబట్టి ఎవరు తీసుకెళ్ళారో ఎవరికీ తెలిసే అవకాశం లేదు. నెమ్మదిగా అక్కడి నుంచి కదిలిఇంటికి చేరుకున్నాను. చాలాసేపటికి సినిమానుంచి శ్రీమతి, పిల్లలు వచ్చారు.

జరిగిందేమీ వాళ్ళకి చెప్పలేదు.

"మహేష్ వెళ్ళిపోయాడా?"అడిగింది శ్రీమతి.

"ఈ రాత్రికి వెళ్ళిపోతానన్నాడు. వెళ్ళిపోయుంటాడు" అన్నాను.

"చాలా మంచి అబ్బాయి మీ మాటంటే వేదం అతనికి" అంది.

"అవును నేనేం చెప్పినా కాదనకుండా చేస్తాడు"

తెల్లారితే ఎలాంటి న్యూస్ వింటానో అని కొంచెం టెన్షన్‌గావున్నా అంతా సక్రమంగానే జరుగుతుందనుకున్నాను.

రాత్రి చాలా ఆలస్యంగా నిద్రపోయానేమో త్వరగా మెలకువరాలేదు.

శ్రీమతి కంగారుగా వచ్చి నన్ను నిద్రలేపింది.

"ఏమండి త్వరగా లేవండి. గంగమ్మను చంపిన నలుగురినీ ఎవరో ముక్కముక్కలుగా నరికి ఊరవతల రోడ్డు పక్కన పారేసి పోయారటండి టీవీలో చూపిస్తున్నారు" అంది ఎంతో ఉద్వేగంగా. నాకేమీ తెలియనట్లుగా "నిజమా" అన్నాను ఆశ్చర్యంగా.

నన్ను లాక్కొంటూవెళ్ళి టీవీ ముందు కూర్చోపెట్టింది.శ్రీమతి ముఖంలోను, పిల్లలముఖాల్లోను ఆనందం తాండవిస్తోంది. టీవీలో ఆ దృశ్యాలు చాలా భయంకరంగా ఉన్నాయి. ఆ నలుగురి శరీరాలనుంచీ కాళ్ళూ చేతులూ వేరుచేసి దూరంగా విసిరేశారు. తలలు నరికేసినట్లు మెడనుంచి వేరుపడి ఉన్నాయి. ఎంతో కక్షతో చేసిన హత్యల్లా ఉన్నాయి. టీవీల్లో రకరకాల విశ్లేషణలు. ఈ హంతకుల్ని ఉరితీయాలని ఓ రాజకీయనాయకుడు గొంతుచించుకుని అరుస్తున్నాడు. ఆ చంపినవాళ్ళెవరో పట్టుకోవడం ఎవరి తరం కాదు. ఎటువంటి ఆధారాలులేవని టీవీవాళ్ళు చెబుతున్నారు. శవాలన్నీ వైజాగ్ వెళ్ళే రహదారి పక్కన పడివున్నాయి. మహేష్ వాళ్ళు వెళ్ళేది విజయవాడవైపు. చాలా తెలివిగా ప్రవర్తించారు. ఆ శవాల దగ్గర తల్లిదండ్రులు తలబాదుకుంటూ ఏడుస్తున్నారు. మహేష్ అన్నట్లు వాళ్ళు పిల్లల్ని సక్రమంగా పెంచి ఉంటే ఈ వేళ ఇలా తలబాదుకోవలసిన అవసరం ఉండేది కాదు కదా. అంతా హర్షం వ్యక్తం చేస్తున్నారు. తర్వాత పరిణామాలగురించి నేను ఆలోచించలేదు. గంగమ్మ ఆత్మ శాంతించి ఉంటుందని మాత్రం చెప్పగలను.

నేను చేసింది తప్పో, ఒప్పో నాకు తెలియదుగానీ నా తోబుట్టువులాంటి గంగమ్మకు జరిగిన అన్యాయానికి పరిష్కారం ప్రస్తుతం ఉన్న ఈ వ్యవస్థలో ఎవరివల్లా కాదని

తెలుసు. అందుకే మహేష్‌ను ఉపయోగించుకున్నాను. అతని సహకారం ఎప్పటికీ మరచిపోలేను. మహేష్‌కి ఇలాంటివేమి కొత్తేమీ కాదు. ఆ జిల్లాలో ఎంతోమంది కరడుగట్టిన నేరస్తులను ఏరి పారేశాడు.

గంగమ్మ పిల్లల్ని ప్రభుత్వ బాలికల వసతిగృహంలో చేర్పించాం. ఇంక ఆ పిల్లలబాధ్యత మాదే. ప్రభుత్వ సహాయంతో వాళ్ళని ఉన్నతుల్ని చేయాలి.

మేం అప్పుడే నిర్ణయించుకున్నాం, మా పిల్లల్ని మంచి విద్యావంతులుగానే కాకుండా మంచి సంస్కారవంతులుగా తయారుచేయాలని. అలాగే మా దగ్గర చదువుకునే ప్రతివిద్యార్థినీ అలాగే తీర్చిదిద్దాలనుకున్నాం.

**(22-1-2020 నవ్య వారపత్రికలో ప్రచురితం. ఈ కథకు గోపరాజు వెంకట అనంతశర్మ స్మృతిసాహితి - నవ్య వీక్లి కథల పోటీలో 5,000 బహుమతి లభించింది.)**

*   *   *

# అహా నా పెళ్లంట

ఎంతసేపు బుర్ర బద్దలు కొట్టుకున్నా ఈ సమస్యకు పరిష్కారం దొరకడం లేదు. దోరక్కపోవడానికిదేదో అంతర్జాతీయ సమస్య కాదు. నా పెళ్లి సమస్య.

అమ్మాయికయితే పెళ్ళి సమస్యగానీ నీకేం రోగం అనుకోవచ్చును. కానీ సుబ్బులితో పెళ్ళంటేనే నాకు పెద్ద సమస్యగా తయారైంది.

సుబ్బులు ఎవరో కాదు, నా మేనమామ కూతురే.  మా కుటుంబం, వాళ్ళ కుటుంబం కలిసి ఏకగ్రీవంగా తీర్మానించేశారు సుబ్బులితో నా పెళ్ళి జరగాలని. ఇదంతా నా యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండానే జరిగిపోయింది. అమ్మకి, నాన్నకి సుబ్బులంటే ఎంతో యిష్టం. అందుకే మా ఇంటిలో ఎప్పుడూ కోతిలా గెంతుతూ ఉంటుంది.

మామయ్యకి ఈ కోతితో పాటు మరో రెండు కొండముచ్చులున్నాయి. వాళ్ళకి చెల్లెలంటే ప్రాణం. ఒక్కర్తే కూతురు కావడంతో అత్తా,మావయ్యలు ఎంతో గారాబంగా పెంచడం, అన్నలు దానికి సై అనడంతో సుబ్బులికి ఒళ్ళంతా గర్వం పెరిగిపోయింది. నన్నసలు కేర్ చెయ్యదు. 'నువ్వేంటి పెద్ద ...' అన్నట్టుంటుంది.

అందుకే నాకు సుబ్బులంటే మంట. దానికి పై నుంచి కిందవరకు అంతా పొగరే. పెళ్ళయితే నాతోకాపురం చేస్తుందా అనేది కూడా అనుమానమే. నేను తప్ప మా యింట్లోను, వాళ్ళింట్లోను కూడా అంతా నెత్తిక్కించుకునే వాళ్ళే.

అందుకే అది పెంకి ఘటంలా తయారయ్యింది.

ఏదో వంక పెట్టి పెళ్ళి చేసుకోకుండా వుందామా అంటే కుదిరే పరిస్థితి కాదు. పోనీ అందంగా లేదని అందామా అంటే అదీ కాదు. ఏ మాటకామాటే చెప్పుకోవాలి మా సుబ్బులు చాలా అందంగా ఉంటుంది. ఇంట్లో ఎప్పుడూ ఆ గడ్డీ ఈ గడ్డీ తింటూ వుంటుందేవో బొద్దుగా, ముద్దుగావుంటుంది.

నాకంటే సుబ్బులే బాగుంటుంది. దాని గర్వానికి అదీ ఓ కారణమే. అంతేకాదు. దానికంటే నేను బాగుండననే చిన్నచూపు కూడా వుంది.

ఓసారి సుబ్బులు, దాని ఫ్రెండు మా యింటికొచ్చారు. అప్పుడు నేను నా గదిలో వున్నాను. వాళ్ళిద్దరూ హాల్లో కూర్చుని కబుర్లు  చెప్పుకుంటున్నారు.

మామయ్య యింటికీ, మా యింటికీ రెండు వీధులే అడ్డం. అందుకే ఎప్పుడు చెంగుచెంగుమంటూ రెండిళ్ళ మధ్య గెంతుతూ వుంటుంది.

“ఏవే సుబ్బులూ! మీ బావనేకదా నువ్వు పెళ్ళి చేసుకునేది. అతన్ని బాగా ప్రేమించేస్తున్నావా? అయినా నీ అంత బాగుండడు కదే నీకెలా నచ్చాడు”

“బావతో ప్రేమేమిటే నా బొంద. అసలు బావల్ని పెళ్ళి చేసుకుంటే లైఫ్‌లో థ్రిల్లేముంటుంది చెప్పు. చిన్నప్పట్నించీ చూస్తున్న ముఖాలే కదా. కానీ నాకు తప్పదే. మా అత్తయ్యకు నేనంటే ప్రాణం. నన్నే కోడలిగా చేసుకోవాలనుకుంటుంది. అయినా మా బావను నేను కాకపోతే ఎవరు చేసుకుంటారు చెప్పు. పోనీ ఎవరైనా ఎగరేసుకుపోతారా అంటే అంత సీను లేదు. మరి నాకు తప్పుతుందా?” అంటూ పెద్ద ఆరిందాలా చెపుతుంది సుబ్బులు.

నాకు అరికాలి మంట నెత్తికెక్కింది. నామీద అలాంటి అభిప్రాయమున్న ఆడదాన్ని పెళ్ళాడి నేను సుఖపడగలనా. అప్పుడే నిర్ణయించేసుకున్నాను సుబ్బుల్ని పెళ్ళి చేసుకోకూడదని. అప్పటికీ బయటకొచ్చి అడిగేను, ఆమె ఫ్రెండ్ వెళ్ళిం తర్వాత.

“అంత యిష్టం లేని దానికి నన్నే పెళ్ళాడతానని చెప్పడమెందుకు మానుకోవచ్చుగా?” అని.

“ఎవరో ముక్కూముఖం తెలీని దగుల్బాజీని కట్టుకునేకంటే ఎలావున్నా తెలిసిన నువ్వే బెటరని చేసుకుందామనుకుంటున్నాను. బావే మొగుడయితే అణిగిమణిగి వుంటాడని మా ఫ్రెండు వాళ్ళ బామ్మ చెప్పిందిలే” అంది చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ.

మా సుబ్బుల్ని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది. కానీ ఏం చెయ్యలేని నిస్సహాయుణ్ణి.

అయితే పెద్ద గొప్పగా మాత్రం మా అమ్మతో, “నిన్ను చూడకుండా నేనుండలేనత్తా. బావని పెళ్ళి చేసుకుంటే నీతోనే వుండొచ్చని మా యింట్లో గట్టిగా చెప్పేసాను. బావను తప్ప ఎవర్నీ చేసుకోనని” అంది.

ఆ మాటలకు మా అమ్మయితే సుబ్బులే ఈ యింటి కోడలని తీర్మానించేసింది. అమ్మకు నేనొక్కణ్ణే కొడుకుని కావడంతో బలిపశువును అవ్వడం తప్పలేదు.

కానీ చూస్తూ చూస్తూ సుబ్బుల్ని పెళ్ళాడాలంటే ఒక ప్రక్క భయంగానే వుంది.

అందుకే గట్టిగా నిర్ణయించుకున్నాను సుబ్బుల్ని పెళ్ళి చేసుకోకూడదని. అయితే ఏం చెయ్యాలి. ఎలాగోలా సుబ్బులి చేతో లేక మామయ్య చేతో యింట్లో చెప్పిస్తే తప్ప అమ్మా, నాన్నా నాకు వేరే పెళ్ళి చెయ్యడానికి ఒప్పుకోరు.

ఏం చెయ్యాలి? ఏం చేస్తే ఈ పెళ్ళి తప్పుతుంది?

ఆలోచనలో పడ్డాను.

– – –

"మామయ్యా! ఈ ఉత్తరం నీకిలా రాయవలసి వస్తుందని కలలో కూడా అనుకోలేదు. కానీ నీకు, సుబ్బులికి నేను అన్యాయం చేయకూడదనుకుంటే అన్ని వివరాలు రాయాలి. ఈమధ్య నాకు నలతగా వుండటంతో డాక్టరు దగ్గరకి వెళ్ళాను. ఏవో మందులు రాసాడు. ఎన్ని వాడినా తగ్గకపోయేసరికి అన్ని రకాల పరీక్షలు చేయించమన్నాడు. అవి చేయించేసరికి ఒక భయంకరమైన నిజం బయటపడింది.

నాకు కేన్సర్! ఈ విషయం యింట్లో చెప్పలేదు. వాళ్ళకి తెలిస్తే బతకరు. నీ ఒక్కడికే చెబుతున్నాను. ఎందుకంటే సుబ్బులితో నా పెళ్ళి జరిగితే సుబ్బులి జీవితం అన్యాయమైపోతుంది. కాబట్టి సుబ్బులికి మంచి సంబంధం చూసి చెయ్యండి. మా యింట్లో ఏదో కారణం చెప్పండి. నాకంటే మంచి ఉద్యోగస్తుడనో, డబ్బున్నవాడనో లేక అందగాడనో... ఏదో చెప్పండి. ఈ రహస్యం సుబ్బులికి కూడా తెలియనివ్వొద్దు. నన్నే చేసుకోవాలనుకుంటుందేమో, విషయం తెలిస్తే తట్టుకోలేదు. మనిద్దరి మధ్యే ఈ రహస్యం ఉండాలి. ఉంటాను మరి అంటూ ఉత్తరం ముగించి మామయ్యకి పోస్ట్ చేసి ఊపిరి పీల్చుకున్నాను.

ఉత్తరం పోస్టు చేసి మూడు రోజులు... వారం రోజులు దాటినా మామయ్య యింటి నుంచి ఎటువంటి రెస్పాన్స్ లేదు. అయితే రోజుకి రెండు, మూడుసార్లు మా యింటికి, వాళ్ళింటికి తిరిగే సుబ్బులు మాత్రం రావడం మానేసింది. అలా ఎందుకు రావడం లేదో మా అమ్మకి అంతుబట్టడం లేదు.

మేనకోడలు యింటికి రాకపోయేసరికి కారణం తెలియక మా అమ్మకు కాలూ చెయ్యి ఆడలేదు.

ఆ పిల్లకు ఏమయ్యిందో– అంటూ రోజుకి నాలుగైదుసార్లు అనుకునేది.

నాకర్థమైపోయింది మామయ్య రానివ్వడంలేదని.

సుబ్బులు రాక ఆగిపోవడంతో నా ఆనందం అంతా యింతా కాదు.

హమ్మయ్య! సుబ్బులి గొడవ ఇలా అయినా లేకుండాపోతే బాగుండుననిపించింది.

ఓ రోజు అమ్మ ఇంక ఉండబట్టలేక మామయ్య యింటికి బయలుదేరింది. అప్పటికీ నేను వారించాను. అది రానప్పుడు నువ్వెళ్ళడమెందుకని. అయినా అమ్మ వినలేదు. సుబ్బులికేదైనా జ్వరమేమో అందుకని రావడం లేదని చూడ్డానికి

బయలుదేరింది. అమ్మ వెళ్ళిందగ్గర్నుంచీ నాకు భయం పట్టుకుంది, అసలు రహస్యం ఎక్కడ బయటపడుతుందోనని. వెళ్ళిన గంటకే అమ్మ తిరిగొచ్చేసింది. ముఖం చూస్తే చాలా కోపంగా రుసరుసలాడుతూ వుంది.

అక్కడేదో జరిగింది. లేకపోతే అమ్మ అలావుండదు.

"వెధవకి బుద్ధి లేకుండా పోయింది. అంతా మరిచిపోయినట్టున్నాడు. నాలుగు డబ్బులు సంపాదించేసరికి కళ్ళు నెత్తి మీదకొచ్చినట్టున్నాయి. నడిమంత్రపుసిరి" అంటూ గట్టిగా అరిచింది.

"ఏం జరిగిందోయ్!" అడిగారు నాన్న.

"ఏం జరగడమేంటండీ సుబ్బులికి వేరే సంబంధం చూస్తున్నాడట మా తమ్ముడు. చిన్నప్పట్నించీ సుబ్బుల్ని మన కోడలిగా చేసుకుందామనుకున్నామా. దానికి వాడూ వంత పాడాడుగా. మరిప్పుడు వేరే సంబంధం చూడవలసిన అవసరమెందుకొచ్చింది??

"మీ తమ్ముణ్ణి, మరదల్ని అడగకపోయావా?"

"వాళ్ళిద్దరూ లేరు ఏదో వూరెళ్ళారట. వుంటే కడిగేద్దును వాళ్ళని. ఇంట్లో సుబ్బులు ఒక్కర్తే వుంది. అది చెప్పింది తనకి వేరే సంబంధాలు చూస్తున్నారని. ఎవడో ఇంజనీరట. బావ గుమాస్తానే కదా మంచి సంబంధమని చూస్తున్నారట. ఇంక నేనక్కడ వుండలేక, వచ్చేశాను. మనకేం తక్కువ. నా కొడుక్కి రాజాలాంటి సంబంధం చూసి చేస్తాను. అప్పుడుగాని వాడి తిక్క కుదరదు."

అమ్మ తీసుకున్న నిర్ణయం నాకెంత ఆనందాన్ని కలిగించిందో చెప్పలేను. సుబ్బులితో నా పెళ్ళి జరగదు అనే మాట నాకెంతో రిలీఫ్ నిచ్చింది.

నన్ను పెళ్ళి చేసుకుని నామీద, ఈ యింట్లోను పెత్తనం చెలాయించాలనుకున్న మా సుబ్బులి తిక్క కుదిరినందుకు నాకు మహా సంతోషంగా వుంది.

అమ్మ పట్టుదల గల మనిషి. నాకు సంబంధాలు చూడటం మొదలు పెట్టింది. సుబ్బుల్లాంటి లడ్డూకయితే మొగుడు దొరకడం కష్టంగాని నాకేం మగమహారాజుని. అనుకున్న వారం రోజులకే ఓ సంబంధం వచ్చింది అమ్మా, నాన్న, నేను వెళ్ళి చూసొచ్చాం. అమ్మాయి బాగానే వుంది (సుబ్బులంత కాదనుకోండి).

సుబ్బులు కానప్పుడు నాకెవరైనా ఒకటేననుకుని గ్రీన్ సిగ్నల్ యిచ్చేసాను.

వారం రోజుల తర్వాత ఈ సంబంధం తీసుకొచ్చిన పెళ్ళిళ్ళ పేరయ్య మా యింటికొచ్చి అమ్మా నాన్నల మీద విరుచుకుపడ్డాడు.

"మీ అబ్బాయి రోగం దాచి పెట్టి నన్ను సంబంధాలు చూడమంటే ఎలాగండి.

ఆ విషయం తెలిసి నామీదెంత మండి పడ్డారో తెలుసా? కొట్టినంత పనిచేసారు. మళ్ళీ యిలాంటి సంబంధాలు తెస్తే పోలీసు రిపోర్టు చెస్తామన్నారు”

ఆ మాటలకు మా వాళ్ళకి మతిపోయింది.

“మా అబ్బాయికి రోగమేమిటయ్యా నీకేమైనా మతిపోయిందా ఏమిటి?” అమ్మ కోప్పడింది అతని మీద. అసలు జరిగిందేమిటో చెప్పమన్నారు నాన్న.

“ఏముందండి మీ అబ్బాయికి కేన్సరుట. అందుకే మీ మేనకోడల్ని మీ అబ్బాయికివ్వడం లేదట. ఈ విషయం వాళ్ళకెవరు చెప్పారో గానీ మొత్తం మీద వాళు ళ్ళ మీ సంబంధం కేన్సిలు చేసుకున్నారు” అమ్మా నాన్నలు అగ్గి మీద గుగ్గిలం అయ్యారు ఆ మాటలు విని. అదంతా అబద్ధమని అలాంటిదేమీ లేదని ఎవరో కిట్టనివాళ్ళు అలాంటి పని చేసుకుంటారని పేరయ్యకు నచ్చచెప్పి మరో సంబంధం చూడమన్నారు.

అతని చేయి కొంచెం తడిపేసరికి సరేనని వెళ్ళాడు. బి నాకర్థమైపోయింది యిదంతా మామయ్య చేసాడని. సరే ఇది కాకపోతే మరొకటి. నాకు పెళ్ళి కాకపోతుందా, అలా అనుకున్నానేగానీ మరో అరడజను సంబంధాలు అదే కారణంతో తప్పిపోయాయి. అప్పుడనిపించింది మావయ్యకు అలా ఉత్తరం రాయడం తప్పేమోనని. అయినా నాకు కేన్సరన్న మాట అబద్ధమని గట్టిగా చెప్పడానికి కూడా లేదు. ఎందుకంటే నేను రాసిన ఉత్తరం తాలూకు జరాక్స్ కాపీలన్నీ వాళ్ళకి చేరి పోతున్నాయి. నా స్వంత దస్తూరితో ఉండటంతో నేను కాదని చెప్పడానికి కూడా లేదు.

ఈ సంగతి మా వూళ్ళో అందరికీ తెలిసిపోవడంతో అంతా నా వంక జాలిగా చూస్తున్నారు. ఆఫీసులో కొలీగ్సంతా వేదాంతం మాట్లాడుతున్నారు. జనన మరణాలు మిథ్య అని హితబోధ చేస్తున్నారు. మామయ్య యింత పనిచేస్తాడని నేననుకోలేదు.

ఆ ఉత్తరం కారణంగా సుబ్బులితో నాకు ఎలాగూ పెళ్ళి కాదు సరికదా వేరే అమ్మాయితోను పెళ్ళయ్యే అవకాశమే కన్పించడం లేదు.

సుబ్బులితో పెళ్ళి యిష్టంలేక అలా ఉత్తరం రాసానే తప్ప నాకే రోగం లేదని చెప్పి అమ్మా నాన్నలను నమ్మించేసరికి తలప్రాణం తోకకొచ్చింది.

నాకింక పెళ్ళి కాదని అమ్మ బెంగపెట్టుకుంది.

ఆ ఉత్తరం సంగతి అందరికీ ఎందుకు చెపుతున్నావని మామయ్యని గట్టిగా అడగాలని నిర్ణయించుకున్నాను.

ఇంట్లో అయితే అంతా వింటారని ఒంటరిగా దొరికినప్పుడు అడిగాను, “నీకిది న్యాయమా” అని.

“న్యాయమేమిట్రా?”అన్నాడు  మామయ్య.

“అదే నేను నీకు రాసిన ఉత్తరం గురించి అందరికీ చెప్పి నన్ను అభాసుపాలు చేస్తున్నావు” బిత్తరపోయినట్టు చూసాడు నా వంక.

“నువ్వు ఉత్తరం రాయడమేమిటి నేనందరికీ చెప్పడమేవిటి. అసలు నువ్వు నాకు ఉత్తరం రాయవలసిన అవసరం ఎందుకొచ్చింది  అందులో ఏం రాసావు” అంటూ మామయ్య ప్రశ్నల వర్షం కురిపించాడు.

నాకర్థమైపోయింది. ఆ ఉత్తరం మామయ్యకు చేరలేదని. మామయ్యకి ఏదో చెప్పి అక్కడ నుంచి తప్పుకున్నాను. అయితే ఆ ఉత్తరం ఎవరందుకుని వుంటారు. మామయ్య కొడుకుల్లో ఎవరో ఒకరు అందుకుని ఈ పని చేస్తున్నారనిపించింది. ఇంత జరుగుతున్నా మామయ్యకు తెలియలేదంటే కారణం ఆ ఉత్తరం గురించి తెలియకపోవడమే. తెలిసుంటే నానాహంగామా చేసేవాడు.

ఇప్పుడు నేనేం చెయ్యాలో నాకే అర్దం కావడంలేదు. ఇంక పెళ్ళిమీద ఆశ వదులుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. నా పరిస్థితి రెంటికీ చెడ్డ రేవడి అయింది. అటు సుబ్బులు కాకపోయినా ఇటు వేరే సంబంధం వచ్చే ఆశ కూడా లేదు.

నా పెళ్ళి విషయంలో అమ్మా, నాన్నలకే కాదు నాకు కూడా దిగులు పట్టుకుంది.

ఇంక నాకు పెళ్ళి కాదని ఓ నిర్ణయానికొచ్చేసాను. అటువంటి సమయంలో నాకు సుబ్బులి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ఏం రాసుంటుందబ్బా అని విప్పి చూసాను.

“బావా!

ఈ ఉత్తరం నా దగ్గర్నుంచి వస్తుందని నువ్వు ఊహించి వుండవు. నీకిలా రాస్తానని నేనూ అనుకోలేదు. కానీ కొన్ని విషయాలు చెప్పాలనే రాస్తున్నాను. నాకు ఊహ తెలిసినప్పట్నించీ నువ్వే నాకు కాబోయే మొగుడివన్నారు. ఆ ఊహతోనే నేనూ పెరిగాను. నిన్ను గుండెల్లో పెట్టుకున్నాను. కానీ ఆ విషయం ఎప్పుడూ బయటపెట్టలేదు. నిన్నెప్పుడూ టీజ్ చేస్తుండేదాన్ని. నువ్వలా వుడుక్కుంటూ వుంటే నాకు బలే సరదాగా వుండేది. అందుకే ఎప్పుడూ నీతో పోట్లాడుతూ వుండేదాన్ని. నేను కాకపోతే ఎవరు బావా నిన్నేడిపించేది. బావా మరదళ్ళన్న తర్వాత ఆ మాత్రం సరదాలు లేకపోతే ఎలా చెప్పు.

బావా! నా ప్రేమను, ఆరాధనను నువ్వు అర్ధం చేసుకోలేకపోయావు. అందుకే నన్ను వదిలించుకోవాలని నువ్వు ప్రయత్నించావు. ఎంతపనిచేసావు బావా. నేనంటే

నీకిష్టం లేనప్పుడు నాతో ఒక్కమాట చెప్పొచ్చుగా. లేని రోగాన్ని సృష్టించుకుని ఎందుకలా ఉత్తరం రాసావు. ఆ ఉత్తరం కనుక మా నాన్నగాని, అన్నయ్యలుగాని చూసుంటే ఎంత గొడవ అయ్యుండేది. లక్కీగా ఎవరూ లేని సమయంలో నా చేతికి అందింది.

ఆ ఉత్తరం చదివి నేనెంత ఏడ్చానో తెలుసా? ఆ తర్వాత కోపం కూడా వచ్చింది. నాకు దక్కని నువ్వు ఇతరులకు కూడా దక్కకూడదని నీకొచ్చిన సంబంధాల్లన్నీ చెడిపోయేలా నేనే ఆ ఉత్తరాన్ని జిరాక్స్ కాపీలు తీయించి పంపేదాన్ని. నేననుకున్నట్టుగానే అన్ని సంబంధాలు చెడిపోయాయి. ఒక్క విషయం చెప్పమంటావా బావా! నీకు నిజంగా ఆ జబ్బున్నా కూడా నేను నిన్నే పెళ్ళాడేదాన్ని. నీతోబాటే నేనూ జీవితం చాలించేదాన్ని.

సరే! అయ్యిందేదో అయ్యింది. ఈ విషయాన్ని యింక మరిచిపో. ఇప్పుడు నేను కూడా నిన్ను పెళ్ళి చేసుకోనని నువ్వు రాసిన ఉత్తరాన్ని మా నాన్న, అన్నయ్యలకు చూపిస్తే చచ్చినా నన్ను నీకివ్వరు. కానీ నేనలా చెయ్యదల్చుకోలేదు. మనిద్దరం పెళ్ళి చేసుకుందాం బావా. అయినా నేను కాకపోతే నీ ముచ్చు ముఖాన్ని ఎవరు చేసుకుంటారు చెప్పు.

కానీ ఒక కండిషను. దానికి నువ్వు ఒప్పుకుంటేనే మన పెళ్ళి జరగేది. ఒప్పుకోక ఏం జేస్తావులే. అదేమిటో చెప్పనా. మనిద్దరికీ పెళ్ళయితే తిరుపతి కొండకొచ్చి నీకు గుండు కొట్టించి ఆ గుండుతోనే నిన్ను పెళ్ళి చేసుకుంచానని వెంకటేశ్వరస్వామికి మొక్కుకున్నాను. కాబట్టి మన పెళ్ళి అలాగే జరగాలి, ఇంతవరకు ఏ మగాడూ బోడి గుండుతో పెళ్ళి చేసుకుని వుండడు. కానీ నీది మాత్రం అలాగే జరుగుతుంది. నీకామాత్రం శిక్ష లేకపోతే ఎలా చెప్పు. నన్నెంత క్షోభ పెట్టావో గుర్తుందా మరి. ఇంతకీ నేను పెట్టిన ప్రపోజల్‌కి ఒప్పుకున్నట్లేనా. లేకపోతే నీకవరూ పిల్లనివ్వరు. ఆజన్మాంతం బ్రహ్మచారిగానే వుండిపోవాలి. తెల్సిందా. ఈ ఉత్తరం అందిన వెంటనే నా దగ్గరకు పరిగెత్తుకుంటూ వస్తావని ఆశిస్తూ.. నీ ముద్దుల మరదలు సుబ్బులు"

ఆ ఉత్తరం చదివిన నా ఆనందానికి అంతులేకుండా పోయింది.

"యాహూ!" అంటూ గట్టిగా అరిచాను. అంతా ఉలిక్కిపడి చూసారు.

"అహ నా పెళ్ళంట. ఒహెూ నా పెళ్ళంట..." అనుకుంటూ ఆ ఉత్తరంతో బయటకు పరుగెత్తాను. పెళ్ళి కావడం లేదని నాకు పిచ్చి పట్టిందేమోనని అంతా ఆశ్చర్యంగా నా వంక చూడసాగారు.

**(ఆంధ్రభూమి వారపత్రికలో ప్రచురితం)**

* * *

# రెండో ఫ్యామిలీ

సుబ్బారావుగారు రోడ్డు మీద నడుస్తున్నారన్న మాటే గాని ఆయన మనసు కుదురుగా లేదు. తన సంసార జీవితంలో ఈరోజు ఊహించని పరిణామం చోటు చేసుకుంది. దాన్ని ఆయన తట్టుకోలేకపోతున్నాడు. ఇంతకాలం ఎంతో ఉన్నతంగా బతుకుతున్నాననుకునేవారు. కానీ భార్య సుభద్ర మాటలు మాటలు తలుచుకుంటున్నప్పుడు గుండెల్లో కలుక్కుమన్న భావన కలుగుతోంది.

'తనేనా అలా మాట్లాడింది?అసలెలా మాట్లాడగలిగింది అలాంటి మాటల్ని? ఆమెను తనెంతగానో ప్రేమించాడో. ఆమే సర్వస్వం అనుకుంటూ బతుకుతున్నాడే. అలాంటిది అంత మాట ఎలా అనగలిగింది?

ముప్పయ్యేళ్ళ వైవాహిక జీవితంలో పుట్టిన ఇద్దరు పిల్లలు ఎవరి జీవితాలు వాళ్ళు బతుకుతున్నారు. ఇంక మిగిలింది తామిద్దరే! బతికినంత కాలం ఒకరికొకరు తోడూనీడగా బతకాలనుకుంటున్న ఈ సమయంలో ఆమె ఎందుకు అలాంటి మాటలంది! తనంటే నమ్మకం లేదా?అంత నమ్మకం లేనప్పుడు ఇంకోరకంగా ఆలోచించవచ్చు కదా! మరెందుకలా మనసు గాయపరిచేలా మాట్లాడింది. తనకిప్పుడు యాభైఎనిమిదేళ్ళు. రెండేళ్ళలో రిటైర్ కాబోతున్నాడు. ఈ వయసులో ఏ మగాడికైనా ముఖ్యంగా తనలాంటి స్థితిలో ఉన్నవాడికి అలాంటి ఆలోచన వస్తుందా?

మరి సుభద్ర ఎందుకలా ఆలోచించింది?'

ఒక్కసారిగా ఉదయం ఇంట్లో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది.

ఆదివారం కావడంతో తీరిగ్గా నిద్ర లేచారు ఇద్దరూ. హాల్లో కూర్చుని పేపరు చదువుకుంటుంటే సుభద్ర ఇద్దరికీ చెరోగ్లాసులో కాఫీ తీసుకొచ్చింది. కాఫీ తాగుతూ ఏవేవో మాట్లాడుకున్నారు. ఆ మాటల సందర్భంలో, "ఏమండీ మీకిప్పుడు ఎంత జీతం వస్తోంది?"అడిగింది సుభద్ర.

భార్య వంక ఆశ్చర్యంగా చూశాడు సుబ్బారావుగారు.

"అదేంటి సుభద్రా అలా అడుగుతున్నావు. ఇప్పుడు జీతం సంగతి ఎందుకు గుర్తుకొచ్చింది?"

"అంటే మీ జీతం గురించి నేను అడగకూడదంటారా?"

"అబ్బే! అడగకూడదని కాదు. నా ఉద్యోగమూ,నా జీతమూ నీకు తెలియనివి కాదుగా!"

"కదా! అయితే మన బతుకులు ఎందుకిలా అయ్యాయంటారు?"

"కదా! అయితే మన బతుకులు ఎందుకిలా ఉన్నాయంటారు?". "మన బతుకులకేమైంది సుభద్రా! బాగానే బతుకుతున్నాం కదా". "అవును రోజూ సుబ్బరంగా రెండు పూటలూ కడుపు నిండా అన్నం తింటున్నాం అంతేకదా". "అంతకన్నా ఏం కావాలి. ఉండటానికి చిన్నదైనా ఓ ఇల్లుంది. రెండుపూటలా కడుపునిండా తింటున్నాం. దేశంతో ఎంతోమందికి లేని జీవితం మనకుంది అది చాలదా?". "అవునుమరి! ఎందుకు సరిపోదు. ఇల్లులేని వాళ్ళతో పోల్చుకుని ఇల్లుందని, తిండిలేని వాళ్ళతో పోల్చుకుని తిండుందని సరిపెట్టుకోండి. అదేనా మీకు జీవితమంటే. అవి మాత్రమే కాకుండా బతకడానికి జీవితంలో చాలా కావాలని మీకు అనిపించదన్నమాట". "ఇంకేం కావాలి చెప్పు. మనం హాయిగానే బతుకుతున్నాం కదా". "మీరు హాయిగానే బతుకుతున్నారు. నాగతే ఇలా ఏడ్చింది" ముక్కు చీదింది సుభద్ర.

సుబ్బారావుగారికి అర్థం కావడంలేదు. 'ఎప్పుడూ ఇలా మాట్లాడని సుభద్ర ఎందుకిలా మాట్లాడుతోంది, అసలు ఏమైంది?'"ఇప్పుడేమైంది సుభద్రా ఎందుకిలా మాట్లాడుతున్నావు" అనునయంగా అడిగారాయన. దాంతో బరస్టయి పోయిందావిడ. "ఏమైందా? మీరు ఏం చేస్తున్నారో మీకు తెలియడంలేదా. మీ కొలీగ్స్ ఎలా బతుకుతున్నారో ఒకసారి చూడండి. ఇంట్లో అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేసుకోవడంతోపాటు మంచిబట్టలు, బంగారాలు ఎప్పటికప్పుడు కొనుక్కుంటూ ఆనందంగా బతుకుతున్నారు. నాకేముంది పుస్తెలతాడు, చేతికో రెండు పాతగాజులు. అవైనా మా పుట్టింటివాళ్ళు పెట్టినవే. మీరేమైనాకొన్నారా, పెట్టారా" అందావిడ కోపంగా. భార్య మాటలకు నోటమాట రాలేదాయనకు. "ఇప్పుడిదంతా ఎందుకు? ఏమైంది నీ కీవేళ" అన్నారు.

"ఏమైందా, దెయ్యం పట్టింది. లేకపోతే ఏంటండి. భార్యగా ఈ విషయాలు మాట్లాడేహక్కు నాకు లేదా. ఎంత జీతం వచ్చినా మనది కరువు బతుకే కదా. వచ్చిన డబ్బంతా ఏం చేస్తున్నారు? దేనికి తగలేస్తున్నారు. కొంపతీసి రెండో ఫ్యామిలీగానీ పెట్టలేదు కదా!"ఆ మాటలకు విపరీతమైన కోపం వచ్చింది సుబ్బారావుగారికి. "ఏం మాట్లాతున్నావో నీకు తెలుస్తోందా? మతి ఉండే మాట్లాడుతున్నావా?"

"ఏం అది నిజంకాదా. నాకేమీ తెలియదనుకోకండి. ఎవరో టక్కులాడిని

వెంటేసుకుని బాగానే తిరుగుతున్నారుగా. దాని పిల్లల్ని స్కూళ్ళకి, హాస్పిటల్స్‌కి తిప్పుతున్నారుగా".ఆ మాటలకు నిశ్చేష్టులయ్యారు సుబ్బారావుగారు. సుభద్రవంక నిశితంగా చూశారు.

ఆవిడ కళ్ళు చింతనిప్పుల్లా కోపంగా చూస్తున్నాయి. ఆయనేం మాట్లాడలేక పోయారు. "ఏం మాటలు పడిపోయాయా. మీ రహస్యం నాకెలా తెలిసిందనా? మీలాంటి పిల్లే కళ్ళు మూసుకుని పాలు తాగుతూ ఎవరూ చూడలేదనుకుందట. మనకిద్దరు పిల్లలున్నారు. చాల్లేదా. ఇంకో ఇద్దరు పిల్లలున్న తల్లిని తగులుకున్నారు. మీకొచ్చినజీతంలో సగంకూడా ఇంట్లో ఖర్చుపెట్టకుండా ఏం చేస్తున్నారా అని నాకెప్పుడో అనుమానమొచ్చింది. తర్వాత తెలిసింది. నన్నిక్కడ ఇలా తగలేసి మీరు అక్కడ హాయిగా కులుకుతున్నారని".

ఆమె మాటలకు సుబ్బారావుగారికి మతిపోతోంది. తను ఆమెకి ఏం సమాధానం చెప్పడానికి వీల్లేని నిస్సహాయస్థితిలో ఉన్నారాయన. కాస్సేపటికి మౌనం వీడి, "చూడు సుభద్రా నువ్వు వింటానంటే ఓ మాట చెబుతాను..."టక్కున అందుకుంది. "ఏం చెబుతారండి ఆవిడకు మీకు ఏం సంబంధం లేదంటారు అంతే కదా. ఇంతకాలం మీ మాటలు నమ్ముతూ వచ్చాను కాబట్టే నా జీవితం ఇలా ఏడ్చింది. ఇంక మీ మాటలు నమ్మే ఓపిక నాకు లేదు మీరేం చెప్పకండి" అంటూ హిస్టీరియా వచ్చిన దానిలా ఊగిపోయింది సుభద్ర. అలా ఏడుస్తూనే గదిలోకిపోయి తలుపేసుకుంది. ఎంత తట్టినా తలుపు తీయలేదు. కొంతసేపు తను ఆవిడకు దూరంగా ఉంటే మళ్ళీ మామూలు మనిషవుతుందని భావించి ఇంట్లో నుంచి బయటకొచ్చి రోడ్డుమీద నడవడంతో ప్రారంభించారు.

అలా నడుస్తూ కొంచెం దూరం వెళ్ళేసరికి కొద్దిగా ఆయాసం అనిపించింది. కాస్సేపు ఎక్కడన్నా కూర్చుంటే మంచిదని రోడ్డుపక్కనున్న ఓ చెట్టుకింద కూర్చున్నారు. చాలా నీరసంగా ఉన్నట్టు అనిపించింది. జేబులో ఉన్న టాబ్లెట్ తీసుకుని నోట్లో వేసుకుని మింగేశారు. పక్కనే ఉన్న కుళాయిలోనీళ్ళు తాగారు. కాస్సేపటికి కొంచెం ఫ్రీగా ఉన్నట్టు అనిపించింది. ఉదయం తాగిన కాఫీతప్ప కడుపులో ఇంకేమీ లేదు. ఆకలిగా కూడా ఉంది. ఇంటికి తిరిగి వెళదామనిపించిందిగానీ సుభద్ర మరిన్ని సూటిపోటి మాటలు భరించలేననిపించింది. ఎందుకన్నామంచిది, ఒకసారి హాస్పిటల్‌కి వెళదామనిపించింది. ఆటోని పిలిచి హాస్పిటల్‌కు వెళ్ళారు.హాస్పిటల్ దగ్గర ఆమె కనిపించింది. సుబ్బారావుగారిని చూసిన వెంటనే ఆమెకళ్ళల్లో ఏదో ఒకలాంటి

ధైర్యం."ఎలా ఉంది పాపకు" అడిగారాయన.

"బాగుంది. జ్వరం కూడా బాగా తగ్గింది. రేపు ఇంటికి తీసుకు పోవచ్చన్నారు".

"మంచిది. నేను డాక్టరుగారి దగ్గరకెళ్ళొస్తాను" అనిచెప్పి ఆయన డాక్టర్‌గారి దగ్గరకెళ్ళారు. సుబ్బారావుగారిని చూసి ఆయన తన దగ్గరున్న ఫైలు తీసి, ఒకసారి చూసి ఆయనతో కొంచెంసేపు మాట్లాడి కొన్నిమందులు రాసిచ్చారు. బయటకొచ్చి అక్కడే ఉన్న ఫార్మసీలో మందులు తీసుకుని జేబులో పెట్టుకున్నారు. అక్కడనుంచి కదిలి ఆమె దగ్గరకొచ్చారు."అయితే రేపు నేనొస్తాను. డబ్బులేమన్నా కావాలా" అనడిగారు."అవసరం లేదు. నా దగ్గరున్నాయి" చెప్పిందామె.

సరే అని అక్కడనుంచి కదిలారాయన.ఇంటికొచ్చేసరికి సుభద్ర ఇంకా అలాగే గదిలో పడుకుని ఉంది. అయితే గది లోపలి బోల్ట్ తీసే ఉంది. తలుపు తీసుకుని లోపలికెళ్ళి ఆమె ప్రక్కన కూర్చుని "సుభద్రా" అని పిలిచారు. ఆమె పలకలేదు. మళ్ళీ పిలిచి ఆమె మీద చెయ్యి వేశారు. ఆయన చేతిని విసిరికొట్టింది."నేను నీకేం అన్యాయం చేశానని నువ్వు అలా ప్రవర్తిస్తున్నావు? నేనెలాంటివాడినో నీకు తెలీదా" అన్నారాయన నెమ్మదిగా."నాకేం అన్యాయం చేశారా? అలా అంటానికి సిగ్గులేదా మీ అంతరాత్మని అడగండి చెబుతుంది. ఇంతకీ అదెవరండి?""అదంటే""ఏం తెలియనట్లు మాట్లాడకండి. మీ రెండో ఫ్యామిలీ గురించి అడుగుతున్నాను"."అదేం మాట సుభద్రా నాకు రెండు ఫ్యామిలీ ఏంటి?"."లేకపోతే మీజీతంలో సగం ఎక్కడికి పోతోందండీ. నేనేం అమాయకురాలిని కాను. నాకంతా తెలుసు.

మిమ్మల్ని చూస్తుంటేనే అసహ్యం వేస్తోంది. పొండిక్కడనుంచి. మీ ముఖం నాకు చూపించకండి, నాతో మాట్లాడకండి. వెళ్ళండి" చీదరించుకుంది.నెమ్మదిగా అక్కడనుంచి కదిలారు. చాలా నీరసంగా ఉంది. సుభద్ర వంటచేసే అవకాశం లేదు. బాగా ఆకలి కూడా వేస్తుంది. ఇంక లాభంలేదనుకుని మళ్ళీ బయటకొచ్చి దగ్గరలో హొటలుకెళ్ళి టిఫిను తిని సుభద్ర కోసం కూడా ప్యాక్ చేయించుకొచ్చారు. ఆ ప్యాకెట్ సుభద్ర పడుకున్న గదిలోపెట్టి "టిఫిన్ తెచ్చాను తిను" అని చెప్పారు. ఆ పగలంతా సుభద్ర బయటకురాలేదు. రాత్రికూడా బయటకురాలేదు. ఆ రాత్రి కూడా ఇద్దరికీ అభోజనమే. పడుకున్నారన్నమాటేగానీ, నిద్ర పట్టడం లేదు. ఒకటే ఆలోచనలు. ఆ రాత్రెప్పుడో ఓ కునుకుతీశారు.

తెల్లవారుజామున మూడుగంటలకే మెలకువ వచ్చేసింది. చాలాసేపు మేలుకునే ఉన్నారు. ఇంక పడుకునివున్నా నిద్రరాదని లేచి హాల్లోకొచ్చారు. తెల్లారి ఎనిమిది

గంటలకు సుభద్రకు మెలకువవచ్చి లేచింది. బయటకొచ్చి చూస్తే భర్త అలికిడి లేదు. డైనింగ్ టేబులు మీద రెండు టిఫిన్ ప్యాకెట్లు, ఫ్లాస్కులో కాఫీ ఉన్నాయి. మొహం కడుక్కొచ్చింది. రాత్రి అన్నం తినకపోవడం, నిద్రపోకపోవడంతో బాగా ఆకలిగా అనిపించింది. భేషజానికి పోకుండా టిఫిన్ తిని కాఫీ తాగింది. భర్త ఎక్కడికెళ్ళాడో అని ఆమె పట్టించుకోలేదు. తన పనులు ముగించుకుని గదిలోకిపోయి పడుకుంది. సరిగ్గా పదకొండుగంటల సమయంలో ల్యాండ్‌లైన్ ఫోన్ మోగింది. లేచి రిసీవరు అందుకుని "హలో" అంది.

"హలో నేనండి సుబ్బారావుగారి కొలీగ్ ఆదినారాయణనండీ, సుబ్బారావుగారు అరగంటక్రితం ఆఫీసులో స్పృహతప్పి పడిపోయారు. వెంటనే దగ్గరున్న కార్పొరేట్‌హాస్పిటల్‌కి తీసుకెళ్ళాం. సీరియస్ అన్నారు. ఐ.సి.యులో ఉంచారు. ఇప్పుడే బయటకొచ్చి మీకు ఫోన్ చేస్తున్నాను. వెంటనే రండి" అని చెప్పి ఫోన్ పెట్టేసాడు. ఆ వార్త విన్న వెంటనే సుభద్రకు గుండె ఆగినంత పనైంది. కాలు, చెయ్యి ఆడలేదు. ఏం చెయ్యాలో తోచలేదు. ఆయనేంటి? స్పృహతప్పి పడిపోవడమేంటి? అంతా అగమ్యగోచరంగా ఉంది. అప్పుడామెకు భర్తతో పోట్లాడినసంగతి గుర్తుకురాలేదు. భర్త ఆరోగ్యం ఎలా ఉందోనని ఆందోళనగా ఉంది. వెంటనే హాస్పటల్‌కి వెళ్ళడానికి తయారవ్వడం మొదలుపెట్టింది. బీరువాతీసింది బట్టలకోసం.

అందులోనుంచి చీర, జాకెట్టు తీసుకుని బీరువాలోనే ఉన్న చిన్న లాకరులోంచి ఐదువందల రూపాయలకట్ట తీసింది. దానితోపాటు ఓ కవరుకూడా చేతిలోకి వచ్చింది. ఆశ్చర్యంగా దానివంక చూసింది. పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుని కవరు తెరిచింది. అది భర్త రాసిన ఉత్తరం. ఉత్తరం చదవడం ప్రారంభించింది. "సుభద్రా! ఈ ఉత్తరం నువ్వు చదివేవేళకి నా స్థితి ఎలా ఉంటుందో నాకు తెలీదు. అయితే నా గురించి నీకు చాలా విషయాలు చెప్పాలనే ఈ ఉత్తరం రాస్తున్నాను. సావధానంగా చదువు. నామీద కోపంతో ఈ ఉత్తరం చదవకుండా చింపేస్తే నా గురించి నువ్వు తెలుసుకోవలసిన విషయాలు తెలియకుండాపోతాయి.

అందుకే చదవమంటున్నాను. నువ్వు నామీద అలాంటి అభిప్రాయంతో ఉన్నావంటే నమ్మలేకపోయాను. ఇన్నేళ్ళ మన సంసారంలో నన్ను నువ్వలా అర్థం చేసుకున్నావంటే అది నా దురదృష్టమనే అనుకోవాలి. సరే అసలు విషయానికొస్తాను. నాకు రెండోఫ్యామిలీ ఉందని అనుమానించావు. నాకు అరవైసంవత్సరాలు రాబోతున్నాయి. ఈ వయసులో నాకు రెండోఫ్యామిలీ ఏంటి చెప్పు. ఆ మాత్రం ఆలోచన నీకు రాలేదా?

ఎవరో పిల్లలతల్లితో నేను రెండో ఫ్యామిలీ పెట్టానని అపవాదువేశావు. ఆమె ఎవరో తెలుసా? కమల!! మీ సావిత్రక్కయ్య ఏకైక గారాలకూతురు. తను ప్రేమించినవాణ్ణి పెళ్ళిచేసుకుంటానంటే కులగోత్రాల పేరుచెప్పి పరువు, ప్రతిష్టలంటూ మీ అక్కా, బావా కన్నకూతుర్ని దూరం చేసుకున్నారు. కమల తను ప్రేమించినవాడిని పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయింది.

ఇద్దరు పిల్లలు పుట్టాక కమలభర్త రోడ్డు ప్రమాదంలో చనిపోయాడు. ఆమె దిక్కులేనిదైపోయింది. అయినా మీవాళ్ళ మనసులు కరగలేదు. కన్నకూతురు కష్టాల్లోవున్నా పట్టించుకోలేదు. భర్త ఉద్యోగస్తుడుకాబట్టి కమలకు ఉద్యోగం వస్తుంది. దాని నిమిత్తం మా ఆఫీసుకొచ్చిందోసారి. నేను అక్కడ పనిచేస్తున్నానని తనకి తెలీదు. నన్నుచూసి బోరున ఏడ్చింది. మనకిద్దరూ మగపిల్లలే కదా. నాకో కూతురుంటే, తను కష్టాల్లో ఉంటే నేను పట్టించుకోకుండా ఉంటానా చెప్పు. ప్రయత్నంచేసి ఎలాగో ఈ ఊళ్ళోనే ఆమెకు ఉద్యోగం వచ్చేట్టు చేశాను. ఆమె భర్తకు రావలసిన డబ్బంతా మా ఆఫీసు ద్వారానే పరిష్కరించాలి. ఆ తతంగమంతా నేనే దగ్గరుండి పూర్తిచేసి మంచి ఇల్లు చూసి ఆమెను అందులో ఉంచాను. భర్తకు వచ్చిన డబ్బంతా బ్యాంక్‌లో వేసుకుని తనకు వచ్చే ఆదాయంతో పొదుపుగా బతుకుతోంది.

నా దగ్గరనుంచి పైసా కూడా తీసుకోలేదు. అప్పుడప్పుడువెళ్ళి వాళ్ళ మంచిచెడ్డలు చూసేవాణ్ణి. పిల్లలకు అనారోగ్యం చేసినప్పుడు హాస్పిటల్‌కి, అడ్మిషన్లప్పుడు స్కూళ్ళకు తీసుకెళ్ళేవాడిని. ఇన్ని తెలుసుకున్నదానివి ఆ అమ్మాయి ఎవరో నువ్వు తెలుసుకోలేకపోయావు. కూతురులాంటి అమ్మాయిని నాకు రెండోఫ్యామిలీగా ఆపాదించావు. ఈ విషయాలేమీ నీకు చెప్పలేదు. ఎందుకంటే నువ్వు కూడా ఆ తానులోముక్కవే కదా. అయినా కమల చేసిన పనిని నువ్వు ఈ రోజుకీ హర్షించలేవు కదా. అందుకే చెప్పలేదు.అయితే ఇంకో విషయం. కమల నానుంచి పైసా కూడా ఆశించలేదు. తీసుకోలేదు. మరి నా ఆదాయమంతా ఏమవుతోందని నీకు అనుమానం రావొచ్చు. అదే ఇప్పుడు చెప్పబోతున్నాను. ఐదారు సంవత్సరాలక్రితం నాకు ప్రమోషను రావడం, అప్పుడే పే రివిజను జరగడంతో జీతం కూడా బాగా పెరిగింది.

ఆర్థికంగా పుంజుకున్నాం కాబట్టి మన జీవనవిధానాన్ని మార్చాలని, అందరిలాగానే అన్నీ సమకూర్చుకుని ఆనందంగా గడపాలని ఎన్నో ప్రణాళికలు వేసుకున్నాను. కానీ అనుకున్నవన్నీ అనుకున్నట్టుగా జరిగితే అది జీవితం ఎందుకవుతుంది చెప్పు. ఓ రోజు ఆఫీసులో కళ్ళుతిరిగి పడిపోయాను. ఏదో నీరసంవల్ల

అలా జరిగి ఉంటుందిలే అనుకున్నాను కానీ అలా నాలుగైదుసార్లు స్పృహతప్పి పడిపోయాను. డాక్టర్ని సంప్రదించాలని హాస్పిటల్‌కి వెళ్ళాను. అక్కడి డాక్టరు ఇది న్యూరాలజీకి సంబంధించిన జబ్బుని న్యూరాలజిస్ట్‌ని కలవమన్నారు. ఆయన్ని కలిస్తే అన్ని టెస్టులూ చేసి మెదడులో ఇన్‌ఫెక్షను చేరిందని దాన్ని మందులతో తగ్గించవచ్చని, అయితే మందులకు తగ్గకపోతే ఆపరేషను చేయాల్సి ఉంటుందని, అయితే ఇది ప్రమాదకరమైన వ్యాధి అని ప్రాణాపాయం ఎక్కువగా ఉంటుందని జాగ్రత్తగా ఉండాలని మందులు రాసి క్రమం తప్పకుండా వాడాలనీ చెప్పారు. అప్పుడే నేను కట్టుకున్నగూడు కుప్పకూలిపోయినట్టైంది.

నిన్ను ఆనందంగా ఉంచి, నీతో సంతోషంగా జీవించాలని ఎన్నో కలలు కన్నాను. అవన్నీ కల్లలైపోయాయి. నీకు చెపితే నువ్వు ఏమైపోతావోనని భయమేసింది. అంతే! అప్పటినుంచీ నా ఆలోచనా విధానం మారిపోయింది. నాకేమైనా అయితే నీ పరిస్థితి ఏమిటి? ఎలా బతుకుతావు? మనకొడుకులు చూస్తారనే గ్యారంటీలేదు. వాళ్ళెంత స్వార్థపరులో మనిద్దరికీ తెలుసు. మనమెలా బతుకుతున్నామో కూడా పట్టించుకోవడంలేదు. అందుకే అప్పుడే ఒక నిర్ణయం తీసుకున్నాను. నా అనంతరం నువ్వు ఎవరిమీదా ఆధారపడకూడదు. అందుకే నాకు నెలకొచ్చే యాభైవేల రూపాయల్లో పాతికవేలరూపాయలు ప్రతీనెల నీపేరుమీద రికరింగ్‌డిపాజిట్ చేయడం ప్రారంభించాను. ఐదువేల రూపాయలు నా మందులకు కేటాయించి మిగిలిన ఇరవైవేలతోనే సంసారం గడపాలని నిర్ణయించుకున్నాను.

ఇప్పటికి ఐదు సంవత్సరాలుగా, నీ పేరుమీద బ్యాంక్‌లో పదిహేను లక్షలవరకు ఉన్నాయి. నువ్వు అన్నావుకదా, నా ఆదాయాన్నంతా రెండోఫ్యామిలీకి తగలేస్తున్నానని, ఇప్పుడు అర్థమైందా? బ్యాంకే నా రెండోఫ్యామిలీ. నా ఆదాయంలోసగం దానికే ఇచ్చేస్తున్నాను. నేను పోయిన తర్వాత ఆ రెండోఫ్యామిలీయే నిన్ను ఆదుకుంటుంది. నేనుపోయాక నాకొచ్చే బెనిఫిట్స్, నెలనెలా వచ్చే పెన్షన్‌తో నువ్వెవరిమీద ఆధాపడకుండా బతకగలవు సుభద్రా. నువ్వంటే నాకుప్రాణం. నా ప్రేమను నీకు పైకి చెప్పుకోలేకపోయాను. నేను పోయినా నీకు ఎటువంటి కష్టం కలగకుండా నువ్వు బతకాలి. నీకు ఏ లోటూ రాకూడదు. పిల్లల్ని నమ్మకు.

ఈ డబ్బు నీ దగ్గర ఉందని తెలిస్తే నీకు మాయమాటలు చెప్పి, నిన్ను బాగా చూసుకుంటామని నమ్మించి, ఆ డబ్బంతా గెద్దల్లా తన్నుకుపోతారు. కాబట్టి వాళ్ళదగ్గరకు వెళ్ళకు. ఈ ఇంట్లోనే హాయిగా బతుకు. నీకు మనసు మారితే కమలను దగ్గరకు

తీసుకో. అది చాలా మంచిపిల్ల. నువ్వు బ్రతికినంతకాలం అది నీకు తోడుగా ఉంటుంది. ఇంతకన్నా ఏం చెప్పగలను సుభద్రా. ఏదో ఒకరోజు నాకు పిలుపు వస్తుందని తెలుసు. అందుకే ఈ ఉత్తరం రాసి ఉంచాను. నా మీద నీకు ఏమైనా అపోహలు ఉంటే అవి మనసులో నుంచి తీసెయ్యి. ఇంక రాయడానికేమీ లేవు. జాగ్రత్త సుభద్రా". ఉత్తరం చదవడం ముగించిన సుభద్ర నిలువెల్లా కన్నీళ్ళతో తడిచిపోయింది.

తనెంత పాపాత్మురాలు. భర్త మనసు తెలుసుకోకుండా ఎంతమూర?ంగా ప్రవర్తించింది. వాళ్ళూవీళ్ళూ చెప్పినమాటలు పట్టుకుని ఆయన్ని అపార్థం చేసుకుంది. ఇంక బాధపడి లాభంలేదనుకుని ఆదినారాయణగారికి ఫోన్‌చేసింది. పరిస్థితి ఎలా ఉందని అడిగింది. ఆపరేషన్ చెయ్యాల్సి ఉంటుందని డాక్టర్లు చెప్పారని ఆయన చెప్పాడు. రీఎంబర్స్‌మెంటు సదుపాయం కూడా ఉంటుందని చెప్పాడు. తను బయలుదేరి వస్తున్నానని చెప్పింది. వెంటనే తయారై బ్యాంక్ డిపాజిట్ సర్టిఫికెట్, పాస్‌బుక్, ఇంట్లో ఉన్న బంగారం తీసుకుంది. దేవుడి గదిలోకెళ్ళి 'నా భర్తను బతికుంచు స్వామి' అంటూ దేవుణ్ణి మొక్కుకుంది. బయలుదేరేముందు కమలకు ఫోన్‌చేసి హాస్పిటల్‌కి రమ్మని చెప్పింది. ఈ డబ్బు బంగారమే కాదు అవసరమైతే ఇల్లు కూడా అమ్మేసి ఎంత ఖర్చయినాసరే భర్తను బతికించుకోవలని ఎంతో ఆశతో హాస్పిటల్‌కు బయలుదేరింది సుభద్ర.

**(నవ్య వారపత్రికలో ప్రచురితం. కూనపరాజు వెంకట రాయపరాజు స్మృతిసాహితి-నవ్య వీక్లీ కథల పోటీలో తృతీయ బహుమతి రూ. 5,000 బహుమతి పొందిన కథ)**

* * *

# రివెంజ్

**మె**డలోని స్టెత్ ను తీసి టేబుల్ మీద పెట్టి రివాల్వింగ్ చెయిర్ లో కూర్చున్నాడు డాక్టర్ నివాస్. అప్పుడే రౌండ్స్ పూర్తి  చేసి వచ్చాడేమో కొంచెం చికాగ్గానే ఉంది. ఆయన హస్తవాసి మంచిదనే పేరుంది. డాక్టర్ నివాస్ కార్డియో థోరాసిక్ సర్జన్. ఆ ఊళ్ళో చాలా పేరు ప్రఖ్యాతులున్న హార్ట్ స్పెషలిస్ట్. వయసు నలభై అయిదు సంవత్సరాలుంటాయి.

సరిగ్గా అప్పుడే మరో డ్యూటీ డాక్టర్ వచ్చి, "డాక్టర్! ప్రముఖ ఇండస్ట్రలియస్ట్ విశ్వనాథ్ సివియర్ అటాక్ తో ఐ.సి.యు.లో అడ్మిట్ అయ్యారు. మీరు రావాలి సార్" అని చెప్పాడు.

మొదటిసారి వచ్చిన స్ట్రోక్ కొంచెం సివియర్ గానే వచ్చింది. సమయానికి తీసుకురావడం వల్ల ఆయనకు ఫస్ట్ ఎయిడ్ అందింది.

ఇంక ఇంటికి వెళదామనుకుంటుండగా నర్సు వచ్చి, "మిమ్మల్ని కలవాలని ఎవరో వచ్చారు సార్ చాలా అర్జంటట.పంపమంటారా"అంది.

ఎవరబ్బా అనుకుంటూ "పంపు"అన్నాడు.

"నమస్కారం సార్, నా పేరు రామకృష్ణ. విశ్వనాథ్ గారి పి.ఏ.ని"అన్నాడు వచ్చినతను.

"కూర్చోండి. ఇప్పుడే విశ్వనాథ్ గారిని చూసి వచ్చాను. కేసు కొంచెం క్రిటికల్ గానే ఉంది. మా ప్రయత్నం మేం చేస్తున్నాం. ఆయన తాలూకు వాళ్ళెవరూ రానట్టుంది"

"అవును సార్. ఆయనకు భార్య, ఇద్దరు కొడుకులు సార్. వాళ్ళిప్పుడు ఇక్కడ లేరు. ఫోన్ చేశాను. రేపటికి రావొచ్చు. విశ్వనాథ్ గారు ఈ కవరిమ్మన్నారు"అంటూ సీల్ చేసి ఉన్న కవర్ని నివాస్ చేతికి ఇచ్చాడు. "నాకా"ఆశ్చర్యంగా అడిగాడు.

"మీకంటే మీకని కాదు సార్. ఆయనకు సీరియస్ అయ్యి ఏ హాస్పటల్ లో అడ్మిట్ చేస్తారో ఆ డాక్టరుకు ఇవ్వమన్నారు సార్. అందులో ఏముందో నాకు కూడా తెలియదు సార్. ఆ కవర్ని ఎవరికి చూపించవద్దని, అది ఉన్నట్టే ఎవరికి చెప్పొద్దని, నన్ను కూడా తీసి చూడవద్దని చెప్పారు సార్. ఈ టైములో మీకు ఇవ్వడం మంచిదని

ఇస్తున్నాను సార్"చెప్పాడు రామకృష్ణ. ఆశ్చర్యపోయాడు నివాస్.

"మీరెళ్ళి బయట కూర్చోండి పిలుస్తాను"

రామకృష్ణ వెళ్ళిన తర్వాత కాసేపు ఆలోచించి కవరు ఓపెన్ చేశాడు. అందులో ఓ పెద్ద ఉత్తరం, ఓ చెక్ ఉన్నాయి. ఆ చెక్ మీద పదిలక్షల రూపాయలు వేసి విశ్వనాథ్ గారి సంతకం పెట్టి ఉంది. అయితే చెక్ ఎవరికి చెందాలో రాసి లేదు. ఖాళీగా వుంది.

"డాక్టరు గారూ! మీరెవరో నాకు తెలియదు. నాకేదైనా అయ్యి హాస్పటల్ లో అడ్మిట్ అయ్యినప్పుడు అక్కడి డాక్టరుగారికి ఈ ఉత్తరం ఇమ్మని మా పి.ఏ.కి చెప్పాను. అతను మీకు ఈ ఉత్తరం ఇచ్చి ఉంటాడు. కాబట్టి ఇది పూర్తిగా చదవండి. నా గురించి ఇప్పటికే మీకు తెలిసే ఉంటుంది. కానీ మీకు చెప్పుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి డాక్టరుగారూ.

నేను అవ్వడానికి ఓ పారిశ్రామికవేత్తనే కానీ ఇంత వాడినవ్వడానికి నేనెంత కష్టపడ్డానో ఎవరికి తెలియదు. ముఖ్యంగా నా కుటుంబ సభ్యులకు. ఒక సాధారణ ఉద్యోగిగా చేరిన నేను అదే సంస్థకు యజమానినై నా బిజినెస్ సామ్రాజ్యాన్ని విస్తరింపచేయడానికి అహోరాత్రులు కష్టపడ్డాను. కొన్ని వేల కుటుంబాలు నా పేరు చెప్పుకుని బతుకుతున్నాయి. కానీ నా కుటుంబంలో నాకెటువంటి గుర్తింపు లేదు. నా భార్యాపిల్లలకు నా డబ్బు కావాలి కానీ నేనక్కర్లేదు. నేను వాళ్ళకు డబ్బు ముద్రించే యంత్రం లాంటి వాణ్ణి.

నా భార్య ఏమీ చదువుకోలేదు. అయినా పేదింటి పిల్లను చేసుకున్నాను. ఎందుకంటే అప్పుడు నేనూ పేదవాణ్ణే. మొదట్లో చాలా అన్యోన్యంగా వుండేవాళ్ళం.కానీ నేను వ్యాపారంలో ముందుకెళ్ళేకొద్ది డబ్బు మీద వ్యామోహం పెంచుకుంది. అదే సర్వస్వంగా బతికింది. ఈ నగరంలో ఉండే అన్ని మహిళామండళ్ళలోనూ సభ్యురాలే. విచ్చలవిడిగా ఖర్చు పెడుతుంది. అయినా నేనేమీ అనేవాణ్ణి కాదు. డబ్బు కూడా అలా వస్తుండేది. నాతో కంటే డబ్బుతో దొరికే ఆనందాలతోనే ఎక్కువ గడిపేది. అలా అని చెడు తిరుగుళ్ళు తిరుగుతుందని కాదు. ఇంక నా కొడుకుల విషయానికి వస్తే వాళ్ళని ఎంతో ఖర్చు పెట్టి విదేశాలకు పంపి చదివించాను. అక్కడ చదువు తప్ప అన్నీ నేర్చుకున్నారు. లిక్కర్, డ్రగ్స్, అమ్మాయిలు ఒక్కటనేమిటి అన్ని అవలక్షణాలతో దేశానికివచ్చారు. వాళ్ళని బిజినెస్ లో పెట్టాను. అందులోనూ పనికి రాలేదు సరికదా నాకు చెడ్డ పేరు తీసుకొచ్చారు. ఇంక వాళ్ళనలా వదిలేశాను. అంతే

నేను సంపాదించింది ఖర్చు పెట్టి జల్సాలు చేస్తున్నారు.నేను వాళ్ళకి డబ్బును అందుబాటులో వుంచకపోతే నాతో పోట్లాట పెట్టుకునేవారు.

నన్నేం చేయడానికైనా సిద్ధం. తల్లీకొడుకులు ఒకే మాట మీద వుంటారు. వాళ్ళతో విసిగిపోయానంటే నమ్మండి. అప్పుడప్పుడు చావాలని కూడా అనిపించేది. కానీ నా మీద ఆధారపడి ఎంతోమంది బతుకుతున్నారు. అలాంటప్పుడు వీళ్ళకోసమా నేను చావాలనుకునేదనుకునేవాణ్ణి. గత సంవత్సరం నుంచీ నా ఆరోగ్యం అంతగా బాగుండటం లేదు.ఎప్పుడైనా విదేశాలకు వెళ్ళినప్పుడు టెస్టులు చేయించుకునేవాణ్ణి. గుండె బలహీనంగా ఉందని చెప్పారు. మందులు వాడుతూ ఉన్నాను. ఎక్కువగా రెస్టులో వుండమన్నారు. బిజినెస్ లో పార్టనర్స్ ని చేర్చుకుని నేను తగ్గించుకున్నాను. అది మా వాళ్ళకు నచ్చలేదు. పార్టనర్స్ వద్దంటారు. లాభాలు తగ్గిపోతున్నాయని గొడవ పెట్టుకుంటున్నారు. నేను నా ఆరోగ్యం గురించి చెప్పాను. నేను పోతే వాళ్ళు వ్యాపారాలు చూసుకుంటామని చెప్పారు.అప్పుడు నేను పడ్డ బాధ వర్ణనాతీతం. అప్పట్నుంచీ వాళ్ళు నా మీద కక్ష కట్టారు. మానసికంగా ఎంతవరకు హింసించవచ్చో అంత హింసించేవారు. అప్పుడే నా మనసు విరిగిపోయింది. అప్పటి నుంచి ధార్మిక సంస్థలకు, ఆశ్రమాలకు, ఇతర సామాజిక సేవలకు విరాళాలివ్వడం ప్రారంభించాను.

ఆ రోజు నుంచి నా పరిస్థితి ఇంకా దారుణంగా తయారయ్యింది. నా చావుకోసం ఎదురుచూడటం మొదలుపెట్టారు. వాళ్ళ మీద నాకు విపరీతమైన ద్వేషం పెరిగిపోయింది. అప్పుడే నిర్ణయించుకున్నాను వాళ్ళకు బుద్ధి చెప్పాలని. నా ఆస్తిని అంతా వాళ్ళకి దక్కనివ్వకూడదని నిర్ణయించుకున్నాను. ఎవరైతే నా అభివృద్ధికి కారకులో అంటే నా వర్కర్స్ కి నా కంపెనీలో వచ్చే లాభాలు చెందేటట్లు రాశాను. మా వాళ్ళకి మాత్రం వాళ్ళు బ్రతకడానికి సరిపోయే ఆస్తులు రాశాను.అప్పుడుగానీ వాళ్ళకు అర్థం కాదు బాగా బతకాలంటే కష్టపడి సంపాదించాలని.మిగిలిన ఆస్తుల్ని పేద పిల్లల విద్యాభివృద్ధికి ఒక ట్రస్ట్ ను ఏర్పాటు చేసి దానికి రాశాను. డాక్టర్ గారూ!మిమ్మల్ని వేడుకునేది ఒక్కటే. మా వాళ్ళకి బుద్ధి చెప్పాలి. దానికి మీరు సహకరించాలి. నేను బతక్కపోవచ్చు. అందుకే మీకు ముందుగా చెక్ రాసిపెట్టాను. ఆ మొత్తం మీదే.వాళ్ళ మీద నా పగ తీర్చుకోనివ్వండి. ఏ భర్తా,తండ్రీ నాలా ప్రవర్తించి ఉండడు. కాని నా మానసిక వ్యథను అర్థం చేసుకోండి. మా వాళ్ళ చేత ట్రీట్ మెంట్ కోసం ఖర్చు పెట్టనివ్వండి. వాళ్ళు తప్పనిసరిగా ఖర్చు పెట్టాలి.అది నేను బతకడం కోసం కాకపోయినా సొసైటీలో చెడ్డ పేరు రాకుండా చూసుకోవడానికైనా ఖర్చు

పెడతారు. ఆ డబ్బు మీకు అక్కరలేకపోతే దాన్ని సేవా కార్యక్రమాలకు ఖర్చు పెట్టండి.

మీరు ఎంతవరకు ఖర్చు పెట్టించడానికి అవకాశం ఉంటుందో అంతవరకు ఖర్చు పెట్టించండి. ఎన్ని లక్షలైనా సరే వాళ్ళని వదలకండి. ఒకవేళ నేను బతికితే అవసరమున్నా లేకపోయినా ఎన్ని నెలలయినా ఇక్కడ ఉంచండి. వాళ్ళకి నేనంటే ఏమిటో తెలియాలి. మీరు నాకీ సాయం చేసిపెట్టాలి. ఇంతకన్నా నేను కోరుకునేది ఏమి లేదు. ఇట్లు విశ్వనాథ్."

ఆ ఉత్తరం చదివి దీర్ఘంగా నిట్టూర్చాడు డాక్టర్ నివాస్. విశ్వనాథ్ మీద విపరీతంగా జాలి కలిగింది. డబ్బు0టే మాత్రం ఏం సుఖం అనుకున్నాడు. రామకృష్ణను పిలిచి ఆయన భార్యా,పిల్లల గురించి అడిగాడు.

"మేడమ్ గారు ప్రస్తుతం ఊళ్ళో లేరండి. ఎక్కడున్నారో కూడా తెలియదు. ఫోన్ చేసి చెపితే ఎల్లుండికి గానీ రాలేనన్నారు. సీరియస్ గా ఉందని చెపితే రేపు రావడానికి ప్రయత్నిస్తానన్నారు. ఇంక అబ్బాయిగార్లయితే క్లబ్బులో ఉన్నారండి. విషయం చెపితే వస్తాంలే అని నిర్లక్ష్యంగా సంధానం చెప్పారు"అంటూ బాధపడ్డాడు

"సరే ఇప్పుడెవరొచ్చి చేసేదే0 లేదు. అవసరమైన మందులు వాడుతున్నాం కదా చూద్దాం"అంటూ పైకి లేచాడు ఇంటికి వెళ్ళడానికి. రామకృష్ణ ఐ.సి.యూ వైపు నడిచాడు.

– – –

నివాస్ పడుకున్నాడన్నమాటే గాని నిద్ర రావడం లేదు. విశ్వనాథ్ గారు రాసిన ఉత్తరం పదేపదే గుర్తుకు వస్తుంది. భార్యాపిల్లల మీద పగ తీర్చుకోవడానికి ఓ డాక్టర్ని ఎంచుకోవడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. నిజంగా సంపాదించాలనుకుంటే దీనిని అడ్డు పెట్టుకుని ఎంతైనా సంపాదించవచ్చు.

"ఏమిటింత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు నిద్ర రావడం లేదా?" అడిగింది శ్రీమతి.

విషయం చెప్పాడు నివాస్. "పాపం!కొందరి జీవితాలంతే",సానుభూతి చూపించిందామె. రేపు విశ్వనాథ్ గారి భార్యాపిల్లలొస్తే ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో నిర్ణయించుకున్నాడు.

కలత నిద్ర పోయి తెల్లారి లేచి గబగబా తయారై హాస్పటల్‌కి వెళ్ళిన వెంటనే ఐ.సి.యూ దగ్గరకు వెళ్ళి విశ్వనాథ్ గారిని చూశాడు. ఆయన ప్రశాంతంగా నిద్రపోతున్నారు. మళ్ళీ రిపోర్టులన్నీ చూశాడు. ప్రస్తుతం ఆయన ఆరోగ్యం నిలకడగానే వున్నట్టనిపించింది. "లేచిన వెంటనే నన్ను పిలవండి"అని చెప్పి మిగిలిన పేషెంట్లను

చూడటానికి వెళ్ళాడు.

రౌండ్స్ పూర్తి చేశాడు. ఓ.పి.చూస్తున్న సమయంలో నర్సు వచ్చి, "విశ్వనాథ్ గారు మేలుకున్నారు సార్"అని చెప్పింది. ఓ.పి. కి బ్రేక్ ఇచ్చి విశ్వనాథ్ దగ్గరకు వెళ్ళాడు. ఆయన్ని నవ్వుతూ పలకరించాడు.

"ఎలా ఉన్నారు"అంటూ ఆయన నుదుటి మీద చేయి వేశాడు. ఆయన కూడా నవ్వాడు. కాసేపైన తర్వాత "మీతో మాట్లాడాలి" అన్నాడాయన.

అక్కడే ఉన్న డ్యూటీ డాక్టర్ని, నర్సును బయటకు పంపేశాడు. అక్కడ ఇద్దరే ఉన్నారు.

"చెప్పండి"అన్నాడు నివాస్.

"విషయమంతా ఉత్తరంలో రాశాను. మీరు నాకా హెల్ప్ చేయాలి డాక్టర్ గారూ"చాలా నీరసంగా ఉండటంతో ఆయన గొంతు నెమ్మదిగా ఉంది.

"చూడండి విశ్వనాథ్ గారూ! మీ సొంత మనుషుల మీద అంత రివెంజ్ అవసరమంటారా చెప్పండి. వాళ్ళని క్షమించలేరా?"

"ఎలా క్షమించమంటారు డాక్టర్. వాళ్ళు నా చావును కోరుకున్నారు. కట్టుకున్న భర్త ఏమైపోయినా నా భార్యకు అవసరం లేదు. కన్నతండ్రి చావు కోసం ఎదురుచూస్తున్నారు నా కొడుకులు. మీరొక్కసారి ఆలోచించండి నా మానసిక స్థితి ఎలా ఉంటుందో. మీకు ఆ డబ్బు సరిపోదంటే చెప్పండి నా పీ.ఏ. చేత డ్రా చేయించి ఇస్తాను."

"నేను డబ్బు గురించి ఆలోచించడంలేదండి. సరే మీరింక విశ్రాంతి తీసుకోండి నేను మళ్ళీ వస్తాను"అని చెప్పి అక్కడి నుండి కదిలి ఓపీ దగ్గరకు వచ్చాడు.

మధ్యాహ్నం రెండు గంటల వరకు చూశాడు. లంచ్ ఇంటి దగ్గర నుంచి వస్తుంది.

భోజనం చేసి రిలాక్స్ అయ్యాడు. మెడికల్ రిప్రజంటేటివ్స్ వస్తే వాళ్ళతో మాట్లాడాడు. సరిగ్గా మూడు గంటల సమయంలో రామకృష్ణ వచ్చి విశ్వనాథ్ గారి భార్య, కొడుకులు వచ్చారని చెప్పాడు.

వాళ్ళని తీసుకురమ్మని చెప్పాడు. వాళ్ళు లోపలికి వచ్చాక రామకృష్ణ బయటకు వెళ్ళిపోయాడు.

విశ్వనాథ్ గారి భార్య గాయత్రీదేవి, కొడుకులు రమేష్,సురేష్ లు నివాస్ టేబుల్ ముందు నిలబడ్డారు. వాళ్ళని కూర్చోమని చెప్పడంతో కూర్చున్నారు.

గాయత్రీదేవికి అరవై సంవత్సరాలు పైనే ఉంటాయి. కాని అంతా వయస్సున్న దానిలా కనపడటం లేదు. చాలా అందంగా ఉంది. ఆవిడ హాస్పటల్ కి చావు బతుకుల మధ్య కొట్లాడుతున్న భర్తను చూడటానికి వచ్చినట్టు లేదు.

ఏదో పెళ్ళికో, పేరంటానికో వెళుతున్నట్లుగా చాలా ఖరీదైన చీరతో, ఒంటి మీద వజ్రాల నగలతో వచ్చింది. కొడుకులు భారీకాయాలతో, పెంచిన గడ్డాలతో రౌడీల్లా ఉన్నారు. పాతిక,ముప్పై సంవత్సరాల మధ్య వయస్సుంటుంది వాళ్ళకి.

"ఆయనెలా ఉన్నారు?" నిర్లక్ష్యంగా అడిగాడు పెద్ద కొడుకు రమేష్.

"ఆయనంటే?"

"అదే మా డాడీ"

"ఎలా వుంటారని అనుకుంటున్నారు?"

"అదేంటి డాక్టర్ పిల్లలకు వాళ్ళ డాడీ ఎలా వున్నారో తెలుసుకోవాలని వుండదా?"అన్నారు గాయత్రీదేవి కొంచెం కోపంగా.

"మీకు లేదా?" తిరిగి ప్రశ్నించాడు నివాస్.

వాళ్ళకి మతిపోతోంది నివాస్ ప్రవర్తనకి. ఆయన మీద చాలా కోపం వస్తోంది.

అది గమనించిన నివాస్, "చూడండి! విశ్వనాథ్ గారు మీరంతా ఉండి కూడా ఎంత ఒంటరిగా బతుకుతున్నారో తెలుసా?"అన్నాడు.

"ఆయనకు ఒంటరితనమేమిటండి.ఆయనో పెద్ద బిజినెస్ సామ్రాజ్యానికి మహారాజు. ఆయన వాళ్ళ పార్టనర్స్ తో కలిసే ఉంటారు ఎప్పుడు"అంది నిష్టూరంగా.

"అంటే ఆయనకు భార్యా,పిల్లల అవసరం లేదంటారా?"

వాళ్ళు మాట్లాడలేదు.

"మీరంతా నేను చెప్పేది కొంచెం జాగ్రత్తగా వినండి. ఏ మనిషికైనా కుటుంబం తర్వాతే ఏదైనా అయ్యుంటుంది. విశ్వనాథ్ గారు అలా ఆలోచించే మనిషని నాకర్థమవుతోంది.

ఆయనకు మీ అండదండలుండి వుంటే ఆయన బిజినెస్ లో ఇంకా బాగా రాణించేవారు. అలాగే ఆరోగ్యపరంగా ఈ స్థితిలో ఉండేవారు కాదు."

ఆ మాటలు వాళ్ళకింకా కోపాన్ని తెప్పించాయి.

"అంటే మా వల్లే ఆయన ఇలా అయ్యారంటారా?" అన్నాడు చిన్న కొడుకు సురేష్.

"అది నిజం కాదంటారా?"

మళ్ళీ మౌనం.

"మీరు అవునన్నా,కాదన్నా అది నిజం. ఇంటి యజమాని మీద కోపం, కక్ష వున్నంతమాత్రాన భార్యగాని, పిల్లలుగాని ఆయన చావును కోరుకోకూడదు. ఆయన పోయాక గాని వారి విలువ తెలియదు."

వాళ్ళు ఏదో చెప్పబోయారు కానీ నివాస్ వాళ్ళని మాట్లాడనివ్వలేదు.

"ఈ విషయాలన్నీ నాకెలా తెలుసని మీకనిపించవచ్చు. తెలుసుకోవాలనుకుంటే ఎలాగైనా తెలుస్తాయి. గొప్పవారి గోత్రాలు లోకులకెరుకంటారు కదా. మీరు ఆయన మీద, ఆయన మీ మీద రివెంజ్ తీసుకోవాలనే ప్రయత్నంలో మీరు ఏం కోల్పోతున్నారో మీకు తెలియడం లేదు."

ఆయనెందుకిలా మాట్లాడుతున్నాడో వారికి అర్థం కావడం లేదు.

''గాయత్రీదేవీగారూ మీరొక విషయం ఆలోచించాలి. మీరిప్పుడు పసుపుకుంకుమలతో సాక్షాత్తూ లక్ష్మీదేవిలా ఉండటమే కాదు, పుణ్యస్త్రీగా సంఘంలో గౌరవమర్యాదలు పొందుతున్నారు.

అలాంటప్పుడు మీ భర్త మీకు దూరమైతే మీకా గౌరవం ఉంటుందంటారా? మీ దగ్గరున్న డబ్బు మీకా గౌరవాన్ని తెస్తుందంటారా?అన్నింటికీ మిమ్మల్ని దూరం పెడతారు. ఆ పరిస్థితిని మీరు భరించలేరు. అనుభవంలోకి వస్తే తప్ప ఆ బాధ ఎలా ఉంటుందో మీకు తెలియదు. అలాగే సురేష్, రమేష్ లు మీరు కూడా ఆలోచించండి.

మీ తండ్రి ఉన్నంతవరకే మీరు తండ్రి చాటు బిడ్డల్లా మీరెన్ని తప్పులు చేసినా రక్షించబడుతున్నారు. ఎప్పుడైతే మీ తండ్రి మీకు దూరమవుతారో అప్పుడు ఈ సమాజం మీతో ఫుట్ బాల్ ఆడుతుంది. ఆ విషయాన్ని మీరు గమనించడం లేదు. ఎంతసేపూ ఆయనపోతే సర్వాధికారాలు మీకొస్తాయని అనుకుంటున్నారు గానీ దాని పరిణామాలను ఆలోచించడం లేదు"చెప్పడం ఆపి వారి ముఖాల వంక చూశాడు నివాస్.

వారి ముఖకవళికలు మారిపోయాయి. ముఖాల్లో భయం చోటు చేసుకుంది. గాయత్రీదేవి కళ్ళలో నుంచి కన్నీరు బుగ్గల మీదుగా జారుతున్నాయి. కొడుకుల ముఖాల్లో కూడా బాధ కనిపించింది.

"ఇప్పటికీ మించిపోయింది లేదు. ఆయన ఆరోగ్యం మీ చేతుల్లో వుంది. మీకు

నిజంగా ఆయన కావాలనుకుంటే ఆయన్ని అక్కున చేర్చుకోండి. మీరంతా ఆనందంగా ఉంటారు. ఆయన ఆరోగ్యం కూడా బాగుపడుతుంది" అని చెప్పాడు నివాస్.

వాళ్ళంతా అక్కడి నుంచి వెళ్ళిపోయారు. నివాస్ రామకృష్ణను పిలిచి అంతకుముందే సీల్ చేసిన ఆ కవర్ ని అతని చేతిలో పెట్టి, "విశ్వనాథ్ గారితో దీని అవసరం రాలేదని చెప్పండి. ఆయన ఆరోగ్యం కూడా బాగుపడుతుంది"అని చెప్పాడు నివాస్.

అక్కడనుంచి లేచి ఐ.సి.యూకెళ్ళి విశ్వనాథ్ గారున్న రూమ్ దగ్గరికొచ్చాడు. లోపలి దృశ్యాన్ని చూసి నివాస్ ఆశ్చర్యపోలేదు.

విశ్వనాథ్ గారి కాళ్ళ మీద తన ముఖాన్ని వుంచి గాయత్రీదేవి రోదిస్తోంది.

విశ్వనాథ్ గారి రెండు భుజాల మీద కొడుకులిద్దరూ తలలు పెట్టి ఏడుస్తున్నారు.

వాళ్ళందర్ని విశ్వనాథ్ గారు ఓదారుస్తున్నారు.

తను ఒక మనిషి ప్రాణాన్ని కాపాడటమే కాదు, ఒక కుటుంబాన్ని నిలబెట్టగలిగాననే సంతృప్తితో నివాస్ అక్కడి నుంచి కదిలాడు.

**(స్వాతి వారపత్రికలో ప్రచురితం)**

* * *

# స్వయంవరం

వేదిక అందంగా అలంకరించబడింది. వేదిక ముందున్న కుర్చీలు కూడా ఒక పద్ధతి ప్రకారంగావున్నాయి. సాయంత్రం 6 గంటల సమయం. ట్యూబులైట్ల వెలుగులో ఆ చిన్న ఆడిటోరియం ధగధగా మెరుస్తుంది. వేదికమీద చిన్న టేబులు, నాలుగు కుర్చీలున్నాయి. వేదిక ముందు ఓ వంద కుర్చీలున్నాయి.

ఒక్కొక్కరుగా ఆడిటోరియమ్ లోనికి ప్రవేశిస్తున్నారు. సుమారు ఓ పాతిక మంది వరకు ముప్పయి సంవత్సరాల లోపు వయస్సున్న యువకులు వేదికముందు కుర్చీల్లో ఆసీనులయ్యారు. మిగిలిన కుర్చీల్లో ఆ సభకు ఆహ్వానించబడిన కొంతమంది పెద్దలు కూర్చున్నారు. కొన్ని కుర్చీలలో విలేఖరులు, టీ.వి. రిపోర్టర్లు కూర్చున్నారు.

సరిగ్గా అనుకున్న సమయానికి అంటే ఆరున్నరకి సభ ప్రారంభమయ్యింది. వేదిక మీదకు సమన్విత రావడంతో సభా ప్రాంగణమంతా వెన్నెల విరిసినట్లయింది. ఆమె ఆ జిల్లా కలెక్టరు. ఆమెతో పాటు ఆ వేదికమీదకు సాదా బట్టల్లో సుమారు ఏభై సంవత్సరాలు పైనే వుండే ఓ జంట కూడా వచ్చింది. ఆ ముగ్గురూ మూడు కుర్చీల్లో కూర్చున్నారు. ఆ జంట ఎవరో ఎవరికీ తెలీదు. నాలుగో కుర్చీలో ఆ నియోజకవర్గ ఎమ్మెల్యేగారు కూర్చున్నారు.వేదిక ముందు కూర్చున్న పాతిక మంది యువకులు సమన్విత వంక చాలా ఆరాధనగా చూస్తున్నారు.సమన్విత కూడా వారివంక నవ్వుతూ చూస్తుంది. ఆ యువకులు కూడా అనేక హెూదాల్లోవున్న ఐ.ఏ.ఎస్ ఆఫీసర్లు. వివిధ జిల్లాల నుంచి సమన్విత ఆహ్వానం మేరకు వచ్చారక్కడకి. సమన్విత స్టేజి మీద లేచి నిలబడి మాట్లాడటం మొదలుపెట్టింది.

"అందరికీ నమస్కారం, ఈ సభకు మీ అందరినీ ఎందుకు పిలిచానో మీలో చాలా మందికి తెలియకపోవచ్చును. కానీ పిలవడానికి చాలా బలమైన కారణముంది కాబట్టే అందర్నీ పిలవడం జరిగింది. ఇంక అసలు విషయానికొస్తాను. నేనీ జిల్లాకి కలెక్టర్ని. నా వయసిప్పుడు దగ్గర దగ్గరగా ముప్ఫయి సంవత్సరాలు రాబోతున్నాయి. ఇంకా పెళ్ళి కాలేదు. నాకు అందరిలాగే పెళ్ళిచేసుకోవాలనే ఆలోచన వుంటుంది కదా. ఎంత కలెక్టరయినా పెళ్ళి, సంసారం వుండాలని కోరుకోవడంలో తప్పులేదు కదా. హెూదా వుండొచ్చేమోకానీ నేనూ సాధారణ ఆడపిల్లనే, నాకు అందరిలాగే

కోరికలుంటాయి కదా. రెండు సంవత్సరాల నుంచీ నాకు పెళ్ళి ప్రపోజల్స్ వస్తున్నాయి. అంతా ఐ.ఏ.ఎస్ ఆఫీసర్లే. అది సహజమే కదా. సుమారు పాతికమంది ప్రపోజల్స్ చేసారు. వాళ్ళలో వంకపెట్టడానికేం లేదు. అంతా అందగాళ్ళు, ధనవంతులు మంచి మంచి హెూదాల్లో వున్నవాళ్ళు. అంతా నన్ను ఇష్టపడినవారే. వారిలో ఎవరినైనా కళ్ళు మూసుకుని చేసుకోవచ్చు. వారంతా నా హెూదాని, అంతస్తును చూసి వచ్చిన వాళ్ళని తెలుసు. ఎవరు కోరుకున్నా అంతే కదా. వారిని తప్పుపట్టడానికేం లేదు. కానీ ఎవరికీ నా వెనుకున్న పరిస్థితులు తెలియవు. నేనెవరినో, నా కుటుంబ నేపథ్యం ఏమిటోకూడా తెలియవు. అవన్నీ తెలిస్తే ఇంత మందిలో ఎవరు ముందు కొస్తారో నాకు తెలియదు. నా గురించి దాచిపెట్టి చేసుకోవాలని నేననుకోవడంలేదు. అందుకే అంతా చెప్పాలని నాకు ప్రపోజ్ చేసిన వారిని ఈ సమావేశానికి పిలిచాను. వారంతా ఈ ముందు వరుసలో కూర్చున్నారు. ఇలా చేయడం ఒప్పో, తప్పో నాకు తెలియదు. ఇది నేను ఎన్నుకున్న మార్గం. ఇంక నా గురించి చెబుతాను అంటూ కాసేపు ఆగింది సమన్విత. అంతా ఆమె ఏం చెబుతుందోనని చూస్తున్నారు.

ఆమె మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"ఈ స్టేజి మీద కూర్చున్న ఈ ఇద్దరూ ఎవరో తెలుసా? వాళ్ళు నా తల్లిదండ్రులు. వాళ్ళు పారిశుద్ధ్య కార్మికులు. కన్నవారినే తల్లిదండ్రులనుకుంటే వాళ్ళు నాకంతకంటే ఎక్కువ. ఎందుకంటే నా కన్నతల్లి తప్పుచేసో, లేక ఆడపిల్లనని అనుకుందో గాని నన్ను బ్రతికుండగానే చెత్త కుప్పలో విసిరేస్తే ఆ చెత్త కుండీని శుభ్రం చేయడానికెళ్ళిన ఈ దంపతులు నన్ను చేరదీసి కన్నబిడ్డకంటే ఎక్కువగా భావించి పెంచారు . పిల్లల్ని కనే వయస్సులోవున్నా కూడా సొంత సంతానాన్ని కోరుకోలేదు. నన్ను కళ్ళలో పెట్టుకు పెంచారు. నాకు చదువంటే తెలీదు. చదుకోవాలనీ తెలీదు. నాకు అయిదారు సంవత్సరాలు వచ్చే వరకు నేను వాళ్ళతో పారిశుద్ధ్య పనులు చేసేదాన్ని. అమ్మ, నాన్న పబ్లిక్ పాయిఖానాలను శుభ్రం చేయడానికి వెళ్ళుతుంటే నేనూ వాళ్ళతో చీపుర్లు పట్టుకు వెళుతుండేదాన్ని. వాళ్ళతో పాటు నేనూ వాటిని శుభ్రపరిచేదాన్ని, నిజానికి నన్నా పనులు చేయడానికి వాళ్ళు ససేమీరా ఒప్పుకునేవారు కాదు. నేను వినేదాన్ని కాదు. నన్నాపనులు నుంచి దూరంగా వుంచడానికే నన్ను స్కూల్లో చేర్పించారు.

అంటే అప్పటి నుంచి నా విద్యా పర్వం ప్రారంభమయింది. అన్ని తరగతుల్లో ముందుండేదాన్ని అలా హైస్కూలు పూర్తిచేసాను. టెన్త్ మంచి మార్కులు రావడంతో కార్పోరేట్ కాలేజిలో ఇంటర్‌లో ఫ్రీ సీటు ఇచ్చారు. ఇంటర్ స్టేట్‌ఫస్టు లో పాసయ్యాను.

డిగ్రీ కూడా అలాగే ర్యాంకులో పాసయ్యాను. డిగ్రీ చదువుతున్నప్పుడే నాకు సివిల్స్‌కు వెళ్ళాలనే ఆలోచన కలిగింది. దాన్ని సాధించడం కోసం తపస్సు చేసాననే చెప్పాలి. మొదటి ప్రయత్నంలో విజయం సాధించాను. ఇంతవరకు వివిధ పదవులు నిర్వహించాను. ఇప్పుడు ఈ జిల్లాకు కలెక్టరుగా వున్నాను.నేను ఐ.ఏ.ఎస్ పాసయి ఉద్యోగంలో చేరినప్పటినుంచి నాకు మ్యారేజ్ ప్రపోజల్స్ వస్తున్నాయి అప్పుడు నాకా ఆలోచన లేదు. కెరీర్‌లో ఇంకా పైకి రావాలనే పట్టుదలతో వుండేదాన్ని.ఇప్పుడు నా తల్లిదండ్రులు కూడా నన్ను పెళ్ళి చేసుకోమ్మని పోరుతున్నారు. అందుకే ఈ సంవత్సరం పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. ముఖ్యంగా నేను చెప్పేదేమిటంటే నన్ను చేసుకోబోయే వ్యక్తి నాతో బాటు నా తల్లిదండ్రులను కూడా స్వీకరించాలి. నాతో పాటే నా తల్లిదండ్రులు జీవితాంతం వుంటారు. నా కన్న తల్లిదండ్రులెవరో నాకు తెలీదు . నిజంగా నేను వాళ్ళ దగ్గర పెరిగుంటే నేనీ స్థాయికి వచ్చేదాన్ని కాదేమో. అందుకే నాకు వాళ్ళమీద కోపం లేదు. ఎందుకంటే వాళ్ళా పనిచేయకుంటే దేవతల్లాంటి ఈ తల్లిదండ్రులు నాకు దొరికేవారు కాదు. నన్ను ప్రాణంతో సమానంగా వీళ్ళు పెంచారు. ఈ తల్లి నాకు గోరుముద్దలు తినిపించింది. వీళ్ళకి నేనే సర్వస్వం. అటువంటి వారిని నేను ఒదులుకోలేను.వాళ్ళు  జీవితాంతకాలం నాతోనే వుంటారు. నా కుటుంబ పరిస్థితుల్ని చెప్పుకోవడానికి నేను సిగ్గుపడను. అందుకే అన్నీ చెప్పాను.

ఈ స్వయంవరానికి నన్నుకోరుకున్న పాతికమంది ఐ.ఏ.ఎస్ ఆఫీసర్లను పిలిచాను. పూర్వం స్వయంవరం అంటే వధువు వరుణ్ణి సెలెక్ట్ చేసుకునే పద్ధతి. ఈ స్వయంవరంలో ఇక్కడ పాతిక మంది వరుళ్ళలో ఎవరైనా ఈ పద్ధతిని పాటించవచ్చు. అయితే వాళ్ళు నన్ను భార్యగానే కాదు నా వాళ్ళని కూడా తల్లిదండ్రులుగా స్వీకరించగలిగే వారై వుండాలి. ఈ రకమైన పద్ధతి అంటే నేను ఏర్పాటు చేసిన ఈ సభాముఖమైన స్వయంవరం తప్పో, ఒప్పో నాకు తెలీదు. కాని అంతా ఓపెన్‌గా జరగాలనే ఉద్దేశ్యంతో దీన్ని ఏర్పాటు చేసాను. మీలో ఎవరు ముందుకు వస్తారో నేను వాళ్ళని చేసుకోవడానికి సిద్ధమే” అంటూ కూర్చుంది సమన్విత.

సభా ప్రాంగణమంతా నిశ్శబ్దమైపోయింది. కూర్చున్న ఆఫీసర్లంతా ఒకరిముఖాలొకరు చూసుకుంటున్నారు. ఎమ్మెల్యేగారు బాగా మాట్లాడావమ్మా అంటూ కళ్ళతో మెచ్చుకున్నారు. సమన్విత తల్లిదండ్రులు జరుగుతున్న తంతేమిటో తెలియనట్లు కూర్చున్నారు.పావుగంట సమయమైనా వాళ్ళలో ఎవరూ ముందుకు రాలేదు. సమన్వితకు అర్ధమైపోయింది. వాళ్ళలో ఎవరికీ తనని చేసుకోవడం ఇష్టం లేదని. తనలో తనే

నవ్వుకుంది. వాళ్ళు ప్రపోజల్ చేసేటప్పుడు ఎన్నో ఆదర్శాలు వల్లించారు. అందుకే వాళ్ళ మనస్తత్వం ఎలాంటిదో తెలుసుకోవడానికి ఈ సభను ఏర్పాటుచేసింది. తనకు తెలుసు అంతా తన అందాన్ని హెూదాని చూసే వస్తున్నారని. ఇంతవరకు వెంటబడ్డారు ఏ సంగతి చెప్పమని. ఇప్పట్నించీ వాళ్ళతో ఇంకెటువంటి బాధా వుండదు.

మరో పావుగంట గడిచింది. ఎవర్నించీ ఎటువంటి రెస్పాన్స్ రాలేదు. సమన్విత పైకి లేచింది. మైకు అందుకుని “ఇక్కడితో ఈ సమావేశాన్ని ముగిస్తున్నాను. నేను చెప్పాలనుకున్నది చెప్పాను. చెప్పాలనుకొన్న విషయాలు ఎలా చెప్పాలో అదే చేసాను. ముఖ్యంగా విలేఖరులను కోరేది ఒక్కటే. దీనిని విపరీతార్థాలకు, విమర్శలకు తావివ్వకుండా వ్రాసుకోండి, ప్రసారం చెయ్యండి. ఈ సమావేశానికి వచ్చిన మీ అందరికీ మరొక్కసారి ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాను నమస్తే”, అంటూ ముగించింది.

అంతా లేవబోయారు. అంతలో “ఎక్స్‌క్యూజ్ మీ మేడమ్” అనే గొంతు వెనుక జనాల్లో నుంచి వినిపించింది.

అంతా ఆశ్చర్యంగా అటు వైపు చూసారు.

సుమారు 27 28 సంవత్సరాలు వయసుండే ఓ యువకుడు లేచి నిలబడి వున్నాడు. సుమారు ఆరడగుల ఎత్తు, మంచి వర్చస్సు కలిగి వున్నాడు. మంచి పెర్సనాలిటీతో చూపరులను ఆకర్షించేలా వున్నాడు.

“చెప్పండి” అంది సమన్విత.

“నేనో రెండు విషయాలు మాట్లాడాలని కోరుకుంటున్నాను. నాకో రెండు నిమిషాలు టైమ్ ఇవ్వండి మేడమ్”.

“ఎస్. ప్లీజ్.”

ఆ యువకుడు హుందాగా నడుస్తూ వేదికమీదకు వెళ్ళాడు. మైకందుకుని చేతులు జోడించి, “సభకు నమస్కారం. కలెక్టరుగారు చెప్పిన తర్వాత నేనో నిర్ణయం తీసుకున్నాను. చెప్పేముందు నాగురించి కొంచెం చెబుతాను. ఏ కారణంచేత సమన్విత గారి తల్లి ఆవిడను చెత్తకుండీలో పార వేసిందో అలాగే నాతల్లి కూడా నేను పుట్టిన వెంటనే అనాధ శరణాలయం ముందు వదిలేసింది. కలెక్టరుగారు ఆడపిల్లగా పుట్టారు కాబట్టీ వారి తల్లి పుట్టిన పిల్ల చచ్చిపోవాలని చెత్తకుండీ లో విసిరేసింది. నేను మగపిల్లాడ్ని కాబట్టి ఎలా అయినా బతుకుతాననే ఉద్దేశ్యంతో శరణాలయంలో వదిలేసి వుంటుంది. నేనూ అనాధ లాగే పెరిగాను. మేడమ్ అదృష్టం కొద్దీ పార్వతీపరమేశ్వరుల వంటి

తల్లిదండ్రులు దొరికారు. నాకా అదృష్టం లేదు. నేను ఒంటరిగా పెరిగాను. అప్పుడు నేను పడ్డ క్షోభ మాటల్లో చెప్పలేనిది. నేను కష్టపడి చదివి పైకి రావాలనే ఉద్దేశ్యంతో చిన్న చిన్న పన్లు చేసుకుంటూపీ.జీ చదివాను. పార్ట్ టైము ఉద్యోగం చేసుకుంటూ పీ.హెచ్‌డీ కూడా చేసాను. చదువుకు తగ్గ ఉద్యోగాలు ఇచ్చే స్థితి ప్రభుత్వాలకు లేదు కాబట్టి ఎలిమెంటరీ స్కూలు లో టీచర్‌గా ఉద్యోగమొచ్చింది. అలా అని నేను దానితో తృప్తి చెందకుండా సివిల్స్ రాస్తూనే వున్నాను. భవిష్యత్తులో దాన్ని సాధిస్తానో లేదో చెప్పలేను. అయితే బతకడానికి చిన్నదో పెద్దదో ఉద్యోగం వుంది.

ఇంక అసలు విషయానికి వస్తే కలెక్టరుగారు ఏర్పాటుచేసిన స్వయంవరం నాకు నచ్చింది. అలా నిర్భయంగా ప్రతీ ఆడపిల్ల తన జీవితభాగస్వామిని ఎన్నుకోగలిగితే ఇప్పుడు మనం చూస్తున్న వివాహవ్యవస్థ బాగుపడుతుందనిపిస్తుంది.

కలెక్టరు గారిని సూటిగా ఒక విషయం అడగాలనుకుంటున్నాను. విద్య విషయం పక్కన పెడితే ఉద్యోగ విషయంలో వారికన్నా చాలా తక్కువ స్థాయిలో వున్నాను. అది అవిడకు అభ్యంతరం లేకపోతే నేను ఆవిడను జీవితభాగస్వామిగా స్వీకరించాలనుకుంటున్నాను. వీడికెంత ధైర్యం అనుకోకండి. ఆవిడంత నిర్భయంగా చెప్పగలిగినప్పుడు నేనూ అలాగే చెప్పగలుగుతున్నాను. ఆవిడ పెట్టిన కండిషను తన తల్లిదండ్రుల విషయం. నేను ముందే చెప్పాను. నేను అనాధనని, నాకు తల్లిదండ్రుల ప్రేమ ఎలావుంటుందో తెలీదు. వారిని నేను ఆవిడకంటే ఎక్కువగా ప్రేమించగలను. నా తల్లిదండ్రులుగా వారిని పూజించగలను. తల్లిదండ్రులను ప్రేమించేవాడు తప్పనిసరిగా భార్యను ప్రేమిస్తాడు. కాబట్టి కలెక్టరుగారికి భర్తగా నా సంపూర్ణమైన ప్రేమనందించగలను. ఇంతకన్నా నేను చెప్పేదేం లేదు. ఆవిడ

అంగీకరించకపోయినా నేనే మీ బాధపడను. నిజంగా అంగీకరిస్తే నేను చాలా అదృష్టవంతుడవుతాను. అప్పుడు ఈ స్వయంవరానికి ఒక పరిపూర్ణమైన అర్థం ఏర్పడుతుంది" అంటూ ముగించి సమన్విత వంకచూసాడు.

సమన్విత నవ్వుతూ అతని చేయినందుకోవడానికి అక్కడనుంచి లేచి అతని దగ్గరకు నడిచింది. హాలంతా కరతాళధ్వనులతో నిండిపోయింది.

**(ఉగాది కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన కథ)**

* * *

# మరో మనిషి

**రా**త్రి పది గంటలయ్యింది. ట్రెయిన్ పదిన్నరకి. అరగంట లేటని రన్నింగ్ స్టేటస్ చూస్తే తెలిసింది. ఇంకా గంట టైముంది కదా అని నెమ్మదిగా బయలుదేరాను. ఆఫీసు పనిమీద హైదరాబాదు వెళుతున్నాను. మా అపార్ట్‌మెంటుకి మెయిన్ రోడ్డు చాలా దగ్గర కాబట్టి నడుచుకుంటూ వచ్చాను ఆటో కోసం.

రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. ఎక్కడా నరసంచారంలేదు చలికాలం కదా. ఇప్పుడెలా వెళ్ళాలి అని కొంచెం టెన్షన్ పడ్డాను. రెల్వేస్టేషను ఇక్కడకు అయిదు కిలోమీటర్లు పైనేవుంటుంది. అంతదూరం నడిచి వెళ్ళలేం అందులోను రాత్రిళ్ళు. ఎలా అబ్బా అనుకుంటున్న సమయంలో దూరంనుంచి ఆటో వస్తూ కన్పించింది. హమ్మయ్య అనుకుంటూ ఆటోను ఆపాను ఖాళీగానే వుంది.

"స్టేషన్ కొస్తావా" అనడిగాను. వస్తానన్నాడు.

"ఎంతిమ్మంటావు".

"ఎంతిస్తారు".

"అదేంటి నువ్వుచెప్పాలి కదా".

"సార్ ఇప్పుడు చూస్తే చాలా టైమయింది. ఆటోలు దొరికే అవకాశం లేదు. నేను ఎంత చెప్పినా మీరివ్వవలసిందే కదా. అందుకే నేను చెప్పడంలేదు. మీరే ఎంతిస్తారో చెప్పండి" అన్నాడు ఆటోడ్రైవరు. ఆశ్యర్యమేసింది అతన్ని చూస్తుంటే. పగలయితే స్టేషన్‌కి యాభై, అరవై రూపాయల వరకు తీసుకుంటారు. రాత్రిళ్ళయితే వందరూపాయిలకు తక్కువతీసుకోరు. ముందే అంత ఇస్తాననడం ఎందుకని డెబ్బయ్యిస్తానన్నాను. రానంటే వందివ్వొచ్చని.

"సరే ఎక్కండి" అన్నాడు ఆటో లోపల లైటువేసి. ఆటో ఎక్కిలోపలంతా పరికించిచూసాను. ఆటోలో ఓ మూలగ మనుషులు కూర్చోడానికి ఇబ్బంది లేకుండా నాలుగైదు లీటర్లు పట్టే వాటర్ కాన్‌ని అమర్చాడు. అలాగే ఆటో సీటు వెనుక ఓ ఫ్లెక్సీని అతికించాడు. అందులో వ్రాసినవి చదివితే చాలా ఆశ్చర్యమేసింది.

"భార్య బానిస కాదు... తల్లిభారం కాదు" అని పెద్ద అక్షరాలలో రాసి ఉంది. దానికింద కొన్ని వాక్యాలు వరుసగా రాసి ఉన్నాయి. స్త్రీలను గౌరవించాలి, వృద్దులకు,

గర్భిణీ స్త్రీలకు ఉచిత ప్రయాణం, రోగులను ఉచితంగా ఆసుపత్రులకు తీసుకెళ్ళబడును లాంటివి ఇంకా రాసివున్నాయి.

"ఏమిటయ్యా ఇవి" అన్నాను వాటినిచూస్తూ. లైటార్పి ఆటో స్టార్ట్ చేసి వెళుతూ చెప్పాడు "ఏముంది సార్ నేను రోజంతా ఆటో తిప్పుతాను, ఎవరైనా ముసలివాళ్ళు కన్పిస్తే వాళ్ళని, ఆస్పత్రులకు వెళ్ళేవాళ్ళను, కడుపుతో ఉన్న వాళ్ళని డబ్బులు తీసుకోకుండా తీసుకెళుతుంటానుసార్. దానికోసం నేనేమీ కష్టబడటంలేదుకదా. ఏదో నాకు తోచిన సాయం చేయాలనుకున్నాను, చేస్తున్నాను".

"వాళ్ళందర్నీ అలా తీసుకెళుతుంటే ఆయిల్ ఖర్చువుతుంది కదా"

"నేను రోజూ ఉదయం ఇరవైమంది స్కూలు పిల్లల్ని నాలుగు ట్రిప్పుల్లో తీసుకెళ్ళి మళ్ళీ వాళ్ళని సాయంత్రం ఇళ్ళకు చేరుస్తాను. ఈ మధ్యలో పాసెంజర్లను తిప్పుతాను. నాకు నెలకి దగ్గర దగ్గరగా ఇరవైవేలు వస్తాయి. అందులో రోజుకి వందరూపాయలు ఇలాంటి వాటికి ఖర్భవుతాయి. అంటే మూడువేలు పోతాయి. ఆటో అద్దెపోను పదివేలవరకు మిగులుతాయి. అవి నా ఖర్చులకువుంటాయి. అంత సంపాదించు కుంటున్నప్పుడు అందులో కొంత ఇతరులకోసం ఖర్చుచేయడం పుణ్యమేకదా సార్."

అతని మాటలకు బిత్తర పోయాను.

అతనికి ముప్పయిదేళ్ళవరకు వుండొచ్చు. ఈ వయసులో అతని ఆలోచన అమోఘమనిపించింది.

"ఎప్పట్నించి ఇదంతా చేస్తున్నావు. అసలెలా వచ్చింది నీకీఆలోచన".

"పదేళ్ళ నుంచి ఆటో వేస్తున్నాను సార్. పదో తరగతి వరకు చదువుకున్నాను. అప్పుడు మదర్ థెరిస్సాగారి పాఠం చదువుకున్నప్పుడు అన్పించింది, మనం సంపాదించుకున్నదాన్లో ఇతరులకు కొంత సాయం చేయాలని. అలాగే ఆదివారాలు చర్చికి, శుక్రవారాలు మసీదుకి, శనివారాలు వెంకన్నబాబు గుడికి వెళుతుంటాను సార్. అంతా చెప్పేదొక్కటే కదా పరులకు సాయం చేయాలని, మాధవసేవే మానవ సేవ అని. అందుకే నాకు తోచిన సాయం చేస్తుంటాను. ఇదేదో గొప్పకోసం చేయడం కాదు సార్. సాటి మనిషికి సాయపడాలన్నదే నా ఉద్దేశం."

"నిజంగా నిన్ను అభినందించాలయ్యా. ఎంతోమంది చేయలేని పనిని నువ్వు చేస్తున్నావు!"

"చేయడానికేముంది సార్. కొంచెం మనసుండాలంతే".

నిజమే ఎవరికైనా కొంచెం సాయం చేయడంవల్ల మనం కోల్పోయేదేమీ ఉ

ండదు. అతను చెప్పినట్టు కొంచెం మనసుండాలి.

"ప్రతి ఆదివారం పది మంది అనాథలకు అన్నదానం కూడా చేస్తానుసార్. ముసలి వాళ్ళయిపోయి కన్నపిల్లల నిరాదరణకు గురైనవాళ్ళు నాకు కొంత మంది తెలుసు. వాళ్ళకి శనివారం వచ్చే ఆదాయంలో కొంత మొత్తం కేటాయిస్తాను. నేను చేసే ఈపనికి కొంతమంది సాయ పడుతుంటారు. వారానికొక్క రోజేకాకుండా ప్రతీరోజు పెట్టాలనేది నాకోరిక సార్. ముందు ముందు అదికూడా చేస్తాను. ఎవరైనా సాయపడితే ఇంకా ఎక్కువమందికే పెట్టాలనుకుంటున్నాను".

అతను నా ముందు ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు.

"నా ఆటో ఎక్కే పాసెంజర్లు చిల్లర లేక ఎంతో కొంత వదిలేస్తుంటారు సార్. ఆ డబ్బుల్తో వాటర్ కేన్లో వాటర్ పోయిస్తాను. అవసరమైనవాళ్ళు త్రాగుతుంటారు".

"మరిలా ఖర్చుపెడుతుంటే మీ ఇంట్లోవాళ్ళు అంటే నీ భార్యా, పిల్లలు ఏమీ అనరా".

"ఎందుకంటారు సార్, నేనేమీ తాగి తగలెయ్యడంలేదుకదా. మా ఆవిడ కూడా ఈ విషయంలో నా కంటే ముందే వుంటుంది. పాసెంజర్లకు ఎక్కువ రేటు చెప్పి భయపెట్టొద్దంటుంది. మేముండేది అద్దింట్లో. ఇల్లు చిన్నదే ఇరుగ్గావుంటుంది. ఇల్లు ఇరుకైనా మా మనసులు మాత్రం ఇరుగ్గావుండవు సార్. మాకుటుంబం అంతా నేను చేసేదానికి సపోర్ట్చేస్తుంటారు."

"సొంత ఆటోలేదు, సొంత ఇల్లు కూడా లేదు. ఈ డబ్బుత్తో వాటిని సమకూర్చుకోవాలని ఎప్పుడూ అన్పించలేదా".

"నిజానికి లేదు సార్, సంపాదించి ఏం చేసుకుంటాం సార్. ఎలా వచ్చామో అలాగే పోతాంకాదా. ఇప్పుడు చూడండి ఎంతోమంది వేలు, లక్షల కోట్లు సంపాదిస్తున్నారు వాళ్ళేమైనా సుఖంగా వున్నారా చెప్పండి రోగాల్తోనే కదా బతికేది. పోనీ కూడా పట్టుకుపోతారా అంటే అదీలేదు కదా. వాటిని సంపాదించుకోడానికి నాకింకా టైముందిలే సార్."

అతన్ని చూస్తుంటే చాలా నేర్చుకోవాలనిపిస్తుంది. అప్పుడు నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

నేనీ సమాజానికేమన్నా చేస్తున్నానా అని. నిజానికి నాకీ సమా జంచాలా ఇచ్చింది. మంచి ఉద్యోగం వుంది. ఆస్తులున్నాయి. విలాసవంతమైన జీవితం గడువుతున్నాను. కానీ నేనెవరికీ ఉపయోగపడటంలేదు. ఎవరికీ రూపాయి సాయంకూడా చేయడం లేదు. నా అంతట నేను చేయలేను కనీసం ఇలాంటి వాళ్ళకి సాయపడినా ఉడుత

సాయం అవుతుంది కదా అన్పించింది.

స్టేషను దగ్గరపడుతుంది. అప్పుడతనితో అన్నాను "నిన్ను చూస్తుంటే చాలా ముచ్చటేస్తుందయ్యా, నాకు అందరికీ ఏదో చెయ్యాలనిపిస్తుంది. అప్పుడప్పుడు నీకు కొంత అమౌంటు ఇస్తుంటాను. వాటిని నువ్వు చేసే వాటికి ఉపయోగించు. నీ అడ్రసు, ఫోను నెంబరు ఇవ్వు నిన్ను కాంటాక్టు చేస్తాను".

"చాలా సంతోషం సార్, మీలాంటి వారు సాయపడతానంటే నేనింకా పెద్ద ఎత్తున చేయగలను సార్" అన్నాడు సంతోషంగా.

ముందు నేను డెబ్బయి రూపాయలిద్దామనుకున్నాను. కాని ఇప్పుడు వందిచ్చి మిగిలిన డబ్బులతో వాటర్ కేన్‌లో వాటరు పోయించమని చెప్పాలి.

ఆటో స్లోగా పోతుంది. అప్పుడు నాలో వున్న మరోమనిషికి డౌటొచ్చింది. ఇతను చెప్పేవన్నీ ఎంత వరకు నిజం అని. నాలాంటి వాళ్ళదగ్గర నుంచి ఎంతో కొంత సంపాదించుకోవడానికి ఇవన్నీ చెబుతున్నాడా? ఇప్పుడు జనం రకరకాలమోసాలు చేస్తున్నారు. ఇదీ అలాంటి మోసంకాదుకదా! ఏమో ఎవరు చెప్పగలరు. ఇలాంటి వాళ్ళతో కొంచెం జాగ్రత్తగా వుండాలి సుమా అనుకున్నాను. స్టేషన్ ముందు ఆటో ఆగింది. నేను జేబులో నుంచి డబ్బులు తీసాను. ఒక వంద, ఒక యాభై నోటు బయటకొచ్చాయి. వందరూపాయలనోటు జేబులో పెట్టి ఏభై రూపాయల నోటుని చేతిలో పట్టుకుని బ్రీఫ్‌కేసు తీసుకుని ఆటోదిగాను.

అతను జేబులోనుంచి చిన్నకాగితం తీసి నాచేతిలోపెట్టి "ఇందులో నాపేరు, ఫోన్ నెంబరు వున్నాయి సార్. మీకు ఏ సమయంలో ఆటో కావలసి వచ్చినా ఫోన్ చేయండి వస్తాను". అన్నాడు.

దాన్ని తీసి చూసాను అందులో "ఈశ్వర్  అని అతని పేరు, ఫోనునెంబరు వేసివున్నాయి. నాచేతిలోవున్న యాభై నోటుని అతనికిచ్చి ''చిల్లర లేదు యాభైయేవున్నాయి. మిగిలినవన్నీ ఐదువందలు, రెండువేల రూపాయలనోట్లే. నువ్వు మళ్ళీ కన్పిస్తావు కదా అప్పుడిస్తాన్లే" అని చెప్పాను.

"అలాగే సార్" అని అతను నవ్వుతూ ఆటోని ముందుకు పోనిచ్చాడు.

అతనిచ్చిన ఆ అడ్రస్ కాగితాన్ని నలిపేసి దూరంగా విసిరేసాను.

నాకిప్పుడు ఆనందంగావుంది నేను మనిషిని కదా మరి.

**(సహరి అంతర్జాల వారపత్రికలో ప్రచురితం)**

* * *

# ఇరుకు

**మం**డుటెండలో నెత్తిమీద బరువైన కట్టెల మోపుతో  ఇంటికి చేరుకుంది దేవమ్మ. ఒళ్ళంతా చెమట పట్టేసింది. చాలా దూరం నుంచి నడిచి వచ్చిందేమో గుండెల్లో నుంచి గసొస్తుంది. చప్పుడు కాకుండా నెత్తి మీదున్న మోపును కిందకుదింపింది. ఇంట్లో కొడుకు, కోడలు వున్నారు. వాళ్ళ ఏకాంతానికి భంగం కలిగించకుండా, తను వచ్చానన్న భావన రానీయకుండా జాగ్రత్త పడింది. బయటేవున్న మంచి నీళ్ళకుండలో నుంచి  నీళ్ళు తీసుకుని తాగింది. కొంచెం అలసట తగ్గినట్లనిపించింది.

ఇంట్లో నుంచి కొడుకు, కోడలు ఆనందంగా గడుపుతున్నట్లుగా నవ్వులు, కేరింతలు, గుసగుసలు–లీలగా విన్పిస్తున్నాయి.

"మీ అమ్మ వచ్చేసుంటాదేమో" అంటోంది కోడలు.

"అప్పుడే రాదులేవే, వత్తే పిలిసేదిగా– కాస్సేపు పడుకో. మళ్ళీ రేపటి వరకు మనకీ అవకాశం రాదుగా" అంటున్నాడు కొడుకు.

కోడలు కిలకిలా నవ్వింది.

దేవమ్మ అక్కడి నుండి నెమ్మదిగా కదిలి దూరంగా వున్న చెట్టునీడలో కూర్చుంది. అప్పటికే సమయం మధ్యాహ్నం మూడుగంటలు కావొస్తుంది.

రేపటి నుండి ఇంకా ఇంటికి ఆలస్యంగా రావాలనుకుంది. కొత్తగా పెళ్ళయిన కొడుకు, కోడలు ఆనందంగా గడుపుతున్నారింట్లో. తను వాళ్ళకు ఏ విధంగాను అడ్డు  రాకూడదు. నూతన దంపతులకు పడక గదిలో పూచిక పుల్లకూడా అడ్డుగానే వుంటుంది. తమకున్నది ఒకే ఒక గదివున్న అద్దెకొంప. ఇక్కడున్నవన్నీ ఇటువంటి ఇరుకు కొంపలే. పట్నంలో తమలాంటి పేదోళ్ళుండటానికి ఇలాంటి ఇళ్ళేతప్ప వేరేవీ దొరకవు. అద్దెలు కూడా సామాన్యంగా వుండవు ఎంత కష్టమైనా వాటిలో సర్దుకుపోవలసిందే.

దేవమ్మకు భర్తపోయి పదేళ్ళయింది. బతికుండగా అతను కూడా కూలిపని చేసేవాడు. ఇద్దరూ పని చేస్తే తప్ప రోజు గడవని పరిస్థితి. సొంతిల్లు లేదు, అలా

లేకపోవడమనేది తమ నుండే ప్రారంభం కాలేదు. అత్తామామలకు కూడా లేదు. ఒకే గదిలో అంతా ఉండటమనేది కొన్ని తరాలనుంచి జరుగుతుంది. అలా వుండటం ఎంత కష్టమో అది అనుభవించే వారికే తప్ప ఇతరులకు తెలీదు.

దేవమ్మ భర్త పేరు రాజయ్య. ఇద్దరికీ పెళ్ళయ్యే నాటికి రాజయ్యకు ఇరవై అయిదు, దేవమ్మకు ఇరవై వుండేవి. అప్పుడు ఇద్దరూ బలంగా మంచి వయసులోవున్న కోడెల్లా వుండేవారు. దేవమ్మలో యవ్వనం అణువణువునా తొణికసలాడుతుండేది. కానీ ఆ యవ్వనాన్ని జుర్రుకునే అవకాశం రాజయ్యకు ఎప్పుడో గాని దొరికేది కాదు. ఎందుకంటే రాజయ్య తల్లిదండ్రులిద్దరూ రోగిష్టివాళ్ళు. ఇద్దరికీ దగ్గు,ఆయాసం, కీళ్ళ నొప్పుల్లాంటి రకరకాల వ్యాధులుండేవి. వాళ్ళు రాత్రి, పగలు అనకుండా ఎప్పుడూ దగ్గుతూ, ఆయాసపడుతూ వుండేవాళ్ళు. రాత్రిళ్ళయితే అసలు నిద్రే పోయేవారు కాదు. దేవమ్మకయితే రోజంతా వాళ్ళకి సేవలు చేయడంతోనే సరిపోయేది. ఇద్దరికీ ఏకాంతం దొరికేది కాదు.

దేవమ్మలో ఆ వయసులో వుండే ఉత్సాహం క్రమక్రమంగా తగ్గుతూ వచ్చింది. ఎప్పుడూ ఏదో కోల్పోయిన దానిలా వుండేది. నలుగురూ తినాలి కాబట్టీ రాజయ్య రోజంతా కష్టపడి నాలుగు రాళ్ళు తెచ్చేవాడు. పగలంతా పడిన కష్టానికి అలసటతో తిన్నవెంటనే నిద్రలోకి జారుకునేవాడు. ఎప్పటికో గాని దేవమ్మకు నిద్రపట్టేది కాదు. నలుగురూ ఆ గదిలోనే పడుకోవాలి. ఎప్పుడైనా శరీరాలు మరీ మారాం చేస్తే అర్ధరాత్రి దాటాక బయట కొచ్చి తడికలతో కట్టిన బాత్‌రూములో మంచం వేసుకుని ఎవరైనా గమనిస్తారేమోననే భయంతో కంగారు,కంగారుగా కలవటం జరిగేది. ఎంతో ఆనందంగా, ఎంతో సమయాన్ని కేటాయించుకుని గడపాల్సిన దాన్ని తూతూ మంత్రంగా ముగించుకుంటుంటే ఎంతో అసంతృప్తిగా వుండేది. కాని ఏం చేయలేని నిస్సహాయస్థితి.

అప్పుడే నిశ్చయించుకుంది దేవమ్మ, ఎలాగైనా రెండు గదులుండే ఇల్లు చిన్నదైనా సరే కట్టుకోవాలని. తాము పడే కష్టం ఇక్కడితో ఆగిపోవాలని. తన సంతానానికి, వాళ్ళ సంతానానికి ఇలాంటి దుస్థితి రాకూడదని నిర్ణయించుకుంది. ఇదే విషయాన్ని భర్తకు చెపితే కష్టమని ముందు కాస్సేపు నసిగి తర్వాత ఒప్పుకున్నాడు. ఆ తర్వాత ఇద్దరూ రూపాయి...రూపాయి పోగుచేసి ఊరికి దూరంగా చిన్న స్థలాన్ని కొనుక్కోగలిగారు. ఒక పిల్లాడు పుట్టాక ఇంక వద్దనుకున్నారు.

పిల్లాడు పెద్దయ్యే కొద్దీ ఇద్దరికీ ఏకాంతం మరీ కరువయ్యింది. ఇద్దరిలోను

ఏదో అసహనం, అశాంతి, శారీరకంగానే కాదు మానసికంగా కూడా దూరమైపోతామేమో అన్పించేది ఇద్దరికీ. ఎక్కడా బయట పడకుండా ఎంతో ఓర్పుగా వుండేవారు.

వాళ్ళ ఇల్లు ఇరుకేమో గాని మనస్సులు మాత్రం ఇరుకుగా వుండేవికావు. తమ ఏకాంతానికి అత్తమామలు అడ్డుగా వున్నారనే భావన దేవమ్మలో ఎప్పుడూ రాలేదు. అన్ని బాధలు తనలోనే అణుచుకునేది.

ఇంటి స్థలమైతే సంపాదించుకున్నారు కాని అందులో ఇల్లు కట్టుకోవడానికి ఎన్నో ప్రతి బంధకాలు. పిల్లాడు పెరుగుతున్న కొద్దీ ఖర్చులు పెరుగుతున్నాయి. ఇంట్లో ముసలి వాళ్ళ రోగాలు, రొష్టులకు ఎంతొచ్చినా సరిపోవడంలేదు. అలాగే సర్దుకుంటూ సంసారాన్ని గుట్టుగా లాక్కొచ్చేది దేవమ్మ.

సరిగ్గా పిల్లాడికి పదిహేనేళ్ళొచ్చేసరికి రాజయ్య ట్రాక్టరు క్రింద పడి చచ్చిపోయాడు. అప్పుడు దేవమ్మకి దగ్గర దగ్గరగా నలభై ఏళ్ళు వచ్చాయి. రాజయ్య పోయిన సంవత్సరానికి ముసలాళ్ళిద్దరూ బెంగ పెట్టుకుని చనిపోయారు.

దేవమ్మకు దిక్కుతోచలేదు. పిల్లాడితో తను ఒంటరిగా ఎలా బ్రతకాలి? కొంతకాలం వరకు మామూలు మనిషి కాలేకపోయింది. అలా ఏడుస్తూ కూర్చుంటే లాభంలేదనుకుని గుండె దిటవు చేసుకుని బ్రతుకు బండిని లాగటానికి ముందడుగు వేసింది. పిల్లాడు స్కూలు కెళుతున్నాడు. తనిప్పుడు పని వుంటే వెళుతుంది లేనప్పుడు ఇంట్లోనే వుంటుంది.

భర్త వున్నప్పుడు తను కోరుకున్న ఏకాంతం ఇప్పుడు లభించింది. కానీ ఏం లాభం? భర్త లేడు. తనకి నలభై సంవత్సరాలు దాటాయి. ఇంతకాలం జీవితం నిస్సారంగా గడిచిపోయింది. మానసికంగా కానీ, శారీరకంగా గానీ, ఆనందాన్ని పొందిన సందర్భాలు లేవు.

దాంపత్య జీవితం గురించి ఎన్నో కలలు కంది. కానీ వాటిలో ఏదీ నెరవేరలేదు. భర్తపోయి అప్పుడే సంవత్సరం కావొస్తుంది. భర్త వున్నప్పుడు ఎన్ని కోర్కెలు పుట్టినా వాటిని తీర్చుకునే అవకాశం లేక ఆ కోర్కెల్ని బలవంతంగా అణుచుకునేది. కానీ ఇప్పుడు శరీరంలో ఎన్నెన్నో అలజడులు బయలు దేరుతున్నాయి. వాటిని అణుచుకోవడానికి ఎంతో ప్రయత్నిస్తుంది.

“ఈ వయస్సులో ఏమిటీ వికారం?” అని కూడా ప్రశ్నించుకుంది.

తనకి తప్పు చెయ్యాలనే ఆలోచన అప్పుడూ రాలేదు, ఇప్పుడూ రావడం లేదు.

కానీ– తప్పుచేయడానికి అవకాశం, తప్పు జరిగిపోతుందేమోననే భయం ఆమెను ఎంతగానో కలవరపెడుతున్నాయి. అయినా ఆమె గుండె దిటవు చేసుకోవడానికే ప్రయత్నిస్తోంది. తనని పెళ్ళి చేసుకోమని ఒకడు, తనతో సహజీవనం చేయమని మరొకడు అడిగారు. తనకు పనిచ్చిన కంట్రాక్టరయితే ఏకంగా తనతో వుంటానంటే ఎటువంటి లోటు రాకుండా జీవితాంతం పోషిస్తానని కబురుపెట్టాడు. అంతేకాకుండా తను కట్టుకోవాలనుకుంటున్న ఇంటిని తనే కట్టించి పెడతానన్నాడు. వాటన్నంటినీ సున్నితంగా తిరస్కరించింది దేవమ్మ.

ఇప్పుడు తను తప్పుచేస్తే ఆ మచ్చ తన సంతానం మీద జీవితాంతం వుంటుంది. ఎన్ని కష్టాలొచ్చినా వాటిని ఎదుర్కొని ఇంతవరకు ఎంత పవిత్రంగా వుందో ముందు కూడా అలాగే వుండాలని నిశ్చయించుకుంది. కాంట్రాక్టరు దగ్గర పని మానేసింది. కొడుకుని చదువు మాన్పించేసి పనిలో పెట్టింది. ఆ పని, ఈ పని అని కాకుండా రెక్కలు ముక్కలు చేసుకుని అన్నిపనులు చేసింది. ఒకరి సంపాదన తింటూ రెండో సంపాదన్ని పొదుపు చేసింది. ఆ వూరి సర్పంచి ద్వారా అధికారుల్ని పట్టుకుంది. బ్యాంకువాళ్ళ కాళ్ళావేళ్ళాపడి లోను శాంక్షను చేయించుకుంది.మొత్తం మీద రెండు గదుల ఇంటికి పునాదులు వేసింది. ఒక్కో ఇటుక పేర్చుకుంటూ వచ్చింది. ఇల్లు పూర్తయ్యే సరికి చాలా కాలం పట్టింది. స్థలం కొనడానికి పది సంవత్సరాలు పడితే ఇల్లు పూర్తవ్వడానికి మరో పది సంవత్సరాలు పట్టింది.

అప్పటికి కొడుక్కి పాతిక సంవత్సరాలొచ్చాయి. దేవమ్మకి ఏబయి నిండాయి. ఇల్లుపూర్తయ్యాకే వాడికి పెళ్ళి చెయ్యాలనుకుంది.ఇంకో ఆరు నెలల్లో ఇల్లు పూర్తవుతుందనగా కొడుకు తొందర పడ్డాడు. తనతో పని చేస్తున్న అమ్మాయిని ప్రేమించానని, ఆ అమ్మాయితో ఇప్పుడు తన పెళ్ళి కాకపోతే వాళ్ళ వాళ్ళు వేరే అబ్బాయితో పెళ్ళి చేసేస్తారని, ఆ అమ్మాయిని చేసుకోలేకపోతే ఇంక జీవితంలో తను పెళ్ళే చేసుకోనని చెప్పడంతో దేవమ్మకి తప్ప లేదు. అమ్మాయి తరపు వాళ్ళని ఒప్పించి కొడుక్కి పెళ్ళి చేసింది. తను పెళ్ళయిన కొత్తలో ఏ కష్టమయితే పడిందో మళ్ళీ అటువంటి కష్టం కొడుక్కి రాకూడదనుకుంది. అందుకే వాళ్ళకి సాధ్యమైనంత వరకు ఏకాంతం కల్పించడానికి కృషి చేసేది.

కొడుకు ఉదయమే పనికి పోయి ఒంటిగంటకు భోజనానికొస్తాడు. మళ్ళీ మూడుగంటలకు పనికి పోతాడు. కొడుకొచ్చే టైముకి ఏదో పని కల్పించుకుని కొత్తగా కట్టుకుంటున్న ఇంటి దగ్గరకు పోయి మళ్ళీ కొడుకు పనికి పోయే సమయానికి

ఇంటికి చేరుకునేది. కనీసం రెండు గంటలయినా వాళ్ళు సరదాగా గడుపుతారనుకునేది. అయితే రాత్రిళ్ళు మాత్రం ఆ గదిలోనే ముగ్గురు వుండాల్సిన పరిస్థితి. పోనీ తను బయట పడుకుంటానంటే కొడుకు ఒప్పుకోడు. అందులోను రాత్రిళ్ళు బయట పాములు తిరుగుతుంటాయి. అందుకే పగలు ఏకాంతం కల్పించడానికి ప్రయత్నించేది.

గతం నుంచి బయటపడింది దేవమ్మ.నెమ్మదిగా అక్కడనుంచి లేచి ఇంటివరకు వచ్చింది. అప్పుడే అక్కడి కొచ్చినట్లు అక్కడే తచ్చాడుతుంది. బయట నుంచి వస్తున్న శబ్దాలకు నూతన దంపతులిద్దరూ బయటకొచ్చారు. దేవమ్మను చూసిన వెంటనే కోడలు అడిగింది"ఎంత సేపయ్యిందత్తా వచ్చి... ఇప్పుడే నిద్ర పట్టింది... లేపాల్సింది" అంది నొచ్చుకుంటూ.

వాళ్ళిద్దరి కళ్ళల్లోను ఏదో తెలియని సంతృప్తి, ఉత్సాహం కన్పించాయి. ఆ వయసులో వున్నప్పుడు తమకు లేనిదేదో వాళ్ళిద్దరిలోను కన్పించింది దేవమ్మకు.

తను కోరుకునేది కూడా అదే కదా.

ఇంకో రెండు నెలల్లో ఇంటి పని పూర్తి చేసి గృహప్రవేశం జరిపించెయ్యాలనుకుంది దేవమ్మ.

**(ఏప్రిల్ , 2 017 నవమల్లెతీగ మాసపత్రికలో ప్రచురితం)**

* * *

# బాధ్యత

**తె**ల్లారకుండానే సెల్ మోగుతుంటే  మెలకువ వచ్చింది. ఇప్పుడెవరబ్బా అనుకుంటూ ఫోన్ తీసి, "హలో" అన్నాను. నా మాటకు నా శ్రీమతికి కూడా మెలకువ వచ్చింది.

"హలో  అంకుల్,  నేను కావ్యను. బాగున్నారా" అంటూ అవతలి నుంచి వినిపించింది.

"కావ్య...ఎవరబ్బా" అనుకుంటూ ఫోన్ పక్కకు పెట్టి శ్రీమతినడిగాను.

"కావ్య అంట నీకు తెలుసా ఆవిడెవరో" అని.

'కావ్య? కావ్య!' అంటూ తను ఆలోచనలో పడింది.

మళ్ళీ ఫోన్ చెవి దగ్గర పెట్టుకుని,

"హలో.... కావ్య... అంటే.." అంటూ ఆగాను.

"అదే అంకుల్ పదేళ్ల క్రితం మీ పక్కింట్లో ఉండేవాళ్ళం కదా. మా పాప స్వీటీ, మా ఆయన ఆనంద్, గుర్తుకొచ్చామా" అనడంతో అప్పుడు గుర్తుకొచ్చారు వాళ్ళంతా.

"నువ్వా తల్లీ! ఎలా వున్నావురా. స్వీటీ ఎలా వుంది. ఇప్పుడు బాగా పెద్దదయి వుంటుంది. ఆనంద్ ఇప్పుడు అదే కంపెనీలో వున్నాడా లేక మారాడా."

"కంపెనీ మారాడంకుల్, బెటర్ పే కోసం మారాల్సి వచ్చింది. ఖర్చులు పెరుగుతున్నాయి కదా."

"ఏంటమ్మా ఇంత పొద్దున్నే ఫోన్ చేసావ్. అందులోనూ చాలా సంవత్సరాల తర్వాత స్వీటీ బాగానే వుంది కదా".  కాసేపు కావ్య నుంచి జవాబు లేదు. కానీ వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటున్నట్టుగా వినిపించింది.

"స్వీటీ గురించి మాట్లాడాలనే మీకు ఫోన్ చేశానంకుల్.... ఇంట్లో ఇంకా ఎవరూ లేవలేదు. అందుకే మీతో మాట్లాడ్డానికి వీలయ్యింది. కానీ ఇప్పుడు పూర్తిగా చెప్పలేనంకుల్. ఒకసారి మీ దగ్గరకు రావాలనుకుంటున్నాను. మీరు రమ్మంటే పది రోజుల్లో స్వీటీని తీసుకుని వస్తాను."

"అంటే అప్పుడు నేను చెప్పినట్లే స్వీటీ వాళ్లకు సమస్యగా ఉందన్నమాట"అనుకుని,

"తప్పకుండా రండమ్మా. నాలుగు రోజులండేలా రండి", అన్నాను.

ఫోన్ పెట్టేసింది.

కావ్య మాటల్ని బట్టి స్వీటీ వాళ్ళకు పెద్ద సమస్యగానే తయారయ్యుంటుంది. నేనప్పుడే చెప్పాను ఆనంద్ కి, కావ్యకి.కానీ నా మాటల్ని వాళ్ళు పెడచెవిన పెట్టారు.వినకపోతే ఎవరు మాత్రం ఏం చేస్తారు.అనుభవించడం తప్ప.ఇంక మంచం మీద ఉండలేక లేచిపోయాను.నేను లేచానని తనూ లేచిపోయింది నా శ్రీమతి.నేను బ్రష్ చేసుకునేసరికి రెండు కప్పులతో కాఫీ పట్టుకొచ్చింది. హాల్లో కాఫీ తాగుతూ పేపర్ చూస్తున్నాను.

"కావ్యంటే ఆ అల్లరిపిల్ల వాళ్ళమ్మ కదూ.మాయదారి పిల్ల నన్ను ముప్పు తిప్పలు పెట్టేదనుకోండి"అంది శ్రీమతి.

"అవును" అన్నాను.

"ఇప్పుడెందుకు ఫోన్ చేసింది. ఎప్పుడో పదేళ్ళయింది వాళ్ళు వెళ్ళి.ఇప్పుడు గుర్తొచ్చామా మనం"

"స్వీటీతో ఏదో ప్రాబ్లమ్ లా వుంది. అందుకే ఫోన్ చేసింది.దాన్ని తీసుకొస్తానంది"

"పాపం కావ్య స్వీటీతో ఎటువంటి అగచాట్లు పడుతుందో మరి.రానివ్వండి తెలుస్తుంది కదా" అంటూ ఖాళీ కప్పుల్ని తీసుకుని వంట గదిలోకెళ్ళిపోయింది.

నేను వాళ్ళ గురించి ఆలోచించడం మొదలు పెట్టాను.గవర్నమెంటు కాలేజీలో రిటైరయ్యాక ఖాళీగా ఉండకుండా సర్వీసులో వుండగా చేసిన సైకాలజీ పీజీ డిగ్రీ, దానితో పాటు చైల్డ్ సైకాలజీ లో చేసిన డిప్లొమా నేను సైకలాజిస్టుగా మారడానికి దోహదం చేసాయి. ఇంటి దగ్గరే బోర్డు పెట్టుకుని అవసరమైన వాళ్ళకి కౌన్సిలింగ్ చేస్తుంటాను.నాకది కాలక్షేపంగా కూడా వుంది. మా ఇంటి పక్కన పోర్షన్లోకి ఆనంద్ కుటుంబం అద్దెకు దిగింది. అతనో సాఫ్ట్ వేర్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. అతని భార్య కావ్య. కూతురు హాసిని. అంతా స్వీటీ అని పిలుస్తారు. వయస్సు మూడేళ్ళు. చూడ్డానికి క్యూట్ గా ఉంటుంది. అయితే ఎప్పుడు అల్లరి చేస్తుంటుంది.

చాలా త్వరగానే మాటలు వచ్చాయి.ఆ వయసులో చిన్న పిల్లలు కొత్తవాళ్ళను చూస్తే భయపడతారు.కానీ స్వీటీకి అలాంటి భయాలేవి లేవు. ఎందుకో స్వీటీలో నాకు అబ్ నార్మాల్టీ ఎక్కువగా కన్పించేది.వయసు పెరిగే కొద్ది స్వీటీలో చిన్నపిల్లల్లో ఉండే సున్నితత్వం కనబడటం లేదు.ఎంత అల్లరంటే ఇంట్లో ఏది దొరికితే అది పగలగొట్టడం, నోటికేది వస్తే అది అనెయ్యడం చేస్తుంది. స్వీటీని చాలా గారాబంగా పెంచుతున్నారు.పిల్లను పెంచడంలో చాలా పొసెసివ్ గా ఉంటున్నారు.

మా ఇంటికొచ్చిందంటే మాకు భయం పట్టుకునేది ఏది పగలగొడుతుందోనని.

అప్పటికే రెండుసార్లు అలాగే జరిగింది.ఒకసారి మా టీపాయి మీదున్న అద్దాన్ని పగలగొట్టింది.దాని స్థానంలో కొత్తది వేయించడానికి రెండువేలయింది.ఆ సంగతి తెలిసి కావ్య "అయ్యో పగిలిపోయిందా. చిన్న పిల్ల కదండి" అంటూ సింపుల్ గా తీసి పారేసింది.ఆనంద్ తనకు తెలియనట్లే ప్రవర్తించాడు.మరోసారి మా డ్రెస్సింగ్ టేబిలు మిర్రర్ ని కార్నరు దగ్గర పగలగొట్టింది.దాన్ని మార్చలేక అలానే ఉంచేసాం.గాజు ప్లేటులు, కప్పులు సరేసరి.మా భయమల్లా మా టీవీ స్క్రీన్ ని ఎక్కడ పగల గొడుతుందోనని.ఎందుకంటే వాళ్ళ టీవీని ఎప్పుడో పగలకొట్టేసింది.అయితే వాళ్ళా పిల్లను ఎటువంటి భయభక్తులు లేకుండా పెంచుతున్నారు. ఆ పిల్లకు ఏ.డి. హెచ్. డి (అటెన్షన్ డెఫిసిట్ హైపర్ ఆక్టివిటీ డిజార్డర్ )వుందని అప్పుడే గమనించాను.ఏం చేస్తుందో తనకే తెలియని విధంగా ప్రవర్తిస్తుంది.ఏం చెప్పినా వినదు.ఎప్పుడూ ఏదోటి చేస్తూనే ఉంటుంది.తను చేస్తున్న పనులకు మనకి కోపం వచ్చింది గట్టిగా అరిస్తే టాప్ లేచిపోయినట్టు ఏడ్చేది.స్వీటీ ఏం చేసినా ఆ తల్లిదండ్రులకు ముద్దుగానే ఉండేది.అల్లరి చిన్నప్పుడు కాకపోతే పెద్దయ్యాక చేస్తారా అన్నది వారి భావన.

ఓ ఆదివారం ఆనంద్, కావ్య మా ఇంటికొచ్చినప్పుడు స్వీటీ విషయం ఎత్తాను. అంత గారాబం చేయడం మంచిది కాదని, కొంచెం భయం చెబుతూ ఉండమని చెప్పాను.దానికి కావ్య ఒప్పుకోలేదు.

"ఏం చెబుతాం అంకుల్. అది చూస్తే చిన్న పిల్ల. పెద్దయితే ఆ అల్లరి దానంతటదే తగ్గిపోతుంది కదా."

"చూడమ్మా! స్వీటీ అల్లరి చూస్తుంటే నాకలా అన్పించడం లేదు. మీకు కోపం వచ్చినా కూడా ఓ విషయం చెబుతాను.స్వీటీకి. ఏ.డి.హెచ్.డి.అని నాకనుమానంగా వుంది. ఓసారి డాక్టరుకు చూపించండి. తననిలా వదిలేస్తే మీరు భవిష్యత్తులో చాలా సమస్యల్ని ఫేస్ చేస్తారు. ఇప్పటి నుంచీ మీరు జాగత్తపడితే మంచిది" అన్నాను. వాళ్లద్దరి ముఖాలు చూస్తూ. వాళ్ల ముఖాలు మాడిపోయాయి. కొంచెం కోపం కూడా కనిపించింది.

"అంటే మా స్వీటీ అల్లరంతా అబ్‌నార్మల్టీ అంటారా" అన్నాడు ఆనంద్.

"నాకయితే అలానే అన్పిస్తుంది ఆనంద్. ఇలాంటి పిల్లల్ని చాలా జాగ్రత్తగా డీల్ చేయాలి. లేకపోతే మీరు చాలా సమస్యల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది."

అప్పుడు కావ్య అందుకుంది. "పిల్లల్ని పెంచడం పెద్ద కష్టమైన విషయంలా చెబుతున్నారంకుల్ మీరు. మమ్మల్ని మా అమ్మానాన్నలు పెంచలేదా. మీరు మీ పిల్లల్ని పెంచలేదా చెప్పండి. స్వీటీ కూడా అలాగే పెరుగుతుంది."

"చూడమ్మా కావ్యా! నువ్వు ఎప్పటి విషయాలో చెబుతున్నావు. కానీ ఇప్పటి పిల్లల ప్రవర్తన గురించి నువ్వు సీరియస్‌గా ఆలోచిస్తున్నట్టు లేదు. ప్రస్తుత వ్యవస్థలో పిల్లల పెంపకమంత సాహస ప్రక్రియ మరొకటి లేదు. నేను రోజూ ఎన్నో కేసుల్ని చూస్తున్నాను. తల్లిదండ్రులు తమ పిల్లల వల్ల ఎన్ని సమస్యల్ని ఎదుర్కుంటున్నారో నాకు తెలుసు. పిల్లలు ఎంత తలనొప్పిగా తయారయ్యారంటే ఎందుకు పుట్టారా భగవంతుడా? అనుకునే విధంగా తయారయ్యారు.

మీ విషయంలో నేను గమనించింది ఏమిటంటే మీరు స్వీటీని జాగ్రత్తగా పెంచడం లేదనే చెప్పాలి. ఎందుకంటే మీరు అతి గారాబం చేస్తున్నారు. తనేం చేసినా మీకు తప్పు అనిపించడం లేదు. కానీ మీరు గ్రహించవలసినదేమంటే ఈ వయసులో పిల్లలు తల్లిదండ్రుల్ని చాలా నిశితంగా గమనిస్తూవుంటారు. తల్లిదండ్రుల ప్రవర్తన పిల్లల మీద బాగా ఉంటుంది. పిల్లలలా తయారవ్వడానికి తల్లిదండ్రుల ప్రభావం ఎక్కువగానే ఉంటుంది.

"ఆనంద్! ఉదయం నువ్వు ఆఫీసుకెళ్లి రాత్రి ఎప్పుడో వస్తావు. నీతో గడిపే సమయాన్ని స్వీటీ మిస్సవుతుంది. పోనీ కావ్యను చూస్తే తనెప్పుడూ సీరియల్స్ చూడటమో లేదా ఫోనులో మాట్లాడుతూ ఉండటమో చేస్తుంది. ఇంక స్వీటీ మీ నుంచి ఏం నేర్చుకుంటుంది చెప్పండి. ఆ వయసులో పిల్లలకు ఎన్నో నేర్పాలి. అవేవీ మీ దగ్గర నుంచి నేర్చుకోవడం లేదు. అందుకే ఆ పిల్ల తనకు తోచింది చేస్తుంది. పిల్లల్ని పెంచడం కత్తిమీద సాములాంటిది. దాన్ని చిన్న విషయంగా భావించకండి." వాతావరణం గంభీరంగా మారింది. అంతలో శ్రీమతి టీలు తెచ్చి ఇచ్చింది. టీ తాగుతూ చెప్పాను.

"చూడండి! మీ స్వీటీ ప్రవర్తన్ని మీరు సరిగ్గా గమనించడం లేదు. తను ఏడిస్తే చాలు మీరు ఏది కావాలంటే దాన్ని సమకూరుస్తున్నారు. అప్పుడు తనకేమనిపిస్తుంది చెప్పండి. ప్రతీదీ ఏడ్చి సాధించుకోవచ్చులే అనే నిర్ణయానికొచ్చేస్తుంది. అది ఎప్పటికీ మంచిది కాదు. నాకు స్వీటీ అంటే ఎంత ఇష్టమో మీకు తెలుసు. నా మనవళ్ళు, మనవరాళ్లు వాళ్ల తల్లిదండ్రుల ఉద్యోగరీత్యా దూరంగా ఉంటున్నారు. స్వీటీ తాతగారూ అంటూ నా చుట్టూ తిరుగుతుంది. అది అదలా తయారవుతుంటే చూస్తూ వుండలేక మీకు చెబుతున్నాను. బంగారంలాంటి పిల్ల భవిష్యత్తు బాగుండాలనే నాబాధంతా" అని చెప్పాను.కాస్సేపు కూర్చుని ఏం మాట్లాడకుండా స్వీటీని తీసుకుని వెళ్లిపోయారు. వాళ్లు నా మాటల్ని పెద్దగా పట్టించుకున్నట్లు లేదు. అయితే స్వీటీని మాత్రం మా ఇంటికి పంపడం తగ్గించేసారు. ఎప్పుడూ ఇంట్లోనే తలుపులేసుకుని తల్లీ కూతుర్లిద్దరూ

ఉండేవారు. ఆ పిల్లని అలా బంధించి ఉంచితే దాని మానసిక పరిస్థితి ఎలా ఉంటుందో నాకు తెలుసు. కానీ వాళ్లకేం చెప్పినా వినేస్థితిలో లేరు.నేను చాలాసార్లు చెప్పాలని ప్రయత్నించాను కానీ మా శ్రీమతి మాత్రం,"మీకెందుకండీ వాళ్ల సంగతి. వాళ్ళ పిల్ల వాళ్ళ ఇష్టం. మధ్యలో మీకెందుకు చెప్పండి" అంటూ వారించింది. అదీ నిజమే కదా అన్పించింది.

ఆనంద్ కుటుంబం మా ఇంటి పక్కన రెండేళ్ళు పైనే ఉన్నారు. స్వీటీకి అయిదు సంవత్సరాలు వచ్చేసరికి ఆనంద్‌కి వేరే కంపెనీలో ఉద్యోగం రావడంతో ఈ ఊరు నుంచి వెళ్ళిపోయారు. మొదట్లో ఒకటి రెండుసార్లు ఫోన్లు చేసారు. తర్వాత మా మధ్య సంబంధాలు లేవు. మళ్లీ ఇప్పుడు కావ్య ఫోనుచేసి స్వీటీ గురించి చెప్పడమే. రానియ్యి చూద్దాం అనుకున్నాను.

"అంకుల్ స్వీటీ, నేను రేపు బయలుదేరి వద్దామనుకుంటున్నాం. రమ్మంటారా" అనడిగింది ఫోను చేసి.

"రండమ్మా ఎల్లుండి ఉదయానికల్లా వచ్చేస్తారుగా ఎదురు చూస్తుంటాం" అని ఫోను పెట్టేసి విషయాన్ని శ్రీమతికి చెప్పాను. అనుకున్నట్టుగానే కావ్య, స్వీటీ వచ్చారు. స్వీటీ చాలా అందంగా ఉంది. పదిహేనేళ్ళుంటాయేమో ఆ వయసులో ఉండే అందమంతా ఆ పిల్లలో ఉంది.

"బాగున్నారా తాతగారూ" అంటూ పలకరించింది.

"నేనింకా గుర్తున్నానా బంగారు తల్లి "

"మీకంటే అమ్మమ్మ గారు బాగా గుర్తున్నారు తాతయ్యా. ఆవిడంటే అప్పుడు నాకు చాలా భయమేసింది" అంటూ నవ్వేసింది.

"ఎందుకే భడవా నేనంటే భయం" అంది శ్రీమతి.

"నేను అల్లరి చేసేటప్పుడు ఏది పగలగొడతానోనని చూస్తుండేవారు. అప్పుడు కొడతారేమోనని భయపడేదాన్ని,"

అంతా నవ్వుకున్నాం. భోజనాలయ్యాక స్వీటీని తీసుకుని బెడ్‌రూంలోకెళ్ళింది నా శ్రీమతి. నేను, కావ్య నా కౌన్సెలింగ్ రూములో కూర్చున్నాం.

"ఏంటి తల్లీ స్వీటీతో ఏదో ప్రాబ్లమ్ అన్నావ్. చూడ్డానికి చాలా నమ్రతగా కన్పిస్తుంది."

"చూడ్డానికి అలానే కన్పిస్తుందంకుల్. అప్పుడు మీరు మాకు స్వీటీ విషయంలో చాలా చెప్పారు. అన్నీ మేం పెడచెవిని పెట్టాము. ఇప్పుడు మాత్రం అన్నీ

అనుభవిస్తున్నాం”

“ఏమయ్యిందమ్మా”కావ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

“ఏం చెప్పనంకుల్. స్వీటీ మా  కంట్రోలు తప్పిపోయింది. చిన్నప్పటి నుంచి చాలా మంకుగా తయారయ్యింది. అదేం చెబితే దాన్నే వినాలనే స్థితికి మమ్మల్ని తీసుకొచ్చింది, తను ఆడింది ఆటా,పాడింది పాటలా తయారయ్యింది. చదువు మీద శ్రద్ధ తగ్గి ఫేషన్ల మీద మోజుపెంచుకుంది. అతి కష్టం మీద టెన్త్‌కు వచ్చింది. అప్పుడంతా మాకు నరకం చూపించింది” అంటూ వెక్కివెక్కి ఏడ్చింది.

“ఏం జరిగిందో చెప్పమ్మా” అనునయంగా అడిగాను.

“ఏ జన్మలో ఏం పాపం చేసామోగాని ఇప్పుడు మాకు మనశ్శాంతి లేకుండా పోయింది. తిండీ, నిద్రలేకుండా ఆనంద్, నేను ఎంత కుమిలిపోతున్నామో మీకు తెలియదంకుల్”

“అసలేం జరిగిందో చెప్పమ్మా”

“ఏం చెప్పమంటారంకుల్, టెన్త్ క్లాసులోనే ఎవణ్ణో ప్రేమించాను, వాణ్ణే పెళ్ళాడుతానంటూ గొడవ. ఆ వయసులో దానికి ప్రేమ, పెళ్ళి ఏమిటి చెప్పండి.అసలలాంటి ఆలోచన దానికెలా వచ్చిందో అర్థం కావడం లేదు. మేము దానికి పెళ్ళి చేయలేమనుకుంటుందా? అసలు దాని భవిష్యత్తు గురించి ఏం ఆలోచిస్తుందో తెలియడం లేదు.”

“అసలు స్వీటీ భవిష్యత్తు గురించి మీరేం ఆలోచిస్తున్నారో చెప్పండి”

“అదేంటంకుల్ అలా అంటారు. అది మా కూతురు. దాని భవిష్యత్తు గురించి ఆలోచించకుండా ఏం చేస్తాం. మేం కష్టపడి సంపాదించేది దాని కోసమే కదా. దానికి మంచి భవిష్యత్తునివ్వాలనే ఉద్దేశంతో ఆనంద్ సంపాదన ఒక్కటే చాలదని ఇక్కడికొచ్చాక నేను కూడా ఉద్యోగంలో చేరాను, దానికి మంచి చదువు చెప్పించి ఉన్నత స్థితికి తీసుకెళ్ళి బంగారు భవిష్యత్తును కల్పించాలనే కదా మేం రాత్రి పగళ్లు కష్టపడేది. దానికెప్పుడూ ఏలోటు రానివ్వలేదు.”

“మీరన్నీ ఇచ్చారు, కానీ దానితో ప్రేమను మాత్రం పంచుకోలేకపోయారు. అందుకే ఈ రోజు తమ పిల్లలు తమ మాట వినడం లేదని బాధపడుతుంటారు. ఎప్పుడూ నేనెవరికి చెప్పినా ఒకటే చెబుతుంటాను. మీ పిల్లల్ని చాలా బాధ్యతగా పెంచండి అని. కానీ ఎంతో బాధ్యతగానే పెంచుతున్నామనుకుంటారు. ఫీజులు కట్టడం, పుస్తకాలు కొనడం, బట్టలు, సెల్‌ఫోన్లివ్వడం.... ఇదే వాళ్ళ దృష్టిలో బాధ్యత

అంటే, వాళ్ళ మనసెరిగి  మాత్రం పెంచడం లేదు.”

కావ్య నేను చెప్పేది అలా వింటోంది.

“మీరిద్దరూ స్వీటీతో కనీసం రోజులో రెండు గంటలైనా మనసువిప్పి మాట్లాడుతున్నారా చెప్పండి. దానిపట్ల మీకున్న ప్రేమను వ్యక్తం చేస్తూ మంచీ, చెడూ చెబుతున్నారా. అందుకే వాళ్ళకు ప్రేమ ఎక్కడ దొరుకుతుందో అక్కడ వెతుక్కుంటున్నారు. అది నిజమైన ప్రేమ అవునో, కాదో తెలుసుకునే జ్ఞానం వాళ్ళకుండదు. తమ పట్ల ఎవరు కన్సర్న్ చూపుతుంటారో వాళ్ళ పట్ల త్వరగా ఆకర్షితులవుతుంటారు. అలాంటి సందర్భంలో ఎంతోమంది అమ్మాయిలు మోసపోతుంటారు.”

కావ్య ఏం మాట్లాడలేకపోయింది. ఆమె కళ్లలో సన్నటి కన్నీటి తెర.

“నిజమే అంకుల్. నేను స్వీటీ విషయంలో తప్పే చేసాను. దానికన్ని విధాలా చూస్తున్నాననుకున్నాను. కానీ దానికేం కావాలో తెలుసుకోలేకపోయానని ఇప్పుడు తెలుస్తోంది. నేనే కాదు నాలాంటి తల్లిదండ్రులెందరో ఇలాంటి తప్పులే చేస్తున్నారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్న చందమైపోతుంది. అప్పుడే మీరన్నారు పిల్లల్ని పెంచడం సాదాసీదా విషయం కాదు, ఓ ఛాలెంజ్ అని. నేనప్పుడు చాలా తేలిగ్గా తీసుకున్నాను. ఇపుడేం చేయాలో అర్థంకావడంలేదంకుల్” అంటూ బోరుమంది. అప్పుడు కావ్యను చూస్తే చాలా జాలేసింది.

“చూడమ్మా! జరిగిందేదో జరిగిపోయింది. దాని గురించి ఆలోచించి ప్రయోజనం లేదు. ఇంక జరగబోయే దాని గురించి ఆలోచించాలి. స్వీటీది అకర్షణే కానీ ప్రేమకాదు. ఆ విషయం దానికి తెలియడం లేదు. అది తెలిసేలా చేయాలి. రెండుమూడుసార్లు కౌన్సిలింగ్ చేస్తే మారుతుందనే నమ్మకం నాకుంది, ఇలాంటివి ఎన్నో కేసులు చేసి సక్సెస్ అయ్యాను. నువ్వు స్వీటీని వారం రోజులిక్కడ వుంచెయ్యి. ఈ వారం రోజులు మాతో వుంటుంది. ఏదో కౌన్సిలింగ్ చేస్తున్నట్టుగా కాకుండా నేను డీల్ చేస్తాను. నా మీద నమ్మకం వుంచు. స్వీటీ తప్పకుండా మారుతుంది. సరేనా” అన్నాను. కావ్య కళ్లలో ఆనందం.

**(ఆగస్టు, 2022 విశాఖ సంస్కృతి మాసపత్రికలో ప్రచురితం. స్నేహసాహితి సంస్థ మరియు విశాఖ సంస్కృతి మాసపత్రిక సంయుక్తంగా నిర్వహించిన పదహారణాల తెలుగు కథల పోటీలో రూ.1,116/- లు బహుమతి పొందిన కథ)**

* * *

# సెకండ్ ప్లేస్

**'కృ**ష్ణవేణి ....సీనియర్ ఇంటర్ ...ఎస్సే రైటింగ్ లో సెకండ్ ప్రైజ్' అంటూ స్టేజీ మీద నుంచి పిలుస్తున్నారు. ఆడియన్స్ లో కూర్చున్న కృష్ణవేణి తన సీట్లో నుంచి కదలలేదు.

'నిన్నే పిలుస్తున్నారు వెళ్ళు' అంది ప్రక్కనున్న వరలక్ష్మి.

'ఉహూ.నేను వెళ్లను. సెకండ్,థర్డ్ ప్లేస్ లంటే నాకిష్టముండదని నీకు తెలుసుగా. ఆ ప్రైజేదో వాళ్ళనే ఉంచుకోమను' అంది కోపంగా కృష్ణవేణి.

'ఇప్పుడే కదా ఎలక్యూషన్ లో ఫస్ట్ ప్రైజ్ తీసుకుంది'అన్నారు ఫంక్షన్ ను ప్రిసైడ్ చేసిన ప్రిన్సిపాల్ గారు.

'ఆ అమ్మాయి ఫస్ట్ ప్లేస్ తప్పితే ఇంకో ప్లేస్ ఆక్సెప్ట్ చెయ్యదు సార్ 'అన్నారు కల్చరల్ ప్రోగ్రామ్స్ ఇన్ చార్జి ఆనందరావు గారు.

'ఐసీ'అన్నారు ప్రిన్సిపాల్ గారు.

ఆ తర్వాత నాలుగైదు ఈవెంట్స్ లో వచ్చిన ఫస్ట్ ప్రైజులను మాత్రమే తీసుకుని, సెకండ్ ,థర్డ్ ప్రైజులను వదిలేసింది. ఫంక్షన్ అయ్యాక బయటికొస్తున్నప్పుడు వరలక్ష్మి అంది. 'ఇదేం బాగుండలేదే కృష్ణవేణీ! ఫస్ట్ ప్రైజ్ లను మాత్రమే తీసుకుని మిగతావి తీసుకోకపోవడం. తీసుకుంటే అన్నీ తీసుకోవాలి లేదా అన్నింటిని మానుకోవాలి. అందరూ ఏమనుకుంటారు చెప్పు. ఇలా ఫస్ట్ ప్రైజు మాత్రమే తీసుకుంటే ఏదో ప్రైజుల కోసమే నువ్వు పాల్గొన్నట్టుంటుంది.'

'ఎవరేమనుకున్నా ఐ డోంట్ కేర్ వరలక్ష్మీ. నా ధ్యేయం ప్రతిదాన్లోను ఫస్ట్ ఉండటమే. సెకండ్, థర్డ్ ప్లేసులను ఒప్పుకుంటే జీవితంలో ప్రతీ దానికి రాజీపడిపోతూ ఉండాలి. అది నాకు ఇష్టం ఉండదు'

'అది సాధ్యపడుతుందంటావా?'

'సాధ్యం చేసుకోవాలి. కష్టపడి సాధన చేస్తే ఏదీ అసాధ్యం కాదు వరలక్ష్మీ. దేన్నయినా సాధించాలనే తపన ఉండాలి అంతే'

'నిజమేననుకో ...కానీ పరిస్థితులు, అదృష్టం అన్నీ కలిసి రావాలి కదా'

'అదంతా పలాయన వాదులు చెప్పే మాటలు. దేనికోసమైనా కష్టపడకుండా ఫలితాన్ని ఆశించి అది దక్కకపోతే అదృష్టం లేదనో, పరిస్థితులు అనుకూలించలేదనో చెపుతారు కానీ తమ ఓటమిని మాత్రం అంగీకరించరు. అది నాకు నచ్చదు.'

నగరంలో ప్రముఖ వ్యాపారవేత్త అయిన సుబ్బారావుగారికి ఇద్దరు కూతుళ్ళు. అందులో రెండవది కృష్ణవేణి. పెద్దమ్మాయి జ్యోతి డిగ్రీ పూర్తి చేసి ఇంట్లో ఉంటోంది. ఆమెకు ఈ సంవత్సరం పెళ్లి చేయాలని మంచి సంబంధం కోసం ప్రయత్నిస్తున్నారు. కృష్ణవేణి ప్రస్తుతం ఓ కార్పొరేట్ కాలేజీలో సెకండ్ ఇంటర్ చదువుతోంది. చాలా తెలివైన అమ్మాయి. చిన్నప్పట్నుంచీ అన్ని తరగతుల్లోనూ మొదటి స్థానంలోనే ఉండేది. ఇప్పుడు ఇంటర్ లో ఫస్ట్ ర్యాంకు తెచ్చుకోవడమే కాకుండా ఎంసెట్ లో కూడా ఫస్ట్ ర్యాంకు తెచ్చుకోవాలని పట్టుదలతో కృషి చేస్తుంది. దాని కోసం స్పెషల్ కోచింగ్ కూడా తీసుకుంటుంది. ఇంట్లో కూడా కృష్ణవేణి భిన్నంగా ప్రవర్తించేది. దేనికీ రాజీ పడేది కాదు. అనుకున్నది సాధించేవరకు నిద్ర పోయేది కాదు. ఆమె ప్రవర్తన ఇంట్లో వాళ్ళకి కొంచెం ఇబ్బందిగానే ఉండేది. అక్క వాడిన బట్టలు గాని, నగలు గాని వాడేది కాదు. స్వంత అక్క సరే ,మొదట ఉపయోగించింది కాబట్టి రెండవదానిగా వాటిని ఉపయోగించడానికి ఇష్టపడేది కాదు. ఏదైనా తనే మొదట ఉపయోగించాలి. అదే ఆమె పట్టుదల.

సాధారణంగా పెద్ద పిల్లలు ఉపయోగించిన బట్టలు, ఇతర వస్తువులు బాగుంటే తర్వాతి పిల్లలు ఉపయోగించడం సహజంగా ప్రతి ఇంట్లో జరుగుతుంది. కానీ వీళ్ళింట్లో అలా కాదు. కృష్ణవేణి తల్లికయితే చిన్న కూతురి ప్రవర్తన చూస్తుంటే ఎంతో బెంగగా ఉండేది. జ్యోతి వాడిన ఖరీదైన వస్తువుల్ని ఆమె తర్వాత కృష్ణవేణి వాడని కారణంగా వాటిని బయటి వాళ్లకిస్తుంటే ఆమె మనసు గిజగిజా కొట్టుకునేది. సెకండ్ హ్యాండ్ పుస్తకాలు, సెకండ్ హ్యాండ్ వస్తువుల జోలికసలు కృష్ణవేణి వెళ్ళేది కాదు. తను ముందు పుట్టకుండా జ్యోతి ముందు పుట్టినందుకు అప్పుడప్పుడు పోట్లాడుతూ ఉండేది. ఎందుకంటే బట్టలు కొన్నా, నగలు కొన్నా జ్యోతికి కొన్న తర్వాతే తనకు కొనేవారు. అది కృష్ణవేణికి నచ్చేది కాదు. సుబ్బారావుగారు జ్యోతికి ఎన్నో సంబంధాలు చూసి ఓ మంచి సంబంధాన్ని సెటిల్ చేశారు. అబ్బాయి సాఫ్ట్ వేర్ ఉద్యోగం బెంగుళూరులో చేస్తున్నాడు. చాలా పెద్ద మొత్తంలో కట్నకానుకలిచ్చి అంగరంగ వైభవంగా జ్యోతి  పెళ్లి చేశారు. పెళ్ళైన వెంటనే జ్యోతి భర్తతో పాటు బెంగుళూరు వెళ్లిపోయింది. అక్క వెళ్లిపోవడంతో ఊపిరి పీల్చుకుంది కృష్ణవేణి. ఇంక ఇంట్లో తనే

మహారాణి. ముందు తన ఇష్టాయిష్టాల తర్వాతే ఎవరైనా అనుకుంది. ఇప్పటి నుంచి నేనే ఫస్ట్. నో సెకండ్ అని కూడా అనుకుంది.

ఇంటర్ ఎగ్జామ్స్ దగ్గర పడటంతో రాత్రీ పగలు కష్టపడి చదివి తను అనుకున్నట్లుగానే ఇంటర్ లో ఎంపిసి లో స్టేట్ ఫస్ట్ ర్యాంకు సాధించింది. ఆమె ఆనందానికి అంతే లేదు. చదివిన కాలేజీకే కాకుండా తమ ఊరికి కూడా పేరు తెచ్చినందుకు సుబ్బారావుగారిని అంతా అభినందించారు. ఎంసెట్ ఎగ్జామ్ ను కూడా బాగా రాసింది. అయితే ఇక్కడ ఎవరూ ఊహించని విధంగా ఒక సంఘటన జరిగిపోయింది. అది కృష్ణవేణే కాదు ఎవరూ అనుకోలేదు. ఎంసెట్ రిజల్ట్స్ లో కృష్ణవేణికి స్టేట్ సెకండ్ ర్యాంకు వచ్చింది. ఆ వార్తా విని కృష్ణవేణి తట్టుకోలేకపోయింది. పదిరోజుల వరకు మామూలు మనిషి కాలేకపోయింది. ఎన్నో మంచి మంచి కాలేజీల వాళ్ళు ఫ్రీగా సీటు ఇస్తామన్నా ఇంజనీరింగ్ చదవనంటే చదవనంది. తల్లిదండ్రులు బతిమాలినా, తను చదివిన కార్పొరేట్ కాలేజ్ వాళ్ళు నచ్చజెప్పినా వినలేదు. ఓ ప్రముఖ కోచింగ్ సెంటర్ వాళ్ళు ఈ సంవత్సరం కోచింగ్ ఇచ్చి వచ్చే ఏడాది ఫస్ట్ ర్యాంకు తప్పనిసరిగా వచ్చేటట్లు తర్ఫీదు ఇస్తామని ఎంతో చెప్పినా వినిపించుకోలేదు. సెకండ్ ఛాన్స్ ప్రసక్తే లేదంది. ఉన్న ఊళ్లోనే ఓ మంచి డిగ్రీ కాలేజీలో బిఎస్సీలో చేరింది. డిగ్రీ చేసి సివిల్స్ కెళ్లాలని నిర్ణయించుకుంది. కాలం ఎవరితోనూ చెప్పకుండా ముందుకు సాగిపోతోంది. ఈ మధ్యలో ఒకసారి జ్యోతి భర్తతో సహా వచ్చి ఒక శు భవార్త చెప్పింది–తనకిప్పుడు మూడో నెల అని. ఇంటిల్లిపాదీ ఎంతో సంతోషించారు.

అనుకోని ఆవంతారలొచ్చి సుబ్బారావు గారి బిజినెస్ ఒడిదుడుకుల్లో పడింది. వాటిని పరిష్కరించుకోవటానికి ఆయన రాత్రీ పగలు కష్టపడుతున్నారు. ఓడలు బళ్లూ, బళ్లు ఓడలు అవుతాయనటానికి సుబ్బారావుగారిని కూడా ఒక ఉదాహరణగా చెప్పొచ్చు. ఆయన బిజినెస్ అంతా పీకల్లోతు నష్టాల్లో కూరుకుపోయి వారిని కోలుకోలేని విధంగా చూసింది. ఉన్న ఆస్తి, బంగారం, ఉంటున్న ఇంటిని అప్పుల వాళ్లు, బ్యాంకుల వాళ్లు జమ చేసేసుకున్నారు. ఆయన కుటుంబం నిలువనీడ లేకుండా పోయింది. దెబ్బతో ఆయనకు హార్ట్ అటాక్ వచ్చేసింది. అదృష్టం కొద్ది ఆయన కోలుకున్నారు.

ఒక్కసారిగా వారి కుటుంబ జీవన చిత్రం మారిపోయింది. ఓ చిన్న ఇంట్లో అద్దెకు దిగారు. ఆదాయం లేదు. ఇల్లు గడవటం కూడా కష్టమయ్యే పరిస్థితి. సుబ్బారావుగారు బాగా క్రుంగిపోయారు. తనకు గుండెపోటు వచ్చినప్పుడు చావెందుకు రాలేదా అని బాధ పడుతున్నారు. ఆయన బావమరిది కొంత ఆర్థిక సహాయం

అందించటంతో ప్రస్తుతం గడిచిపోతోంది. మరి భవిష్యత్తులో ఎలా అన్నదానికి ఎవరి దగ్గరా సమాధానం లేదు. జ్యోతి భర్త మంచివాడు కావడంతో నెలకోసారి వచ్చి మెడికల్ చెకప్ చేయించి హాస్పటల్ ఖర్చంతా అతనే భరిస్తున్నాడు. అప్పుడప్పుడు వాళ్ళని ఆదుకుంటున్నాడు. కృష్ణవేణి పరిస్థితి మరింత ఘోరంగా తయారైంది. తను ఎన్నో కలలు కంది. ఎంతో ఉన్నత స్థానానికి వెళ్లాలని ఆశలు పెంచుకుంది. ఎప్పుడూ ఫస్ట్ ప్లేస్ లోనే ఉండాలనే పట్టుదలతో అడుగులు వేస్తూ వచ్చింది. అటువంటి సమయంలో ఈ విపత్కర పరిస్థితులు ఏర్పడ్డాయి. ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. నాన్న సంపాదించే స్థితిలో లేడు. తల్లి బయటకు వెళ్లలేదు. ఎవరి సాయమైనా కొంతకాలమే. తన చదువు కూడా ముందు ముందు కష్టమే. అందుకే ఆమె ఓ నిర్ణయానికొచ్చింది. ఏదైనా ఉద్యోగం సంపాదించుకుని కుటుంబాన్ని ఆదుకోవాలని. అయినా తన చదువుకి ఎక్కడ నుంచి వస్తాయి ఉద్యోగాలు. ఇంట్లో వాళ్ళ ఇష్టాయిష్టాలతో పని లేకుండా ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టింది.

కృష్ణవేణి అందమైనది, చురుకైనది,వాక్చాతుర్యం కలది కావడంతో నగరంలోని ఓ ప్రముఖ క్లాత్ షోరూమ్ లో సేల్స్ గర్ల్ గా చేరింది. ఉదయం తొమ్మిది గంటల నుంచి రాత్రి తొమ్మిది గంటల వరకు పని చేసేటట్లుగా నెలకు ఆరువేల రూపాయల జీతానికి చేరింది.

అప్పటి నుంచి కుటుంబం కొంచెం ఆర్థికంగా నిలదొక్కుకుంది.

జ్యోతికి నెలలు నిండాయి. ఓ అర్ధరాత్రి నొప్పులు ప్రారంభమయ్యేసరికి హాస్పటల్ కి తీసుకువెళ్లారు. అప్పుడు జ్యోతి భర్త కూడా వచ్చి ఉన్నాడు.జ్యోతి చాలా బలహీనంగా ఉంది. నార్మల్ డెలివరీ అయ్యే అవకాశం లేదని,సిజేరియన్ చేయాలన్నారు. సరే అనక తప్పింది కాదు.

విధి ఆడిన వింత నాటకంలో భాగంగా ఓ ఆడపిల్లకు జన్మనిచ్చి తను ప్రాణాలు కోల్పోయింది జ్యోతి.

అంతా నిర్ఘాంతపోయారు. సుబ్బారావు గారికైతే రెండవసారి హార్ట్ అటాక్ వచ్చింది. అప్పుడంతా హాస్పటల్ లోనే ఉండటంతో ఆయన్ని వెంటనే అడ్మిట్ చేయడంతో లక్కీగా సేవ్ అయ్యారు. ఇంకోసారి వస్తే మాత్రం బ్రతకడం కష్టమని చెప్పేశారు.

వార్త తెలిసి జ్యోతి అత్తగారు, మామగారు బెంగుళూరు నుంచి వచ్చారు. జ్యోతి కర్మకాండలు ముగిసాయి.

ఇంక అసలు సమస్య మొదలైంది. చంటిపిల్లనేం చెయ్యాలి?అని. అచ్చం

జ్యోతిలానే ఉందా పాప. పాప ఆలనా పాలనా కృష్ణవేణి చూసుకుంటోంది. పాపను తనతో తీసుకువెళతానంది జ్యోతి అత్తగారు. ఆవిడ చూస్తే పెద్దావిడ. అంత ఆరోగ్యవంతురాలు కూడా కాదు. అంత చిన్నపిల్లను ఆవిడెలా చూడగలదు. అదే మాట అంటే ముందో నర్సును పెట్టుకుంటామని తర్వాత మూడో నెలలో వాళ్లబ్బాయికి మళ్లీ పెళ్లి చేస్తామని, ఈ వయసులో భార్య లేకుండా వాడెలా ఉంటాడని ఆవిడనేసరికి అంతా నిర్ఘాంతపోయారు.

పోనీని పాపను తామే పెంచుతామని, ఇక్కడే ఉంచెయ్యమని జ్యోతి తల్లి ఆవిణ్ణి బతిమాలింది. ఆవిడ భయం వచ్చే అమ్మాయి ఎన్నో ఆశలతో వస్తుంది.అటువంటప్పుడు ఈ పసిపాపను తన కూతుర్లా ఎలా చూస్తుంది. అదే విషయాన్ని చెప్పింది.

మా వంశాంకురాన్ని ఇక్కడెలా ఉంచుతాం అందావిడ.

అప్పుడు కృష్ణవేణి కలుగజేసుకుని ఆ బిడ్డను తన స్వంత బిడ్డలా చూసుకుంటానని, పాప కోసమైనా తను పెళ్లి చేసుకోనని చెప్పింది. ఆ పాప కృష్ణవేణికి దగ్గరవుతోంది. ఎవరెత్తుకున్నా ఏడుస్తోంది . ఒక్క కృష్ణవేణి ఎత్తుకుంటే తప్ప ఊరుకోవటం లేదు. పాలు పట్టించడం,స్నానం చేయించడం అన్నీ కృష్ణవేణే చేస్తుంది. ఇవన్నీ ఆవిడ గమనిస్తుంది కూడా.

'ఈ పాపనూ మీరూ కావాలంటున్నారు. మేము కావాలనుకుంటున్నాం. కాబట్టి ఉభయులకు దక్కేలా నేనో మాట చెబుతాను వినండి. మా అబ్బాయికి ఎలాగూ మళ్లీ పెళ్లి చేయాలనుకుంటున్నాం కాబట్టి మీరన్నట్టు కొత్తగా వచ్చే అమ్మాయి ఈ పాపను ఎలా చూస్తుందో ఊహించలేం కదా. అందుకని మీ కృష్ణవేణిని మా అబ్బాయికిచ్చి చెయ్యండి. మన సమస్యకు అదే పరిష్కారం'అందావిడ.

అందరూ చేష్టలుడిగినట్లయ్యారు.

నెత్తిన పిడుగు పడ్డట్లయింది కృష్ణవేణికి. ఏమిటీవిడ ఇలా మాట్లాడుతుంది. అక్క ప్లేస్ లో తను వెళ్లాలా? అంటే సెకండ్ ప్లేస్ లో తను...ఊహించలేకపోయింది. ఇలాంటి పరిస్థితిని ఫేస్ చెయ్యాల్సొస్తుందని తను కలలో కూడా ఊహించలేదు. తాను దేన్నయితే వ్యతిరేకించిందో అదే ఇప్పుడు తన ముందుంది.

ఆ రాత్రంతా కృష్ణవేణికి నిద్ర పట్టలేదు. ఒకటే ఆలోచనలు. తల్లిదండ్రులు ఈ విషయంలో ఏం మాట్లాడటం లేదు.

అందరూ ఈ విషయంలో మౌనంగానే ఉన్నారు. అంటే వాళ్లంతా ఈ ప్రపోజల్ కు సుముఖంగా ఉన్నట్టా?

అసలు తల్లిదండ్రుల కోసమైనా తను పెళ్లి చేసుకోకూడదనుకుంది. తను పెళ్లి చేసుకుని వెళ్లిపోతే వాళ్ళను ఎవరు చూస్తారు? కానీ మధ్యాహ్నం ఈ డిస్కషన్ జరుగుతున్నప్పుడు బావ మరో ప్రపోజల్ పెట్టాడు. తను గనుక ఒప్పుకుంటే అమ్మానాన్నలని కూడా బెంగుళూరు తీసుకువెళ్తానని, వాళ్ళు తమతో కలిసి ఉండటానికి అభిమానం అడ్డొస్తే నాన్న గారి చేత ఏదైనా షాపు పెట్టిస్తానని అది చూసుకుంటూ వాళ్ళు వేరే ఉండవచ్చని, ఒకే ఊళ్ళో అంతా ఉంటాం కాబట్టి ఎటువంటి ఇబ్బంది ఉండదని చెప్పేసరికి అమ్మానాన్న సైలెంట్ అయిపోయారు. కానీ నిర్ణయం మాత్రం నాకే వదిలేశారు.

అయితే తనిప్పుడేం చేయాలి? ఆలోచనలతో బుర్ర పగిలిపోతుంది. మంచం మీద నుంచి లేచి హాల్లోకొచ్చింది. హాల్లో పెట్టిన జ్యోతి ఫోటోకు పెద్ద దండ వేలాడుతుంది. జ్యోతి ఆర్తిగా తాననేదో అడుగుతున్నట్లనిపించింది. 'నా కూతురికి నువ్వే అమ్మ కావాలి'అన్నట్లున్నాయి ఆమె చూపులు.

అంతవరకు ఊయలలో హాయిగా నిద్రపోతున్న పాప ఉలిక్కిపడి లేచి గట్టిగా ఏడవటం మొదలుపెట్టింది. కృష్ణవేణి ఆ పాపను ఎత్తుకుని హృదయానికి హత్తుకుంది. వెంటనే ఏడుపు ఆపేసింది ఆ పాప.

'చిట్టితల్లీ! ఇక నుంచీ నీ అమ్మను నేనేరా. నీ కోసం, అమ్మానాన్నల కోసం నా జీవితంలో అన్ని విషయాల్లోనూ రాజీ పడిపోతాను. అనుబంధాలు,రక్తసంబంధాల కంటే ఏది ముఖ్యం కాదని ఇప్పుడు తెలుసుకున్నాను'అంటూ పాపను తన పక్కలో పడుకోబెట్టుకుని నెమ్మదిగా జోకొడుతూ తనూ నిద్రలోకి జారిపోయింది కృష్ణవేణి.

**(ఆంధ్రభూమి ఆదివార పత్రికలో ప్రచురితం)**

* * *

# అంత అవసరమా?

"**చూ**డు చంద్రం! నువ్వు చెప్పింది నాకర్థం అయింది. నీకు డబ్బు సర్దడానికి నాకేం ఇబ్బంది లేదు. నీక్కావాల్సిన పదివేలు ఇప్పుడే ఇస్తాను, తీసుకెళ్లు. అయితే ఒక విషయం ఆలోచించు,'అది అంత అవసరమా?' అని. ఒకవేళ నీకు అవసరమనిపిస్తే నువ్వనుకున్నట్లే చేయి"అన్నాను చంద్రంతో.

"సరే రేపు నిన్ను కలుస్తాను"అని చెప్పి వెళ్లిపోయాడు చంద్రం.

చంద్రం, నేను సహోద్యుగులం. సెక్రటేరియట్ లో ఒకే సెక్షన్ లో పని చేస్తున్నాం. ఇద్దరం ఒకేరోజున ఉద్యోగంలో జాయినయ్యామేమో మా ఇద్దరి మధ్య ఏర్పడ్డ పరిచయం ప్రాణస్నేహానికి దారి తీసింది. మా ఇద్దరి కుటుంబాల మధ్య కూడా మంచి అనుబంధం ఏర్పడింది. చంద్రానికి ఇద్దరు పిల్లలు. ఇద్దరూ స్కూలు ఎడ్యుకేషన్ లోనే ఉన్నారు.అతనిది కృష్ణా జిల్లాలోని ఓ పల్లెటూరు. చంద్రం ఇంట్లో పెద్దవాడు. అతని తరువాత ఇద్దరు తమ్ముళ్లు, ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. తమ్ముళ్ళిద్దరూ స్వంత ఊళ్లోనే వ్యవసాయం చేసుకుంటున్నారు.

చెల్లిళ్ళిద్దరి భర్తలు స్కూలు టీచర్లుగా పక్కపక్క వూళ్లోనే పని చేస్తున్నారు. ఆ ఇంట్లో చంద్రం ఒక్కడే బాగా చదువుకున్నవాడు, మంచి ఉద్యోగం చేస్తున్నవాడూనూ. అందులోనూ హైదారాబాద్ లో ఉంటున్నాడేమో పల్లెటూరిలో ఉండే తమ్ముళ్లు, చెల్లెళ్లు ఎప్పుడూ వచ్చిపోతుంటారు.

వ్యవసాయ పనులు లేనప్పుడు తమ్ముళ్లు వాళ్ల వాళ్ల ఫ్యామిలీస్‌తో వస్తే, చెల్లెళ్లు వాళ్ల భర్తల స్కూలు సెలవులప్పుడు వచ్చి అవి పూర్తయ్యేవరకు ఉండి అప్పుడు వెళ్లేవాళ్లు. వాళ్లలా వచ్చిపోతుండడం వల్ల చంద్రం చాలా ఇబ్బంది పడుతూ ఉండేవాడు. అదే విషయం నాతో చెబుతూ బాధపడుతూ ఉండేవాడు.

"రామం! నా పరిస్థితి చూస్తే నాకే జాలేస్తోంది. మా వాళ్లలా వచ్చిపోతుండడం వల్ల నాకెంత ఇబ్బందిగా ఉంటుందో వాళ్లు గ్రహించడం లేదు. వాళ్లు రాకూడదని నేనేనడంలేదుగానీ దసరాకి, సంక్రాంతికి మా బావలిద్దరికీ సెలవులు ఉండడంతో ప్రతి సంవత్సరం ఇక్కడికే వచ్చేస్తున్నారు. పండుగ రోజున ఇంట్లో ఉంటున్నప్పుడు పిల్లలతో సహా వాళ్లందరికీ బట్టలు పెట్టడం తప్పనిసరి అవుతుంది. వాళ్లకి పెళ్లిళ్లయి

పదేసి సంవత్సరాలైనా ఇప్పటికీ కొత్త దంపతుల్లాగే పెట్టుపోతలు జరపాల్సి వస్తోంది. వాళ్ల మర్యాదలకు ఎక్కడా లోటు రాకూడదు. ఆ ఖర్చులు భరించేసరికి నాకు చుక్కలు కన్పిస్తున్నాయి. నేనిక్కడ సిటీలో ఉండటం,వుంటున్న ఇల్లు అన్ని వసతులతో ఉ ండడంతో నేనేదో బ్రహ్మాండంగా బ్రతికేస్తున్నానని వాళ్ల భావన. నాకొచ్చే ఆదాయంలో నాలుగో వంతు ఆదాయమొచ్చినా వాళ్లు నాకన్నా బాగా బ్రతగ్గలరు. ఎందుకంటే అందరికీ స్వంత ఇళ్లున్నాయి. పొలంలో అన్నీ పండుతాయి. వాళ్లకు ఖర్చంటూ ఏమీ వుండదు. పిల్లల చదువులకు కూడా అంత ఖర్చుండదు. నాకలా కాదుగా. అద్దె ఇల్లు, ప్రతీదీ కొనాలి. పిల్లల చదువులు కూడా తలకు మించిన భారంగా ఉంటున్నాయి. అవేమీ వాళ్లకర్థం కావు." కాసేపు చెప్పడం ఆపి మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

"మా తమ్ముళ్లయితే వేసవికాలంలో అక్కడ పనులేమీ ఉండవు కాబట్టి ఆ రెండు కుటుంబాలు సమ్మరంతా మా ఇంట్లోనే ఉంటాయి. వాళ్లకి బట్టలాంటివేమీ పెట్టకపోయినా వాళ్లందర్నీ సిటీ అంతా తిప్పి చూపించాలి. ఓ రోజు రామోజీ ఫిల్మ్ సిటీ అంటారు, ఇంకో రోజు నెక్లెస్ రోడ్ అంటారు. ఇలా వాళ్లున్నన్ని రోజులు ఎక్కడో ఓ చోటికి తీసుకువెళ్లాల్సిందే. అలా తీసుకెళ్లకపోతే నిష్టూరాలూ,కోపాలును. సిటీలో తిరగాలంటే ఎంత ఖర్చో,కష్టమో వారికి అర్థం కాదు. నాకయితే ఇక్కడనుంచి ఎక్కడికైనా ట్రాన్స్ ఫర్ చేయించుకుని వెళ్లిపోవాలనిపిస్తుంది. పిల్లల చదువుల గురించి ఆలోచిస్తున్నానంతే"ఎంతో ఆవేశంగా చెప్పాడు.

"చంద్రం! నీ సమస్యకు ట్రాన్స్ ఫర్ పరిష్కారం కాదు. మీవాళ్లు నువ్వెక్కడున్నా వస్తారు. బంధువులు అన్నాక రాకపోకలు ఉంటాయి. ఉండాలి కూడా. ముఖ్యంగా అన్నదమ్ముల మధ్య, అక్కాచెల్లెళ్ల మధ్య మరీ ఉండాలి. కానీ మీ వాళ్ల విషయంలో అది మరీ ఎక్కువగా ఉంది. రాకపోకలనేవి ఎవరినీ ఇబ్బంది పెట్టేవిగాను, భారంగానూ ఉండకూడదు. అది మీ వాళ్లు గ్రహించడం లేదంతే. నువ్వు వాళ్ల మీద ఏమాత్రం అయిష్టత కనబరిచినా వాళ్లు అర్థం చేసుకోరు సరికదా నీ మీద శతృత్వాన్ని పెంచుకుంటారు.బంధుత్వాలు అనేవి అద్దంలాంటివి. ఒక్కసారి ముక్కలయితే అవి అతుక్కోవు. వాటిని అతికించినా ఆ మచ్చ పోదు కదా. వాటిని జాగ్రత్తగా డీల్ చేసుకోవాలి. దేనికైనా సమయం రావాలనుకో"అన్నాను.

– – –

నేనన్నట్లుగానే ఆ సమయం రానే వచ్చింది. ఆ రోజు మధ్యాహ్నం లంచ్ అవర్లో భోజనం చేస్తున్నప్పుడు చంద్రం అన్నాడు, "ఓ పెద్ద ఖర్చు వచ్చి పడింది రాము.

పదివేలయినా సరిపోయేట్టు లేవు. అన్నీ ఒకేసారి వచ్చాయి"

"ఏమిటి విశేషం?"అడిగాను.

"ఈ రోజు ఉదయం మా చిన్న తమ్ముడు,పెద్ద చెల్లెలు ఫోన్లు చేశారు. ఈ నెల ఇరవై అయిదో తేదీన మా పెద్ద తమ్ముడి కూతురి బర్త్ డే ఫంక్షన్ జరుపుతున్నారట. వాడింకా ఫోన్ చేసి చెప్పలేదనుకో. రేపో ఎల్లుండో చేసి చెబుతాడు. ఆ ఫంక్షన్ కి అందరూ వస్తారు కాబట్టి అదే రోజున మా చిన్న తమ్ముడి కొడుక్కి పంచె కట్టు ఫంక్షన్ ,మా చెల్లెలి కూతురికి ఓణీల ఫంక్షన్ జరుపుకోవాలని అంతా నిర్ణయించుకున్నారు. ఇంటికి పెద్దవాడిగా నేనొచ్చి అందరినీ ఆశీర్వదించాలట. కుటుంబ సభ్యులు,బంధువులు అంతా ఉన్నప్పుడు నేను రాకపోతే బాగుండదట. నేను తప్పకుండా రావాలని మరీ మరీ చెప్పారు. ముగ్గురికీ బట్టలు పెట్టాలి. అలాగే గిఫ్ట్ లు ఇవ్వాలి. ఎంతలేదన్నా వాటన్నింటికి పది వేలుండాలి కదా. అంత డబ్బు ప్రస్తుతం నా దగ్గర లేదు. మా ఫ్యామిలీ అంతా వెళితే పదివేలు కూడా సరిపోవనుకో. కనీసం నేనొక్కడిని వెళ్లినా అంత కావాలి. నువ్వా డబ్బు సర్దితే ఆ గండం గట్టెక్కుతుంది. త్వరలో నీ డబ్బు ఇచ్చేస్తాను."

"ఈ ఫంక్షన్ కు నువ్వు వెళ్లాలనుకుంటున్నావా?" అడిగాను.

"వెళ్లకపోతే ఎలా? బాగుండదు కదా?"

"ఎవరికి బాగుండదు నీకా?వాళ్లకా?"

అతనేమీ మాట్లాడలేదు.

"చూడు చంద్రం! నేనిలా మాట్లాడుతున్నానని ఏమి అనుకోకు. నీ మంచితనాన్ని లేక నీ అమాయకత్వాన్ని చూసి మీవాళ్లు నీతో ఆడుకుంటున్నారనిపిస్తుంది. లేకపోతే ఏమిటి చెప్పు? మీ తమ్ముడి కూతురి బర్త్ డే కి నువ్విక్కడ నుంచి వెళ్లాలా? అదంత ముఖ్యమైనదా? పోనీ ఏదో సరదాకి చేసుకున్నా అక్కడివాళ్లు అటెండ్ అవుతారుగా. ఆ బర్త్ డే కి మీ తమ్ముడికయ్యే కేకు ఖర్చు మూడువందలయితే నీకయ్యేది మూడువేలు. ఇకపోతే మీ చెల్లెలు తన కూతురికి జరిపే ఓణీల ఫంక్షన్ గురించి ఒక్కసారి ఆలోచించు. బాగా డబ్బున్న వాళ్లు తమ డబ్బును ఎలా ఖర్చు పెట్టాలో తెలియక ఆడంబరంగా ఇలాంటివి చేస్తున్నారు. వాటిని అంతా అనుకరించడం అలవాటయిపోయింది. వాటివల్ల మధ్యతరగతి వాళ్లు ఎంతో ఇబ్బంది పడాల్సి వస్తుంది. ఇప్పుడీ మధ్య మగపిల్లలకి పంచెకట్టు ఫంక్షన్లంటూ చేస్తున్నారు. అసలిప్పుడు పంచెలు కట్టే మగపిల్లలు ఓణీలు వేసుకునే ఆడపిల్లలు లేనప్పుడు ఆ ఫంక్షన్లు చేయడంలో అర్థముందంటావా? ఈ

ఒక్కసారికే కాదుకదా వాళ్లకింకా పిల్లలున్నారు. ఇటువంటివి వాళ్ళకీ చేస్తారు. అప్పుడు మళ్లీ నీకు ఖర్చు తప్పదు. పెళ్లిళ్లు లాంటి ఫంక్షన్లకు అటెండవ్వడమనేది తప్పనిసరి. కానీ ఇలాంటి చిన్నా చితకా ఫంక్షన్లకు వెళ్లి అంత డబ్బు ఖర్చు పెట్టడం అవసరమంటావా చెప్పు? మీవాళ్లెంత తెలివైనవాళ్లో చూడు. విడివిడిగా ఫంక్షన్లు పెట్టుకుంటే ఖర్చు పెరుగుతుంది కదా, అన్నీ ఒకే రోజు పెట్టుకుని ఒకే చోట చేస్తున్నారంటే వాళ్ళకి పార్టీ ఖర్చు, భోజనాల ఖర్చు తగ్గిపోతుంది. మరి నీకో? ఒకేసారి అందరికీ బట్టలు, గిఫ్ట్ లు కొనుక్కెళ్లాలంటే ఎంత ఖర్చో ఆలోచించు. ఏదో ఒక వంక చెప్పి తప్పించుకో. ఆఫీసులో ఇన్ స్పెక్షన్లు ఉండటం వాళ్ల సెలవు దొరకలేదనో, కేంపుకు వెళ్లాల్సి ఉండటం వల్ల రాలేననో చెప్పు.వాళ్లు నమ్మకపోయినా నీకొచ్చే నష్టమేమీ ఉండదు. వాళ్లకి కోపమొచ్చి మీ ఇంటికి రాకపోయినా నీకు మంచిదేగా!" నేను చెప్పేది వింటున్నాడు.

"చంద్రం! నువ్వు మరోలా అనుకోవచ్చుగానీ చెప్పే విషయంలో వాస్తవాన్ని గ్రహించు. నాగరికత వెర్రితలలు వేస్తున్న ఈ తరుణంలో మన సంస్కృతిని ఎవరు పాటించనప్పుడు ఈ ఆచారాలకు,సాంప్రదాయాలకు విలువ వుంటుందంటావా? మనం కొత్తగా చేసుకున్న అలవాట్లను సాంప్రదాయాలుగా మార్చుకుని అనుకరించడం ఎంతవరకు సమంజసం? అనవసరపు ఖర్చులు చేసి నువ్వు అప్పుల పాలవ్వకూడదనే నేను కోరుకునేది. ఆ పదివేలు తీర్చడానికి పిఎఫ్ లోన్ పెట్టుకోవాలి. నువ్విలా అనవసరపు ఖర్చులకు పోతే ఎదిగే నీ పిల్లలకు అవసరమైన ఖర్చులకు ఏమి మిగలదు. ఎంతసేపూ మీ వాళ్ల గురించే కాక నీ గురించి, నీ పిల్లల గురించి, అలాగే మీ అందరి భవిష్యత్తు గురించి ఆలోచించు. ఇప్పుడు తప్పనిసరిగా ఆ ఫంక్షన్లకు అటెండ్ కావాలనుకుంటే నీ ఇష్టం"అన్నాను.

"నేను బాగా ఆలోచించాను రామం. నువ్వు చెప్పిన దాంట్లో ఎంతో వాస్తవముంది. అందుకే నేనా ఫంక్షన్లకు వెళ్లాలనుకోవడం లేదు. భవిష్యత్తులో కూడా అటువంటి అనవసరపు ఖర్చులకు దూరంగా ఉంటాను. ఈ విషయంలో మా వాళ్లంతా ఏమన్నా పట్టించుకోను. నువ్వన్నట్లు మనలాంటి మధ్య తరగతి జీవితాలకు అవి అంత అవసరమని నేననుకోను. పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు ఉంటుంది. ఈ విషయం మా వాళ్లకు కూడా చెబుతాను. వాళ్లు వింటారా సరే లేకపోతే నేనేం చేయలేను"అని చెప్పి వెళ్లిపోయాడు చంద్రం.

**(సెప్టెంబర్ , 2014 ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితం)**

* * *

# వాస్తవ చిత్రం

ఫస్ట్ పిరియడ్ అయినట్లుగా బెల్ మోగడంతో చెబుతున్న లెసన్ని ఆపి డిగ్రీ క్లాసులో నుంచి బయట కొచ్చాను. ఎందుకో ఈ రోజు పాఠం సరిగ్గా చెప్పలేక పోయాననే అసంతృప్తి కలిగింది. ఆవిషయాన్ని పిల్లలు కూడా గమనించారు. అయినా సైలెంటుగా వున్నారు. నేను లెసన్ ఎలా చెబుతానో వాళ్ళకి తెలుసు. నామూడ్ సరిగ్గా లేదని గ్రహించినట్టున్నారు. డౌట్స్ కూడా అడక్కుండా కూర్చున్నారు. రోజూ నా క్లాసు చాలా జోవియల్‌గా వుంటుంది. ఇంకో రకంగా చెప్పాలంటే సగం పాఠం వాళ్ళచేతే చెప్పించేస్తాను. డిబేట్‌లా పెట్టి వాళ్ళు ప్రశ్నలడుగుతుంటే వాటిని క్లారిఫై చేస్తూ లెసన్ చెబితే వాళ్ళకి బాగా అర్థమవుతుందనేది నాఉద్దేశం. అందుకే నేను తీసుకునే ప్రతీ క్లాసు చాలా లైవ్‌లీగా వుండేటట్లు చూస్తాను.కానీ ఈరోజు ఎప్పట్లా లేదు. తీనికి కారణం ఉదయం జరిగిన సంఘటనేనా? ఎంతహృదయ విదారకంగా వుంది చూస్తుంటే. ఆసంఘటన మనసులో కదలాడుతూ ఉండటం వలన నాలోని ఉత్సాహమంతా చచ్చిపోయిందనే చెప్పాలి.

క్లాసు రూములో నుంచి స్టాఫ్ రూములో కొచ్చాను.

“హలో మూర్తిగారూ” అంటూ పలకరించింది సరళ. ఆవిడ తెలుగు లెక్చరర్. సినిమాల్లోను, టీవిల్లోను వస్తున్న జోకులమీద రీసెర్చిచేసి తన బంధువొకాయన యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా వుంటే ఆయన సారథ్యంలో పరిశోధనా గ్రంధాన్ని సమర్పించి పి.హెచ్.డి సంపాదించింది. ఆవిడీ మధ్య కథలు వ్రాయాలని సంకల్పించి సఫలీకృతం కాలేక వాళ్ళని విమర్శిస్తూ వుంటుంది.

“ఏం సరళగారూ ఖాళీగా వున్నారు క్లాసుల్లేవా” అడిగాను.

“మూడో పిరియడుందండి. ఏమిటీ డల్‌గావున్నారు. మీ కథలేమైనా తిరిగొచ్చాయా”.

ఆవిడలా అనే సరికి నాకు చాలా కోపంవచ్చింది కానీ ఆవిడ మనస్తత్వం తెలిసి కూడా ఆవిడతో ఎక్కువ మాట్టాడటం అనవసరమని చిన్నగా నవ్వివూరుకున్నాను.

“అయినా మూర్తిగారూ! మాలాంటి తెలుగులో డాక్టరేటు సంపాదించిన వాళ్ళమే కథలు సరిగ్గా రాయలేకపోతున్నాం. మరి సైన్స్ చదివిన వాళ్ళు కథలేం

రాయగలుగుతారులెండి” అంది వ్యంగ్యంగా.

నేనేం మాట్లాడకుండా వెళ్ళి నాసీట్లో కూర్చున్నాను.

“హల్లో మూర్తిగారూ బాగున్నారా” అంటూ అప్పుడే క్లాసునుంచి వచ్చిన వెంకటరావు పలకరించాడు. ఆయన కామర్స్ లెక్చరర్.

“హలో వెంకటరావు గారూ” విష్ చేసాను. ఆయనది నా పక్క సీటే.

“అవునూ మూర్తిగారు ఈమధ్య వచ్చిన ‘నక్షత్రం’ పత్రికలోని మీకథ చదివానండి. అబ్బే అందులో పెద్ద విషయమేమీలేదండి. ఇంకా మంచి విషయాలు పొందుపరిచి రాసుంటే బాగుండేది. అయినా ఈమధ్య మీరు ఏదీ సరిగ్గారాయడం లేదండి. ఏదో డబ్బులు కోసం రాస్తున్నట్టే వుంది కానీ సందేశాత్మకంగా వుండటం లేదు.”

ఆయన్ని చూస్తే జాలేసింది. వీళ్ళింక ఎదగరు. వీళ్ళకు రచయితలంటే చిన్న చూపు. నిజానికి ఆయన చదివిన కథ తెలుగు సాహిత్యానికే మకుటాయమైన ‘నక్షత్రం’ అనే పత్రికలో వచ్చింది. ఎంతో బాగుంటేతప్ప కథలను ప్రచురించదా పత్రిక. ఎంతో మంది విమర్శకుల ప్రశంశలను కూడా అందుకుందా కథ. అలాంటిది సాహిత్యం మీద ఎటువంటి అవగాహన లేని వెంకటరావు, సరళలాంటి వాళ్ళనుచూసి జాలిపడాలే తప్ప వాళ్ళతో వాదించి ప్రయోజనం లేదు. అందుకే నా సీటులో కూర్చుని ఆలోచనలో పడ్డాను. పదే పదే ఉదయం నేను చూసిన సంఘటనే గుర్తుకొస్తుంది. ఉదయం తొమ్మిది గంటలకు స్కూటర్ మీద కాలేజీకి బయలుదేరాను. రైల్వే స్టేషను మీదుగా వెళ్ళాలి. సరిగ్గా అక్కడకు వచ్చేసరికి ఫ్రంట్ వీల్‌లో గాలి కొంచెం తగ్గినట్టనిపించింది. కొంచెం దూరంలో పంక్చర్లేసే షాపు కనిపించడంతో గాలి కొట్టిద్దామని అక్కడికెళ్ళి స్కూటర్ని ఆపాను. ఎప్పుడూ ఆ సెంటరంతా బిజీగా వుంటుంది. అక్కడున్న ట్రాఫిక్‌ని పోలీసులు కంట్రోలు చేస్తున్నారు. ఓ పోలీసయితే బళ్ళమీద పళ్ళు పెట్టుకుని రోడ్డుని ఆక్రమిస్తున్న వాళ్ళని అదిలిస్తూ వాళ్ళ దగ్గర నుంచి డబ్బులు వసూలు చేస్తున్నాడు. అదేమీ కొత్తవిషయంకాదు గానీ నన్ను అమితంగా ఆకర్షించింది. చాలా బాధ కలిగించిన సంఘటన్ని తలుచుకుంటుంటే ఇప్పటికీ ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

“సార్ పంక్చర్ పడినట్టుంది. చూడండి టైరునుంచి గాలి కొద్దికొద్దిగా ఎలా బయట కొస్తుందో” అన్నాడు పంక్చర్లు వేసే కుర్రాడు. టైము చూసాను ఇంకా టైముంది అనుకుని “వెంటనే పంక్చర్ వెయ్యి. కాలేజీకి టైమవుతుంది” అని చెప్పాను.

“ఎంతసార్ పదినిమిషాలు” అంటూ టైరువిప్పడం మొదలెట్టాడు.

అంతలో పక్కనుంచి ఏదో గొడవ వినపడటంతో ఏమిటా అనిచూసాను. ఒకతను

రౌడీలా వున్నాడు. అతను ఓ వ్యక్తిని అదిలిస్తున్నాడు. ఆవ్యక్తి రోడ్డుకి ఓ పక్కగా చిరిగిన చాపపరుచుకుని కూర్చున్నాడు. ముందో గుడ్డపరిచాడు. అతన్ని చూసి ఆశ్చర్యపోయాను. అతనో కుష్టురోగి. రెండుచేతులు, రెండు కాళ్ళు పూర్తిగా పుచ్చిపోయాయి.కను బొమలు రాలిపోయి, ముఖం వికారంగా వుంది. చేతులనుంచి, కాళ్ళనుంచి రసికారుతుంది. అతను రెండు చేతుల్ని పైకెత్తి దండాలు పెడుతున్నాడు. రౌడీ ఏమో తన చేతిలోవున్న కఱ్ఱతో అతన్ని కొట్టినంత పని చేస్తున్నాడు.

"దొరా కాస్సేపాగండి. ఇంకా ఎవరూ దరమం చేయలేదు మళ్ళీరండి" అంటూ వేడుకుంటున్నాడు.

"నీ దొంగవేషాలు నా దగ్గరకాదురా తియ్యి బయటకు నీకు తెలీదా ప్రతీరోజూ మాకు డబ్బులిస్తేనేగాని అడుక్కోవడానికి వీల్లేదని. నిన్నొచ్చిన డబ్బులన్నీ ఏంచేసావు తాగేసావా" అరుస్తున్నాడు వాడిమీద.

"అడుక్కున్న డబ్బులు తిండానికే సరిపోడం లేదయ్యా ఇంక తాగడ మొకటా. నా ఆకారం సూసి ఎవరూ దగ్గరకొచ్చి దానం సేయడంలేదు. భయపడి దూరం నుంచే ఎల్లిపోతున్నారు. ఎవరన్నా పున్యాత్ములిచ్చిన అయిదూ, పదివుంటే మీలాంటోల్లకివ్వడానికే సరిపోతున్నాయి దొరా." అతని మాటలకు ఆ రౌడీకి కోపమొచ్చినట్టుంది.

"దొంగనాకొడకా..." అంటూ ఓ బూతు మాటను వదిలాడు.

"నీకు బాగా పొగరెక్కిందిరా. రేపిట్నించీ ఇక్కడ కూర్చోనివ్వకుండా చేస్తే తప్ప నీకు బుద్ధిరాదు.

"అలా అనకండయ్యా, మీకివ్వవలసిన డబ్బుల్నిచ్చేత్తాను ఓగంటపోయాక రండి" అంటూ బతిమాలుకున్నాడతను.

"సరే అయితే. వచ్చినవి వచ్చినట్టు పక్కనపెట్టు తెల్సిందా" అంటూ అక్కడనుంచి కదిలాడా రౌడీ.

ఈ సంఘటన్ని ఎవరికీ తెలియకుండా నాసెల్‌ఫోనులో వీడియోతీసాను. అప్పుడు నాకా రౌడీ మీద విపరీతమైన కోపం వచ్చింది. ఎంతఅన్యాయం. కుష్టువాడి దగ్గర నుంచి కూడా డబ్బులు లాక్కోవడం... ఇంతకన్నా దౌర్భాగ్యం మరోటి లేదనిపించింది.

" ఏమిటయ్యా ఈదారుణం" అన్నాను పంక్చరేస్తున్నతన్ని.

"వాడో రౌడీషీటర్ సార్, రాజకీయ అండతో వాడెన్నో అరాచకాలు చేస్తుంటాడు. ఇదన్న మాటేమిటి సార్ ఇంతకన్నా దారుణాలు చేస్తుంటారు వీళ్ళు.పొట్టచేత పట్టుకొచ్చి

చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునేవాళ్ళని, అడుక్కునే వాళ్ళని దోచుకుంటూ వుంటారు. వాళ్ళున్నది ఇలాంటి దోపిడీలు చేసుకోడానికేసార్. రోజూ మేమూ ఇవ్వాలి సార్ వాళ్ళకి. అంతెందుకు మీరిక్కడ ఇంతసేపున్నందుకు మిమ్మల్ని డబ్బులడిగినా ఆశ్చర్యపోనక్కర లేదు సార్ " అంటూ నవ్వాడతను.

అతనికి డబ్బులిచ్చి కాలేజీకి బయలుదేరాను. క్లాసులకెళ్ళి సరిగ్గాపాఠాలు చెప్పలేకపోయాను. పదేపదే ఆ సంఘటనే గుర్తుకొస్తుంది. ఎంతదారుణమైన విషయం. నిజంగా హృదయవిదారకమైన సంఘటన. అదే పనిగా కళ్ళముందు మెదులుతుంది. ఇంటికొచ్చినా అదే గుర్తుకొస్తుంది. " ఏమిటలావున్నారు" అడిగింది శ్రీమతి. విషయం చెప్పాను.

"నిజమా! ఎంతదారుణం. ఆ నీచుల్ని ఎవరూ ఏం చేయలేదు అదితప్పని ఎవరు చెప్పినా వాళ్ళని ఏం చేస్తారోనని భయం. ఛీ!ఛీ?!" అంటూ ఈసడించుకుంది. అన్యమనస్కంగానే భోజనం చేసాను.

"అవునూ ఈవిషయాన్ని మీరు కథగా రాసి జనాలకు ఎందుకు తెలియజేయ కూడదు ఇదీ సామాజిక స్పృహవున్న అంశమే కదా" అని సలహా ఇచ్చింది. నిజమే కదా అనిపించింది.

ఆరాత్రి కూర్చుని కథగా రాయడం మొదలు పెట్టాను. రాజకీయనాయకుల అండతో కొంతమంది వీళ్ళు చేసే అకృత్యాలను నాకు తెలిసిన వాటిని చేర్చి పరిశోధనాత్మక కథగా మలిచి మర్నాడే పత్రిక్కి పంపాను. పంపిన నెలకే ఆ కథను పత్రిక ప్రచురించింది. ఎప్పటిలాగే అందరికీ నచ్చి విమర్శకుల ప్రశంసలనందుకుంది. అయితే నాకెందుకో అన్పించింది అంతా ఈ సంఘటన్ని కథగానే చదివారు కానీ అందులోని వాస్తవికతను గుర్తించి ఎవరూ రియాక్టవలేదని. కొన్నిరోజుల తర్వాత దీన్నంతా మరిచిపోతారు. మరి ఇది ఇంకా జనాల్లో కెళ్ళాలంటే ఏంచెయ్యాలబ్బా అనుకున్నాను.

వెంటనే స్ఫురించింది ఆరోజు –ఈసంఘటన్ని సెల్లో వీడియోగా చిత్రీకరించానని. అప్పుడనిపించింది దీన్ని జనాల్లోకి పంపాలంటే టీ.వి కి మించిన సాధనంలేదని. వెంటనే ఓ ప్రముఖ టీ.వి ఛానల్‌కు ఫోన్‌చేసి విషయం చెప్పాను. వాళ్ళు వెంటనే స్పందించారు. వాళ్ళకి కావలసిన సెన్సేషను ఇందులో వుంది. వాళ్ళ ప్రతినిధిని పంపిస్తామని చెప్పారు. అలా చెప్పిన అరగంటలోనే ఆప్రతినిధి వచ్చి నాసెల్‌లోని వీడియోని కాపీ చేసుకున్నాడు. నన్ను కూడా ఇంటర్వ్యూ చేసి షూట్ చేసుకున్నాడు. ఈరాత్రి తొమ్మిది గంటలకు ప్రసారం చేస్తామని, ఈలోగా ఆ ప్రాంతాన్ని అక్కడుండే

రద్దీని షూట్‌చేస్తామని దీన్ని మంచి ఎఫక్టివ్‌గా తయారుచేసి ప్రసారం చేస్తామని చెప్పాడు. అన్నట్టుగానే ఆఛానల్ ప్రసారం చేసింది. ఒక్కసారే కాకుండా దాన్ని పదేపదే ప్రచారం చేయడంతో మిగిలిన ఛానళ్ళవాళ్ళు కూడా నా దగ్గరకొచ్చి దాన్ని కాపీ చేసుకుని వాళ్ళూ ప్రసారం చెయ్యడం మొదలెట్టారు. మొత్తం మీద ఈ న్యూస్ పెద్ద సెన్సేషనై మర్నాడు అన్ని పేపర్లలో కూడా వచ్చేసింది. కొన్ని పేపర్లయితే రౌడీలను పోషిస్తున్న రాజకీయనాయకులను వాళ్ళకు సపోర్టు చేసే పోలీసు వ్యవస్థను దుయ్యబట్టేసాయి. దాంతో పోలీసు యంత్రాంగంలో కదలిక మొదలయ్యింది.

మర్నాడు నేను క్లాసులో వుండగా ఓ పోలీసుజీపు, వ్యానూ మాకాలేజీ కేంపస్‌లో ఆగాయి. కొంతమంది పోలీసులు, అధికారులు ప్రిన్సిపాల్ గారి రూములో కెళ్ళడం గమనించాను. నేనూహించినట్టుగానే నాకు కబురొచ్చింది నన్నురమ్మని. నేను క్లాసులోనుంచి బయట కొచ్చి ప్రిన్సిపాల్ గారి రూములో కెళ్ళాను. అక్కడ డి.ఎస్పీ, సి.ఐలతో పాటు ఆరౌడీషీటరు, ఓ రాజకీయనాయకుడు కొంత మంది పోలీసులున్నారు.

నన్ను చూసిన వెంటనే "నువ్వేనా దీనికంతటికీ కారణం" అంటూ నిర్లక్ష్యంగా పలకరించారు డి.ఎస్పీగారు. ఆయనలా మాట్లాడే సరికి నాకు చాలా కోపం వచ్చింది.

"చూడండి డి.ఎస్పీగారూ ముందు మీరు మర్యాద ఇచ్చి మాట్లాడటం నేర్చుకోండి. మీరు ఎవరితో మాట్లాడుతున్నారో కూడా గుర్తించండి. నేనిక్కడ లెక్చరర్ని. డాక్టరేట్ కలిగిన విద్యావంతుడినైన ఉద్యోగిని. మీ సంగతి నాకు తెలీదు. మీరు ఎదుటి వ్యక్తుల్ని గౌరవించే సంస్కారాన్ని నేర్చుకోండి". నేనిలా అనేసరికి ఆయన బిత్తరపోయాడు.

"సారీ! మీరేనా ఆ వీడియోతీసింది."

"అవును నేనే తీసాను".

"అలా తీయొచ్చా?"

"ఎందుకు తీయకూడదు. ఓ చోట అన్యాయం జరుగుతున్నప్పుడు ఎవరి వల్ల జరుగుతుందో అది అందరికీ తెలియాలిగా మరి తప్పెలా అవుతుంది."

"మీరీ వీడియో తీయడంవల్ల మా పార్టీ పరువు పోయింది కదా." అన్నాడా రాజకీయనాయకుడు.

"దానికి కారకులెవరో చూడండి. మీకు మీరే పరువు తీసుకుంటున్నారో లేక బయటివాళ్ళ వల్ల పోతుందో ఆలోచించండి. పరువుపోతుందని ఇక్కడికొచ్చి చెపితే ఎలా?"

"మీరీ విషయాన్ని ముందు మా దగ్గరకు తీసుకొస్తే మేమలాంటి వాటిని

జరగన్వికుండా చూస్తాంకదా." అన్నాడు డి.ఎస్పీ.

"ఏం చూస్తారు చెప్పండి. మీస్టేషన్ కొచ్చే ప్రతీవాణ్ణి నేరస్తుడిగానే చూస్తారు. కనీస గౌరవం కూడా వుండదు. ధైర్యంగా వచ్చి ఎవరు రిపోర్టు చేస్తారండి. పరువు తీసే ఎన్నో పెద్ద పెద్దవిషయాలు మీదృష్టికొచ్చినా మీరేం చేయరు, చేయలేరుకూడా. ఎందుకు చెప్పండి ఈప్రయాస. నేను తీసానా లేదా అని తెలుస కోవడానికి కొచ్చారు కదా నేనే తీసానని చెపుతున్నాను కదా". అని చెప్పి మీరింక వెళ్ళొచ్చున్నట్టుగా వాళ్ళవంకచూసాను.

"రాజకీయ వ్యవస్థనే కాదు దేశంలోనే ఓముఖ్యమైన పోలీసు వ్యవస్థ పరువు తీసేవిధంగా మీరు ప్రవర్తించినందుకు మిమ్మల్ని నేరస్తుడిగా పరిగణించి అరెస్ట్ చేసి తీసుకెళ్ళాలని అరెస్ట్ వారెంట్‌తో వచ్చాం తెలుసా" అన్నాడుడి.ఎస్పీ.

"చూడండి సార్! నేనిలా చెప్పవలసి వచ్చినందుకు నాకే బాగోలేదు. ఆ కుష్టువాడి కొచ్చిన రోగం కంటే ఇంకా దారుణంగా పుచ్చిపోయింది వ్యవస్థ. అలాంటి వ్యవస్థల్లోని లోపాలను ధైర్యంగా చెప్పగలిగిన వాడే అసలైన రచయిత అని నమ్ముతానునేను. నన్ను అరెస్ట్ చేసి ఇంకా మీ పరువెందుకు తీసుకుంటారు చెప్పండి. నన్ను అరెస్ట్ చేస్తే మీ వ్యవస్థ ప్రక్షాళనవుతుందంటే అలాగే చేయండి. అయితే ఆ తర్వాత వచ్చే పరిణామాలను ఎదుర్కోడానికి కూడా సిద్దంగావుండండి." అన్నాను కొంచెం గట్టిగానే.

అప్పటికే ఈవార్త బయటకు పాకిపోయింది. మాకాలేజీలో వుండే రెండువేల మంది స్టూడెంట్సు క్లాసుల నుంచి బయటకు వచ్చేసారు. వాళ్ళతో క్యాంపస్పంతా నిండిపోయింది. అక్కడంతా గోలగోలగా వుంది.

"పోలీస్ జులుంనశించాలి ..... రౌడీలను వెనకేసుకొచ్చే పోలీసులు డౌన్...డౌన్...." అంటూ నినాదాలిస్తున్నారు.

స్టూడెంట్ నాయుకుడయితే అక్కడున్న డయాస్ ఎక్కిగట్టిగా ఉపన్యాసం మొదలెట్టాడు. "ఎవరి అనుమతితో పోలీసులు కాలేజీలో ప్రవేశించారు. వాస్తవాన్ని వివరించే ఓ ప్రముఖ రచయితను అరెస్ట్ చేసే అధికారం ఎవరిచ్చారు. వీళ్ళు సమాధానం చెప్పేవరకు వదిలేది లేదు."

ఇలా జరుగుతుందని పోలీసులు అసలూహించలేదు. వాళ్ళకేంచేయాలో అర్ధం కాలేదు. మా కాలేజీ విద్యార్థులద్వారా విషయం తెలుసుకున్న ఇతర కాలేజీ విద్యార్దులతో రోడ్లన్నీ నిండిపోయాయి.మా కాలేజీ మంచి సెంటర్లోవుండటంతో ఇతర కాలేజీల విద్యార్దులు కొన్ని వేల మంది రావడంతో ట్రాఫిక్ అంతా స్థంభించిపోయింది. ఇంతలో

మీడియా వాళ్ళు కూడా రావడంతో ఆ రౌడీషీటరు, రాజకీయనాయకుడు పోలీసులు బెంబేలెత్తిపోయారు. మీడియా వాళ్ళయితే మొత్తమంతా వీడియో తీస్తున్నారు. డి.ఎస్పీ మా ఎదురగానే ఎస్.పీ కీ ఫోను చేసి విషయాన్ని వివరించాడు. ఆయనగారు డి.ఎస్పీని తలవాచేటట్టు పెట్టినట్టున్నారు డి.ఎస్పీ ముఖం వాడిపోయింది.

"ఎస్పీగారొస్తున్నారు" అని చెప్పాడు.

సైరన్ శబ్దంతో ఎస్పీగారి కారు, పోలీసుజీపులు మా క్యాంపస్‌లో ప్రవేశించాయి. అప్పటికే ప్రిన్సిపాల్ రూము దగ్గరకి మిగిలిన స్టాఫ్ మెంబర్లు, విద్యార్థి నాయకులు వచ్చారు. ఎస్పీగారికి మా ప్రిన్సిపాల్ గారు జరిగిన విషయాలను వివరించారు. ఆయన సావధానంగా అన్నీ విన్నారు. తొందరపడి ఇంతవరకు తీసుకొచ్చిన సిబ్బందిని ఆ రౌడీషీటరును మా ఎదుటే మందలించారు. జరిగిందానికి సారీ చెప్పి అక్కడనుంచి వెళ్ళిపోయారు.

ఒక రచయితగా నాకు లభించిన సపోర్టుకు నా మనసంతా ఎలాగో అయిపోయింది. సరళ, వెంకటరావు, మిగిలిన వాళ్ళు కూడా నన్ను మనస్ఫూర్తిగా అభినందించారు. ఆ తర్వాత అక్కడ సమావేశమైన విద్యార్థులకు ధన్యవాదాలు తెలియబేసాను. నాకప్పుడు అనిపించింది వాస్తవాలను ప్రతిబింబించే రచనలు చేసే రచయితలనెప్పుడూ సమాజం గౌరవిస్తుందని, అది మరిన్ని మంచి రచనలు చేయడానికి దోహదపడుతుందని.

**(సృజనప్రియ రజతోత్సవాల సందర్భంగా నిర్వహించిన కథల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన కథ )**

* * *

# నైవేద్యం

**వీ**ధి అరుగు మీద కూర్చుని మంగ వంక దిగులుగా చూస్తోంది పదకొండేళ్ళ సత్య. ఇంటి ముందున్న ఖాళీస్థలంలో పూల మొక్కల మధ్య గింజలేరుకుంటూ, ఒక్కో గింజను తన ముక్కుతో పొడుస్తూ ఉంటోంది మంగ. తను పెంచుకుంటున్న కోడిపిల్ల పేరు మంగ. నలుపు,తెలుపు ఈకల కలయికతో చూడముచ్చటగా ఉంటుంది మంగ. సంక్రాంతికి అమ్మమ్మగారింటికి వెళ్ళినప్పుడు తెచ్చుకుంది ఆ కోడిపిల్లను. నిజానికి తెచ్చుకున్నప్పుడు పిల్లేగాని ఇప్పుడు బాగా పెద్దదై నవనవలాడుతోంది. అప్పటినుంచీ ఎంతో ప్రేమగా పెంచుకుంటోంది మంగను.

ఉదయం లేచిన వెంటనే దానికి గింజలు పెట్టి నీళ్ళు తాగించి పెద్ద పురికొసను కాలికికట్టి స్వేచ్ఛగా ఇంటిముందున్న ప్రదేశంలో తిరిగేటట్టుగా ఆ రెండో కొసని ఓ చెట్టుకి కడుతుంది. ఎక్కడికీ పోకుండా ఆ ప్రదేశమంతా కొన్ని గింజల్ని అల్లుతుంది. మంగ పురికొస పరిధిలో ఉన్న ఆ ప్రదేశమంతా కలియతిరుగుతూ ఒక్కొక్క గింజా ఏరుకుని తింటూ ఉంటుంది స్కూలుకెళ్ళేముందు సత్య కాసేపు మంగతో ఆడుకుంటుంది. స్కూలుకెళ్ళాక కూడా మంగ గురించే ఆలోచిస్తుంది ఎలా ఉందోనని. స్కూలుకెళ్ళే ముందు తల్లితో పదేపదే చెబుతుంది మంగను జాగ్రత్తగా చూసుకోమని. “అలాగేలేవే”అని నవ్వుతూ అనేది తల్లి.

కానీ వారం రోజులనుంచీ వాతావరణం మారిపోయింది. అలా మారిపోవడానికి సత్య తండ్రి రామదాసే కారణం. ఇక్కడ రామదాసు గురించి కొంత చెప్పుకోవాలి.

రెండువేలమంది జనాభా వున్న ఆ గ్రామంలో రామదాసు ఓ చోటా రాజకీయనాయకుడు. పార్టీ అధికారంలో ఉంటే ఆ పార్టీలో ఉంటూ పబ్బం గడుపుకుంటూ ఉంటాడు. ఆ ఊరు పంచాయితీ మాజీ వార్డుమెంబరు కూడా. పైరవీలు చేసుకుంటూ ఎంతోకొంత సంపాదించుకుంటూ బతికేస్తుంటాడు. సంక్రాంతి పండుగ వచ్చిందంటే చాలు కోడిపందాల నిర్వహణలో రామదాసుదే ప్రముఖపాత్ర. ఇప్పుడూ అదే పాత్ర. పోలీసులిచ్చిన నోటీసులకు వ్యతిరేకంగా ప్రవర్తించాడు కాబట్టి అతడిని జైల్లో పెట్టారు. అలా జైలుకి వెళ్ళి రావడం రామదాసుకు కొత్తేమీ కాదు. ఏదో ఒక గొడవలో అప్పుడప్పుడు అలా జైలుకెళ్ళడం అతనికి అలవాటే. రామదాసుకి

తాతతండ్రులిచ్చిన ఆస్తిని పేకాటలోనూ, కోడిపందాల్లోనూ పెట్టి పోగొట్టుకున్నాడు. పోగొట్టుకున్న చోటే తిరిగి సంపాదించాలని కంకణం కట్టుకుని పనీపాటా చేయకుండా వాళ్ళ దగ్గర ఏదో విధంగా డబ్బులు కొట్టేసి బతుకుబండి లాక్కొస్తున్నాడు. అతని భార్య సుబ్బలక్ష్మి. భర్తకు ఎదురు చెప్పలేక గుట్టుగా సంసారం లాక్కొస్తుంది. వాళ్ళకు ఒక్కర్తే కూతురు సత్య. ఆ పిల్లను వాళ్ళు చాలా గారాబంగా పెంచుకుంటున్నారు. కూతురంటే ప్రాణం రామదాసుకి. జైల్లో ఉన్న మూడు నెలలూ అక్కడ పెట్టిన చిప్పకూడు తినీ తినీ అతడి నాలుక చచ్చుబడిపోయింది. ఇంటికి వచ్చిన వెంటనే అతని కళ్ళు ఇంటిముందు తిరుగుతున్న మంగ మీద పడ్డాయి. నవనవలాడుతున్న మంగను చూస్తుంటే అతని నోట్లో నీళ్ళూరాయి.

సుబ్బలక్ష్మి నడిగాడు "ఎవరిదది?"అని.

"ఇంకెవరిది మనదే. మన మంగే. సత్య ముద్దుగా పెంచుకుంటోంది. సంక్రాంతప్పుడు మీరు జైలుకెళ్ళినప్పుడు మా అమ్మా వాళ్ళు సత్యను తీసుకెళ్ళారు. నన్నూ రమ్మందిగానీ నేనెళ్ళలేదు. మీరు జైల్లో ఉంటే నేను పండక్కి పుట్టింటికి ఎలా వెళతాను చెప్పండి!పండుగ మూడు రోజులూ అక్కడే ఉండి వచ్చేటప్పుడు దాన్ని కూడా తెచ్చుకుంది. దానికి మంగ అని పేరుపెట్టి పెంచుకుంటోంది",సంబరంగా చెప్పింది సుబ్బలక్ష్మి.

"అయితే మనదేనన్నమాట. ఇంకేం ఈ రోజు దాన్ని కోసి మసాలా పెట్టి ఫ్రై చేయి.సరిగ్గా భోజనం చేసి ఎన్నో నెలలైపోయింది"అన్నాడు రామదాసు.

"అయ్యో! దాన్నెలా కోసుకుతింటామండి. సత్య దాన్ని ఎంతో ఇష్టంగా పెంచుకుంటోందండి. దానికి సత్యే తిండి తినిపిస్తుంది. నీళ్ళు తాగిస్తుంది. చివరికి పడుకునేటప్పుడు కూడా దాన్ని గంపకింద దాచి జాగ్రత్తగా చూసుకుంటోంది మరి."

"పెంచి ఏం చేస్తుందట. పెళ్ళి చేసి పంపుతుందా? దానికి నేను చెపుతానులే" అంటూ తేలిగ్గా తీసిపారేశాడు రామదాసు.

"సరే ఓ పని చేద్దామండి...ఓ పదిరోజుల్లో సత్తెమ్మ తల్లి జాతర వస్తుంది. ఆవిడ మన గ్రామదేవత కదా.అంతా ఆ రోజు కోళ్ళు కోసి ఆ తల్లికి నైవేద్యాలు పెడతారు. మనం కూడా ఆ రోజు సత్తెమ్మ తల్లికి ఈ కోడిని కోసి నైవేద్యం పెడదాం. దాన్ని ఎలాగో నేను ఒప్పిస్తాను లెండి. ఇప్పుడు మాత్రం దాని గురించి ఆలోచించకండి. మీకంతగా తినాలని ఉంటే బజారు నుంచి ఓ కేజీ చికెన్ తెప్పించి మీరు కోరుకున్నట్టు వండి పెడతానులెండి" అంటూ భర్తకు నచ్చజెప్పింది. అది కూతురిది కాబట్టి అప్పుడేమీ

అనలేక మిన్నకుండిపోయాడు రామదాసు.

అప్పుడే స్కూలునుంచి వచ్చి తల్లీదండ్రీ మాటలు విన్న సత్య గుండెల్లో రాయిపడింది. "ఏంటీ మంగను కోసుకు తినేస్తారా?"ఆమెకు దుఃఖం ఆగలేదు. లోపలికెళ్ళిపోయి తలుపేసుకుని కాసేపు ఏడ్చింది. ఆ తర్వాత ముభావంగా ఉండిపోయింది. మూడు నెల్ల తర్వాత ఇంటికొచ్చిన తండ్రి దగ్గరక్కూడా వెళ్ళలేదు. మామూలుగా అయితే, రోజూ తండ్రి ఇంటికి రాగానే అతడిని చుట్టుకుపోయేది సత్య. కానీ ఇప్పుడు తండ్రి ముఖం కూడా చూడాలనిపించలేదు.

సత్యలో వచ్చిన ఈ మార్పును రామదాసు పెద్దగా పట్టించుకోలేదు. ఎందుకంటే తాను జైలు నుంచి విడుదలై వచ్చానని తెలిసి, తనని చూడడానికొచ్చిన తన అనుచరులతో మాట్లాడే సందడిలో ఉండిపోయాడు.

ఒక్కొక్కరోజు గడుస్తూంటే సత్య మనసు దిగులుతో నిండిపోయింది. అన్నం తినబుద్ధికావడం లేదు. సరిగ్గా నిద్ర పట్టడం లేదు. చదువు కూడా సరిగ్గా సాగటం లేదు. ఓ వైపు పరీక్షలు దగ్గర పడుతున్నాయి.

ఆ ఊళ్ళో సత్తెమ్మతల్లి చాలా మహిమగల దేవత అని అందరి నమ్మకం. అందరిళ్ళలోను ఒకరికైనా ఆ దేవత పేరు పెట్టుకుంటారు. మగపిల్లలైతే సత్యన్నారాయణ అనో, సత్తిబాబు అనో, ఆడపిల్లలైతే సత్యవతి, సత్యవాణి అనో పేర్లు పెట్టుకుంటారు. రామదాసు తనకు కూతురు పుట్టినవెంటనే జాతకం చూపించాడు.రెండక్షరాల పేరు పెట్టమంటే సత్య అని పేరు పెట్టుకున్నారు. ప్రతీ సంవత్సరం ఆ ఊళ్ళో ఉగాది వెళ్ళాక వచ్చే పౌర్ణమి రోజున సత్తెమ్మ తల్లికి ఘనంగా జాతర చేస్తారు.

అంతా కొత్తబట్టలు కుట్టించుకుంటారు. తెల్లారకుండా లేచి తలంటుకుని కొత్త బట్టలు వేసుకుని పూజలు మొదలుపెడతారు. నైవేద్యం కోసం తెల్లని అన్నం వండుతారు. మునగాకు, తెలగపిండికూర, ముద్దపప్పు, కొబ్బరి పచ్చడి చేస్తారు. పూర్ణంబూర్లు, మినపగారెలు, పుణుకులు కూడా చేస్తారు. కోళ్ళు కోస్తారు. డబ్బులున్న వాళ్ళైతే మేకల్ని బలిస్తారు.ఆ రోజు ఊరంతా హడావుడిగా ఉంటుంది. రాత్రి సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తారు.

జాతరరోజు దగ్గరపడేకొద్దీ సత్య మరింత బెంబేలు పడిపోతోంది. ఇంక కొన్నిరోజులేనా మంగ తనతో ఉండేది? ఆ తర్వాత కనిపించదా? అని ఆ పసిమనసు తల్లడిల్లిపోతోంది. సత్తెమ్మ తల్లి నిజంగా బలి కోరుతుందా? అయినా నోరూవాయీ లేని ఆ మూగజీవుల్నా ఆ తల్లి కోరుకునేది? ఊరంతా క్షేమంగా ఉండాలంటే అలాంటి

జీవులు బలయిపోవలసిందేనా? ఎందుకు తల్లీ నీకు వాటి మీద కోపం? ఏ రక్షణా లేకుండా బతుకుతూ, మనుషుల్లా కాకుండా కార్పణ్యాలు లేకుండా జీవించే వాటిని నువ్వు బలి కోరుకుంటున్నావా? వద్దు తల్లీ వద్దు. అటువంటివాటిని బలి కోరుకోకు. వాటి జీవితకాలం చాలా తక్కువకదా. మరి అలాంటప్పుడు నీలాంటోల్లు వాటినే బలి కోరుకుంటుంటే అవి కనీసం కొన్ని నెలలైనా బతకలేవు కదా. వాటిని కనికరించు తల్లీ", అని వేడుకుంది సత్య.

సత్తెమ్మతల్లి జాతరపనుల్లో రామదాసు బిజీ అయిపోయాడు. రికార్డింగ్ డ్యాన్సులు బుక్ చేశారు. కోడిపందాలు మామూలే. గుండాటలు సరేసరి. అన్నింటిలోను కమీషన్ మాట్లాడుకున్నాడు. అన్నీ తానై జాతర పనులు చక్కబెడుతూ తిరుగుతున్నాడు.

జాతర ఇంకా మూడు రోజులే ఉంది. ఇక మంగ గురించి సుబ్బలక్ష్మి కూతురికి చెప్పేసింది. "నీ మంగని సత్తెమ్మతల్లికి నైవేద్యంగా అర్పిస్తున్నాం తెలుసా? అదెంత పుణ్యం చేసుకుందో! మనం స్వంతంగా పెంచుకున్నదాన్ని బలిస్తే ఆవిడ ఎంతో సంతోషిస్తుంది. మనకి ఏ కష్టాలు రావు" అంది.

తల్లిని చూస్తుంటే ఎలాగో అన్పించింది సత్యకు. ''తన తల్లేనా మాట్లాడుతున్నది"అని కూడా అనుకుంది.

"ఎందుకమ్మా మంగ మీద నీకంత కోపం. బలి ఇవ్వకుండా నైవేద్యం పెడితే సత్తెమ్మ తల్లి ఒప్పుకోదా?ఆవిడ పేరు చెప్పుకుని అందరూ దాన్ని కోసుకుతినడానికే కదా."

"ష్... అలా అనకే. ఆ తల్లికి కోపం వచ్చిందంటే మనకు మంచిది కాదు. మాకు ఎన్నో సంవత్సరాలు పిల్లలు పుట్టకపోతే, ఆ తల్లికి మొక్కుకుని జాతర చేయిస్తే, అప్పుడు పుట్టావు నువ్వు. నువ్వింకేం మాట్లాడకు తెలిసిందా"అంటూ గట్టిగానే చెప్పింది.

'తన గోడు ఎవరికి చెప్పుకోవాలి? తండ్రికి చెప్పినా వినిపించుకోడు. దాన్ని ఎప్పుడు కోసుకు తిందామా అని ఎదురు చూస్తున్నాడాయె!'

అప్పుడు సత్యకు అమ్మమ్మ గుర్తుకొచ్చింది. అమ్మమ్మనడిగితే మంగని రక్షించే మార్గమేదైనా చెబుతుందేమోనని పక్కూరిలో ఉన్న అమ్మమ్మకు ఫోన్ చేసి చెప్పింది.

ఆవిడ పకపకా నవ్వి "ఓసి పిచ్చి మొద్దా దానికింత బెంబేలు పడిపోతావెందుకే! కోళ్ళు పెంచుకునేది కోసుకు తింటానికే కదే ,దాన్ని కోసుకుతింటే కోసుకొనియ్యి. నేను జాతరరోజున వస్తాను కదా...వస్తూ ఇంకో పిల్లను తెస్తాను. దాన్ని పెంచుకుందువుగానిలే"అని చెప్పింది.

అన్ని దారులు మూసుకుపోయాయనిపించింది సత్యకి. 'ఏం చేస్తే మంగను రక్షించుకోవచ్చు?' అని ఆలోచించింది. టక్కున మదిలోమెదిలిందో ఆలోచన. ఆ రాత్రి నిద్రపోయాక గంప కింద ఉన్న మంగను బయటకు తీసింది. దాని కాలికి కట్టిన తాడు విప్పేసింది. దాన్ని ఎత్తుకుని కొంచెం దూరం తీసుకువెళ్ళి వదిలిపెట్టి, "వెళ్ళిపో మంగా, దూరంగా వెళ్ళిపో. ఈ లోకం నుంచి వెళ్ళిపోయే బదులు ఎక్కడికైనా పోయి హాయిగా బతుకు.రోజూ నిన్నింక చూడలేకపోయినా నువ్వెక్కడో ఓచోట బతికుంటే నాకదే చాలు. తెల్లారేసరికి ఈ ఊరు విడిచిపెట్టి వెళ్ళిపో. మనుషుల్లేని చోటుకి పోయి బతుకు"అంది కళ్ళనిండా నీళ్ళు నింపుకుని ఏడుస్తూ. దాన్ని ముద్దులతో ముంచెత్తి వదల్లేక వదల్లేక వదిలిపెట్టి ఇంట్లోకొచ్చి పడుకుంది. ఆ రాత్రంతా సరిగ్గా నిద్రలేకపోయినా ఆ కలతనిద్రలోనే కలలుకంది. మంగ హాయిగా పక్కనే ఉన్న అడవిలోనే బతుకుతోందనే ఓ అందమైన కలగంది. మంగ ఎక్కడున్నా సుఖంగా ఉందనుకుంటూ తెల్లారి నిద్రలేచింది. బయటకొచ్చి చూసి బిత్తరపోయింది. మంగ రోజులాగే గింజలేరుకుంటూ తింటోంది.సత్యను చూసిన వెంటనే మంగ క్కో..క్కో...క్కో ...అంటూ వచ్చి సత్య కాళ్ళచుట్టూ తిరుగుతోంది. మంగను చూసిన సత్యకు ఓ ప్రక్క ఆనందం, మరో పక్క దుఃఖం కలిగాయి. 'మంగ తననీ, ఈ ఇంటినీ విడిచి వెళ్ళలేదు. మళ్ళీ మళ్ళీ ఇక్కడికే తిరిగొచ్చేస్తుంది. మరెలా? ఇకడుంటే దాన్ని ఈ రోజు తప్పకుండా నైవేద్యం పెట్టేస్తారు.' సత్యకు ఇంకా దిగులు ముంచుకొచ్చేసింది. మంగని నైవేద్యం పెట్టాలని తల్లిదండ్రులు నిర్ణయించుకున్నప్పటినుంచి సత్యకు సరిగ్గా తిండి,నిద్రా లేదు. ఎప్పుడూ మంగ గురించిన దిగులే. బాగా నీరసపడిపోయింది. ఆరోజు ఏమీ తినకుండానే స్కూలుకెళ్ళింది. సత్తెమ్మ తల్లి గుడి దగ్గర పందిర్లు వేసే హడావుడిలో ఉన్నాడు రామదాసు. జాతరరోజున ఇంటికొచ్చే బంధువుల కోసం పిండివంటలు చేసే పనిలో పడింది సుబ్బలక్ష్మి. అప్పుడు సరిగ్గా స్కూలుదగ్గర నుండి కబురొచ్చింది. సత్య కళ్ళు తిరిగి స్పృహ పడిపోయిందనీ, కళ్ళు తెరవడం లేదనీ పిల్లలొచ్చి చెప్పారు. గుడి దగ్గర నుంచి రామదాసు, ఇంటి దగ్గర నుంచి సుబ్బలక్ష్మి పరుగెత్తారు. లెక్కలు చేస్తూ చేస్తూ సత్య ఒక్కసారిగా పక్కకు ఒరిగిపోయిందనీ,ఏం చేయాలో తోచక తోటిపిల్లలను, టీచర్నీ ...ఇచ్చి పక్కనే ఉన్న హాస్పటల్ కి పంపించానని హెడ్మాస్టర్ గారు చెప్పారు. వెంటనే అక్కడకు పరిగెత్తారు.

వాడిపోయిన తోటకూర కాడలా హాస్పటల్ బెడ్ మీద పడి ఉంది సత్య. సెలైన్ పెట్టారు. ఆ బాటిలోంచి ఒక్కో చుక్కా సత్య శరీరంలోకి శరీరంలోకి ఎక్కుతోంది.

రామదాసూ, సుబ్బలక్ష్మి ఒకర్ని పట్టుకుని ఒకరు ఏడుస్తున్నారు. అప్పటికే చాలామంది అక్కడకు చేరుకున్నారు. అంతలో డాక్టర్ వచ్చి సత్యను పరీక్షించాడు. నాడి బలహీనంగా కొట్టుకుంటోంది. "మా సత్యకు ఏమైంది డాక్టర్?"అని భయం భయంగానే అడిగాడు రామదాసు.

ఆయన వాళ్ళమీద కయ్ మని ఎగిరిపడ్డాడు.

"మీ అమ్మాయి ఇంట్లో తిండి తింటుందో, తినడం లేదో అసలు మీరు గమనిస్తున్నారా? అమ్మాయి బాగా నీరసపడిపోయింది. పిల్లను పట్టించుకోకపోతే ఎలా?" అన్నాడు.

"జాతర హడావుడిలో పట్టించుకోలేదండి"నెమ్మదిగా అంది సుబ్బలక్ష్మి.

"కూతురు ముఖ్యమా? జాతర ముఖ్యమా? ఏదైనా ఆరోగ్యాలు బాగుంటేనే కదా జ్వరం కూడా ఎక్కువగానే వుంది. మందులు వాడుతున్నాంకదా. చూద్దాం"అని చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

డాక్టరు "చూద్దాం"అనేసరికి వాళ్ళ గుండెల్లో రాయి పడినట్లైంది. 'ఎందుకిలా జరిగింది. సత్యకు నీరసమేమిటి? కళ్ళు తిరిగి పడిపోయేంత పరిస్థితి ఎందుకొచ్చింది?' వాళ్ళకేమీ అర్థం కావడం లేదు. అలాగే కూర్చున్నారక్కడ. సత్యకు ఎప్పుడు మెలకువ వస్తుందా అని ఎదురుచూస్తున్నారు. రామదాసుకీ, సుబ్బలక్ష్మికీ దుఃఖం ఆగటం లేదు. సత్యను అలా చూడలేకపోతున్నారు వాళ్ళు.

సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో నెమ్మదిగా కళ్ళు తెరిచింది సత్య. గబగబా ఆమె పక్కకు చేరారు. తనలో తనే గొణుక్కుంటోంది సత్య.

"ఏమైంది తల్లీ నీకు" వెక్కివెక్కిపెడుతూ అడిగింది సుబ్బలక్ష్మి. రామదాసు కర్చీఫుతో కళ్ళు తుడుచుకుంటున్నాడు. సత్య వాళ్ళిద్దరిని నిరసనగా చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంది. మళ్ళీ డాక్టర్ వచ్చి చూశాడు.

"ఇప్పుడు కొంచెం జ్వరం తగ్గింది. మళ్ళీ జ్వరం రాకుండా చూడాలి"అంటూ మెడిసిన్స్ రాసి, ఎలా వాడాలో నర్సుకు చెప్పి వెళ్ళిపోయాడు. తిండీతిప్పలు లేకుండా అందరూ హాస్పటల్ దగ్గరే ఉండిపోయారు.అర్థరాత్రప్పుడు సత్యకు స్పృహ వచ్చింది. అంతా ఆమె మంచం చుట్టూ చేరారు. కలవరిస్తోంది.

"మంగా, నిన్ను రక్షించుకోలేకపోతున్నాను...నువ్వు లేకుండా నేను బతకలేను మంగా... నీ బదులు నన్ను బలిమ్మని మా నాన్నకు చెబుతాను మంగా... ఆ తల్లికి కావలసింది మా ఇంటి నుంచి ఎవరో ఒకరిని బలి ఇవ్వడమే కదా ...ఆ తల్లి

దగ్గరకు నేనే వెళ్ళిపోతాన్లే. నువ్వు సుఖంగా ఉండు...”అంటూ అలిసిపోయినట్లుగా మళ్ళీ కళ్ళు మూసేసింది.

ఆ మాటలు విని అందరూ బిత్తరపోయారు. ఏమిటీ? మంగను బలి ఇవ్వాలనుకున్నందుకే బెంగ పెట్టుకుని సత్య ఇలా అయిపోయిందా?

“ఆ విషయం మాకు చెప్పొచ్చుకదమ్మా...మంగ కోసం ఇంత మథనపడ్డావా తల్లీ “అంటూ కూతుర్ని పట్టుకుని భోరున ఏడ్చాడు రామదాసు.

ఇంతలో డాక్టర్ని పిలుచుకొచ్చింది నర్సు. ఆయన వచ్చి సత్యను పరీక్షించి, “జ్వరం ఇంకా పూర్తిగా తగ్గలేదు. ఎన్ని మందులు వాడుతున్నా రెస్పాండ్ కావడం లేదు. చాలా పవర్ ఫుల్ మెడిసిన్స్ వాడుతున్నాం మరి”అన్నాడు. దాంతో అక్కడున్నవాళ్ళంతా భయపడిపోయారు.

సుబ్బలక్ష్మి ఏకంగా ఆయన కాళ్ళ మీద పడి, “డాక్టరుగారూ! నా కూతుర్ని బతికించండి. దానికేమన్నా అయితే మేం బతకలేమండి”అంటూ ఏడ్చేసింది.

“చూడమ్మా.నేను చేయగలిగిందంతా చేస్తాను. ఆ తర్వాత దేవుడి దయ”అని నర్సుకు చెప్పాల్సింది చెప్పి వెళ్ళిపోయాడాయన. డాక్టరు అలా అనేసరికి అందరికీ దుఃఖం పొంగుకొచ్చింది.

కాసేపటికి సత్య మెల్లగా కళ్ళు తెరిచింది.

“మంగా... మంగా”అంటూ కలవరిస్తుంది.

అక్కడున్నవాళ్ళలో ఒక పెద్దాయన, “ముందు వెళ్ళి ఆ మంగను తీసుకురండి”అని అరిచాడు. పక్కింటతను మంగ కోసం సత్య ఇంటికి పరిగెత్తాడు.

– – –

“అమ్మా సత్యా! నన్ను క్షమించు తల్లీ! నువ్వు ఎంతో అల్లారుముద్దుగా పెంచుకుంటున్న మంగను బలిస్తాననడం నా తప్పే. మంగనే కాదు, ఇక ఏ జీవినీ ఆ తల్లికి బలివ్వనమ్మా. ఆ తల్లికి కోపం వచ్చినా సరే, నా కూతురు కంటే నాకు ఏ దేవత ఎక్కువ కాదు. మనింట్లోనే కాదు తల్లీ, అందర్నీ వేడుకుంటాను మన ఊరి జాతరలో ఇంక ఎటువంటి బలులూ ఇవ్వకూడదనీ, మూగజీవులను బలివ్వడం తప్పు అని తెలుసుకున్నాను. మేం చేసిన తప్పుల నుంచి నువ్వు మమ్మల్ని కాపాడటానికి, ఏ తప్పూ చేయని ఆ మూగజీవులను బలివ్వడం తప్పేనమ్మా. ఇప్పటి నుంచి బలివ్వకుండానే నైవేద్యాలు పెట్టుకుంటాం. మాకు అన్యాయం చేయకమ్మా. ఇంక నీ మంగ ఎప్పుడూ నీ దగ్గరే ఉంటుంది”, అంటూ కూతుర్ని పట్టుకుని గట్టిగా ఏడ్చేశాడు

రామదాసు.

నెమ్మదిగా కళ్ళు తెరిచి తండ్రి వంక చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంది సత్య. అంతలో అక్కడకు మంగను తీసుకువచ్చారు.

"క్కో...క్కో...క్కో"అంటూ మంగ అరుస్తోంది బెడ్ మీద ఉన్న సత్యను చూస్తూ. ఆ అరుపులకు సత్య నెమ్మదిగా కళ్ళు తెరిచింది. ఆ ముఖంలో ఓ పక్క ఆనందం, మరోపక్క ఆశ్చర్యం! మంగను సత్య బెడ్ మీద ఉంచారు. మంగను తీసుకుని సత్య తన గుండెలకు అదుముకుంది. ఆమె కళ్ళల్లో ఆనందభాష్పాలు.

"మంగా... వచ్చేశావా... ఇంకా నీకు ఏం భయం లేదు. మనిద్దరం రోజు ఆడుకుందాం, సరేనా"ఉద్వేగంగా అంటూ కళ్ళు మూసుకుంది సత్య.

అంతా కంగారుపడ్డారు. డాక్టర్ వచ్చి ప్రాణాపాయమేమీ లేదని చెప్పడంతో అంతా ఊపిరి పీల్చుకున్నారు.

అవేమీ తెలియని మంగ బెడ్ మీద సత్య చుట్టూ తిరుగుతోంది 'క్కో...క్కో...క్కో..' అంటూ.

**( నవ్య వారపత్రికలో ప్రచురితం )**

* * *

# చెట్టు నీడ

**వా**రం రోజుల నుంచీ  రాజారావు నాకు చాలా డల్ గా కనిపిస్తున్నాడు. ఎపుడూ హుషారుగా వుండే అతను అలా వుండటం ఎప్పుడూ చూడలేదు. మా ఇంటికి నాలుగిళ్ళ అవతల ఉంటాడు. నాలుగెకరాల భూమిలో వ్యవసాయం చేస్తూ ఏ చీకూ, చింత లేని జీవితాన్ని గడుపుతున్నాడు. ఒక్కడే కొడుకు,ఇంటరు సెకండియర్ చదువుతున్నాడు. అందరితో చాలా కలివిడిగా వుంటాడు. అటువంటి రాజారావు అలా కనపడేసరికి  విషయం తెలుసుకోవాలనుకున్నాను. ఓ ఆదివారం ఉదయం తనే వచ్చాడు మా ఇంటికి. "రావయ్యా రాజారావ్!నేనే నిన్ను పిలిపిద్దామనుకుంటున్నాను. నువ్వే వచ్చావు"అంటూ నేను కూర్చున్న కుర్చీ పక్కనే కుర్చీ ఉంటే అందులో కూర్చోమన్నాను.

"ఎందుకు సారూ!నా అవసరమేమొచ్చింది" అంటూ కూర్చున్నాడు.

"అవసరమేమీ లేదు రాజారావ్. నేను స్కూలుకెళ్ళేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు రోజూ గమనిస్తున్నాను. నువ్వెందుకో బాధపడుతున్నావనిపిస్తుంది. చాలా దిగులుగా వుంటున్నావు. మునుపెన్నడూ ఇలా లేవు"

"అవును సార్. ఆ విషయం మీతో చెప్పుకోవాలనే వచ్చాను. మా కుర్రాడు నాకు పెద్ద తలనొప్పయిపోయాడు సార్. కాలేజీకి సరిగ్గా పోవడం లేదు. ఇంక చదువనంటే చదవనంటున్నాడు. కాలేజీ మానేస్తాడంట"దిగులుగా అన్నాడు.

"మానేసి ఏం చేస్తాడంట"

"నాతో పాటు వ్యవసాయం చేస్తాడట సార్"

"ఇద్దరూ కలిసి వ్యవసాయం చేసేటంత భూమి వుందటనా"

"అదే కదా సార్ నా బాధ. మీరైనా వాడికి నచ్చచెపుతారని చెప్పడానికి వచ్చాను సార్"

"అయితే సాయంకాలం వాణ్ణి తీసుకుని రా" అన్నాను.

రాజారావు వెళ్ళిపోయాడు. నేనీ వూళ్ళో గవర్నమెంటు హైస్కూల్లో  టీచర్ గా పని చేస్తున్నాను. రాజారావు కొడుకు చలపతి టెన్త్ వరకు నా దగ్గర చదివాడు. బాగా చదువుతాడు. మంచి మార్కులతోనే టెన్త్ పాసయ్యాడు. ఈ ఊళ్ళోనే వున్న జూనియర్

కాలేజీలో ఇంటర్లో బైపిసి గ్రూపు తీసుకున్నాడు. మొదటి సంవత్సరం బాగానే చదివాడు. మరిప్పుడు అలాంటి ఆలోచన ఎందుకు చేస్తున్నాడు? వస్తాడు కదా చూద్దాంలే అనుకున్నాను.

సాయంత్రం ఐదు గంటలకు కొడుకును తీసుకువచ్చాడు రాజారావు. చలపతి మోహంలో నిరాశ, నిస్పృహలు కనిపించాయి.

"ఏం చలపతీ! ఏవేవో నిర్ణయాలు తీసుకుంటున్నావట, నిజమేనా చదువు మానేస్తున్నావా?"

"చదివేం చేయాలి సార్. ఇంటరయ్యాక, డిగ్రీ, అదయ్యాక పి.జి. ఆ తరువాత మాత్రం ఏం చేయాలి. ఉద్యోగాలా, సద్యోగాలా? అప్పుడైనా పొలం చేయాల్సిందే కదా. ఇన్ని సంవత్సరాలు డబ్బు, సమయం వృధా చేసుకోవడం కంటే ఇప్పుడు ఆ పనులు నేర్చుకోవడం మంచిది కదా సార్"

వాడడిగిన వాటికి వెంటనే సమాధానం చెప్పలేకపోయాను.

"చూడు చలపతీ! చదువుకున్న ప్రతి వాడికీ ఉద్యోగాలు ఇవ్వడమంటే ఏ వ్యవస్థకీ సాధ్యం కాదు. చదువు కేవలం ఉద్యోగాల కోసమే అనుకుంటే ఎలా?"

"మరి ఉద్యోగాలు రానప్పుడు చదువెందుకు సార్"

"అదే మూర్ఖత్వపు ఆలోచన. చదువుకుంటే విజ్ఞానం పెరుగుతుంది. మనం సంపాదించుకున్న జ్ఞానంతో ఎన్నో నూతన ఆవిష్కరణలు చేపట్టవచ్చు. ఇప్పుడు నువ్వేవున్నావు చదువు మానేసి వ్యవసాయం చేస్తానంటున్నావు. అసలు దాని గురించి నీకేం తెలుసని. మీకున్న భూమిలో మీ నాన్న ఒక్కడు చేస్తుంటేనే అది లాభదాయకంగా లేదు. నువ్వు కూడా కలిస్తే ఏమైనా ప్రయోజనముంటుందా చెప్పు. వ్యవసాయం గురించి మీ నాన్న కంటే నీకెక్కువ తెలుసా? అదే నువ్వు చదువుకుని వ్యవసాయ రంగంలో వస్తున్న మార్పుల్ని, సాంకేతిక విజ్ఞానం వల్ల వస్తున్న అనేక నూతన పద్ధతుల్ని ఆకళింపు చేసుకుని చేసావనుకో అప్పుడు అందులోని సాధక, బాధకాలు తెలుస్తాయి."

చలపతి సాలోచనగా వింటున్నాడు.

"బాగా చదువుకోవడం వల్ల మన ఆలోచనావిధానంలో ఎన్నో మార్పులు వస్తాయి. నువ్వు తెలివైనవాడివే. కానీ తెలివితేటలకు, ఆలోచనలకు చాలా తేడా ఉంటుంది. చదువులేని వాళ్ళలో చాలామందిలో తెలివితేటలు పుష్కలంగా వుంటాయి. కానీ ఆ తెలివితేటలు వాళ్ళ అభివృద్ధికి ఏ విధంగానూ పనికిరావు. మన తెలివితేటలకు కొంత విజ్ఞానం తోడయితే మన జీవితంలో పైకి రావడానికి అవసరమైన లాజిక్కులు

తెలుస్తాయి. నీకో ఉదాహరణ చెపుతాను విను. ఇది నేను గతంలో ఓ చోట చదివాను. ఓ ముసలమ్మ దగ్గర ఒక ఆవు వుంది. ఆ ఆవు ఇచ్చే పాలమీదే ఆమె ఆధారపడి బతికేది. ఆమె రోజూ ఆవుకి పెట్టే గడ్డి కోసం రెండు వందల రూపాయలు ఖర్చు పెట్టేది. ఆ ఆవు రెండు పూటలా నాలుగువందల రూపాయల పాలు ఇచ్చేది. ఆమెకు రెండు వందలు మిగిలేవి. అవి ఆమెకు సరిపోయేవి కాదు. ఆమె తెలివిగా ఓ పని చేసి గడ్డికయ్యే ఖర్చు తగ్గించుకుంది. ఇక్కడ ఆమె ఒక చిన్న లాజిక్ ఉప యోగించుకుంది. అదేమిటో నువ్వూహించగలవా" అని చలపతిని అడిగాను. వాడు కాసేపు ఆలోచించి "ఆమె ఆవును తోలుకుపోయి ఊరిలోని చేలగట్ల మీద మేపి గడ్డికయ్యే ఖర్చు తగ్గించుకొని వుంటుంది" చెప్పాడు చలపతి.

"అలా అయితే ఆ ఆవును రోజంతా తిప్పాలి. ఆమె వయస్సు అందుకు సహకరించకపోవొచ్చు కదా!"అన్నాను. వాడేం మాట్లాడలేదు.

"ఏమీ లేదు. ఆవిడ ఆ ఆవుని రద్దీగా వుండే ఓ గుడి ముందు కట్టేసి ఆవుకోసం కొన్న గడ్డిని గుడికి కొంచెం దూరంగా పెట్టుకుని కూర్చునేది. గుడికొచ్చే భక్తులు ఆమె దగ్గర గడ్డి కొని ఆవుకు తినిపించి భక్తి పారవశ్యం పొందేవారు. ఇక్కడ లాజిక్ ఏమిటంటే ఆమె గుడి దగ్గర ఆవును కట్టడమే. గడ్డిని ఆమె ముడిసరుకుగా ఉప యోగించి భక్తి అనే మార్కెట్ లో తను వ్యాపారం చేసి మొత్తం నాలుగువందలు తనే అనుభవించేది" చలపతి ఆశ్చర్యంగా వింటున్నాడు.

"ఆ ముసలమ్మ తెలివైనదైనా చదువులేనిది. కాబట్టి గడ్డి అనే ముడిసరుకుని ఉపయోగించింది. అదే బాగా చదువుకుని విజ్ఞానాన్ని సంపాదించుకున్న వాళ్ళయితే ముడిసరుకు అనేది లేకుండా బాగా సంపాదిస్తారు. ఉదాహరణకు ఊబర్, ఓలా క్యాబ్ సర్వీసులున్నాయి కదా. ఆ విషయం నీకు తెలిసే వుంటుంది. వాళ్ళకి ఒక్క క్యాబ్ కూడా సొంతంగా వుండదు. అలాగే స్విగ్గీ, జొమాటో లాంటి సర్వీసులున్నాయి కదా వాళ్ళకీ ఒక హొటలూ స్వంతంగా వుండదు. నేటి సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుని ముడిసరుకుతో పనిలేకుండా ప్రజల 'బద్ధకం' అనే పెద్ద మార్కెట్ లో సేవలు 'సులభం' అనే పేరుతో చాలా సులువుగా కోట్లు సంపాదిస్తున్నారు. ఇదంతా ఎలా సాధ్యమైందంటావు. వాళ్ళు బాగా చదువుకోవడం వల్లే కదా"చలపతి ముఖంలో ఉత్సాహం కనిపించింది.

"చదువు అనేది పెద్ద చెట్టులాంటిది చలపతీ. చెట్టు బాగా పెరిగి పెద్ద పెద్ద కొమ్మలతో విస్తరిస్తే దాని నీడలో ఎంతోమంది సేదతీరుతూ ఉంటారు. దాని వేళ్ళు

ఎంత బలంగా భూమిలో విస్తరిస్తే అది అంత పెద్దగా ఎదుగుతుంది. చదువు కూడా అంతే. చెట్లలాగే ఎంతోమందికి జీవితాన్ని ఇవ్వడమే కాకుండా దేశాన్ని సౌభాగ్యవంతంగా తీర్చిదిద్దుతుంది", చెప్పడం ఆపి చలపతి వంక చూసాను. నేను చెప్పిందంతా చలపతి ప్రశాంతంగా విన్నాడు.

"మీరు చెప్పింది నిజమే సార్. నేనిలాంటివేమి ఆలోచించకుండా తప్పుడు నిర్ణయం తీసుకున్నాను. నేను చదువు కంటిన్యూ చేస్తాను సార్. రేపటినుండి కాలేజీకి వెళతాను" అన్నాడు. రాజారావు ముఖం ఆనందంతో వెల్లివిరిసింది.

"చాలా సంతోషం చలపతీ! నువ్వు ఇంటరు సైన్స్ సబ్జెక్టులతో చదువుతున్నావు కాబట్టి అది పూర్తయిన వెంటనే 'సెట్' రాయి. డిగ్రీ అగ్రికల్చర్ బియస్సీ చెయ్యి. అది నీకు ఇంట్రస్టింగ్ సబ్జెక్ట్ కాబట్టి నువ్వు చెయ్యాలనుకుంటున్న వ్యవసాయానికి ఎంతో ఉపయోగపడుతుంది. ఇప్పుడు ఎన్నో కొత్త కొత్త సేంద్రియ పద్ధతులొస్తున్నాయి. ఎన్నెన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. అవన్నీ నీకూ, నీ కుటుంబానికే కాకుండా దేశప్రగతికి కూడా బాగా ఉపయోగపడతాయి. తెలిసిందా" అన్నాను.

తండ్రీకొడుకులిద్దరూ అక్కడనుంచి ఆనందంగా ఇళ్ళకు వెళ్ళారు.

**( సాహితీకిరణం మాసపత్రిక, మార్చి 2021 సంచికలో ప్రచురితం.**

**ఈ కథ ముట్టూరి కమలమ్మ ఫౌండేషన్–సాహితీకిరణం సౌజన్యంతో నిర్వహించిన జాతీయ స్థాయి చిన్న కథల పోటీలో బహుమతి పొందింది. )**

* * *

# ఎవరికి ఎవరో

రైల్వేస్టేషన్‌కెళ్ళడానికి ఆటో కోసం నిలబడ్డాను. అయిదు నిమిషాల తర్వాత నాముందొక ఆటో వచ్చి ఆగింది. ఆటో డ్రైవర్ ఫోన్‌లో మాట్లాడుతూనే డ్రైవ్ చేసుకుంటూ వచ్చాడు. ఫోన్ చెవి దగ్గర నుంచి తప్పించి "ఎక్కడికి సార్" అని అడిగాడు. "రైల్వేస్టేషన్‌కి" అని చెప్పాను.

"ఎక్కండీ, వంద రూపాయలు" అన్నాడు ట్రెయిన్ పావుగంటలో వుంది. బేరమాడే అవకాశం లేక ఎక్కికూర్చున్నాను. ఆటో పోతుంది. అతను మాట్లాడుతూనే ఆటో తోలుతున్నాడు. ట్రాఫిక్ చూస్తే ఎక్కువగావుంది. వీడెక్కడ దేన్ని గుద్దుతాడో అని భయంగావుంది. అప్పటికీ అన్నాను ఫోన్ మాట్లాడకుండా పోవొచ్చుగా అని. అతను నవ్వి "భయపడకండి సార్ నాఆటోకి అలవాటే నా ప్రమేయంలేకుండానే వెళ్ళిపోతుంది" అని చెప్పి మళ్ళీ మాట్లాడటం మొదలెట్టాడు.

ఇతననే ఏముంది ఇప్పుడందరికీ ఈ పిచ్చిబాగానే వుంది. దీనివల్ల అంతా ఎవరికి వారే యమునా తీరే అన్నట్టు బతికేస్తున్నారు. ఎవరి చేతుల్లో చూసినా సెల్‌ఫోనే. గతంలో అయితే ప్రతివారి చేతిలో పుస్తకమో, సంచో, గొడుగో వుండేవి. ఇప్పుడు వాటిస్థానాన్ని ఈఫోను ఆక్రమించేసింది.

మొత్తం మీద నన్ను ఆ ఆటోవాడు క్షేమంగానే స్టేషన్లో దించాడు. టికెట్ ముందే రిజర్వ్ చేయించుకున్నానేమో క్యూలో నిలబడి టికెట్ కొనే బాధ తప్పింది. స్టేషన్‌లోపలి కెళ్ళి చూస్తే ఫ్లాట్‌ఫాం నిండా జనాలే. అయితే అంతా నిశబ్ధంగావుంది. గతంలో ఏఫ్లాట్‌ఫాం చూసినా గోలగోలగా వుండేది. ఈ సెల్‌ఫోన్ల పుణ్యమాఅంటూ ఎవరి ఫోన్ వాళ్ళు చూసుకుంటూ పక్కవాడితో పని లేకుండా కాలం గడిపేస్తున్నారు.

ఓసారి మా ఫ్రెండొకడు చాలా అర్జంటు పనిమీద హైదరాబాదు వెళ్ళవలసి వచ్చి తత్కాల్లో సెకండ్ ఏ.సి.లో టికెట్ సంపాదించుకుని స్టేషన్ కొస్తే ట్రెయిన్ అరగంట లేటన్నారని ఓ ప్రక్కన కూర్చుని వాట్సాప్ ఓపెన్ చేసి దాన్లో పడిపోయి గంటపోయాక స్పృహలోకొచ్చి చూస్తే అప్పటికే రైలురావడం, పోవడం జరిగిపోయింది. లబోదిబో అంటే ఏం ప్రయోజనం! మళ్ళీ ఓ మామూలు టికెట్ కొనుక్కుని తర్వాతి ట్రైయిన్‌లో జనరల్ కంపార్ట్‌మెంటు ఎక్కినానా అగచాట్లు పడి వెళ్ళాడట. కనీసం పక్కవాడికి

చెప్పినా వాడు చెప్పేవాడు. కానీ ఇప్పుడెవరు పక్కవాళ్ళని పలకరించరు. అదో అగౌరవమనుకుంటారు. అందుకే మానవ సంబంధాలన్నీ కనుమరుగవుతున్నాయి. ఇలాంటి సంఘటనలు చాలా మంది జీవితంలో జరుగుతూనే వున్నాయి.

ఇంతలో మా ట్రెయిను వస్తున్నట్లు అనౌన్స్‌మెంటు వినిపించింది. నెనెక్కాల్సింది జన్మభూమి ఎక్స్‌ప్రెస్. రాజమండ్రికి ఆ ట్రెయిన్ తొమ్మిదీ, తొమ్మిదిన్నర మధ్యలో వస్తుంది. ఏ.సి. చైర్‌కార్‌లో రిజర్వ్ చేసుకోవడంతో తోసుకుంటూ ఎక్కాల్సిన పనిలేదు. కాబట్టినెనెక్కాల్సిన కంపార్ట్‌మెంటు ఎక్కడ ఆగుతుందో డిస్‌ప్లేబోర్డు దగ్గరకు నెమ్మదిగా వెళ్ళి నిలబడ్డాను. ఈస్టేషన్లో రైలు రెండుమూడు నిమిషాలాగుతుంది. ఒక్కోసారి అయిదు నిమిషాలాగుతుంది. గోదావరి బ్రిడ్జిమీద నుంచి క్లియరెన్స్ వచ్చే వరకు ట్రెయిను బయలు దేరదు. అందుకే రాజమండ్రి స్టేషన్లో కొంచెం ఎక్కువ సేపే ఆగుతాయి. ఈ రోజుకూడా అయిదు నిముషాల తర్వాతే బయలు దేరింది.

నెమ్మదిగా కదులుతున్న రైల్లోకి కంగారుగా ఓ స్త్రీ ఎక్కింది. ఆమెకు ముప్పయి సంవత్సరాల వయసుండొచ్చు. సాదా బట్టల్లో వుంది. చేతిలో చిన్న సంచి. చూస్తుంటే ఆమె ఏడెనిమిది నెలల గర్భిణీలా వుంది. లోపలి కొచ్చి నేను కూర్చున్న సీటు దగ్గర నిలబడిరది. కంగారుగా ఎక్కడంవల్ల బాగా ఆయాస పడుతుంది. మరో పక్క భయం, భయంగా కూడా వుంది.

మా కంపార్ట్‌మెంట్లో సీట్లన్నీ నిండిపోయాయి. మరో మనిషికి ఇందులో చోటులేదు. మరి ఇందులోకి ఎందుకెక్కింది? పక్కభోగీలో సీటు వుండివుంటుంది. తను ఫ్లాట్‌ఫాం మీదకు వచ్చేసరికి రైలు కదిలివుంటుంది. అందుకే దీనిలో ఎక్కివుంటుందనుకున్నాను. ట్రెయిను బ్రిడ్జిదాటినా ఆమె ఇక్కడ నుంచి వేరే భోగిలోకి పోకుండా అలాగే నిలబడివుంది. టీ.టి.యి ఇంకారాలేదు. మిగిలిన రెండు ఏ.సీ భోగీలను చెక్ చేసుకుని రావాలికదా.

ఆమె చాలాసేపటి నుంచీ నిలబడి వుండటంతో చాలా కష్టంగా ఫీలవుతున్నట్టనిపించింది. కడుపుతో వున్న మనిషికదా. అంతసేపు నిలబడటం కష్టమే. రైల్లో వున్న వాళ్ళెవరూ ఈలోకంలో లేరు అంతా సెల్ ఫోన్లతో కుస్తీలు పడుతున్నారు వారంతా ఈ ప్రపంచంలో సంబంధం లేనట్లుగా వున్నారు.

పూర్వం రైలు ప్రయాణమంటే అదో పండుగ అంతా కిటికీ పక్కనే కూర్చోవాలని పోటీలు పడేవారు. రైలు పోతున్నప్పుడు కనపడే ప్రకృతి అందాలను చూసి ఎంతో పరవశించి పోయేవారు. అంతా చక్కగా కబుర్లు చెప్పుకుంటే కలిగే ఆనందం అంతా

ఇంతా కాదు. రైల్లో కలిసి భోజనం చేయడం అదో థ్రిల్. రైలు ప్రయాణంలో ఎవరో తెలియని వ్యక్తులతో పరిచయాలు పెరిగి రైలు దిగే సరికి స్నేహితులైపోయేవారు తర్వాత వారి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరిగేవి. రైలు ప్రయాణాల్లో పెళ్ళి సంబంధాలు కుదిరిన సంఘటనలు కూడా నాకుతెలుసు.

ఇప్పుడేమైపోయాయా రోజులు. ఎవరికి ఎవరో అన్నట్టుగా బతికేస్తున్నారంతా. మా కంపార్ట్మెంట్లో సగం మంది ఆడవాళ్ళే వున్నారు. కానీ ఎవరూ సాటి స్త్రీని ఆ స్థితిలో చూసి ఎవరూ పట్టించుకున్నట్టులేదు. ఎవరెలా పోతే ఏంలే అన్నట్టుగా వాళ్ళపనిలో వాళ్ళున్నారు. అప్పుడు నాలో ఓ ప్రశ్న ఉదయించింది. ఆడాళ్ళు కష్టాల్లో వుంటే ఆడాళ్ళే పట్టించుకోవాలా? మగవాళ్ళు పట్టించు కోకూడదా? మరి నేనే ఆపనెందుకు చేయకూడదు?

"చూడండి! మీరు నిలబడి ప్రయాణం చేయలేరు. నాసీట్లోకూర్చోండి. నేను నిలబడతాను" అంటూ నాసీట్లో నుంచి లేచాను.

"అబ్బే వద్దండి. నేను నిలబడి ప్రయాణం చేయగలను" అందామె.

"మీరు నిలబడటం మంచిది కాదు. ఇలాంటి పరిస్థితిలో అంత సేపు నిలబడి ప్రయాణం చేయడం అసలు మంచిది కాదు. పర్వాలేదు కూర్చోండి" అన్నాను.

అయినా ఆమె కూర్చోలేదు. కూర్చోమని బలవంతపెట్టాను

"వద్దుసారూ! నేను టిక్కెట్టు కొనకుండా ఎక్కాను. వచ్చే స్టేషన్లో దిగిపోతాను".

"ఇది వచ్చేస్టేషన్లో ఆగదమ్మా. ఇంకో గంట ప్రయాణం చేస్తేనేగాని ఆగదు. అంతవరకు నిలబడి వుండటం శ్రేయస్కరం కాదు. అయినా టికెట్ కొనకుడా రైలెక్కడమేమిటి."

"నాదగ్గర డబ్బులేవండి" అలా చెప్పేటప్పుడు ఆమె కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

నాకు చాలా ఆశ్చర్యమేసింది. డబ్బుల్లేకుండా రైలెక్కడమేమిటి? ఇప్పుడవన్నీ ఎందుకనుకుని "చూడమ్మా ముందు కూర్చో", అంటూ బలవంతంగా సీట్లో కూర్చోపెట్టాను.

"ఎంత వరకు వెళ్ళాలి?"

"విజయవాడ వెళ్ళాలండి. అనుకోకుండా బయలుదేరవలసి వచ్చింది. డబ్బుల్లేవు. ఏ పాసెంజరురైలన్నా ఎక్కొచ్చనుకున్నాను. తీరాస్టేషన్ కొచ్చేసరికి ఇది బయలుదేరుతుంది. ఎక్కేసాను. టీ.సీ పట్టుకుని ఏదైనా స్టేషన్లో దించేస్తే దిగిపోయి

ఇంకో రైలెక్కొచ్చనుకున్నాను. ఎక్కాక తెలిసింది ఇది ఏ.సి.బోగీ అని. దిగేటైము లేదు ఎక్కిన వెంటనే కదిలిపోయింది." అంది సంజాయిషీ ఇస్తున్నట్లుగా.

"ఎందుకంత అర్జంటుగా బయలుదేరారు".

ఆమె కళ్ళనిండుగా నీళ్ళు తిరిగాయి. పైకి శబ్ధం రాకుండా దుఃఖపడుతుంది. ఇంతలో టీ.టి.యి మాదగ్గర కొచ్చాడు.

"ఈసీటు జెంట్స్‌ది కదా లేడీ కూర్చుందేమిటి?"

"అవునండి అది నా సీటే. కానీ ఆవిడ నాకు బాగా తెలిసిన ఆవిడ నిండు గర్భిణీ. విజయవాడకు మెడికల్ చెకప్‌కి అర్జంటుగా వెళ్ళవలసి వచ్చింది. టికెట్ పెనాల్టీనే ను కడతాను" అన్నాను.అతను నాతో ఏదో అనబోయాడు. "ప్లీజ్ సార్ ఏమీ మాట్లాడకండి. నేను పే చేస్తానంటున్నానుగా"

"అది కాదండి ఏసీ భోగీలన్నీ నిండిపోయాయి. మీకు సీటు చూపించాలి కదా."

"పర్వాలేదండి నేను నిలబడగలను."

"అయితే సరే. ఏలూరులో మీ పక్క సీటు ఖాళీ అవుతుంది. ఇంకా గంట నిలబడాలి మరి" అంటూ పెనాల్టీతో టికెట్ రాసిచ్చాడు.

అతనికి డబ్బులిచ్చి పంపాక" మీరింక నిశ్చింతగా వుండండి" అంటూ టికెట్ రిసిఫ్ట్ ఆమె చేతికిచ్చాను. దానిమీద వున్న అమౌంట్ చూసి ఆమె బిత్తరపోయింది. "ఇంతా" అంటూ నా వంక చూసింది. ఏం పర్వాలేదంటూ ఆమె వంక నవ్వుతూ చూసాను. ఆమె కళ్ళలో నిండుగా నీళ్ళు.

ట్రైయిను కదిలింది."ఇప్పుడు చెప్పమ్మా ఏం పనిమీద అంత సడెన్‌గా విజయవాడ వెళుతున్నావు" అనడిగాను. అది చెప్పడానికి ముందు నన్ను "మీది రాజమండ్రేనా సార్" అనడిగింది.

అవునన్నాను. అక్కడ నేనోకాలేజీలో ప్రిన్సిపాల్‌గా పని చేస్తున్నానని కూడా చెప్పాను. అప్పుడు తన గురించి చెప్పింది "మాది కడియం పక్కనే వున్న పల్లెటూరు సార్. నా భర్త నర్సరీలో పని చేస్తాడు. మేమిద్దరం పదో తరగతి వరకు చదువుకున్నాం. ఆ చదువుకి ఉద్యోగాలెక్కడొస్తాయి సార్. నేనూ ఆ నర్సరీలో కలుపు తీయడానికి పోతుంటాను. పేదకుటుంబం రోజంతా కష్టపడితేనేగానీ కడుపునిండని సంసారం. అప్పుడప్పుడు అప్పులు చేయడం తప్పడం లేదు. ఇక్కడే వుంటే బతుకంతా ఇలాగే వుంటుందని మా ఆయన తెలిసిన వాళ్ళు పని ఇప్పిస్తాం రమ్మంటే విజయవాడ వెళ్ళాడు. అక్కడ ఓ కాంట్రాక్టరు దగ్గర పనిదొరికింది. నెలకోసారి వచ్చేవాడు. తన

కొచ్చినదాన్లో తన ఖర్చులకు వుంచుకుని మిగిలింది నాకిచ్చేవాడు. కొద్ది కొద్దిగా అప్పులు తీరుతున్నాయి. ఏదో కుదుట పడిరది అనుకుంటున్న సమయంలో నాభర్త మీద దొంగతనం మోపి పోలీస్ స్టేషన్లో పెట్టారని ఈరోజు ఉదయమే నాకు తెలిసినవాళ్ళు ఫోన్ చేసి చెప్పారు. నాభర్త అలాంటి వాడు కాదు సార్. ఎవరేది చెప్పినా నమ్మేస్తాడు. అమాయకత్వం ఎక్కువ. విషయం తెలిసిన వెంటనే గుండాగినంత పనయ్యింది. ఇంకేం ఆలోచించకుండా బయలు దేరాను. ఆ కంగారులో డబ్బులు పెట్టుకున్న పర్స్ మర్చిపోయాను. మావూరి నుంచి స్టేషన్ వరకు ఆటోలో వచ్చాను. ఆటో అతను మావూరివాడే కావడంతో తర్వాతిస్తానని చెప్పాను. స్టేషన్‌లోకి వచ్చిన వెంటనే ఈరైలు కదులుతుంది ఎక్కేసాను".

"వెళ్ళి ఏం చేద్దామనుకుంటున్నావు" అనడిగాను బేలగా చూసింది నావంక "విషయం తెలిసి ఇంట్లో వుండలేక పోయాను సార్."

"ఇప్పుడు ఎవరూ ఎవరినీ పట్టించుకోలేని పరిస్థితిల్లో మనం బతుకుతున్నాం. అటువంటిది నువ్వు ఒక్కదానివి బయలుదేరావు. నువ్వు నీ భర్తను విడిపించుకోగలవా" కళ్ళనిండా నీళ్ళునింపుకోవడం తప్ప ఏంమాట్లాడలేదామె. కాసేపు మా ఇద్దరి మధ్య మౌనం చోటు చేసుకుంది.

"నువ్వో అరగంటలో విజయవాడ చేరుకుంటావు. అక్కడ నీభర్తను విడిపించే వాళ్ళు ఎవరైనా ఉన్నారా? అందులోను నీదగ్గర పైసా లేదు కదా" అన్నాను.

మళ్ళీ ఆమెకు తన పరిస్థితి గుర్తుకొచ్చింది. వెక్కిళ్ళుపట్టింది. ఆమెను చూస్తే నాకు చాలా జాలికలిగింది. ఆమెకు నేనేమైనా సాయపడగలనా అని ఆలోచించాను. అప్పుడు నాకు మురళీక్రిష్ణ గుర్తుకొచ్చాడు. అతను నా దగ్గర డిగ్రీ చదినవాడు. ఎస్సైగా సెలక్టయి, తర్వాత సి.ఐ.గా పనిచేసి ఇప్పుడు డి.ఎస్పీగా విజయవాడలో పనిచేస్తున్నాడు. అప్పుడప్పుడు నాకు ఫోన్లు కూడా చేస్తుంటాడు. అతనితో మాట్లాడితే ఏమైనా పని అవుతుందేమో అనిపించింది. ముందుగా ఈమె నుంచి అన్ని వివరాలు తెలుసుకోవాలి. ఆమె భర్త పేరు, ఏస్టేషన్లో పెట్టింది మొదలైనవన్నీ అడిగాను. ఆమె చెప్పిన వెంటనే మురళీకృష్ణకు ఫోన్ చేసాను. వెంటనే రెస్పాండ్ అయ్యాడు. విషయమంతా చెప్పి ఈమెకు సాయం చేయమని చెప్పాను. తప్పకుండా చేస్తానని మాటిచ్చాడు. డైరెక్టుగా తనున్న స్టేషన్‌కి రమ్మని అడ్రస్ ఇచ్చాడు. అలాగేనని చెప్పి ఆమెకా విషయాన్ని చెప్పాను.

"మీ మేలు జన్మలో మరిచిపోలేను సార్" అంది ఆనందంగా.

"నేనిప్పుడు ఇదే ట్రైయినులో హైదరాబదు వెళుతున్నాను లేకపోతే నేనే నిన్ను స్టేషన్‌కి తీసుకెళ్ళేవాడిని. నీదగ్గర డబ్బులేమిలేవు. నువ్వు స్టేషన్‌కి ఎలా వెళతావు. అలాగే నీభర్త, నువ్వు తిరిగి మీవూరెలా వెళతారు. ఈవెయ్యి రూపాయలు వుంచుకో. మీ ఆయన్ని ఇక్కడ వుంచకుండా నీతో తీసుకెళ్ళిపో. మీ వూళ్ళోనే ఏదో పని చేసుకుంటూ వుడండి. మీకూ మంచి రోజులొస్తాయి. అంతకీ మీరా వూళ్ళో వుండలేకపోతే నన్ను కలవండి మీ ఇద్దరికీ ఏదో పని చూడగలను. కష్టపడి పనిచేసేవాళ్ళకి పనులు దొరక్కపోవు సరేనా" అంటూ ఆమెకు నా విజిటింగ్ కార్డు,, వెయ్యి రూపాయలు ఇచ్చాను.

ఆమె కళ్ళనిండా సంతోషంతో కూడిన నీళ్ళు."నీభర్త విడుదలయిన వెంటనే నాకు ఫోన్ చెయ్యి" అలాగే అంటూ తలూపింది. అంతలో విజయవాడ స్టేషన్లో ట్రెయినాగింది. ఆమెను దిగమని చెప్పి పంపించేసాను. ఎందుకో మనసంతా హ్యాపీగా అన్పించింది.

ఎవరూ ఎవరినీ పట్టించుకోవడం లేదని అనుకోవడం ఎందుకు? కొందరైనా వుంటారుగా పట్టించుకునే వాళ్ళు అటువంటప్పుడు ఇలాంటి నిస్సహాయకులకు న్యాయం జరుగుతుందనిపించింది. అక్కడ నుంచి ట్రైయిన్ నెమ్మదిగా కదిలింది.

**(29-08-2022 జాగృతి వారపత్రికలో ప్రచురితం)**

* * *

# పండగ

“ **రే**పు చూస్తే పండగ, పిల్లలంతా కొత్త బట్టల్లేవని గొడవ చేస్తున్నారు.... వాళ్ళకేం చెప్పాలో తెలియడం లేదు” అంది శ్రీమతి.

బాధగా ఆమె వంక చూశాను.

“బట్టలనే కాదు పండగ పూట మంచి భోజనం కూడా వాళ్ళకు పెట్టలేక పోతున్నాను... తలుచుకుంటుంటేనే బాధగా వుంది” అంది మళ్ళీ.

ఆలోచనలో పడ్డాను. ఏం చేయాలి? చేతిలో చిల్లిగవ్వ లేదు. వారం రోజుల నుంచీ పని లేదు.నేను కార్పెంటరీ పని చేస్తుంటాను. అంతా రెడీమేడ్ వే కొనుక్కోవడం వల్ల మాకు పని చెప్పేవాళ్ళే వుండటం లేదు. ఏవైనా రిపేర్ వర్కులుంటే ఎవరైనా పిలుస్తుంటారు... అదీ ఎప్పుడైనా. అక్కడా, ఇక్కడా తీసుకున్న చిన్న, చిన్న అప్పులతో పచ్చడి మెతుకులతో రోజులు గడుస్తున్నాయి.

నిరాశగా, నిస్పృహగా అక్కడే వున్న కుర్చీలో కూలబడిపోయాను. కరెంటు బిల్లు కట్టలేదేమో ఫీజు తీసేసారు. ఫ్యాను తిరగని కారణంగా ఒళ్ళంతా చమట పట్టేసింది. అక్కడ వున్న పక్కింటి వాళ్ళ న్యూస్ పేపరుంటే తీసుకుని కాసేపు విసురుకున్నాను. పేపరు పేజీలు తిప్పాను. సగం పేజీల్లో ప్రకటనలే వున్నాయి. విపరీతమైన డిస్కౌంట్లతో బట్టలు తీసుకుపొమ్మని బట్టల షాపు వాళ్ళు, మీ పిల్లల భవిష్యత్తంతా మా చేతుల్లోనే వుంది బీమా స్కూల్లో చేర్చి మీరు నిశ్చింతగా వుండండని కార్పొరేట్ స్కూల్స్ వాళ్ళు విపరీతంగా ప్రచారం చేసేశారు. ప్రతిరోజు పేపర్లలో ఇదే గోల అని పేపరు పక్కన పడేశాను. మళ్ళీ ఆలోచనలు.... రేపేం చేయాలి?

పాపం పిల్లలు ఎంతో ఆశగా వున్నారు నేను కొత్త బట్టలు తెస్తానని. ఎలా తేవాలి? టక్కున నా మదిలో ఒక ఆలోచన మెరిసింది. శ్రీమతిని పిలిచి అలా చేస్తే ఎలా వుంటుందని అడిగాను..... ముందు ఆమె ఒప్పుకోకపోయినా ఒప్పించాను.తన సందేహాలను కూడా నివృత్తి చేశాను.

మా పిల్లల్ని కూడా పిలిచాను.నాకిద్దరు మగపిల్లలు.పెద్దాడికి పన్నిండేళ్ళు, చిన్నాడికి పదేళ్ళు.వాళ్ళకి కూడా ప్రస్తుత సమస్య చెప్పి రేపు పండగెలా చేసుకోవాలో కూడా చెప్పాను.ముందు వాళ్ళు డిస్సపాయింటయినా తర్వాత ఒప్పుకున్నారు.

తెల్లారింది. అంతా తలంటుకున్నారు.ఉన్నవాటిల్లో మంచి బట్టల్ని తీసి పిల్లలకిచ్చింది శ్రీమతి. నేనూ, శ్రీమతి కూడా బాగానే తయారయ్యాం. సరిగ్గా పది గంటల కల్లా ఇంటి నుంచి బయలుదేరి పెద్ద షాపింగ్ మాల్ కెళ్ళాం. అందులో బట్టల సెక్షన్ లోకి అడుగుపెట్టాం. అప్పుడే షాప్ తెరిచారేమో ఎక్కువగా జనం లేరు.'ఏం కావాలన్నాడు' సేల్స్ మాన్. పిల్లలకు బట్టలు చూపించమంది శ్రీమతి. అతను చాలా వెరైటీలు చూపించాడు. శ్రీమతి చెరో రెండు జతల్ని సెలక్టు చేసి ట్రయల్ రూముకి తీసుకెళ్ళి చెరో జత వేయించింది. వాళ్ళు బయటకొచ్చి నాకు చూపించారు. కాస్సేపు వాటితోనే ఆ షాపులో తిరిగి అద్దాలముందు నిలబడి వేసుకున్న బట్టల్ని చూసుకున్నారు.

రెండో జత కూడా వేసుకోమన్నాను. అది కూడా వేసుకొచ్చి నాకు చూపించారు. బాగున్నాయని చెప్పి తీసెయ్యమన్నాను. వాళ్ళు వాటిని తీసేసి పాత బట్టలు వేసుకొచ్చారు.

డిస్కౌంట్ ఎంతని అడిగాను. టెన్ పర్సంటిస్తామన్నాడు. అదేంటి ప్రతీ చోట ఫార్టీ పర్సెంట్, థర్టీ పర్సెంటని అంటుంటే ఇక్కడింత తక్కువేంటని అనడిగాను. అంతకంటే ఇవ్వలేమన్నాడు.ఫార్టీ పర్సంటివ్వమన్నాను. కుదరదన్నాడు.'పోనీ థర్టీ పర్సెంటయినా యివ్వమన్నాను. ఇచ్చేది లేదన్నాడు. అలా అయితే వద్దని చెప్పి,'పదండ్రా వేరే షాపు కెళదాం"అన్నాను.అంతా షాపు నుంచి బయటికొచ్చి పక్కనే వున్న ఇంకో షాపుకి వెళ్ళి అదే పని చేశాం.

అక్కడ నుంచి కదిలి ఓ కార్పొరేట్ స్కూలుకెళ్ళాం. సమయం పన్నెండు గంటలు దాటింది.

రిసెప్షనిస్ట్ వివరాలడిగింది. పిల్లలిద్దర్ని ఇక్కడ హాస్టల్లో వేయాలను కుంటున్నానని, మొత్తం. ట్యూషన్ ఫీజు,హాస్టలు ఫీజు ఎంతవుతాయో చెప్పమన్నాను. చాలా పెద్ద మొత్తం చెప్పిందామె.

హాస్టల్లో భోజనం ఎలా వుంటుందని అడిగాను. గతంలో వేరే స్కూల్లో చేరిస్తే అక్కడ హాస్టల్ భోజనం బాగోలేదని మాన్పించేశానని కూడా చెప్పాను.'ఇక్కడ భోజనం చాలా బాగుంటుందండి. మీరంతా ముందు వెళ్ళి భోజనం చేసి రండి'అని చెప్పి అటెండర్ ని పిలిచి డైనింగ్ హాలు చూపించమంది.

'మీకు భోజనం నచ్చితేనే ఇక్కడ చేర్చండి'అని కూడా చెప్పింది. డైనింగ్ హాల్లోకి ప్రవేశించాం. అప్పటికే అక్కడ చాలామంది పేరెంట్స్, పిల్లలు భోజనాలు చేస్తున్నారు.మేమంతా కడుపునిండా తిన్నాం. అడ్మిషన్ల టైము కావడంతో స్పెషల్ గా

అరేంజ్ చేశారు.

బయటకొచ్చి రిసెప్షనిస్ట్ కి నా అడ్రస్సు, పిల్లల వివరాలు ఇచ్చి రేపొచ్చి జాయిన్ చేస్తామని చెప్పి వచ్చాం.

పిల్లల ముఖంలో ఒక రకమైన ఆనందాన్ని గమనించాను.

"ఎలా వుందిరా పండగ"అనడిగాను.

"చాలా బాగుంది డాడీ!ఎప్పటికన్నా వెరైటీగా వుంది "అన్నారిద్దరూ.

"నేను కొంటే ఏదో మామూలుది చెరో జతా కొనేవాణ్ణి. మీరు ఏకంగా నాలుగు జతలు ఖరీదైనవి వేసుకున్నారు. అలాగే అమ్మ వండాల్సొస్తే అన్నీ వండలేదుగా.... కానీ ఇక్కడ మనం స్వీటు, బిరియానీతో స్పెషల్ భోజనం చేశాం"అన్నాను.

నేను చేసింది తప్పే. కానీ పిల్లల కోసం అలా చేయాల్సి వచ్చింది.

మా ఇంట్లో పండగ రోజు... అలా గడిచింది.

**('రేపటి కోసం'మాస పత్రికలో మార్చి, 2017 లో ప్రచురితం. ఈ కథ హాస్య కథల పోటీల్లో ప్రథమ బహుమతి పొందింది.)**

* * *

# మబ్బు తెర

**రా**ఘవరావుకి కోపంగా వుంది. చాలా బాధగా కూడా వుంది. ఏమిటీ జీవితమనుకున్నాడు. ఎందుకీ జీవితమని కూడా అనుకున్నాడు. చాలా విసుగ్గావుంది. ఎండలో నడిచి రావడం వల్ల చికాగ్గా కూడా వుంది. ఆరునెలల క్రితం తన జీవితం ఎలావుండేది. ఇప్పుడెలా మారింది ఆరునెలల్లో ఇంత మార్పా? మనిషి విలువ అంతేనా! అధికారం, డబ్బులు వుంటేనేనా గౌరవం. అవే వుంటే ఈ రోజిలా నడిచే పరిస్థితి వచ్చేది కాదేమో. ఇంట్లో అంతా ఎలా మారిపోయారో తలుచుకుంటుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఇంటి యజమాని ఆదాయం తగ్గిపోతే ఇచ్చే గౌరవం ఇలాగే వుంటుందా? అంటే తనింక ఎందుకూ పనికిరాని వాడా?

రాఘవరావు రిటైరయ్యి ఆరునెలలయ్యింది. కలెక్టరాఫీసులో సెక్షన్ సూపరిండెంట్‌గా పని చేసాడు. మొదటి అయిదు నెలలు బాగానే గడిచింది. అప్పుడు భార్య కావేరి, కొడుకు రాకేష్ కోడలు సుధ ఎంతో బాగా చూసుకునేవారు. కానీ నెలరోజుల నుంచే అందరి తీరూ మారిపోయింది. అంతా తననో శత్రువులా చూస్తున్నారు. ఒక్కసారిగా వాళ్ళలో అంత మార్పెందుకొచ్చింది. తనకు పెన్షన్ రూపంలో వచ్చే ఆదాయం సగానికి తగ్గిపోయింది. అయినా కొడుకు మంచి ఉద్యోగంలో వున్నాడు. బాగానే సంపాదిస్తున్నాడు. తన ఆదాయం మీదే ఆధారపడవలసిన పనిలేదు. అయినా మరి తననో భారంగా ఎందుకు చూస్తున్నారు. భార్య కావేరికి తనంటే ప్రాణం. రిటైరయ్యేవరకు తననెంతో బాగా చూసుకునేది. ఈ మధ్య ప్రతీదానికి విసుక్కోవడం, తిట్టడం చేస్తుంది. రాకేష్ లేక లేక పుట్టాడేమో ఎంతో గారాబంగా, ప్రేమగా పెంచాడు. కోరుకున్న చదువు చెప్పించాడు. మంచి ఉద్యోగం వచ్చేలా చేసాడు. ప్రేమించినమ్మాయినిచ్చి పెళ్ళిచేసాడు. వాడికీ తనంటే అమితమైన ప్రేమ. కోడలు సుధ చాలా మంచి పిల్ల, ఆ అమ్మాయికి తండ్రి లేడు. తనలో తండ్రిని చూసుకుంది. తనూ ఆమెకు తండ్రి ప్రేమను పంచాడు. ఆ అమ్మాయి కూడా తనని బాగా చూసుకునేది. మరిప్పుడు అంతా అలా ఎందుకు మారిపోయారు.

రాఘవరావుకో అనుమానం వచ్చింది. తన గురించి ఎవరైనా ఇంట్లో వాళ్ళకి చెడుగా చెప్పివుంటారా. అయినా తనెప్పుడూ ఎలాంటి చెడ్డపని చేయలేదే. ఉద్యోగంలో

తనెంతో నిజాయితీగా పనిచేసాడు. తన నిజాయితీ పెద్దపెద్ద కాంట్రాక్టర్లకు ఇబ్బందిగా మారేది. లంచాలివ్వచూపేవారు. అయినా తాను లొంగేవాడు కాదు. వాళ్ళలో ఎవరైనా తన మీదకక్షకట్టి కుటుంబంలో కలతలు రేపడానికి ప్రయత్నిస్తున్నారా. ఓసారి తన ఆఫీసులో పని చేసే అటెండరు సింహాచలం తనింట్లో లేనప్పుడు వచ్చి వెళ్ళాడని భార్య చెప్పింది. వాడికి తనంటే పడదు. ఆఫీసులో పైరవీలు చేసే వాడు. వాడి ఆటలు సాగనిచ్చేవాడుకాదు. ఒకవేళ వాడు లేనివీ, వున్నవీ చెపితే మాత్రం వీళ్ళు నమ్మెయ్యడమేనా.

రాఘవరావుకి తెల్లారి లేచిన వెంటనే వేడివేడి స్ట్రాంగ్ కాఫీ తాగడం అలవాటు. తనులేచి బ్రష్‌చేసుకొచ్చేసరికి కోడలు మంచి కాఫీతో రెడీగా వుండేది. అలాంటిది ఇప్పుడు కాఫీ అడిగితే విసుక్కుంటుంది. అప్పటికీ మనసు చంపుకుని అడిగినా చల్లారిపోయిన, పల్చని లైట్ కాఫీ ఇస్తుంది. అది తాగాలనిపించేది కాదు. తాగక తప్పేది కాదు. తాగకపోయినా వూరుకునేవారు కాదు.

కావేరి వంటంటే తనకెంతో ఇష్టం. తనకిష్టమైనవన్నీ చేసిపెట్టేది. కాని ఇప్పుడు రుచీ, పచీ లేని వంటలు చేసి పెడుతుంది. తినలేకపోతున్నాడు. తినకపోతే వూరుకోవడంలేదు. బలవంతంగా తినవలసి వస్తుంది. రాకేష్ అయితే డాడీ... డాడీ అంటూ తనచుట్టూ తిరిగేవాడు. ప్రతీది తనతో షేర్ చేసుకునేవాడు. ఇప్పుడయితే మాట్లాడటం మానేసాడు. మాట్లాడాలని ట్రైచేసినా సరిగ్గా సమాధానం చెప్పేవాడు కాదు. అట్లాంటప్పుడు తనకి ప్రపంచమంతా గిర్రున తిరిగినట్లనిపిస్తుంది.

ఈరోజు ఉదయం ఎలా విసుక్కున్నాడని. తనెప్పుడూ వూహించలేదు. వాడలా మాట్లాడతాడని. రైతుబజారుకెళ్ళడానికి తన చేతక్ స్కూటర్ని స్టార్ట్‌చేస్తే స్టార్టవ్వలేదు. టేంకులో చూస్తే చుక్కపెట్రోలు లేదు. మొన్ననే చెప్పాడు పెట్రోలు అయిపోవచ్చింది కొట్టించరా అని. కొట్టించినట్లు లేదు. అంత దూరం నడవడం కష్టం. పెట్రోలు బంకు కూడా దూరమే. వాడికి చెబుదామని వాడి బెడ్ రూము దగ్గరకెళితే వాడింకా లేవలేదు. లేపి విషయం చెపితే “పెట్రోలు లేక పోతేనేం రెండు కాళ్ళున్నాయి కదా నడిచి పోవచ్చుగా” అన్నాడు. ఆ మాటకు తనకి కలిగిన బాధ అంతా ఇంతాకాదు. ఏం చేయలేక నడిచి బయలుదేరాడు.

రైతుబజారుకి ఇంటికి ఒకటిన్నర కిలోమీటర్లుంటుంది. రాను, పోను మూడు కిలోమీటర్లు నడవాలి. తమ వీధిలో ఆటోలు కూడా దొరకవు. ఇకవేళ దొరికినా వెళ్ళడానికి ఏబయి, రావడానికి ఏబయి తీసుకుంటారు. అలవాటులేని నడక వలన

చాలా ఆయాసంగా, చికాగ్గా వుంది. తెచ్చిన కూరగాయల సంచిని వంట గదిలో పెట్టాడు.

"అయ్యో! కొత్తిమీర, కరివేపాకు తెమ్మని చెప్పడం మరిచాను. అవి లేకపోతే కూరలేం బాగుంటాయి చెప్పండి. అయినా వాటిని తెమ్మని చెప్పాలా ఏంటి. కాస్త కరివేపాకును కొసరిమ్మన్నా ఇస్తారు. సర్లే రేపెళ్ళి తెద్దురుగానిలెండి" అంది కావేరి.

ఎప్పుడూ అంతే ఏంకావాలో పూర్తిగా చెప్పదు. ఓరోజు అల్లం చెప్పడం మరిచానంటుంది. మరో రోజు ఆకుకూరలు మరిచానంటుంది. వారానికి సరిపడా ఒకేసారి తెచ్చుకుని ఫ్రిజ్‌లో పెట్టుకుంటే రోజూ వెళ్ళనవసరం లేదు. కాని అలా ఒప్పుకోదు, ఫ్రెష్‌గా వుండవంటుంది. ఇంచుమించు వారంలో అయిదు రోజులు రైతుబజారుకు పంపుతుంది ఏదో కక్షకట్టినట్లు. ఏదైనా చెప్పబోయినా కయ్‌మంటూ మీదమీదకొస్తుంది. అందుకే తాను కామ్‌గావుంటున్నాడు.

స్నానం చేసొచ్చి టిఫిన్ కోసం డైనింగ్ టేబుల్ దగ్గర కొచ్చాడు. అప్పటికే రెండు అట్లు, పేరు తెలియని చట్నీ సుధ తెచ్చి పెట్టింది. వాటిని చూస్తునే నీరసమొచ్చింది. నోట పెట్టబుద్ధి కాలేదు. చప్పచప్పగా తింటే వాంతోచ్చేలా వున్నాయి. ఏదోటి తినాలి కాబట్టి తిన్నాననిపించి అక్కడ నుంచి గదిలో కొచ్చి మంచం మీద నడుం వాల్చాడు. మామూలుగా ఉదయం టిఫిన్ చేసిన వెంటనే టీ తాగడం అలవాటు. ఇప్పుడెవరూ ఇవ్వడం లేదు. తనూ అడగటం లేదు. పడుకున్నాడన్న మాటే గాని ఏవేవో ఆలోచనలు. అందరి ప్రవర్తన చూస్తుంటే తనకనిపిస్తుంది తనని ఇంట్లోనుంచి పంపెయ్యాలని ప్రయత్నిస్తున్నారేమోనని. తనంత భారమైపోయాడా వాళ్ళకి. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పోనీ వాళ్ళు పంపే వరకు ఎందుకు తనే వెళ్ళిపోతే! ఎక్కడికని పోతాడు. ఎవరున్నారని. తనకుటుంబమే సర్వస్వమనుకుని అందరికీ దూరమయ్యాడు. ఇంక పైకే పోవాలి మరి. అలాపోవాలంటే ఎంతోధైర్యం వుండాలి. అంత ధైర్యం వుందా తనకి?

మధ్యాహ్నం లంచ్ తర్వాత కాస్సేపు నిద్రపోయి లేచే సరికి నాలుగు కావొస్తుంది. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. రాకేష్ ఆఫీసుకెళ్ళాడు. ఇంట్లో కావేరి, సుధా వున్నారు. వాళ్ళుకూడా వున్న జాడలేదు. ఎక్కడికెళ్ళు0టారబ్బా అనుకుంటూ ఇల్లంతా చూసి పెరట్లో కొచ్చాడు. పెరట్లో పెద్ద ఖాళీ స్థలముంది. అందులో అత్తాకోడళ్ళిద్దరూ అక్కడున్న కలుపు మొక్కల్ని పీకుతూ. చిన్నచిన్నగోతులు తీసి వాటిలో పూలమొక్కల్ని నాటుతున్నారు. పెద్ద రబ్బరు ట్యూబు తెప్పించినట్టున్నారు అక్కడున్న నీళ్ళ పంపుకి బిగించారు.పోనీలే పెరడంతా ఇలాగైనా సార్థకమవుతుందికదా అనుకుంటూ హాల్లోకొచ్చి

టీ.వి. పెట్టుకున్నాడు.

"అత్తయ్యా! మనం నాటిన మొక్కలకి లైటుగా ట్యూబుతో వాటర్ పెడతాను" సుధ అనడం వినిపించింది.

"నువ్వేం పెడతావు లేమ్మా. మీ మామగారు ఖాళీగానే వున్నారుగా ఆయనకు చెప్పు ఆయనపెడతారు" అంది కావేరి. టీ.వి. ముందు నుంచి లేవక తప్పలేదు. ఆరోజే కాదు ప్రతీరోజు సాయంకాలమప్పుడు అదే పని. గానుగెద్దు జీవితమైపోయింది. ఇంట్లో అంతాగంభీరంగా వుంటున్నారు. ఓ సరదాలేదు ఓ ముచ్చటా లేదు. ఇంతకు ముందేలా వుండేదని. సందడి సందడిగా వుండేది. మరిప్పుడు దానికి భిన్నంగా వుంటుంది.

రోజులు... వారాలు... మరో మూడు నెలలు అలాగే జరిగిపోయినాయి. ఓ ఆదివారం ఉదయం రాఘవరావు రైల్వేస్టేషన్‌కి బయలు దేరాడు. తనతో పనిచేసి రిటైరయిన రంగారావు ఫోన్ చేసి ఈరోజు రత్నాచల్ ఎక్స్‌ప్రెస్‌లో వైజాగ్ వెళుతున్నాని, రాజమండ్రిలో ట్రెయిన్ మూడు, నాలుగు నిమిషాలు ఆగుతుంది కదా తను స్టేషన్ కొస్తే చూసినట్లు, పలకరించినట్లు వుంటుంది కదా వీలయితే రమ్మని చెప్పాడు, తను కలవాలనే వెళుతున్నాడు. రంగారావు తన ప్రాణ స్నేహి తుడు. తనకి వాణ్ణి చూడాలనే వుంది. అందుకే బయలుదేరాడు. ఫ్లాట్ ఫాం టికెట్ తీసుకుని రెండో నెంబురు ఫ్లాట్ పాంమీదకు వచ్చాడు.

"హల్లో రాఘవరావుగారూ" అనే పిలుపు వినబడే సరికి వెనక్కి తిరిగిచూసాడు. అక్కడ సుధాకర్‌గారు వున్నారు.

"సార్ మీరా నమస్తే ఏంటి ఇక్కడ"

"మా అమ్మాయి, అల్లుడు వైజాగ్ వెళుతుంటే ట్రైయిన్ ఎక్కించడానికొచ్చాను. మరి మీరు."

"మా ఫ్రెండొకడు వైజాగ్ వెళుతూ స్టేషన్లో కలవమంటే వచ్చాను సార్."

"అయితే ఇద్దరం ఒకే ట్రైయిన్ కోసం చూస్తున్నామన్నమాట. అవునూ మనం కలిసి మూడు నెలలయ్యింది కదూ. ఎలా వుందిమీ రిటైర్‌మెంట్ జీవితం" అడిగారాయన.

ఏం మాట్లాడలేకపోయాడు. మామూలుగానవ్వి "బాగానే వున్నాను సార్"

"అప్పటి కన్నా మీలో కొంచెం మార్పు కనిపిస్తుంది." అన్నారాయన నవ్వుతూ. అంతలో ట్రైయిన్ రావడంతో అక్కడి నుంచి కదిలారు. ట్రైయిన్ అయిదునిముషాల్లో

కదిలింది. ఇద్దరూ బయటకి నడిచారు. సుధాకర్ గారు కారు స్టార్ట్ చేస్తూ రాఘవరావుని పిలిచి డ్రాప్ చేస్తాను కారెక్కమన్నారు. కాదనకుండా కారెక్కాడు రాఘవరావు.

– – –

ఇంటికి కొంచెందూరంలో కారులో నుంచి దిగి ఇంటి వైపుకి అడుగులేసాడు రాఘవరావు, ఇంటిని చూస్తుంటే అతని కళ్ళు నీళ్ళతో నిండి పోయాయి. కళ్ళు తుడుచుకుని వీధి గుమ్మం దగ్గరకు నెమ్మదిగా చేరుకున్నాడు. లోపలి నుంచి మాటలు వినిపిస్తున్నాయి. కిటికీ తలుపుల్ని కొద్దిగా తీసాడు. లోపలహాల్లో కావేరి,రాకేష్ సుధలు మాట్లాడు కుంటున్న మాటలన్నీ విన్నాడు. అతని దు:ఖం మరింత పెరిగిపోయింది. అక్కడే వున్న కుర్చీలో కూలబడిపోయాడు.

అప్పుడు స్టేషన్ నుంచి తిరిగి వస్తున్నప్పుడు కారులో సుధాకర్ గారితో మాట్లాడినప్పుడు ఆయన మాటలు గుర్తుకొచ్చాయి.

"రాఘవరావు గారూ మీరు చాలా అదృష్టవంతులండీ. దేవతలాంటి భార్య, రత్నంలాంటి కొడుకు, కూతుర్ని మరిపించిన కోడలు వుండటం ఎవరికి దొరుకుతారు చెప్పండి. వాళ్ళంతా మీరు రిటైరయ్యాక మిమ్మల్ని ఎంత జాగ్రత్తగా చూసుకున్నారో మీకు తెలీదు. మీరొకసారి కళ్ళుతిరిగి పడిపోయినప్పుడు మిమ్మల్ని మీవాళ్ళు నా క్లినిక్‌కు తీసుకొచ్చారు గుర్తుందా" అన్నారు డాక్టర్ సుధాకర్ గారు.

"అవును గుర్తుంది అప్పుడు మీరు అన్ని టెస్ట్‌లు చేసి ప్రోబ్లమ్ ఏదీలేదని చెప్పారుగా"

"చెప్పాను. కానీ అలా చెప్పకపోతే మీ ప్రాబ్లమ్స్ ఇంకా పెరిగిపోతాయని అలా చెప్పాల్సివచ్చింది. మీకు చేసిన టెస్టులు పరిశీలిస్తే మీకు సుగర్ ఇప్పుడిప్పుడే పెరగడం మొదలయింది. కొలస్ట్రాల్ లెవెల్స్ కూడా పెరుగుతున్నాయి. హెచ్.డి.ఎల్, ఎల్.డి.ఎల్‌లు వుండవలసిన విధంగాలేవు. ట్రైగిజరైడ్స్ కూడా పెరుగుతున్నాయి. హార్ట్ కూడా వీక్‌గా వుంది. ఈ విషయాలన్నీ మీకు చెప్పకుండా మీ కుంటుంబ సభ్యులతో సంప్రదించాను. ఈ సంగతి తెలిస్తే మీరు తట్టుకోలేరని టెన్షన్ పడతారని తెలియడం మంచిది కాదని మీకు చెప్పలేదు. అన్నీ ప్రాధమిక దశలోనే వున్నాయి కాబట్టి డైటింగ్, వాకింగ్, ఎక్స్‌ర్‌సైజుల ద్వారా వాటిని నార్మల్ కి తీసుకురావడానికి ప్రయత్నించాను.

ఒక్కసారిగా మీచేత ఆ పనులు చేయించడం సాధ్యం కాదు. మీ వాళ్ళంతా వాళ్ళ పాత్రల్ని మిమ్మల్ని బాధ పెట్టి మరీ పోషించారు. ఆ సందర్భంలో మీ వాళ్ళు మీకంటే ఎక్కువ బాధపడేవారు. మీ గురించి నేను అప్పుడప్పుడు ఎంక్వయిరీ చేస్తుండేవాడిని. ఎందుకంటే మీ రాకేష్ మా అబ్బాయి స్నేహితులు. మీ ఆరోగ్యం

విషయంలో మా వాడు కూడా ఆతృత పడేవాడు. ఇప్పుడు మీరు నాతో హాస్పిటల్‌కి రండి. మీకన్నీ టెస్టులు చేస్తాను. రిజల్ట్స్ బాగానే వుండొచ్చని అనుకుంటున్నాను" అంటూ ఆయన హాస్పటల్‌కి తీసుకెళ్ళి అన్ని టెస్ట్‌లు చేసారు. రిపోర్టులన్నీ నార్మల్‌గానే వున్నాయి. "మంచి రిజల్ట్. ఇలాగే మీరు వాకింగ్, డైటింగు చేస్తూ వుండండి. మందులు వాడకుండానే మీకు నయమవుతుంది" అని చెప్పి డ్రైవర్నిచ్చి ఇంటికి పంపించారు.

తన ఆరోగ్యం కోసం తనకుటుంబ సభ్యుల తపన తలుచుకుంటుంటే తనెంతో మూర?ంగా వారి గురించి ఆలోచించాడు కదా. ఇప్పుడు వాళ్ళులోపల ఏడుస్తూ తనని క్షమించమని కోరుకోవాలని మాట్లాడుకుంటున్నారు. అంటే డాక్టరు గారు వీళ్ళకి ఫోన్ చేసి చెప్పారన్నమాట. వాళ్ళందర్నీ తనే క్షమించమనిఅడగాలి అనుకుంటూ కాలింగ్ బెల్ నొక్కాడు. తలుపు తెరుచుకున్నా వెంటనే లోపలి కడుగేసి ఎదురుగా నిలబడివున్న ఆ ముగ్గుర్ని చూసాడు. అందరి కళ్ళలోను నిండుగా నీళ్ళు.

తన రెండు చేతుల్ని చాచి వాళ్ళని రమ్మని సైగ చేశాడు. వాళ్ళు ముగ్గురు ఒక్కసారిగా వచ్చి ఆయన్ని అల్లుకుపోయారు. "క్షమిం..."రాఘవరావు నోటిని కావేరి చేత్తో మూసి 'అంతమాట అనకండి'అన్నట్లు ఆయన ముఖం వంక చూసింది. ఆయన ముఖంలో ఆనందం తాండవించింది.

**(సహరి అంతర్జాల వార పత్రికలో ప్రచురితం)**

* * *

# కొబ్బరాకు సాక్షిగా ....

**మా** కోనసీమకీ అందాలు కొబ్బరితోటలు, పచ్చని పంట చేలు, చక్కని ప్రకృతి వనరులవల్లే కాదు ఇక్కడుండే అందమైన అమ్మాయిల వల్ల కూడా చేకూరాయి తెలుసా?" అందమైన పలువరుస ముత్యాల్లా మెరుస్తుంటే కెంపు రంగులో వున్న పెదాలనుంచి వచ్చే నవ్వును ఆపుకుంటూ అంది నందిని.

"అంటే నువ్వు అందగత్తెనని చెప్పుకుంటున్నావన్నమాట" కవ్విస్తూ అన్నాడు హరీష్.

"మరి కాదా!!"

"నువ్వలా అనుకుంటున్నప్పుడు నేను కాదంటే నన్ను బ్రతకనిస్తావా" అంటూ నవ్వాడు.

"అంటే నేను నీకెలా కన్పిస్తున్నాను" బుంగమూతి పెట్టుకుంటూ అంది నందిని.

"కోనసీమ అందాలన్నీ కలబోసుకుని నాకోసం పుట్టిన ఒక అపురూపమైన సౌందర్య రాశిలా కన్పిస్తున్నావు" అన్నాడు హరీష్.

పకపకా నవ్వింది నందిని. ఆ నవ్వులో కొత్త అందాలను వెతుక్కుంటున్నాడు హరీష్.అందమైన కోనసీమ ప్రాంతం. గోదావరి ఒడ్డు. సాయంసమయం. చుట్టూ కొబ్బరితోటలు. సాయంకాలపు నీరెండ వీళ్ళిద్దరి మీద పడి బంగారంలా మెరుస్తుంది. ఇసుకలో గోదారి అలలు తాకేటట్టుగా కూర్చున్నారిద్దరూ. గోదార్లోని చల్లని నీళ్ళు కాళ్ళకు తగులుతుంటే చక్కని అనుభూతిని పొందుతున్నారు.

"ఇంత అందాల రాశి నా ప్రియబాంధవి అనుకుంటే నాకెంత గర్వంగా వుంటుందో తెలుసా" అన్నాడు హరీష్. "అంటే నా అందాన్ని చూసే ప్రేమించావన్నమాట. నాలో ఇంకేం చూడలేదా" అంది సీరియస్‌గా మొహం పెట్టి.

"ఎందుకు చూడలేదు నీలో ఒక్క అందమేమిటి ,అవయవ సంపద కూడా బాగుంటుంది కదా. పైనుంచి కింద వరకు అన్నీ కన్నులకు విందు చేస్తుంటాయి" అన్నాడు సీరియస్‌గా ముఖం పెట్టి, "నువ్వూ..." అంటూ చెయ్యెత్తి కొట్టడానికొస్తున్నట్టు పైకి లేచింది.

"రా...రా..." అంటూ రెండు చేతులు ముందుకు చాచాడు హరీష్ నవ్వుతూ.

తనూ నవ్వుతూ కూర్చుండి పోయింది.గోదావరి మీద నుంచి వస్తున్న చల్లనిగాలి వాళ్ళిద్దరి మనసుల్ని గిలిగింతలు పెడుతుంది. అంత ఆహ్లాదకరమైన వాతావరణంలో వాళ్ళు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

"నందూ" ముద్దుగా పిలిచాడు హరీష్.

"ఊ"

"జీవితమంతా ఇలా ఆనందంగా నీతో గడిపెయ్యాలని వుంది నందూ"

"నేను కోరుకునేదీ అదే హరీష్. అందుకే కదా నిన్ను మా వాళ్ళకి పరిచయం చెయ్యాలని పిలిపించింది."

"నిజంగా నీ తల్లిదండ్రులు చాలా సంస్కారవంతులు నందూ, లేకపోతే నన్ను మీ ఇంటికి అల్లుడిగా అంగీకరిస్తాననుకోలేదు. నువ్వు మీ వాళ్ళకి ఒక్కగానొక్క గారాలకూతురివి. నీ అందం, మీ ఆస్తిపాస్తులు, మీ కుటుంబ పలుకుబడి నా కంటే ఉన్నతుణ్ణి నీకు తెచ్చివ్వగలవు. అయినా నువ్వు కోరుకున్నావని ఎటువంటి ఆస్తులు లేని, యూనివర్సిటీలో పాఠాలు చెప్పుకునే ఓసాధారణ ఉద్యోగిని ఒప్పుకోవడం చాలా గొప్ప విషయం నందూ."

"ఆ విషయంలో నేనూ చాలా అదృష్టవంతురాలిని హరీష్. నా సెలెక్షనెప్పుడూ ఖచ్చితంగా వుంటుందని వాళ్ళకి తెలుసు. నేనునీ దగ్గరయితే జీవితాంతం హాయిగా వుంటానని నీతో మాట్లాడాక మా వాళ్ళకి నమ్మకం కలిగింది. ఆస్తులెందుకు హరీష్ మాకు లేకపోతే కదా. మా ఆస్తుల కంటే మంచి మనసు నీకుంది. అది చాలదా నాకు. అయినా నీకేం తక్కువని,అధిక విద్యావంతుడవి, పి. హెచ్.డి సాధించావు.యూనివర్సిటీలో ప్రొఫెసర్ స్థాయి ఉద్యోగం చేస్తున్నావు. నీతో పాటూ నేనూ రీసెర్చిలో చేరినా నా పి.హెచ్.డి పూర్తికాలేదు గానీ నీది పూర్తవ్వడం, ఉద్యోగం రావడం చకచకా జరిగిపోయాయి కదా".

"నిజమే నందూ అది నా అదృష్టం. ఆ మాత్రమైనా లేకపోతే నిన్ను పొందే అర్హత నాకుండదు కదా. నీదెంత ఇంకో ఆరునెలలు కష్ట పడితే అయిపోతుంది మన పెళ్ళయితే మనముండేది వైజాగ్‌లోనే కాబట్టి నీ రీసెర్చికేమీ ఆటంకం వుండదు. నీ పి. హెచ్.డి కూడా అయిపోతే మనిద్దరం ఒకేచోట ఉద్యోగాలు చేసుకుంటూ హాయిగా వుండొచ్చు" అన్నాడు నవ్వుతూ. తనూ నవ్వింది.

"ఇంక వెళదాం మనకోసం ఎదురు చూస్తుంటారు మావాళ్ళు" అంటూ పైకి లేచింది నందిని.

ఇద్దరూ నడుస్తున్నారు. తాము నడుస్తున్న కంకర రోడ్డుకిరువైపులా నాటిన కొబ్బరి చెట్ల ఆకుల నుంచి గాలి చల్లగా వీస్తుంది.

"అవునూ ఈ రోడ్డు ప్రక్కన ఆ గొట్టాలు, పైపులు ఏంటి అసహ్యంగా ఓపద్దతి పాడూ లేకుండా వున్నాయి. అదోరకమైన దుర్వాసన కూడా వస్తుంది" అన్నాడు హరీష్,

"అవా ఓ.ఎన్.జీ.సి వాళ్ళ గేస్ పైపులు. గేస్ సరఫరా అంతా అందులోనుంచే అవుతుంది. మా కోనసీమలో నిధినిక్షేపాలుకూడా వున్నాయి తెలుసా!"

"నిజమే అవేకాదు ఇక్కడున్న అమ్మాయిల్లో కూడా వుండాల్సిన నిధినిక్షేపాలు బోలెడున్నాయి మరి" అన్నాడు నవ్వుతూ ఆమె ఒంటిని పైనుంచి కిందవరకు చూస్తూ.

"ఊ అబ్బాయి గారికి మాటలు బాగా వచ్చే" అంది నవ్వుతూ.

"అవును నందూ గేస్ ఎంతో ప్రమాదకరమైనది కదా. ఈ గొట్టాల్ని చూస్తుంటే ఎంతో నిర్లక్ష్యం కన్పిస్తుంది. ఏదైనా జరిగితే ఇక్కడెంత నష్టమో కదా."

"అవును ఓ సారి పేద్ద బ్లోఅవుట్ జరిగింది. ఓసారి గేస్‌లీకయి పెద్ద ప్రమాదం జరిగింది. అయినా వాళ్ళ నిర్లక్ష్యానికి అంతే లేకుండా పోయిందనుకో. ఏదైనా సమస్య వచ్చినప్పుడే కొంచెం కదలిక కన్పిస్తుంది. ఆ తర్వాత మామూలే"

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి చేరుకున్నారు. హరీష్‌కి ప్రత్యేకంగా అవుట్ హౌస్‌లో రూము ఏర్పాటు చేసారు. ఆరోజు ఉదయమే తన వూరైన వైజాగ్ నుంచి అక్కడకు చేరుకున్నాడు వాళ్ళ ఆహ్వానం మేరకు. హరీష్ అందం, అణకువ నందిని తల్లిదండ్రులకు బాగా నచ్చాయి. అతని తల్లిదండ్రులతో మాట్లాడి మంచి ముహూర్తం చూసి పెళ్ళిచేయాలని నిర్ణయించుకున్నారు.

– – –

రాత్రి పదిగంటల సమయం. కొబ్బరితోటల్లోంచి చల్లనిగాలివీస్తుంది. ఆ తోటల మధ్య ఓ అందమైన కుటీరంలో శోభనం ఏర్పాటు చేసారు. గదంతా అందంగా అలంకరించారు. ఆగదిలో వాళ్ళిద్దరూ తప్ప ఇంట్లోగాని, బయట గానీ ఎవరూ లేరు. వాళ్ళకు ఏకాంతం కల్పించాలని పూజాతంతు ముగిసాక ఇళ్ళకు వెళ్ళిపోయారు. అక్కడకి కిలో మీటరు దూరంలో వుంటుంది వూరు. తోటల మధ్యన ఆ చిన్న ఇంటిని కుటుంబ సభ్యులొచ్చి అక్కడ కాస్సేపు గడపడానికి కట్టించారు నందిని తండ్రి. ముందు రాత్రే హరీష్, నందినికి ఇరుపెద్దల సమక్షంలో అంగరంగవైభవంగా పెళ్ళి జరిగింది. ఈ రాత్రి శోభనం ఏర్పాటు చేసారు.

అంత వరకు స్నేహితులుగా, ప్రేమికులుగా ఎంతో క్లోజ్‌గావున్న ఆ ఇద్దరూ పెళ్ళయి, భార్యా భర్తలయ్యాక మొదటి రాత్రి ఏకాంతంగా వున్నా సరే ఏదో బిడియం, టెన్షన్‌గా వున్నట్లున్నారు. మల్లెలు, గులాబీలతో అందంగా అలంకరించిన ఆడబుల్ కాట్ బెడ్ మీద ఓమూలన తెల్లని పట్టుచీర కట్టుకుని తలనిండా మల్లెలు, సంపెంగలతో తలవంచుకుని కూర్చున్న నందినిని చూస్తుంటే నవ్వాగింది కాదు హరీష్‌కి.

గట్టిగా నవ్వేసాడు కూడా.

"ఎందుకలా నవ్వుతావ్" చిరు కోపంగా అడిగింది.

"నవ్వక ఎప్పుడూ డబ్బాలో రాళ్ళేసినట్లు బడబడావాగే నువ్వు అలా సిగ్గుపడుతూ మూగనోము పడితేను."

"నేనిప్పుడు శోభనపు పెళ్ళికూతుర్ని తెలుసా?సిగ్గుపడుతూ వుండాలి మరి"

"అదెలా పోతుందో మరి"

"అది నీచేతుల్లోనే వుందిగామరి" అని దీర్ఘం తీసింది. కాస్సేపు మౌనంతర్వాత ఇద్దరూ ఫెళ్ళున నవ్వారు. ఆ నవ్వు కొన్ని సెకన్లపాటు అక్కడి మౌనాన్ని భంగపరిచింది.

"నందూ! " అంటూ ఎంతో ఆర్తిగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. గువ్వలా అతని గుండెలపై వాలిపోయింది.

"హరీ! ఇప్పుడు నాకెంత ఆనందంగా వుందో చెప్పలేను. ఈ ఆనందాన్ని జీవితాంతం నీ సమక్షంలో ఇంతకన్నా ఎక్కువగా మూట కట్టుకోవాలనుకుంటున్నాను. నా కోరిక నిజమవుతుంది కదూ" అంటూ అతన్నింకా కరుచుకుపోయింది.

"నీకెందుకొచ్చిందా అనుమానం నువ్వూ నేనూ వేరు అనే ఆలోచనే నాకు లేదు. నా హృదయంలో నువ్వు తప్ప ఇంకెవ్వరూ వుండరు తెల్సిందా. నా ప్రేమ, ఆనందం నువ్వే నందూ" అంటూ ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుని నుదుటి మీద ముద్దుపెట్టుకుని, కవ్విస్తున్న ఆమెపెదాలను అందుకుంటున్న సమయంలో ఓ పెద్దమెరుపు... దాని వంక చూస్తుంటే కళ్ళు పేలిపోయేటంత వెలుగు... పెద్ద పెద్ద శబ్దాలు... ఊరంతా అంటుకుపోయిందా అన్నట్టు పెద్ద పెద్ద మంటలు. చటుక్కున ఆమెను వదిలేసి చేష్టలుడిగినవాడిలా బయటకి చూస్తుండిపోయాడు, ఎందుకలా వదిలేసాడా అని బిత్తరపోయి అతను చూస్తున్నవైపు చూసింది. కిటికీలోనుంచి బయటి దృశ్యాన్ని చూసి బెంబేలెత్తిపోయింది. తమ ఇంటివైపు పరుగెత్తి కొస్తున్నట్లు మంటలు. కొబ్బరాకులు కాలిపోతున్నాయి. చెట్లు పడిపోతున్నాయి. ఊళ్ళోనుంచి అరుపులువినిపిస్తున్నాయి.

"పారిపోండి... పారిపోండి... గేస్ పైపులు లీకయి ఫైరయ్యింది... పారిపోండి" అంటూ జనాలు అరుచుకుంటూ వస్తున్నారు.

పైపులన్నీ ఊళ్ళోనుంచి కాకుండా పొలాల వైపువుండటంతో మంటలన్నీ ఇటే వస్తున్నాయి. తామిక్కడ ప్రమాదంలో వున్నామని గ్రహించి అరుస్తున్నారనుకున్నాడు హరీష్. అంతలో తామున్న గదికున్న కిటికీవైపు పెద్ద శబ్దం చేసుకుంటూ మంటలు రావడంతో నందిని కెవ్‌మని అరిచి స్పృహతప్పి పోయింది.

ఒక్క క్షణం హరీష్‌కేం తోచలేదు. వెంటనే గది తలుపులు తీసి నందిన్ని పైకెత్తి భుజాన వేసుకుని అక్కడ నుంచి పరుగందుకున్నాడు. వెనుకనుంచి వేడి సెగలు. మంటలు తమను తరుముతున్నాయా అన్నట్లుంది పరిస్థితి. అదే పరుగు... అదే వేగం... గేస్ పైపులుండే రోడ్ వైపు కాకుండా తోటలు, చేలగట్లు మీద నుంచి పరుగుపెడుతున్నాడు. తనో ఏభై కేజీల బరువున్న వ్యక్తిని మోస్తున్నాననే భావన లేకుండా అక్కడ నుంచి సాధ్యమైనంత దూరం వెళ్ళి పోవాలని పరుగు పెడుతున్నాడు. అలా ఎంత సేపు పరుగెత్తాడో తెలీదు. పరుగెత్తి పరుగెత్తి స్పృహ తప్పి పడిపోయాడు హరీష్. భుజంమీదున్న నందిని కూడా అతని నుంచి జారిపోయింది.

\- - -

మెలుకువ వచ్చేసరికి అంతా అగమ్యగోచరంగా వుంది. తనెక్కడున్నాడో తెలియలేదు. చుట్టూ జనం. అందరి ముఖాల్లోను ఒక రకమైన ఆందోళన. జరిగిన ఒక్కొక్క సంఘటన గుర్తుకొస్తుంది హరీష్‌కి. ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాడు,నందిని గుర్తొచ్చిన వెంటనే. నందినికేమయ్యింది? అప్పుడు స్పృహతప్పిపోయింది. చుట్టూచూసాడు,ఎక్కడా కన్పించలేదు. హరీష్‌కి మెలకువ రావడంతో అక్కడ కలకలం మొదలయ్యింది. నందిని తండ్రి అతని మంచం దగ్గరకొచ్చి, "బాబూ రాత్రి చాలా పెద్ద అగ్ని ప్రమాదం జరిగింది. మీరున్న కొబ్బరితోటకు కొంచెం దూరంలో గేస్ పైపులైను లీకయి ఫైరయ్యింది. జనాలు మిమ్మల్ని అప్రమత్తం చేయడంతో మీరా ఇంట్లోనుంచి బయటపడ్డారు. చేలగట్ల మధ్య పడిపోయిన మిమ్మల్ని ఊళ్ళోవున్న మన ఇంటికి తీసుకొచ్చేసాం... తోటలో వున్న ఆ ఇంట్లో మీరొక్కక్షణం ఆలస్యం చేసుంటే ఘోరం జరిగి పోయేది. నందినికింకా స్పృహరాలేదు" అన్నాడాయన కళ్ళ నిండా నీళ్ళు నింపుకుని.

అతికష్టంమీద అక్కడ నుంచి లేచి నందిని వున్న గదిలోకి నడిచాడు. ఆ గదిలో మంచం మీద అచేతనంగా వుంది నందిని. అక్కడ ఆడాళ్ళంతా

గుమిగూడివున్నారు. శోభనం కోసం కట్టిన తెల్లచీర మట్టి కొట్టుకుపోయింది. తలంతా రేగిపోయివుంది. తల్లోని మల్లెపూలన్నీ వాడిపోయాయి. ఆమెనలా చూసిన వెంటనే హరీష్ గుండెల్లోనుంచి బాధ తన్నుకొచ్చింది. నందిని పక్కన కూర్చుని ఆమె ముఖంలోకి తదేకంగా చూసాడు. ముఖమంతా వాడిపోయింది. పక్కనే స్టూలు మీదున్న నీళ్ళగ్లాసు తీసుకుని నందిని ముఖం మీద చిలకరించాడు. ఎట్లాంటి కదలిక లేదు.

"నందూ" అంటూ ప్రేమగా పిలిచాడు.అయినా ఎటువంటి రెస్పాన్స్ లేదు. చేతుల్ని కదిపాడు. గుండెమీద తలపెట్టి చూసాడు. గుండె సన్నగా కొట్టుకుంటుంది. మనిషిని ఎంత కదిపినా కదలడంలేదు. అందరికీ భయమేసింది. వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలని నిర్ణయించుకుని త్వరత్వరగా కారుని రెడీ చేసి అమలాపురం తీసుకుపోయి హాస్పటల్లో చేర్పించారు.

– – –

దగ్గర దగ్గరగా సంవత్సరం కావొస్తుంది. ఆరోజు ఆ సంఘటన జరిగిన వెంటనే నందినిని హాస్పిటల్లో చేర్చారు. నెలరోజుల పాటు ఐ.సి.యూలోనే వుంచారు. నాలుగు రోజులు వెంటిలేటర్ మీద వుంచారు. ఆమెలో ఎటువంటి మార్పూ రాలేదు. పూర్తి కోమాలోకి వెళ్ళిపోయింది. ఆ షాక్ నుంచి ఇంకా కోలుకోలేనట్టుంది. ఎంత మంచి ట్రీట్‌మెంటు ఇప్పించినా నందిని కోమాలో నుంచి బయటకు రాలేదు. డాక్టర్లు కూడా ఏం చెప్పలేకపోతున్నారు. వాళ్ళ సలహాతో వైజాగ్ తీసుకొచ్చేసాడు హరీష్. నందిని కోసం ప్రత్యేకంగా అన్ని వసతులతో ఇంట్లో ఒక గదిని ఏర్పాటు చేసి ఆమెను చూసుకోవడానికి ఒక నర్సుని నియమించాడు.

హరీష్ నందినిని కంటికి రెప్పలా చూసుకుంటున్నాడు. ఎప్పటికైనా ఆమెకు స్పృహ వస్తుందని కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నాడు. మూడు నెలల పాటు శెలవు పెట్టేసాడు కానీ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఉద్యోగంలో చేరక తప్పలేదు. ఉద్యోగ సమయంలో తప్ప మిగిలిన సమయమంతా నందిని సమక్షంలోనే వుంటున్నాడు.

– – –

"రా! హాసినీ!!" అంటూ ఆహ్వానించాడు హరీష్.

"అక్క ఎలావుంది బావా" అంటూ వచ్చి హరీష్‌కి ఎదురుగా మరో సోఫాలో కూర్చుంది.

"అలాగే వుంది హాసినీ. ఎటువంటి ప్రోగ్రెస్ లేదు. నందినిని అలా చూడలేకపోతున్నాను. ఎప్పటికి లేచి కూర్చుంటుందో తెలియడంలేదు".

“నిజమే బావా అక్కగురించి నువ్వెంత బాధ పడుతున్నావో నేను చూస్తూనే వున్నాను కదా”. అంటూ లేచి నందిని వున్న గదిలో కొచ్చింది,కూడా హరీష్ కూడా వచ్చాడు. నందిని మంచం మీద కూర్చుని ఆమె నుదిటిని తాకింది. హాసిని కళ్ళలో సన్నటి తెర. అక్కడ నుంచి లేచి బయటకొచ్చేసింది.

నందిని చిన్నాన్న కూతురు హాసిని. యూనివర్శిటీలో ఎమ్మెస్సీ ఫైనలియరు చదువుతుంది. హాస్టల్లో వుంటుంది. వారంలో రెండు, మూడు సార్లొచ్చి నందినిని చూసి పోతుంది.

హాసిని నందిని కంటే అందంగా వుంటుంది. చక్కని అవయవ సౌష్టవంతో చూపరులను ఇట్టే ఆకర్షిస్తుంది. ఆమెకు హరీషంటే ఒక రకమైన అడ్మిరేషను. అక్కవల్ల అతనెంత బాధ పడుతున్నాడో అని మధన పడుతూ వుంటుంది. అప్పుడప్పుడు సాయంకాలాలప్పుడు యూనివర్శిటీ నుంచి డైరెక్టుగా బీచ్‌కి తీసుకెళ్ళి కబుర్లు చెబుతూ వుంటుంది. ఆదివారాలప్పుడు పగలంతా ఇంట్లోనే వుండి రాత్రికి హాస్టల్‌కి పోతుంది. ఇద్దరూ కలిసి భోజనం చేస్తారు. కబుర్లు చెప్పుకుంటారు. హరీష్‌కి కూడా హాసినీ సమక్షంలో ఆనందంగానే వుంటుంది.

– – –

ఓసారి హరీష్ ఒక రోజు కేంప్ కెళ్ళాల్సి వచ్చింది. హాసినిని నందినికి తోడుగా వుండమన్నాడు. ఆరాత్రి నందిని గదిలోనే పక్కనే వేరే బెడ్ మీద పడుకుంది. నందినిని చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది హాసినికి. ఆరోజు నుంచి ఈరోజువరకు అలాగే నిద్రపోతున్నట్లు వుంటుంది. ఎటువంటి కదలికా లేదు, ఒక్క శ్వాస ఆడటంతప్ప. గదంతా ఆక్సిజన్ సిలిండర్, ఇతర మందులతో హాస్పిటల్ రూములాగా వుంది. ప్రతిరోజు మెడికల్ చెకప్ చేయడానికి డాక్టర్ని ఏర్పాటు చేసాడు. ఆమెకు ఒళ్ళు తుడిచి బట్టలు మార్చడానికి వేరే మనిషిని నియమించాడు. పగలంతా వుండి ఎప్పటికప్పుడు వాడాల్సిన మందులు, ఆహారం అందించడానికి నర్సుని పెట్టి ఎన్ని రకాలుగా చూడాలో అన్ని రకాలుగాను చూసుకుంటున్నాడు.

అవన్నీ తలుచుకుంటుంటే హాసినికి మనసు నిండా హరీష్ పట్ల ఏదో తెలియని అనుభూతి కలుగుతుంది. నిజంగా హరీష్‌లాంటి ఉత్తముడు అక్కకు దొరకడం ఎంత అదృష్టం. కానీ ఏం లాభం అక్కజీవితం ఇలా అయిపోయింది. అలా ఆలోచిస్తూ పడుకుంది కానీ చాలా సేపటి వరకు నిద్రరాలేదు. మాగన్నుగా నిద్ర పడుతున్న సమయంలో బయటనుంచి వర్షం పడుతున్న శబ్దం,పెద్దగా గాలి వీస్తున్నట్లుగా తలుపులు

కొట్టుకోవడం వినిపించింది. పక్కమీదనుంచి లేచింది హాసిని. పెద్ద పెద్ద శబ్దాలతో ఉరుములు మరో పక్క మెరుపులతో ఊరంతా వెలుగు నిండి పోతుంది. ఒక్కసారిగా కరెంటు పోయింది.

వెంటనే ఇన్వెర్టరుతో గదిలో లైటు వెలిగింది. ఆ వెలుగులో నందిని వంక చూసింది హాసిని. ఎప్పటిలాగే నిశ్చింతగా నిద్రపోతున్నట్లుగా వుంది.

అంతలో బ్రహ్మాండం బద్దలయి పోతుందా అన్నట్లు పెద్ద శబ్దం.పక్కనే పిడుగు పడినట్లుంది. ఆశబ్దానికి చెవులు గింగుర్లెత్తిపోయాయి హాసి నికి. ఆక్షణంలోనే 'కెవ్' మని అరిచింది మంచం మీదున్న నందిని. హాసిని కంగారుగా నందిని వంక చూసింది. నందిని వూరికే వణికి పోతుంది. ఒళ్ళంతా చమటలు పట్టేసాయి. ఏంచేయాలో హాసినికి అర్థంకాలేదు. గబగబా నందిని పక్కన కూర్చుని "నందూ…నందూ…" అంటూ ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకుంది. నందిని ఒకసారి కళ్ళు తెరిచి చూసి మళ్ళీ మూసేసింది.

– – –

ఆదివారం సాయం కాలం అయిదు గంటలకు హాసిని హరీష్ ఇంటికి వచ్చింది. హరీష్ హాల్లో కూర్చుని టాబ్‌లో వదో సెర్చిచేస్తున్నాడు.

'హాయ్! బావా' అంటూ వచ్చి కూర్చుంది.

"ఏమిటి యిప్పుడొచ్చావు ప్రొద్దుటే వస్తావనుకున్నాను" అన్నాడు నవ్వుతూ.

"కొంచెం పనివుండి రాలేకపోయాను బావా. ఇప్పుడొచ్చాను కదా రాత్రికి ఇక్కడే వుండిపోతాను" అంది నవ్వుతూ.

"వావ్! వెరీనైస్" అన్నాడు. ఇద్దరూ లేచి నందిని గదిలో కొచ్చారు. నందిని అలాగేవుంది. ప్రశాంతంగా వుందామె ముఖం. ఊపిరి తీసుకోవడం వలన ఛాతీ భాగం కదులుతుంది. ఆమెనలా చూసేసరికి హరీష్ హృదయం బాధగా మూలిగింది. అక్కడనుంచి ఇద్దరూ కదిలారు.

రాత్రి తొమ్మిది గంటల సమయం. రీడింగ్ రూములో కూర్చుని రేపు చెప్పబోయే లెసన్ గురించి బుక్స్ రిఫర్ చేస్తున్నాడు హరీష్. ప్రతిరాత్రీ పది గంటల వరకు అక్కడే గడిపి నందిని రూములో కెళ్ళి పడుకుంటాడు. తలుపు తట్టిన శబ్దమయ్యింది. 'కమిన్' అన్నాడు. తలుపు తీసుకుని లోపలి కొచ్చింది హాసిని. తలపైకెత్తి చూసిన హరీష్ బిత్తర బోయాడు. ఓ శృంగార దేవత తన ఎదురుగా నిలబడినట్లుంది. హాసిని ఎంతో అందంగా తయారయ్యింది. ట్రాన్స్‌పరెంట్ నైటీలో నుంచి ప్రతీ అవయవం

స్పష్టంగా కన్పిస్తుంది. మతి పోయింది హరీష్‌కి. హాసిని కళ్ళ నిండా కోరిక. ఆచూపులు హరీష్‌ని టెంప్ట్ చేస్తున్నాయి. నెమ్మదిగా నడుచుకుంటూ హరీష్ కూర్చున్న కుర్చీవెనుక నిలబడి తన రెండు చేతులు హరీష్ భుజాల మీదనుంచి కిందకు పోనిచ్చింది. తన ముఖాన్ని హరీష్ భుజం మీద ఆనించింది. తన బుగ్గల్ని హరీష్ బుగ్గలతో రాసింది. హరీష్‌కి అంతా అగమ్యగోచరంగా వుంది.

"హాసిని ఏంటిది" అన్నాడు ఎలాగో నోరు పెగల్చుకుని.

"బావా ఈ రాత్రి నన్ను నీ సొంతం చేసుకో. ఎప్పట్నించో నువ్వు నాహృదయంలో గూడు కట్టుకున్నావు. ఎంత కాలమిలా కఠోర బ్రహ్మచర్యంతో వుంటావు చెప్పు. అక్కవల్ల ఎలాగూ నీకు సుఖంలేదు. నన్ను నీదాన్ని చేసుకో బావా" అంటూ అతన్ని గట్టిగా హత్తుకుంది. హరీష్‌కి ఒళ్ళంతా ఏదోలా అయిపోయింది. హాసినీ ప్రవర్తన అర్థం కావడం లేదు. ఎందుకిలా ప్రవర్తిస్తుంది. నిజంగా తనని కోరుకుంటుందా. అంటే నందినికి అన్యాయం చేయాలనుకుందా! మరి తన మాటేమిటి? తనూ అలాగే అనుకుంటున్నాడా?మరి హాసిని స్పర్శకు తన శరీరం ఎందుకలా స్పందిస్తుంది. కాస్సేపు విచక్షణ కోల్పోయినా మళ్ళీ మామూలుగా అయిపోయాడు. నెమ్మదిగా తనను చుట్టుకున్న హాసిని చేతుల్ని తొలగించి తన ముందుకు హాసినిని తిప్పుకున్నాడు.

"ఏమిటి హాసినీ ఈ పిచ్చిపని, ఏం చేస్తున్నావో తెలుస్తుందా నీకు. నీకు నేను లొంగిపోతానని ఎలా అనుకున్నావు. నేను నందినిని ఎంత గాఢంగా ప్రేమించానో నీకు తెలీదు. ఆమె నాప్రాణం. ఆమె జీవితాంతం అలాగే వున్నా కూడా నువ్వన్నట్లుగా కఠోర బ్రహ్మచర్యం పాటిస్తానే కాని నేనెవ్వరి ప్రలోభాలకూ లొంగిపోను. నిన్ను నేనా దృష్టితో ఎప్పుడూ చూడలేదు. నీతో చనువుగా వున్నాను అంటే అది నువ్వు నందినికి చెల్లెలివి కాబట్టి. నందినికి నువ్వు చెల్లెలివైనప్పుడు నిన్ను నేను కూడా అదే భావనతో చూస్తున్నాను. నేను నీ పట్ల ఏమన్నా ప్రలోభపెట్టినట్టు భావిస్తే నన్ను క్షమించు" అన్నాడు హరీష్,

హాసిని కళ్ళనిండా నీళ్ళు నిండిపోయాయి.

"నన్ను క్షమించు బావా నేనే చాలా తప్పుగా ప్రవర్తించాను. క్షణికావేశంలో అలాప్రవర్తించానే తప్ప మరేంకాదు. ఇందులో నీ పొరపాటేం లేదు" అని చెప్పి ఇప్పుడే వస్తానని గదిలోనుంచి బయట కెళ్ళి పావుగంట తర్వాత తిరిగొచ్చింది. ఇప్పుడు పూర్తిగా వేషం మారిపోయింది. మామూలు డ్రస్ వేసుకుని ముఖం శుభ్రంగా కడుక్కుని వచ్చింది. నవ్వుతూ చూసాడు ఆమె వంక.

హాసిని పావుగంటసేపు హరీష్‌కి చాలా విషయాలు చెప్పింది. వాటిని సావకాశంగా విన్నాడు హరీష్. హాసిని అక్కడ నుంచి లేచి వేరే బెడ్ రూములోకి వెళ్ళి పోయింది. హరీష్ పదినిమిషాల తర్వాత నందిని వున్న రూములోకొచ్చాడు పడుకోవడానికి. నందిని అలా ప్రశాంతంగా నిద్రపోతున్నట్లుగా వుంది.

– – –

రాత్రి పది గంటల సమయం కొబ్బరితోటల్లోంచి చల్లని గాలి వీస్తుంది. ఆ తోటల మధ్య ఓ అందమైన కుటీరంలో శోభనం ఏర్పాటు చేసారు. గదంతా అందంగా అలంకరించారు. మల్లెలు, గులాబీలతో అందంగా అలంకరించిన డబుల్‌కాట్ బెడ్‌మీద తెల్లని పట్టుచీర, తల్లో మల్లెల సంపెంగలతో అందంగా అలంకరించిన నందిని ప్రశాంతంగా పడుకుని వుంది. పట్టు పంచెకట్టుకుని హరీష్ బెడ్ పక్క నిలబడి ఆమె వంక అలాగే చూస్తున్నాడు.

సంవత్సరం క్రితం ఇదే రోజున వాళ్ళిద్దరికి ఇదే గదిలో శోభనం ఏర్పాటు చేసారు. కాని ఆ రోజునున్న ఉత్సాహం ఈ రోజు హరీష్‌కి లేదు. నందూ అలా వున్నప్పుడు ఇలా చెయ్యడం పద్ధతి కాదనుకున్నాడు. కానీ ఆ రోజు రాత్రి హాసిని చెప్పిన మాటల మీద నమ్మకం కలిగింది. ఆ రాత్రి హాసిని అలా ప్రవర్తించడం, తను ఆమెతో మాట్లాడటం గుర్తొచ్చింది. అప్పుడు హాసిని అన్న మాటలు కూడా గుర్తుకొచ్చాయి.

“బావా! మీ పెళ్ళయి సంవత్సరమయ్యింది. వారం రోజుల్లో మీ పెళ్ళి రోజు కూడా వస్తుంది. ఆ రోజు మనవూరు వెళ్ళండి. మీ మొదటి రాత్రి ఎక్కడయితే ఏర్పాటు చేసారో అక్కడే మళ్ళీ మొదటి రాత్రి ఏర్పాటు చేసుకోండి. అప్పుడైనా అక్కలో ఏమైనా మార్పు వస్తుందేమో. పరిసరాలు కూడా ఒక్కోసారి ప్రభావాన్నిస్తాయి. నేనెందుకు చెబుతున్నానో విను బావా” అంటూ చెప్పేసరికి ఏదో ఆశతో ఒప్పుకున్నాడు. కానీ అలా నిజంగా జరుగుతుందా?

హరీష్ నందిని మంచం మీద కూర్చుని, “నందూ!” అంటూ ప్రేమగా పిలిచాడు.

“ఎందుకు నందూ నాకీ శిక్ష. నీతో నేనెంతో ఆనందంగా జీవించాలనుకున్నాను. నువ్వేనా సర్వస్వమనుకున్నాను. కానీ ఈ జన్మలో నాకా అదృష్టం లేదు. వచ్చే జన్మలో అయినా నాకా అదృష్టాన్ని కల్పించు” అంటూ ఆమె గుండెలపై తన తల ఆనించి పడుకున్నాడు.

కాస్సేపలాగే వుండిపోయాడు. అలావుంటే మనసంతా ఎంతో సేదతీరినట్టుగా

వుంది. ఆ స్థితిలో తనని ఓరెండు చేతులు చుట్టుకున్నాయని గ్రహించలేక పోయాడు. తనని ఎవరో బందిస్తున్నారన్న అనుభూతితో కళ్ళుతెరిచే సరికి నందిని తన మెరుస్తున్న కళ్ళతో హరీష్‌ని ఎంతో ఆర్తిగా చూస్తుంది. హరీష్ నమ్మలేక పోయాడు. ఇది కలా! నిజమా అనే సందిగ్ధంలో వుండిపోయాడు.

"నందూ" అంటూ అంటూ ఎంత ఆత్మీయంగా పిలిచాడు.

"హరీ నమ్మలేకపోతున్నావు కదూ నన్నిలా చూడటం."

"అవును నందూ. ఇదెలా సాధ్యం."

"నువ్వు కేంపు కెళ్ళిన రోజు రాత్రి ఉరుములు, మెరుపులతో కూడిన పెద్ద గాలి వాన వచ్చింది కదా. అప్పుడు మనింటి దగ్గరగా పెద్ద పిడుగు పడింది. ఆ శబ్దానికి నేను కోమాలో నుంచి బయట పడ్డాను. ఇదో మిరాకిల్ కదూ."

"అయితే ఇన్ని రోజులు నాకెందుకు తెలియనీయలేదు."

"హాసినీ వద్దంది. ఈ రోజువరకూ ఆగమంది. అందుకే ఆగాల్సివచ్చింది."

"అంటే మొన్న ఆదివారం రాత్రి...."అంటూ ఆగాడు.

"అవును నాకు తెలుసు. అదేదో సరదాగా నిన్ను ఏడిపించాలని నా అనుమతితోనే అలా ప్రవర్తించింది"

"నిజంగా ఆ రాత్రి నా ప్రమేయం లేకుండానే ఏదైనా తప్పు జరిగుంటే..."

"నేను జీవితాంతం ఇలా మంచం మీద వుండేదాన్ని అదే నీకు పెద్ద శిక్ష" అంది నవ్వుతూ.

"మీరిద్దరూ తోడు దొంగలన్న మాట. అయితే మీరిద్దరూ చేసిన పనికి నీకే శిక్ష వెయ్యాలి" అంటూ నవ్వి ఆమెను గట్టిగా కౌగిలిలో బందించాడు.

"నీదే ఆలస్యం" అంటూ హరీష్‌ని అల్లుకు పోయింది.

కిటికీలోనుంచి వాళ్ళిద్దరి శృంగారాన్ని చూడలేక కిటికీని ఆనుకుని వున్న కొబ్బరాకు సిగ్గుతో అటు తిరిగి పోయింది.

**(20-08-2021 సహరి అంతర్జాల వారపత్రికలో ప్రచురితం.
సరసమైన కథల పోటీలో 1,000 రూపాయలు బహుమతి పొందిన కథ)**

* * *

# ముగ్గు బుట్టలు

"ఒరేయ్! రాముడు!!"

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను. ఇలా పిలిచేది మా రాజారావొక్కడే. వెనక్కి తిరిగి చూశాను. ఎవరు కనబడలేదు. చూసిన వెంటనే కనబడటానికి అది ట్రాఫిక్ లేని రోడ్డూ కాదు. జనం లేని వీధీ కాదు. రైల్వే స్టేషను. నేనున్న ప్లాట్ ఫామంతా గోలగోలగా ఉంది. నలుదిక్కులా చూసాను పిలిచిన వాళ్ళు కనపడతారేమోనని. అవతలి ఫ్లాట్‌ఫారం మీద కూడా చూసాను. ఉహూ! ఎవరూలేరు. ఎవరో ఎవర్నో పలకరించుంటారులే అనుకుని ముందుకడుగు వేసాను. మళ్ళీ అదే పిలుపు. మళ్ళీ వెనక్కి తిరిగి చూసాను. ఎవరో ఇద్దరు వయసు మళ్ళిన దంపతులు చెరో ముగ్గుబుట్ట నెత్తిన పెట్టుకున్నట్టు తళతళా మెరుస్తున్న తెల్లని జుట్టుతో నావంక నవ్వుతూ చూస్తూ వస్తున్నారు. ఎవరబ్బా! అనుకుంటూ ఆగాను.

"నేన్రా గుర్తుపట్టలేదా" అన్నాడతను నవ్వుతూ.

నేను అయోమయంగా చూసాను.

"అన్నయ్యగారూ మేమండి" అందావిడ తనూ నవ్వుతూ.

"నేనేరా రాజారావుని" అన్నాడు నా మిత్రుడు రాజరావు. నా ఆశ్చర్యానికి అంతే లేకుండా పోయింది. రాజారావేంటి ఇలా వుండటమేంటి. రాజారావు నా సహోద్యోగి. ఇద్దరం ఓ ఎయిడెడ్ కాలేజీలో లెక్చరర్లుగా ముప్పయిదేళ్ళు కలిసి పని చేసి గత సంవత్సరమే రిటైరయ్యి ఈవూళ్ళోనే సెటిలయ్యాం. ఎప్పుడూ కలుస్తూనే వుంటాం. ఓ ఆర్నెల్లక్రితం రాజారావు వాడి భార్య లలిత వాళ్ళబ్బాయి దగ్గరకు బెంగుళూరు వెళ్ళారు. అతనక్కడ సాఫ్ట్‌వేర్ ఉద్యోగి. రాజారావు నేనూ రెండు రోజులకోసారి ఫోన్‌లో మాట్లాడుకునేవాళ్ళం. మూడు నెలల క్రితం బెంగుళూరు నుంచి భార్యాభర్తలిద్దరూ ఊటీ వెళ్ళొచ్చామని చెప్పాడు. ఈ రోజు బెంగుళూరునుంచి వస్తున్నాడన్నమాట.

"ఏమిట్రా ఈవేషం. ఇలా తయారయ్యారేమిటిద్దరూ."

"అదో పెద్ద కథలేరా. ఇప్పుడే కదా ట్రయిన్ దిగాం. సాయంకాలం ఇంటికి రా ఏం జరిగిందో చెబుతాను. అవునూ నువ్విక్కడేంటి ఎక్కడికైనా వెళుతున్నావా"

"ఎక్కడికీ వెళ్ళడం లేదురా మా బంధువొకాయన వైజాగ్ నుంచి వస్తుంటే రిసీవ్ చేసుకుందామని వచ్చాను. ట్రయినొచ్చినట్టుంది అనౌన్స్ చేస్తున్నారు. సరే సాయంకాలం కలుద్దాం అని చెప్పి అక్కడనుంచి కదిలాను.

రాజారావు నాకున్న స్నేహితుల్లో ముఖ్యుడు. మంచి వ్యక్తి, చాలా సరదాగా వుంటాడు. ఎప్పుడూ నీట్‌గా డ్రస్ చేసుకుని చాలా చక్కగా తయారవుతాడు. ఎప్పుడూ నల్లని, చెరగని జుట్టుతో వుంటాడు. నలభై ఏళ్ళప్పుడు నెత్తి మీద అక్కడక్కడ తెల్లవెంట్రుకలు కనపడేసరికి బెంబేలెత్తిపోయాడు. అప్పుడు నేనో సలహా ఇచ్చాను, "ఎందుకంత కంగారు 'డై' చేసుకుంటే సరిపోతుంది. ఇప్పుడు అంతా చేసేదదేగా. పూర్తిగా నెరిసాక వేసుకునే కంటే ఇప్పుడే మొదలు పెడితే అసలు జుట్టే నెరవలేదను కుంటారు. ఇప్పుడు 'డై'లు చాలా నేచురల్‌గా యాలకుల్లో పొటాషియం, క్యాల్షియం, వుంటున్నాయి మరి."

అప్పటి నుంచీ వాడు వారం వారం 'డై' చేసుకుంటూ వయసు కనపడకుండా వుండటానికి నానా తంటాలు పడేవాడు. రిటైరయ్యే వరకు అలాగే వున్నాడు. అతనితో పాటు అతని భార్య కూడా 'డై' చేసుకునేది. ఏమాటకామాటే చెప్పుకోవాలి. వాళ్ళకి అరవై ఏళ్ళు నిండినా ఏభై ఏళ్ళ వారిలాగే కనపడేవారు. వాళ్ళు వయసు చెపితే తప్ప ఎవరూ నమ్మేవారుకాదు. ఆ రకంగా తమ ఫిజిక్‌ని మెయింటైన్ చేస్తుండేవారు.

– – –

సాయంకాలం ఆరింటికి రాజారావింటికెళ్ళాను. భార్యా, భర్తలిద్దరూ టీ.వి. చూస్తున్నారు. వాళ్ళని ముగ్గుబుట్టలతో చూస్తుంటే అరవైఏళ్ళుదాటిన వాళ్ళలా కన్పిస్తున్నారు. వాళ్ళ నిజం వయసు అదే కదా.

"మనమిలా కలిసి చాలా కాలమయిందిరా" అన్నాను రాజారావు భార్య అందిస్తున్న టీ కప్ అందుకుంటూ.

"నిజమేరా మేం బెంగుళూరు వెళ్ళేముందు కలిసాం. అప్పుడే ఆరునెలలయి పోయింది."

"అవునూ మీ ముగ్గుబుట్టల కథేంటి" అడిగాను.

రాజారావు భార్య తనో కప్పు తెచ్చుకుని కూర్చుంది. ముగ్గురం టీ తాగాం.

"అన్నయ్యగారూ మా ఊటీ ప్రయాణం బలే జరిగింది లెండి. ఆ తర్వాతే మేమిలా తయారయ్యాం" అందావిడ.

"ఏం జరిగిందో చెప్పరా" అన్నాను రాజారావుతో.

"అదో పెద్ద అనుభవంరా. నా అభిమానాన్ని దెబ్బతీసిన సంఘటన, అలాగే నేను బాగా అవమానం పడిన సంఘటన కూడా. చెబుతాను విను. మేం ట్రయిన్‌లో సెకండ్ ఏ.సి బుక్ చేసుకున్నాం. అసలు మాతో పాటు మా అబ్బాయి, కోడలు కూడా వద్దామనుకున్నారు. కానీ మావాడికి సడెన్‌గా ఆఫీసులోఇన్ స్పెక్షను వుండటంతో వాడు డ్రాపయిపోయాడు. దాంతో మా కోడలు కూడా మానేసింది. ఇంక మేమిద్దరమే బయలుదేరాం. సర్వీసులో వుండగా వెళ్ళాలనుకున్న ఊటీ ప్రయాణం ఇప్పటికైనా జరుగుతుందని ఆనందంగా బయలుదేరాం. కానీ దార్లో మేం ఎదుర్కొన్న సంఘటనల వల్ల మా ప్రయాణం అనుకున్నంత హేపీగా జరగలేదురా" అన్నాడు వాడు.

"అసలేం జరిగిందిరా" అడిగాను వాణ్ణి.

"అన్నయ్యగారిని అంత టెన్షన్ పెట్టకపోతే జరిగింది చెప్పొచ్చుగా. ఏం లేదన్నయ్యగారూ అదేమంత గొప్ప విషయంకాదు. ఈయన వూరికే ఫీలయిపోతున్నారు" అంది వాడి భార్య లలిత.

"నిజమేరా మీచెల్లెలన్నట్టు బాధ పడిపోయే టంత గొప్ప సంఘటన కాదుగానీ అప్పుడలా అనిపించింది."

"అబ్బబ్బా చంపకుండా జరిగిందేమిటో చెప్పరా" అంటూ విసుక్కున్నాను.

"ట్రయిన్‌లో మేమోపావుగంట ప్రయాణం చేసేటప్పటికి ఓ కుర్ర టి.టి.యి వచ్చాడు టికెట్లు చెక్ చేయడానికి. మా బెర్త్ నెంబర్లడిగాడు. చెప్పాను. ఐ.డిలు చూపించమన్నాడు. మా ఇద్దరి ఆధార్ కార్డులు చూపించాను."

"ఇవి మీ బెర్తులు కావండి. సీనియర్ సిటిజెన్స్ కోటాలో రిజర్వ్ చేయించు కున్నవి. మీరు పొరపాటుగా ఇవి మీవనుకున్నారేమో" అన్నాడు.

"లేదండి ఇవి మావే. నా పేరు రాజారావు.నాభార్యపేరు లలితకుమారి. చూడండి చార్జ్‌లో పేర్లుంటాయి." అన్నాను.

"పేర్లున్నాయండి. రాజారావు 61, లలిత కుమారి 60 అని వయసు కూడా వేసి వున్నాయి. కాని అవి మీవి అవ్వడానికి అవకాశం లేదే" అని అన్నాడు మళ్ళీ.

"అదేంటండి అలా అంటారు. ఆధార్ కార్డులు చూడండి. పేర్లు, వయసు అన్నీ కరెక్ట్‌గానే వున్నాయి."

అప్పటికే మా ఎదురుగా కూర్చున్నవారు, సైడు బెర్తుల్లో వున్నావారు మా వంక

వింతగా చూస్తున్నారు.

"నిజమేనండి ఆధార్ కార్డుల్లోవున్నపేర్లు, వయసులు, మా చార్జ్‌లోవున్న పేర్లు వయసులు కరెక్ట్‌గానే వున్నాయి. కానీ ఇవన్నీ మీవి కావని అంటున్నాను."

"మావి కాకపోవడమేమిటండి. అవి మావే" అన్నాను.

"ఏలా అవుతాయందడి. ఆధార్‌లో వున్న మీ ముఖాలు, ఇప్పుడున్న మీ ముఖాలు ఒకేలా వున్నాయంటారా." అన్నాడతను.

"చూడండి టీ.టి.యీ గారూ బుద్దున్న వాడెవడూ అనడండి ఆధార్ కార్డులో వున్న ముఖం, ఒరిజినల్ మనిషి ముఖం ఒకేలా వుంటాయని. పోనీ మీ ఆధార్ కార్డులో వున్నట్లుగా మీముఖం వుందటారా?" అడిగాను.

అతను కంగారుపడి,"అఫ్‌కోర్స్ మీరు చెప్పింది నిజమే అనుకోండి. కానీ మీ అసలు వయస్సులను దాచి టికెట్ కన్సెషన్ల కోసం ఏజ్ ఎక్కువ వేయించుకుని కార్డులు సంపాదించారనిపిస్తుంది."

"చూడండి మాటలు జాగ్రత్తగా రానియ్యండి. మేమంత కక్కుర్తిపడి అలా మోసం చేయాల్సిన అవసరం మాకులేదు తెల్సిందా."

"ఈ ఐ.డీలు, మీరు ప్రస్తుతమున్న తీరు చూస్తుంటే నమ్మాలని పించడంలేదు. మీరి ద్దరూ ఏబయి సంవత్సరాల కంటే తక్కువ వయసున్నవారిలా కన్పిస్తున్నారు. మీరేమో జీన్స్ పేంట్ వేసుకున్నారు. చెక్స్‌వున్న టీషర్టు టక్ చేసుకున్నారు. మీ జుట్టు, మీసాలు నల్లగా నిగనిగలాడుతున్నాయి. ఆవిడా చుడీదార్‌లో వయసుమళ్ళిన ఆవిడలా లేదు. ఇద్దరూ మంచి నడి వయస్సులో వున్నవాళ్ళలా వున్నారు కానీ సీనియర్ సిటిజెన్స్ అంటే ఎలా నమ్మమంటారు. మీరు ఫైన్ కట్టాల్సి వుంటుంది. ఎక్స్ట్రా అమౌంట్ పే చేయండి" అన్నాడు.

ఏం చెప్పాలో అర్థంకాలేదు అయినా చెప్పాలికదా.

"చూడండి టీ.టి.యి గారూ నిజంగా నావయస్సు అరవైఒక్క సంవత్సరాలు, మా ఆవిడవయసు అరవై ఏళ్ళు. మా ఇద్దరికీ నలభై ఏళ్ళవయసులో తల నెరవడంతో డై చేసుకోవడం అలవాటయిపోయింది. రిటైరయ్యాక కూడా కంటిన్యూ చేస్తున్నాం. మాకూ మొదటి నుంచీ వాకింగ్, యోగా చేయడం అలవాటు.దాని వల్ల కూడా మా వయసు అంతగా కన్పించదు. ఇంక డ్రస్సింగ్ అంటారా ఇలా ప్రయాణాలప్పుడు నేను టీషర్టు, ఆవిడ చుడీదార్ వేసుకుంటాము. మా వయసు మాత్రం మేం టికెట్లు రిజర్వ్ చేయించుకున్నాప్పుడు పొందుపరిచినవే. పోనీ మీకునమ్మకం కలగకపోతే

నేను రిటైరయ్యినప్పుడు మా ఇద్దరికీ కలిపి ఇచ్చిన ఫామిలీ ఐ.డి చూడండి. అంటూ ఆఐ.డి చూపించాను. మొత్తంమీద టీ.టి.యీని అలా కన్విన్స్ చేయవలసివచ్చింది.

అప్పటికే మా వెనకాల వున్నవాళ్ళు 'డై'లు వేసుకుని వయసుని కనపడకుండా ఈ వయసులో ఏం సాధిద్దామను కుంటున్నారో అంటూ వ్యంగ్యంగా మాట్లాడుకోవడం వినిపించింది. వెళ్ళేటప్పుడే కాదు వచ్చేటప్పుడు కూడామరో టీ.టీ.యి కూడా ఇలాగే గొడవచేసాడు. దాంతో మాకు బాగా విరక్తి కలిగి ఇంక డై చేసుకోకూడదని నిర్ణయించుకుని మానేసాం. అంతే మా తలలిలా ముగ్గుబుట్టలయిపోయాయి. నాకు ఇప్పుడనిపిస్తుంది. ఇంకా డైలు, టీ షర్టులు, జీన్స్ వేసుకుని తిరగడమెందుకు. ఏవయసులో ఎలా వుండాలో అలా వుంటే బాగుంటుందని" అంటూ ముగ్గ బుట్టల కథ వినిపించాడు.దాంతో నాకు నవ్వాగ లేదు.నాతోబాటూ వాళ్ళూ నవ్వేసారు.

**(14-05-2021 సహరి అంతర్జాల వారపత్రికలో ప్రచురితం.**

**సలాది స్వామినాయుడు స్మారక ఉగాది కథల పోటీలో తృతీయ బహుమతి రూ.1000 పొందిన కథ)**

* * *

# పక్కింటావిడ

సరిగ్గా మధ్యాహ్నం రెండు గంటల సమయంలో మంచినిద్రలో ఉండగా ఫోన్ మోగింది. ఈ టైములో ఎవరబ్బా అనుకుంటూ విసుగ్గా ఫోన్ అందుకుని, "ఎవరూ?" అన్నాను.

"నేను సత్యా! పక్కింటి పంకజాన్ని. అర్జంటుగా ఒకసారి రాగలవా, చిన్న పనుంది", అంది పంకజం.

అర్జెంటుగా రమ్మందని కంగారుగా లేచాను.

"ఎవరు ఫోన్ చేసింది?"అడిగారు శ్రీవారు.

ఈ ఫోన్ కాల్ ఆయనకి నిద్రాభంగం కలిగించింది.

''పక్కింటి పంకజం ఫోన్ చేసిందండి. ఏంటో అర్జెంటుట. ఓసారి వెళ్ళొస్తాను"అన్నాను.

"సరే అయితే ఏంటో కనుక్కుని వెంటనే వచ్చెయ్యి. మనం మూడు గంటలకు మ్యాట్నీకి వెళ్ళాలనుకున్నాం. టికెట్స్ కూడా రిజర్వ్ అయ్యాయి", అన్నారాయన.

"అలాగే", అని చెప్పి వాష్ రూంలోకెళ్లాను.

ఈ రోజు ఆదివారం మావారికి సెలవు కావడం, పిల్లలిద్దర్నీ మా తమ్ముడు ఉదయం వచ్చి అమ్మ పిల్లల్ని చూడాలంటోందని చెప్పి వాళ్ళని తీసుకెళ్ళడం, వాళ్ళు రేపు స్కూలుకి అట్నుంచటే వెళ్ళిపోతాననడంతో ఈ రోజు శ్రీవారితో ఆనందంగా గడపాలనుకున్నాను. ఈ మధ్య అసలు మాకు ఏకాంతంగా గడిపే అవకాశమే దొరకడం లేదు. పిల్లలు పెద్దవాళ్ళవడం, ఆదివారాలప్పుడు పుట్టింటినుంచో, అత్తింటి నుంచో ఎవరో ఒకరు రావడం– ఎప్పుడూ బిజీ బిజీ అయిపోతోంది జీవితం.

ఈ రోజైనా మా సొంతం చేసుకోవాలనుకున్నాం.మధ్యాహ్నం మ్యాట్నీ కెళ్లి, తర్వాత షాపింగ్ చేసుకుని, డిన్నర్ స్టార్ హొటల్ లో చేసి, ఇంటికొచ్చి చక్కగా కబుర్లు చెప్పుకుని ఆనందంగా గడపాలని ముందుగానే ప్లాన్ చేసుకున్నాం.... అందుకే సాయంత్రం పనిమనిషిని, వంట మనిషిని రావొద్దని చెప్పేసాను.

కాలింగ్ బెల్ నొక్కిన వెంటనే వచ్చి తలుపు తీసింది పంకజం.

"ఏమిటి పంకజం!అర్జెంటన్నావు?..."అన్నాను కంగారుగా.

"ఏం చెప్పమంటావు సత్యా! ఎల్లుండే మా అమ్మాయి నిశ్చితార్థం అని తెలుసుగా... ఇంట్లోనే సింపుల్ గా చేద్దామనుకున్నాం.... మొత్తం యాభైమంది దాటరనుకున్నాం!.... ముహూర్తం మధ్యాహ్నం 3.30కి వచ్చింది. అది టీ టైము కదా! స్నాక్స్ అవీ బజారునుంచి తెప్పించడమెందుకని.... ఇంట్లోనే చేద్దామనే ఉద్దేశంతో ఈ రోజు హాటూ, రేపు స్వీటూ చేద్దామనుకున్నాను. ఈ రోజు సాయం చేయడానికి కామాక్షి వస్తానంది తీరా పిలిచేసరికి.... ఆ ముచ్చి మొహంది ఊరేళ్లి%శీ%దట. హేండిచ్చేసింది. కొంచెం నువ్వు సాయం చేస్తావని పిలిచాను", అంది పంకజం.

నా గుండెల్లో రాయి పడింది.పంకజం నోరసలు మంచిది కాదు.పనుందంటే కామాక్షిని అన్నట్టే నన్నూ ఏదో అంటుంది.ఇప్పుడేం చేయాలి!

"గంటలో అయిపోతుందా?"అడిగాను.

"ఎందుకవదు. ఇద్దరం ఉన్నాముగా!"

మూడింటికల్లా వెళ్లిపోవచ్చని సరే అన్నాను.

'నువ్వు చాలా మంచిదానివి సత్యా. ఎవరికైనా సాయం చేయడంలో ముందుంటావు' అంటూ రెండు బేసిన్ల నిండా కలిపిన జంతికల పిండి, చెక్కవడల పిండి స్టవ్ ముందు పెట్టింది.

వాటిని చూసిన వెంటనే మతిపోయింది.

ఇవన్నీ గంటలో ఎలా అవుతాయి? సాయం చేయకపోతే ఈవిడతో బాధ వెళ్ళకపోతే శ్రీవారితో గొడవ!ఎలా?.... ఏదయితే అదే అయిందిలే అని పంకజం ఇంట్లో జంతికలు, చెక్కవడలు చేయడానికి నిశ్చయించుకున్నాను.

"చూడు సత్యా! నేను ముందు జంతికలు చేసి బాండీలో వేస్తాను. నువ్వు వాటిని బాగా వేగాక తీసి ఆ పక్కనున్న డబ్బాలో వెయ్యి!"అంది.

నాకసలే పొయ్యి దగ్గర అలవాటు లేదు.

వంట మనిషే అన్నీ చేయడంతో నాకు స్టవ్ దగ్గర పనే లేకుండా పోయింది. ఏం చేయను? తప్పలేదు మరి.

గంటలో అయిపోతాయనుకున్నవి పూర్తయ్యేసరికి మూడుగంటలు పైనే పట్టింది.

అంతసేపు నిలబడి వుండటంతో కాళ్ళు పట్టేసాయి. ఒళ్ళంతా నొప్పులతో పుల పరంగా వుంది. ఇంటికెలా వచ్చానో నాకే తెలీదు. శ్రీవారు చాలా సీరియస్‌గా వున్నారు.

నాతో అసలు మాట్లాడలేదు. సారి చెప్పినా గానీ నావంక చూడనేలేదు. కాఫీ పెట్టుకుని తాగే ఓపిక లేక పారాసెటామాల్ టాబ్లెట్ వేసుకుని పడుకుండిపోయాను.

తెల్లారి వంటమనిషి కాఫీ తెచ్చి లేపేవరకు మెలకువ రాలేదు.

టైము చూస్తే తొమ్మిది కావస్తోంది.

"అమ్మా! అయ్యగారు టిఫిన్ చేసి ఆఫీసుకెళ్లి పోయారమ్మా! ఏంటో ఈ రోజు చాలా సీరియస్‌గా వున్నారు!"అందామె.

ఉండరామరి! ఎన్నో ఆశలు పెట్టుకున్న మనిషి. పంకజం వల్ల మా ప్రోగ్రామంతా అప్ సెట్ అయిపోయింది. ఈ రోజు స్వీటు చేయడానికి నాలాంటి ఒకదాన్ని ఫిక్స్ చేసుకునే ఉంటుంది పంకజం.

ఇంతకీ అసలు విషయం ఏమిటంటే, ఆ మర్నాడు జరిగిన నిశ్చితార్థానికి, ఆ తర్వాత నెలరోజులకు జరిగిన పెళ్ళికి నన్నుగానీ, మా అపార్ట్ మెంట్ లో వున్న వాళ్ళనెవరినీ గానీ పిలవకుండానే కూతురి పెళ్ళి చేసేసింది…మా పక్కింటి పంకజం.

**(హాస్యానందం మాస పత్రికలో సెప్టెంబర్ 2022 లో ప్రచురితం. శ్రీగుదిబండి వెంకటరెడ్డిగారు నిర్వహించిన కథల పోటీలో బహుమతి పొందిన కథ)**

* * *

# ఆ(మె) వేదన

**కో**ర్టు హాలంతా కిటకిటలాడుతోంది. ఆ రోజే ఓ కీలకమైన కేసు విషయంలో తీర్పు చెప్పబోతున్నారు. సంచలనం కలిగించిన ఆ కేసు తీర్పెలా వుంటుందో తెలుసుకోవడానికి చాలామంది అక్కడికి చేరుకున్నారు ప్రింట్ మీడియా వాళ్ళు. ఎలక్ట్రానిక్ మీడియా వాళ్ళు కోర్టుకు ముందే చేరుకున్నారు. ఆ కేసు అంత ప్రాధాన్యత సంతరించుకోవడానికి కారణం ఆ కేసులోని నిందితుడు ఆ పట్టణంలోని కోటీశ్వరుడు మరియు ప్రముఖ రాజకీయవేత్త కొడుకు కావడమే. ఆ కేసును కోర్టు వరకు రాకుండా చేయడానికి ఆయన తన పలుకుబడినంతా ఉపయోగించాడు. కానీ ధర్మానికి, న్యాయానికి కట్టుబడి వున్న కొంతమంది పోలీసులు, న్యాయవాదుల వల్ల ఆయన ఆటలు సాగలేదు.

జడ్జిగారు సీట్లోకొచ్చి కూర్చున్నారు. అన్యాయానికి గురైన అమ్మాయిని బోనులోకి పిలిచారు. ఆమె చెప్పదలచుకున్నదేమైనా ఉంటే జడ్జిగారు చెప్పమన్నారు. ఆమె చెప్పడం ప్రారంభించింది.

“జడ్జిగారూ! వాద ప్రతివాదనలు పూర్తయ్యాయి. నేను చెప్పాల్సిందేమైనా వుంటే చెప్పమన్నారు. చాలా ఉంది సార్. అయితే నేను చెప్పేది మీరేంతవరకు నమ్ముతారో నాకు తెలీదు. అది మీ తీర్పు మీద ఎలాంటి ప్రభావం చూపుతుందో కూడా నాకు తెలీదు. అయినా నేను చెప్పాలి. నేను చెప్పేది మీరే కాదు, ఈ కోర్టులో వున్నవాళ్ళు కూడా వినాలి. నాకెంత అన్యాయం జరిగిందో ప్రత్యక్షంగా మీరు చూస్తున్నారు. నాకింత చేసిన వాడిని రక్షించడానికి ఈ కోర్టులో ఎంత తతంగం జరిగిందో కూడా మీరు చూశారు. వాడు తప్పు చేయలేదని, చాలా అమాయకుడని వాడి తరపున లాయర్ వాదించాడు. దానికి ఎన్నో సాక్ష్యాలు చూపించాడు. వాటిని మీరు నమ్మారో లేదో నాకు తెలీదు. వాడంత ఘోరం చేస్తుండగా చూసినవాళ్లతో మా లాయర్ సాక్ష్యం చెప్పించాడు. వాటినీ మీరెంత వరకు నమ్మారో తెలియదు.

అయినా జడ్జిగారూ! నాకు జరిగిన అన్యాయం కళ్లకు కట్టినట్టు కనిపిస్తుంటే వేరే సాక్ష్యం కావాలా చెప్పండి. ఇంక అసలు విషయానికి వస్తాను. నేను నా జీవితాన్ని ఎంతో అందంగా ఊహించుకున్నాను. కష్టపడి చదివి ఉన్నత స్థితికి వెళ్లాలనుకున్నాను. అందుకే వేరే వ్యాపకాలు పెట్టుకోకుండా కాలేజీకి, చదువుకి అంకితమైపోయాను. అలాంటి సమయంలో ప్రేమిస్తున్నానంటూ వెంటపడ్డాడీ రాస్కెల్, నేను చదువుకోవ

డానికి వచ్చింది ప్రేమలో పడడానికి కాదని వాడి ప్రేమను తిరస్కరించాను. రోజూ వెంటపడేవాడు. అయినా నేను పట్టించుకోలేదు. నా అందాన్ని పొగిడేవాడు. నేను ప్రేమించకపోతే చచ్చిపోతానని బెదిరించాడు. నన్నిలా వేధిస్తే ప్రిన్సిపాల్ కి రిపోర్టు చేసి పోలీసులకు కంప్లైంట్ ఇస్తానన్నాను. అప్పట్నుంచీ నా మీద కక్ష పెంచుకున్నాడు. కక్ష పెంచుకున్న వాళ్ళు ఈ మధ్య ఏం చేస్తున్నారో అదే వీడూ చేశాడు. నా ముఖం మీద, ఒంటి మీద కసి తీరా యాసిడ్ పోసాడు. నా జీవితాన్ని చిదిమేశాడు. నన్ను కన్నవారి ఆశల్ని కాలరాచాడు. స్వప్నిక సంఘటన జరిగిన తరువాత యాసిడ్ దాడులు ఉండవని అంతా అనుకున్నారు. శ్రీనివాస్ ని అతని ఫ్రెండ్స్ ని ఎన్ కౌంటర్ చేసిన తరువాత ఎవరూ అంత సాహసం చేయరనే అనుకున్నారు. అలాగే నిర్భయ కేసులోని నిందితులకు ఉరిశిక్ష విధించిన తరువాత కూడా అటువంటివి ఇంక జరగవను కున్నారు. కానీ ఆ మర్నాటి నుంచే ఈవ్ టీజింగులు, యాసిడ్ దాడులు, అత్యాచారాలు మొదలయ్యాయి. అంటే ఉరిశిక్షలు, ఎన్ కౌంటర్లులాంటి శిక్షలకు కూడా భయపడటం లేదంటే ఆ నేరాలకు అది శిక్ష కాదన్నమాట. అలాంటి తప్పులు చేసిన వాళ్లకి చెయ్యాల్సింది ఎన్ కౌంటర్లు, వెయ్యాల్సింది ఉరిశిక్షలు కాదు సార్. వాటివల్ల తప్పుచేసిన వాడికి శిక్ష తెలియదు. క్షణంలో ప్రాణం పోతుందంతే. అలా కాకుండా ఇటువంటి వాళ్లకి కాళ్లు చేతులు తీసేసి వదిలిపెడితే ఆ బాధేమిటో వాడికి జీవితాంతం తెలుస్తుంది. అప్పుడు మిగతా వాళ్లకి బుద్ధొస్తుంది.

జడ్జిగారూ! నా మీద యాసిడ్ పోసినవాడికి అలాంటి శిక్ష కూడా సరిపోదు. అయినా వాడికిప్పుడు అలాంటి శిక్ష వేసే అవకాశమూ లేదు. ఎందుకంటే వాడిప్పుడు మీ అధీనంలో ఉన్నాడు కదా. మీరిప్పుడు వాడికి కొన్ని నెలలో లేక కొన్ని సంవత్సరాలో జైల్లో పెట్టమని శిక్ష వేస్తారు. ఎంతకాలం జైల్లో ఉన్నా అలాంటివాళ్లలో మార్పు రాదు. బయటకు వచ్చిన తరువాత వాడికి బోలెడంత జీవితం ఉంటుంది. మళ్లీ వాడు ప్రేమ వేట మొదలుపెడతాడు. నా లాంటి ఆడపిల్ల కనిపిస్తుంది. మళ్లీ యాసిడ్ పోయడమో, లేక రేప్ చేయడమో ఏదో ఒకటి చేస్తాడు. ఇలాంటివాళ్ల ఆగడాలకు అంతు ఎక్కడుంది సార్? ఇటువంటి వెధవల నుంచి మాకు రక్షణ ఎక్కడుంది సార్. అందుచేత నేనే వాడికి శిక్ష వేయాలనుకుంటున్నాను. ముఖమంతా వికృతమైపోయి, శరీరమంతా కాలిపోయి నా జీవితమంతా వ్యర్థమైపోయింది. నా జీవితాన్ని ఇలా నాశనం చేసినవాడు కూడా జీవితాంతం చిత్రవధ అనుభవించాలి. నేను వెయ్యాలను కుంటున్న శిక్షేమిటో చెప్పమంటారా? పెళ్ళి!! నేను వాడ్ని పెళ్లి చేసుకుంటాను. వాడు చేసిన దానికి ఇదే సరైన పరిష్కారం. పెళ్లి చేసుకుని వాడి భార్యగా నేను సమాజంలో తిరుగుతాను. పెళ్లిళ్లకు, పేరంటాలకు వెళతాను. జీవితాంతం వాడి వెన్నంటిఉంటాను.

నన్ను చూసిన ప్రతి క్షణం వాడికి తను చేసిన తప్పేమిటో తెలుస్తుంది. నేను వాడికి ఏ విధంగానూ ఉపయోగపడను. మరో స్త్రీ వాడి జీవితంలోకి ప్రవేశించదు. ప్రవేశించనివ్వను కూడా. ప్రతి క్షణం వాడికి నరకం చూపిస్తాను. నాకెటువంటి హాని తలపెట్టినా వాడికే నష్టం. ఆ జాగ్రత్తలు నేను తీసుకుంటాను. నన్ను, వాడిని చూసిన వాళ్లకి అలాంటి తప్పు చేస్తే పడే శిక్ష ఎంత భయంకరంగా ఉంటుందో తెలుస్తుంది. అలాంటి పనులు చేయడానికి భయపడతారు. కాబట్టి మా ఇద్దరికీ పెళ్ళే సరైన్ శిక్ష అని మీరు తీర్పు చెప్పండి.

జడ్జిగారూ! మీకు చెప్పదగిన అర్హత నాకు లేదు. ఇలా చెప్పొచ్చో లేదో కూడా నాకు తెలియదు. అయినా ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను సార్. మన చట్టాల్లో మార్పులు రావాలి. లేకపోతే పరిణామాలెంత దారుణంగా ఉంటున్నాయో మీరు చూస్తున్నారు. అందుకే పరిస్థితులకు అనుగుణంగా తీర్పులు ఉండాలని కోరుకుంటున్నాను సార్. ఇంకో విషయం. ప్రస్తుతం మన విద్యా వ్యవస్థ ఎంత లోపభూయిష్టంగా ఉందో మీకు తెలుసు. అక్కడా మార్పులు రావాలి సార్. ఎలక్ట్రానిక్ ,ప్రింట్ మీడియాల ప్రభావం విద్యార్థుల్లో చాలా వుంది. వారిలో మానసిక ప్రవృత్తి సక్రమంగా లేకపోవడం వల్లనే ఇటువంటి ఘోరాలు జరుగుతున్నాయి. వారి ప్రవృత్తిని మార్చడానికి విద్యాసంస్థల్లో మానసిక విశ్లేషకుల అవసరం ఎంతయినా ఉంది. వారిని ప్రతీ విద్యా సంస్థల్లో తప్పక ఉంచేలా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. ఎంత చెప్పుకున్నా నా ఆవేదన తీరేది కాదు సార్. అందుకే ఇక ఆపేస్తున్నాను. మీరిచ్చే తీర్పులు భవిష్యత్తులో ఇటువంటి దారుణాలు జరుగకుండా ఉండేలా ఉండాలని కోరుకుంటున్నాను. నేను మాట్లాడిన విషయాల్లో ఏమైనా తప్పులున్నా, అసలు నేను మాట్లాడ్డమే తప్పయినా నన్ను క్షమించండి సార్."ఆమె చెప్పడం ఆపింది. కోర్టు హాలంతా నిశ్శబ్దంగా మారిపోయింది.ఆమె చెబుతున్నప్పుడు జడ్జిగారు తనకు కావాల్సిన పాయింట్స్ నోట్ చేసుకున్నారు.

తీర్పు చెప్పడానికి సిద్ధంగా ఉన్న జడ్జిగారి ముఖంలో ఎంతో ప్రశాంతత కన్పిస్తోంది. ధర్మానికి పేరు గాంచిన ఆయన ఆ అమ్మాయి మాటల్లోని వాస్తవాన్ని గుర్తించారు. ఆమె ఆవేదనను అర్థం చేసుకున్నారు. ఇలాంటివి పునరావృతం కాకుండా ఉండడానికి ఆమె ఇచ్చిన సూచన ఆయన్ని ఎంతో ఆలోచింపజేసింది. తీర్పు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నట్లుగా ఆయన తీర్పు కాగితాన్ని చేతిలోకి తీసుకున్నారు. అంతా ఆయన వంక ఆసక్తిగా చూస్తున్నారు.

**(ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితం)**

* * *

# హత్య

**రం**గనాథాన్ని హత్య చేశారన్న వార్త విని అంతా నిర్ఘాంతపోయారు. ఆ సంఘటన జరిగిన అయిదు నిమిషాలకే ఆ ప్రదేశమంతా జనంతో కిటకిటలాడిపోయింది.

బజార్లో సరుకులు కొనుక్కుని ఇంటికి వస్తుంటే మెయిన్ రోడ్డు మీదే చంపేశారాతన్ని.

అప్పుడు రాత్రి ఏడు గంటలు దాటింది. మెయిన్ రోడ్డయినా స్ట్రీట్ లైట్లు వెలగని కారణంగా చీకటిలో పొంచి ఉండి చంపేశారు. ఎంతో కక్షతో చంపినట్లుగా హృదయవిదారకంగా ఉందా దృశ్యం. మెడ, కాళ్లు, చేతులు నరికేసారు. శవం రోడ్డు ప్రక్కగా పడి ఉంది. చేతి సంచిలోని సరుకులు రోడ్డు మీద చెల్లాచెదురుగా ఉన్నాయి.

వార్త తెలిసిన పోలీసులు హుటాహుటిన వచ్చారు.

రంగనాథం లాంటి వ్యక్తిని అంతలా చంపారంటే ఎవరూ నమ్మలేకపోతున్నారు. అతనా ఊళ్లో చాలా కాలంగా ఉంటున్నాడు. ఊరు చిన్నది కావడంతో అతను అందరికీ తెలుసు. చిన్న ఉద్యోగం చేసుకుంటూ భార్యాబిడ్డలతో హాయిగా ఉంటున్నాడు. ఒకరి జోలికి పోడు. ఎవరి విషయమూ అతనికక్కర్లేదు. అజాతశత్రువని కూడా పేరు.

మరి ఎవరు చంపి ఉంటారు? ఎందుకు చంపి ఉంటారు? అందరిలోనూ అనుమానం.

అక్కడ గుమిగూడిన జనంలో రకరకాల అనుమానాలు ప్రవేశించాయి. ఇలాంటి హత్యలకు రెండే రెండు కారణాలుంటాయి. ఒకటి రాజకీయాలుబీ రెండు అక్రమ సంబంధాలు. అతనసలు రాజకీయాలు జోలికి పోడు. ఎవరితోను అక్రమ సంబంధాలు పెట్టుకున్న దాఖలాలు కూడా లేవు. అయినా రాజకీయాల్లో అయితే పైకి తెలుస్తుంది కాని అక్రమ సంబంధాలు పైకి తెలియవుగా. అంటే ఇతనెవరితోనో అక్రమ సంబంధం పెట్టుకుని ఉంటాడు. కాబట్టి వాళ్ల తాలూకు మనుషులు ఈ హత్య చేసుంటారని అంతా నిర్ధారణ కొచ్చేశారు. ఈ విషయం గోరంతలై కొండంతలయింది.

రంగనాథం కుటుంబం ఈ సంఘటనకు తట్టుకోలేకపోయింది. మనిషి పోవడమే పెద్ద లోటనుకుంటే దానికి తగ్గట్టు అపవాదొకటి. పోలీసులడిగే ప్రశ్నలకు ఎవరూ

ఏమీ చెప్పలేకపోతున్నారు. ఫలానా వారి మీద అనుమానమని చెప్పడానికి కూడా అవకాశం లేదు.

రంగనాధం భార్య కుమిలికుమిలి ఏడుస్తోంది. భార్యను, పిల్లల్ని ఎంతో ప్రేమగా చూసుకునే వాడు రంగనాధం. భార్యక్కూడా భర్త0టే ప్రాణం. అటువంటి భర్త పోవడం ఆమెకు పెద్ద షాక్. అందరూ అనే సూటిపోటి మాటల్ని ఆమె భరించలేకపోతోంది. అంతా–ఆమె భర్త ఎవరితోనో అక్రమ సంబంధం పెట్టుకున్న కారణంగానే చంపబడ్డాడనటాన్ని జీర్ణించుకోలేకపోతోంది. అయితే భర్తను ఎవరు చంపారు? ఎందుకు చంపారు? ఆమెకూ అంతుబట్టడం లేదు. ఒకవేళ అందరూ అంటున్నదే నిజమా? లేకపోతే ఆయన్ని చంపడానికి ఎవరికి అవకాశం వుంది. నెమ్మది నెమ్మదిగా ఆమెలో అనుమాన బీజాలు మొలకెత్తాయి. నిజంగా ఆయన్ని దేవుడనుకుంది. కాని తననింత మోసం చేస్తారని అనుకోలేదు. అతను బ్రతికుండి తనని అలా మోసం చేస్తూ ఉండే కంటే చనిపోవడమే మంచిదేమో అని కూడా ఆమెకు అనిపించింది.

భర్త చనిపోయిన వారం రోజులకే ఆమెలో నిర్లిప్త భావం బయలుదేరింది. భర్త పోయిన దుఃఖం ఇప్పుడామెలో లేదు. భర్త మీద గతంలో ఉన్న ప్రేమ కూడా తగ్గిపోయింది. భర్త తాలూకు ఆనవాళ్లను ఆమె చెరిపెయ్యడానికి ప్రయత్నించింది. పడక గదిలో ఉన్న భర్త ఫోటో తీసేసింది. అప్పుడప్పుడు క్యాంపుల కెళ్లినప్పుడు భర్త రాసిన ఉత్తరాలను చింపి పారేసింది. భర్తతో గడిపిన తీయని స్మృతుల్ని మనసు నుంచి తొలగించేసింది. భర్తపోయిన మొదట్లో పిల్లలు తండ్రి గురించి ఏడుస్తుంటే వాళ్లని పట్టుకుని భోరుమని ఏడ్చేది. కాని ఇప్పుడు వాళ్లు తండ్రి గురించి అడుగుతుంటే వాళ్లని చితక తన్నుతోంది. మొత్తం మీద ఆమె ఆమె తన భర్త మీద ప్రేమను పూర్తిగా చంపేసుకోవడమే కాక భర్త తనని ఎంత గాఢంగా ప్రేమించేవాడో కూడా మరిచిపోయింది.

అప్పటికి రంగనాధం హత్య జరిగి పది రోజులయ్యింది. అనుమానించడానికి ఆధారాల్లేక పోలీసులు ఎవర్ని అరెస్టు చేయలేదు. వాళ్ల ప్రయత్నాలు వాళ్లు చేస్తున్నారు.

పదకొండో రోజున రంగనాధానికి ఇంట్లో కర్మకాండలు జరుపుతున్నారు. బంధువర్గమంతా వచ్చారు. కర్మకాండలు జరుగుతున్నాయన్న మాటేగాని, భక్తితోనూ, ప్రేమతోనూ జరుపుతున్నట్లుగా లేవు. ఏదో తప్పనిసరిగా జరుపుతున్నట్లుంది.

అంతలో పోస్టుమ్యాన్ వచ్చాడు. అతని చేతిలో పార్సిల్ ఉంది. అది రంగనాధం భార్య పేరు మీద ఉంది. రంగనాధం భార్య సంతకం చేస్తే ఆ పార్సిల్ అందుకున్నారు.

రంగనాథం తండ్రి పార్సిల్ విప్పాడు. అందులో నోట్లకట్టలు! పైన ఉత్తరం ఉంది. అందరూ ఆశ్చర్యంగా, భయంగా ఆ నోట్ల కట్ల వంక చూస్తున్నారు.

ఆ ఉత్తరం రంగనాథం భార్య చదవడం మొదలుపెట్టింది.

"అమ్మా! ఈ ఉత్తరం మీరు చాలా కష్ట కాలంలో ఉన్నప్పుడు రాస్తున్నాం. మీ భర్తను మా వాళ్లు చంపారు. అయితే మీ భర్త పట్ల మాకు ఎటువంటి కోపంగాని, కక్షగాని, శతృత్వంగాని లేదు. మాకు రాజకీయంగా అడ్డుతగులుతున్న ఒక వ్యక్తిని చంపాలనుకుని అతని కోసం కాపు కాస్తే ఆ సమయంలో అటు వస్తున్న మీ భర్తను అతనే అనుకుని మా వాళ్లు చంపేశారు. అమాయకుడైన మీ భర్తను అలా చంపడం మాకు చాలా మనస్తాపమయింది. అందులోనూ అక్రమ సంబంధ కారణంగా చంపేశారన్న అపవాదు మాకు చాలా బాధ కలిగించింది. ఆ అపవాదూ తొలగించడం కోసమే ఈ ఉత్తరం రాస్తున్నాం. హత్య చేసిన వాళ్లు ఇలా ఉత్తరం రాస్తారా అని అన్పించవచ్చును. కాని రంగనాథం గారి లాంటి మంచి వ్యక్తిమీద మాకున్న అభిప్రాయం ఇలా ఉత్తరం రాయించింది. మేం రాజకీయ హత్యల్ని ప్రోత్సహించేవాళ్లమయినా మాలో ఉన్న కొద్దిపాటి మానవత్వం ఈ పని చేయించింది. మీకు జరిగిన నష్టాన్ని పూడ్చడం మా వల్ల కాదు. కాని మీ పిల్లలకు అన్యాయం జరగక్కూడదన్న ఉద్దేశంతో ఒక లక్ష రూపాయల్ని పంపిస్తున్నాము. దయచేసి స్వీకరించండి....మమ్మల్ని క్షమించండి."

ఆ ఉత్తరం చదివిన రంగనాథం భార్య నిశ్చేష్టురాలైంది. ఆమె భర్త పట్ల చేసుకున్న అభిప్రాయాలకు కుంచించుకుపోయింది. ఆమె కళ్ల నిండుగా నీళ్లు. దుఃఖాన్ని ఆపుకోలేక గట్టిగా ఏడ్చేసింది.

"ఏమండీ! మిమ్మల్నెంత అపార్థం చేసుకున్నానండి. వాళ్లెవరో మీ శరీరాన్ని దారుణంగా హత్య చేస్తే నేను అంతకన్నా దారుణంగా మీ ఆత్మను హత్య చేశాను. మీ మీద నమ్మకాన్ని, మన ప్రేమను హత్య చేశానండి. నిజంగా నేనెంత పాపాత్మురాల్ని మిమ్మల్ని నేనే హత్య చేశాను...నేనే హత్య చేశాను" అంటూ గట్టిగా అరుస్తూ ఆమె స్పృహ కోల్పోయింది.

**(31-07-1996 ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ప్రచురితం)**

* * *

# అమ్మ చేతి బువ్వ
## కథల సంపుటి

**AMMA CHETHI BUVVA** KATHALA SAMPUTI

**By : Kattaa Rambabu**



# కట్టా రాంబాబు

గందరగోళం ఉండే వాస్తవాన్ని సరిదిద్ది, తీర్చిదిద్దుతూ, మనిషిని మనిషితో కట్టిపడేసే ప్రేమ బంధంగా కథలు రాస్తూ, ముందు తరం కోసం కూడా కథలు సృజించే కథకులు కట్టారాంబాబు.

-జగన్నాథశర్మ

భిన్న కోణాల్లో సమాజాన్ని, సమాజం వల్ల మనుషుల్లో రూపొందే మంచి-చెడులను, ఒక ఆసరా కలిగించగలిగితే సంస్కరించగలిగే అనేక మానవ హృదయాలను,తప్పు-ఒప్పుల కన్నా సమాజ స్థాయిలో కొట్టుకుపోయే మనిషి స్వాభావిక నైతికతను కట్టా రాంబాబు గారు తన కథల్లో ఆవిష్కరించారు.

-శృంగవరపు రచన

గత నాలుగు దశాబ్దాలుగా సాహితీ రంగంలో విశేష కృషి చేస్తున్న కట్టా రాంబాబు గారు తూర్పు గోదావరి జిల్లాలోని అమలాపురం దగ్గర ఉన్న గోడి గ్రామంలో జన్మించారు.డిగ్రీ వరకు అమలాపురంలో, పీజీ విశాఖపట్నంలోని ఆంధ్రా యూనివర్సిటీలో చేశారు. ప్రకాశం జిల్లాలో లెక్చరర్ గా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించి,తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రిలో ప్రిన్సిపాల్ గా ఉద్యోగం చేసి ఈ మధ్యనే పదవి విరమణ చేశారు.

1969 లో హైస్కూల్ మ్యాగజైన్ లో కథలు రాయడం ఆరంభమైనా, 1975 నుండి వారి రచనలు పత్రికల్లో వెలుగు చూసాయి. నేటికి 300 కథలు,6 నవలలు రాసారు.20 కథలకు వివిధ బహుమతులు లభించాయి.అనేక పత్రికలలో ప్రచురించబడిన వారి కథలు పాఠకుల, విమర్శల మెప్పును పొందాయి. 'కట్టా రాంబాబు కథలు-ఒక అనుశీలన' అనే పరిశోధన వ్యాసానికి కట్టా రాంబాబుగారి శిష్యుడు నర్సింహారావుకి బొమ్మూరు విశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఫిల్ పట్టా ప్రదానం చేయడం జరిగింది. అపారమైన జీవితానుభవం, సామాజిక సమస్యలను వివిధ కోణాలలో దర్శించిన తీరు, ప్రపంచం పట్ల-మనుషుల పట్ల వీరికున్న ప్రేమ,వీరి రచనల్లో కనిపిస్తాయి.